శ్రీ బాలసరస్వతీ ప్రచురణము-12

ఓం నమో భగవతే శ్రీరమణాయ, శ్రీ భారతీ దేవ్యైనమః.

# ఉమాసహస్రము

(తృతీయభాగము - 5, 6, 7, 8, 9, 10 శతకములు)

★

శ్రీ వాసిష్ఠగణపతిముని ప్రణీతము

★

ఆంధ్రీకృతికర్త:—
సాహిత్యవిద్యాప్రవీణ - ఉభయభాషాప్రవీణ
కవిశేఖర, వేదాంతవిమర్శన విశారద,
పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి
విజయనగరము.

సర్వస్వామ్యములు :- ఆంధ్రీకృతికర్తవి

ప్రకాశకుఁడు :- శ్రీ వేదుల రామమూర్తి

ప్రేరకుఁడు:- అయలసోమయాజుల చిట్టిసోమయాజులు

అనుమతిప్రదాత:- శ్రీ డి. యస్. విశ్వామిత్ర

ప్రథమ ముద్రణము. ప్రతులు - ఆరు వందలు

శ్రీ విలంబి - మాఘమాసము.

మూల్యము - 5 రూపాయలు

---

ప్రాప్తిస్థానము :-

పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి

ఆంధ్రభాషాప్రధానాధ్యాపకుఁడు.

శ్రీ ప్రభుత్వ మహారాజ సంస్కృతకళాశాల;

పత్తిపాటివారి వీధి: విజయనగరము.

---

శ్రీనివాస ముద్రణాలయము, రాజమహేంద్రవరము.



ఆంధ్రకృతికర్త:
పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి

ఓం నమో భగవతే శ్రీరమణాయ.

# ఆంధ్రీకృతి సమర్పణము



అమృత నిరంజనాద్వయ సదాత్మ విహారముఁ బూని, దివ్యభ
వ్యమధురదృక్ పరంపరల భక్తుల ముక్తులఁ జేయు-వారి హృ
త్తమము హరించి, తన్నిగమ తత్త్వ సుఖానుభవమ్ముఁ గూర్చు శ్రీ
రమణ మహర్షి-సద్గురు పరాత్పరు, మత్కృతి భర్తఁ జేయుదున్!

శాంతిరస ప్రవాహిని- నిజాశ్రిము, మద్భుత దివ్యమోద సం
క్రాంతి-పవిత్ర దర్శనము, గాఢవివేక విఖండితాత్మ వి
భ్రాంతి-కటాక్ష పాతము, విభాసిల, ఏ భగవానుఁడు-ఈ జగద్
ధ్వాంత మడంచు; తద్ గురువతంసుఁడు-మత్కృతి స్వీకరించుతన్!

మంత్రవినాదమూల, పరమాత్మ వివేక, 'కుమార'నవ్య సి
ద్ధాంతమహోపదేశము-'గణాధిపమౌని' - 'ఉమా' కటాక్ష సం
క్రాంతి గడించి, ఆయమకు కాన్క యొసంగు సహస్రమున్, నివే
దింతును తెన్గుబాస, గురుదేవ మహర్షికి, శాంతి దాతకున్.

ఉమ-యమ గాఁగ, ప్రాగ్జని, గుహుండగు తా, నరుణాచలస్థుఁడై,
రమణమహర్షియై, సుకృతిరక్షకుఁడై, గణపత్యుమా సహ
స్రము, మదనూదితమ్ము-వికసన్మతియై విని, అక్షరాత్మ బో
ధమొసఁగె, నెవ్వఁ, డీకృతి-తదంకితమై విలసిల్లుఁ గావుతన్!

శ్రీగుహమూర్తి, సంస్కృతి విశిష్ట వరిష్ఠ నిజాశ్రిత ప్రజా
ధీగుహవర్తి, పావన సుధీపరిపూర్తి, పరాత్మయోగ వి
ద్యాగురుకీర్తి, దివ్యకరుణార్ద్ర కటాక్ష విదారితార్తి; తా
నా గురుదేవమూర్తి, రమణార్యుఁడు మమ్ము ననుగ్రహించుతన్!

ఓం, తత్, సత్,

శ్రీ విళంబినామసంవత్సర
కార్తీకశుద్ధ త్రయోదశి.

ఇట్లు,
శ్రీరమణ భగవత్పాద శిష్యుఁడు,
పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి

ఓం నమో భగవతే శ్రీరమణాయ.

# వినయ నివేదనము

శ్రీమత్ సద్గురుమూర్తి, శ్రీగణపతిన్, సేవించి, భక్తిగ, తదా
రాముండై, తదుమా సహస్రి కృతి నాంధ్రమ్మందుఁ గూర్పన్ ననున్
'శ్రీమద్ భాగ్యమునన్ వరించి'-సుకృతిగ జేయించె నే ధన్యుఁ, డా
'శ్రీమద్ వేదుల రామమూర్తి', శుభ సంసిద్ధుల్ ప్రసాదించుతన్.

కరుణాపూర్ణ మతిగ, మదాంధ్రకృతి నాకర్ణించి, విజ్ఞాన భా
స్కర కాంతి స్థిర దివ్యలోచన పరిష్కారమ్ము సంధించె. తత్
పరమానంద రసప్రసారిత సుఖాస్వాదమ్ము నొందించె, నే
పురుషుండా 'రమణర్షి'-స్వాత్మ గురుదేవుండీ కృతిం బ్రోవుతన్!

సీ. తాత-యప్పయ గాఁగ, తండ్రి-చెన్నయ గాఁగ, తల్లి-వెంకమ గాఁగ, పిన్నతండ్రియగుచుఁ,
దనను దత్తుఁగఁ గైకొనిన తండ్రి-నరసింహము, నమ్మ-వేంకట రమణమ్మ గాఁగ
విమలకౌండిన్యగోత్రమునం; 'దయల సోమయాజులాన్వయము' ప్రఖ్యాతినొంద,
'చల్లపేట' జనించి, 'సాలూర' విద్య నేర్చి, 'మలేరియా యినస్పెక్ట'ర గుచు,

ఆ. వె. కోరి, యడిగి, దీక్షఁ గొని, యీ యుమా సహ
స్రిము వెలార్చి; ధర్మ, సత్య, శాంతి,
విమలు, 'సోమయాజి' సుమయు, గణపతి ర
మణులుఁ, నిహ పరంబుల మనుతుర్గాత!

ఉమ, జగదంబ, శాంకరి, ప్రబోధయు సంపదలగ వెలార్చి, ని
త్యము సమనుగ్రహించుత! కటాక్ష సమీక్ష, తదీయమా సహ
స్రిముఁ బ్రకటింపఁ దోడ్పడిన, సన్మతియుక్తుల, ధర్మరక్తులగ,
విమల గుణప్రయుక్తుల, పవిత్రచరిత్రుల, స్వాత్మభక్తులన్!.

రమణాశీర్బలముగ, కపాలి వరమున్; ప్రాజ్ఞుండు డీ. యస్. బుధో
త్తము నామోదము, భక్తవిత్తసుఁడు, విద్యాదృష్టి, 'శ్రీసోమయా
జి' మనోఽభీష్టము, భక్తలోక రుచియుగ, 'శ్రీరామమూర్త్యా'త్మభా
సి మహాకార్య, ముమాసహస్రకృతిగా సిద్ధించె, ధన్యాత్ముడన్.

పత్తిపాటినారి వీధి,
విజయనగరము
శ్రీమద్విలంబి నామసంవత్సర
కార్తీకశుద్ధ త్రయోదశి.

ఇట్లు
శ్రీమదుమా, గణపతి, రమణ, భక్తజన, విధేయుఁడు
పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి

# అభిప్రాయములు

శ్రీ విద్వాన్, కావ్యతీర్థ
మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి,
"కవితాసామ్రాజ్యము"

నంద్యాల 1-2-54
(విజయ పౌష బ ౧౩ సోమ)

బ్రహ్మశ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారి సన్నిధికి-
విజయనగరము

విధేయ భాషోపాసకుఁడు, మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి :-

ఆర్యా! అభివాదములు. శ్రీ నూలా పేరన్నశాస్త్రిగారందఁ జేసిన తమ యమూసహస్రానువాద గ్రంథప్రథమభాగమును జూడఁ గంటిని. చవులూరెడి తమ పద్యములను జదువు కొలదిని దమ శైలి, సరళిమ, సలక్షణము-నన్నది చక్కఁగ దృఢపడిపోయినది. చక్కని ధార!

అనువాదములో నుండెడి కష్టము ననుభవపూర్వకముగా గుర్తించిన వారిలో నేను నొకఁడను. శ్లేషసంఘటనాదుల యందొక భాషాసంప్రదాయ మింకొక భాషలోనికిఁ దెచ్చుట- సాధ్యమే కాదని చెప్పవలయును, ఇట్టిచోఁ, ప్రకృతగ్రంథమున, మీరచన-మూలగ్రంథమునకు మెఱుపు నేగాక, మెఱుఁగునుగూడఁ దెచ్చిపెట్టినదని చెప్పకతప్పదు.

మూలగ్రంథకర్త యొక్క యలోకసామాన్య ప్రతిభావైభవాదికమును దాముగాఁ జక్కని వివరణముతో నాంధ్రలోకమునకుఁ బంచిపెట్టినవారైతిరి. ఇందుల కాంధ్రపాఠకలోకము మీకు ఋణపడినదనుటలో నత్యుక్తి లేదు.

తామీశ్వరు వర్ధించిన యుత్తర గ్రంథభాగరచనలుగూడఁ దమచే ననూదితములగునట్లు చిదాత్ముని ప్రార్థించు,

భవదీయ భాషాతపస్వి,
మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి.

## ❋ శ్రీ లేఖలు ❋

(౧) రాజమహేంద్రవరము, 4—11—56

బ్రహ్మశ్రీ మహితులు, పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారి సన్నిధికి, అనేక నమస్కారములు, కుశలోపరి.

ఈనడుమ, ఉత్తరములులేవు. తమ యోగక్షేమాదికమును మనమిత్రులు శ్రీ హొట్టా వీరభద్రరావుగారు వ్రాయుచున్నారు

మొన్ననే, ఉమాసహస్రము- ద్వితీయభాగము- ముద్రాలయమువారు- నాకందఁజేసినారు. దానిని- కండ్లోయికద్దుకొని, మహానందముతో పఠించుకొని, కృతార్థుఁడ నైతిని. ఇట్టి సత్కృతి, వ్యాఖ్యలతో, ఆంధ్రధారుణినేకాక, లబ్ధవర్ణశ్రేణిని- అధమర్ణము చేసికొనుచున్న, తమ మహోదాత్త వ్యవసాయమునకు, నాభక్త్యంజలి తెలుపుకొనుచున్నాను. ఆంధ్రపత్రిభ—ఎన్నో శాస్త్రీయములు, సాంప్రదాయకములుఅయినతత్త్వరహస్యములనుఆవిష్కరించుచున్నది.

చిత్తగింపుడు.

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి.

❋

(౨) యలమంచిలి, 13—3—57

ఉభయభాషాప్రవీణ, సాహిత్యవిద్యాప్రవీణ,

శ్రీ పంతుల లక్ష్మీనారాయణ శాస్త్రిగారికి—

'గుంటూరు వెంకటసుబ్బారావు' అనేకనమస్కారములు.

ఉభయకుశలోపరి.

తాము శ్రీ సత్యనారాయణశాస్త్రిగారి ద్వారా పంపిన ఉమాసహస్రము, (ద్వితీయసంపుటము) మాతృపూజాపుష్పాంజలి- అందినవి. నేను, నాభార్య చదివినాము చాలా ఆహ్లాదముపొంది నాము. అనేకవిధములగు "కాలక్షేప" గ్రంధములు వెలువడుచున్న, ఈరోజులలో యిటువంటిఉత్తమశ్రేణి గ్రంధములు లభించుట- ఎడారిలో జలప్రవాహమువలె, ఆత్మకు శాంతి కలిగించును. ఈపుస్తకములుమాకు లభింపఁజేసినందుకు, మాఉభయులము-కృతజ్ఞులము.

ఇట్లు,

గుంటూరు వెంకటసుబ్బారావు, B.A; B.L

# ఉమాసహస్రము



ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. సంపుటము 42. సంచిక 4,
విజయ సం॥ ఆశ్వయుజ కార్తీకములు.

ఆంధ్రీకృతికర్త: సాహిత్య విద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ
కవిశేఖర, శ్రీపంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు,
విజయనగర మహారాజ సంస్కృతకళాశాలాంధ్ర పండితులు.

ప్రథమభాగము (నూతనముద్రణము) **2-00**

(గ్రంథప్రతులు కృతికర్తయొద్ద లభింపగలవు.)

సుప్రసిద్ధపండితులు; గీర్వాణకవీశ్వరులు, శ్రీరమణమహర్షి శిష్యవర్యులు; నగు కీ॥ శే॥ శ్రీ కావ్యకంఠ గణపతిశాస్త్రిగారు "ఉమాసహస్రము" అను పేరుతోఁ, బరాశక్తి స్తుతి పూర్వకముగా రచించినయుద్గ్రంథమున మొదటి నాలుగు స్తబకము లందుఁగల ప్రథమశతకమునకిది-యాంధ్రానువాదము. మూలగ్రంథము 1943 సంవత్సరములో (ఉత్తర కానరా) శిరసిపురమందలి నందినీముద్రణాలయమున నాగరిలిపిలో, గణపతిశాస్త్రివర్యులశిష్యులు - శ్రీ టి. వి. కపాలిశాస్త్రిగారు రచించిన "ప్రభా" నామకవ్యాఖ్యాసమేతముగ ముద్రింపఁబడినది. ప్రకృత గ్రంథమున నాంధ్రీకర్తల యనువాదపద్యములే గాక- మూలకృతివ్యాఖ్యాతల వ్యాఖ్యానవిషయములు గూడ నాంధ్రమున వివరింపఁబడుటచేత కవిహృదయము పాఠకులకు బాగుగా నవగతమగుటకయి తెలుఁగుపద్యములతోఁ బాటావివరణము గూడ సహాయకరమగుచున్నది; సూర్యునియందుఁ బ్రభవలెను, చంద్రునియందుఁ జంద్రికచందమునను, పరమేశ్వరుఁడగు శివునియందాతని తపశ్శక్తి యభిన్నముగ నవినాభావముగ సంలగ్నతమయి యున్నదనుట- బహు తాత్త్వికసమ్మతమయిన, సిద్ధాంతము. ఈశక్తియే- పరమేశ్వరుని లీలచే సృష్టిస్థితిలయ తిరోధానానుగ్రహ రూపములగు, పంచకృత్యములకుఁ గారకమయి, ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులు, పరా, పశ్యంతీ: మధ్యమా, వైఖరీ; వాగ్రూపశక్తులు, అవిద్య, మాయ ప్రకృతి, (మనుష్య శరీరముల) కుండలినీ శక్తి-మున్నగు వేర్వేఱు నామములతో వ్యవహృతమై; జగ

వ్యాపార మంతటికి మూలాధారమైయున్నది. అందుచేతనే – ఆమె జగజ్జనని యని, తదభిన్నుడగు సదాశివుడు– జగత్పితయని వ్యవహరింపబడు చున్నారు. అప్రతిహతము, నమేయమునగు శివశక్తి తత్త్వమును –(శ్రీ గణపతిశాస్త్రి గారు— బహుముఖములుగ నుద్ఘాటించి, యీమాల గ్రంథరచనమును గురువర్యు లగు శ్రీరమణమహర్షి సన్నిధానముననే ముగించి–వారి యనుగ్రహాశీర్వాదములకు పాత్రమయిరి. ఆంధ్రీకృతికర్తలుకూడ— తమ పద్యకృతానువాదమును శ్రీమహర్షి వర్యుల జీవిత కాలములో 1948 సంవత్సరములో వారి సమక్షమున జదివి, వినిపించి వారి యామోదాశీర్వాదములనందిరి. వారికే యంకితమొసంగియున్నారు. ఇందలి, "ఉమ" యనునది పరాశక్తియే గాని, పురాణములందును, కావ్యములందును, వర్ణితయైన పరవ్యక్తియగు హైమవతి గాదు. ఉమ=(ఉ=పరమేశ్వరుని, మా= మానవశక్తి; హైమవతి=సౌవర్ణద్యోతి (హేమము=సువర్ణము; పార్వతీ=వైద్యుతజ్యోతి (వైదిక పరిభాషలో పర్వతము=మేఘము. ఇత్యాదులిందలి నిర్వచనములు] ఇట్లే, దక్ష, దాక్షాయణి, సతి, అదితి, యున్నగు కొన్ని పదములకు, పౌరాణిక గాథలకు; విలక్షణములగు నర్థములు– వ్యుత్పత్తి సాధనతో నిరూపింపబడినవి. కృతియంతయు, గణపతి కవీంద్రుల యసాధారణ వైశిష్ట్యమునకు, సర్వదర్శన కళావైదుష్య మునకు, నాదర్శప్రాయమై వెలయుచున్నదని చెప్పదగును. ఈప్రథమ శతకమందలి ప్రథమ చతుర్థస్తబకము లార్యావృత్తములందును. ద్వితీయస్తబకము పంచచామర ములలోను, తృతీయస్తబకము తనుమధ్యావృత్తములందును కూర్పబడినది. అను వాదముకూడ— ఆంధ్రీకర్తల సామర్థ్యమునకనుగుణముగనున్నది. క్రిందనుదాహరణములు– చూడదగును. గ్రంథమందలి తక్కిన భాగములుగూడ త్వరలో వెలువడుటకయి యాంధ్రలోకము–కృతికర్తకు ప్రోత్సాహమొసగుగాక! గణపతిశాస్త్రిగారి జీవితసంగ్రహముగూడ– గ్రంథారంభమున గలదు.

శ్లో॥ పల్లవ మృదువేదిగత । జ్వలన పవిత్రాం, మహార్ఘ్యమణి కాన్తామ్।
నవచంద్రిక్షుణ్ణసౌమ్యాం। శివసుదృశః తత్స్మరామి వపుః (1–17)

చ. నవశశిఖండసౌమ్యము, న ♦ నర్ఘ్యమహామణి కాంతియుక్తమున్,
పవిమలవేది మధ్యగత ♦ పావక పావన రూపశాలి, ప
ల్లవ మృదులంబు, సుందరక ♦ ళా పరిపూర్ణ విచిత్రమూర్తి, నా
శివతరుణీ శరీరమును ♦ జింతనముం బొనరింతు నిత్యమున్.

శ్లో॥ కరోతి, యా బిభర్తి, యా నిహన్తి, యా జగత్త్రయమ్
సమస్తతో విభాతి యానదృశ్యతే క్వచిచ్చయా :
అతీవ గుప్తరూపిణీ గురూపదేశమంతరా
నశక్యతే బుధైశ్చబోద్ధు మద్భుతారి సుందరీ॥ (2-3)

ఉ॥ ఎవతె జగత్త్రయంబు సృజియించి, భరించి, హరింపుచుండుఁ, దా
నెవతె సమస్తమందును రహించియు, నెప్పుడు గానుపింపదు, దా
శివసతి- గుప్తరూపిణి, ప్రసిద్ధగురూక్తి లభింపకుండినన్
వివృతనిజస్వరూపము నే భువి నెంతటి బోధకాలికిన్?

శ్లో॥ మాతాపితరౌయత్ । తావేక శరీరా
చిత్ర ప్రథనార్థా । సా కాచనలీలా 3-9

ద్విపదగతిరగడ.

అతఁడు, నంబికయు, నే । కతను సంగతులౌట
అతిచిత్రకృతిజాల ! అది యొకానొక లీల!

శ్లో॥ స్వతనుషు విహరన్తీం త్వాం । ఉపాధివీణాకృతేర్జగన్మాతః।
సాదృశ్యాత్ కుణ్డలినీం, పరోక్షవాదప్రియాః ప్రభాషన్తే.

కం. జనదేహ విహారిణివగు
నిను వీణాకృత్యుపాధి నింగుండలిఁబో
లిన దానిఁ గుండలినివని
యనియెదరు పరోక్షవాగ్రతాత్ములు జననీ!

— బండారు తమ్మయ్య.



ఆంధ్రపత్రిక, ఆదివారము. 30-12-1956)

# ఉమా సహస్రము

( 1, 2 భాగములు )

[శ్రీ వాసిష్ఠ గణపతి ముని ప్రణీతము,

ప్రాప్తిస్థానము:- శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి,

పత్తిపాటివారివీధి. విజయనగరము.

[వెల: ప్రథమభాగం 1-50 న॥ పై॥ (నూతనముద్రణముగలది 2-00)
ద్వితీయభాగం రు 3/లు. ]

ఎలప్రాయమునందే, వశీకృత వేదవేదాంగుడై, సరసకవితారీతితో, నవద్వీపస్థ, విద్వత్పరిషత్తును మెప్పించి— 'కావ్యకంఠబిరుదము' పొందిన, 'శ్రీ అయల సోమయాజుల గణపతిశాస్త్రిగారు'- రచించిన గీర్వాణవిలాస భాసురమైన ఈ ఉమాసహస్రం స్తోత్రరూపమైన సాహిత్యప్రబంధం ఈ రెండు భాగాలలో నాలుగువందల శ్లోకాలుమాత్రం ఉన్నాయి. వాటిలో మొదటి నూరుశ్లోకాలకూ- పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు తెలిగించిన పద్యాలుకూడా- చేరిఉన్నాయి. రెండవభాగానికి శాస్త్రిగారి (వచనానువాదంతోకూడిన) వివరణం మాత్రము వచనంలో ఉంది. మొదటిభాగానికి పద్యానువాదమే కాక, వివరణంకూడా ఉంది. మొత్తంమీద, గణపతిముని రచనకు- లక్ష్మీనారాయణశాస్త్రిగారి అనువాదం- 'సర్వలక్షణసంపన్నమైన భాష్యం' అని అనడానికి సందేహం లేదు. (మూలశ్లోకాలు. రెండుభాగాలలోను ఉన్నాయి.)

"ఇది—కేవలం, సహస్రనామస్తోత్ర పద్ధతిని నడచిన గ్రంథం కాదు. సంస్కృతభాషలో, శ్లేష యమక చక్రవర్తి: శ్రీవేంకటాధ్వరి రచించిన లక్ష్మీసహస్రం, వంటిది- ఈ వాశిష్ఠగణపతి ప్రోక్తమైన ఉమాసహస్రం, లక్ష్మీసహస్రం. కేవలం లౌకికక్రియాకలాపంలో సంసారులకు స్వాభీష్టసిద్ధిని కలిగించే దేవతగా లక్ష్మిని స్తోత్రించినట్లు గ్రహింపగలం. గణపతిముని ప్రోక్తమయిన, ఈ ప్రబంధం—ఐహికమునూ, ఆముష్మికమునూ, యోగ పద్ధతిలో సాధించే సాహిత్యగ్రంథం" అని, చని వపమీంద సుకరంగా గుర్తింపగలం.

వీతరాగులైన యోగులు మాత్రం, గ్రహింపఁగలిగిన పరాశక్తి మూలశక్తిని, యోగంతోను, క్రియాయోగంతోను శ్రీరమణమహర్షి బోధించిన యోగంతోనూ, సులువుగా గ్రహించి, గణపతిమునీంద్రులు-ఈ కావ్యసంపుటిలో సచ్చిదాత్మకమైన తచ్ఛక్తిని-సోపపత్తికంగా ఉపనిబంధించియున్నారు. ఆ తాంత్రికరహస్యాన్ని సాకల్యంగా చర్చించి, తత్సారం- శ్రీభగవాన్ రమణమహర్షుల అంతేవాసి అయిన. శ్రీపంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు-లలితమైన తెలుఁగులో వెల్లడించారు. ఈ గ్రంథం - భుక్తికీ, కావ్యామృతపానరక్తికీ, ముక్తికీ, తాపత్రయం పడే సద్బుద్ధి యుక్తులకు మంగొంగు బంగారం.

యథాశక్తిగా, ఆ యా సందర్భాలలో. గణపతిముని వాక్సంచయమునూ దానిని శ్రీపంతుల లక్ష్మీనారాయణశాస్త్రి ప్రజ్ఞావిశారదులు- ప్రపంచీకరించిన విధానమునూ, మచ్చుకు చూపుతున్నాను.

"సా తత్త్వతః సమస్తాత్
సత్యస్యవిభోస్తతా తపశ్శక్తిః ।
లీలా మహిలా వపుషా
హైమవతీ తనుషు కుణ్డలినీ." (ప్రథమస్తబకం శ్లో.)

లక్ష్మీనారాయణ శాస్త్రిగారి అనువాదం, వివరణం.

గీ. ఆమహాశక్తి- సత్యాత్ముఁడైన విభుని
దృఢ 'తపశ్శక్తి' - లీలాసతీ శరీర
ధారణను 'హైమవతి' - జీవతనువులందు
నరయ 'కుండలినీశక్తి' - యనఁగ వరలు.

తత్త్వదృష్టిచేత, విచారించునెడల, ఆమహాశక్తి - సత్యస్వరూపుఁడగు పరమేశ్వరుని చుట్టును వ్యాపించియున్న 'తపశ్శక్తి' యగుచున్నది. ఆమెయే—లోకుల ననుగ్రహింపదలయునను, వాంఛచేత— లీలాశరీరమును ధరించుటచేత, 'హైమవతి' (పార్వతి) యగుచున్నది. ఇఁక, మన శరీరములందొకానొక శక్తి కలదు. అదియే- 'కుండలినీశక్తి'. ఈ కుండలినీశక్తి—తంత్రశాస్త్ర ప్రసిద్ధయై యున్నది. ఇది—యోగులకు మాత్రమే కనఁబడుచుండును. ఇట్లు మహాశక్తి— త్రివిధయైయున్నది. అద్వితీయుఁడును, సత్యస్వరూపుఁడును, అగు పరమేశ్వరునకు— సూర్యునకు ప్రభవలె, సహజసిద్ధయు, సర్వవ్యాపినియు. నగు తపోరూపయగు శక్తి కలదు. మహాశక్తి

కిదియే- మూలస్వరూపము కావున, నీతపశ్శక్తియే- యామెకు మొదటి రూపము. లోకుల ననుగ్రహించుటకై స్వీకరించిన, హైమవతీ రూపము— రెండవది. సకల జంతువులయందును గల కుండలినీ శక్తియే- మూడవది.

ఇట్లే, పద్యమునందు— అధ్యండము, అధిదైవతము, అధ్యాత్మము, అగు మహా శక్తియొక్క— రూపత్రయము- ప్రస్తుతింపఁబడినది. 1. అధ్యండము—తపశ్శక్తి 2. అధిదైవతము—హైమవతి, 3. అధ్యాత్మము- కుండలిని.

కుజాది గ్రహసృష్టినిగూర్చి, గణపతిముని సిద్ధాంతం-

మయూఖమాలిమణ్డలే నిజాయ, పాద ముగ్రయా
మయూఖశక్తిరూపయా, త్వయామ్బ! చేష్టమానయా,
ఖకోశతః సమాహృతైః, పునస్త్రిరూప రేణుభిః
వ్యధాయి మఙ్గలాదిభిః సహగ్రహైరియం మహీ!.
ద్వితీయ స్తబకం, శ్లో (14)

పంతులవారి అనువాద, వివరణాలు:—

ఉ॥ ఉగ్రవు, చేష్టమానవు మయూఖ సముజ్జ్వల శక్తివై, క్రియా
వ్యగ్రత, సూర్యమండలమునందొక పాదము నుంచి, సన్మహా
నుగ్రహవై, ఖకోశమున నుండి త్రిరేణువులూది, తత్ కుజా
దిగ్రహయుక్తగా, వసుమతిన్ సృజియించితి వంచికేశ్వరీ.!

సూర్యమండలమున, పాదము నుంచుట—మహానుగ్రహమయి యున్నది తత్పాదనిక్షేపముచేత- సూర్యద్వారమున గ్రహోత్పత్తి- చెప్పఁబడినదగుచున్నది.

ఈప్రపంచసృష్టి-ఏకాంశముచే జరుపఁబడియెనని తెలుపుటకు-'ఒక పాదము నుంచి' అని, ప్రయోగింపఁబడినది. 'ఈ ప్రపంచసృష్టి— పరమేశ్వరుని యందొక భాగమే' అనునంశము-'పాదోస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతందివి' అను వేదమంత్రము— తెలుపుచున్నది కదా!

పైశ్లోక తత్త్వాన్ని బట్టి- ప్రత్యక్షములైన వస్తువులకు మూలం_సూర్యమండలమనీ, ఆసూర్యమండలం గా- కిరణరూపంగా ఉన్న పరాశక్తి- సూర్యమండలాన్ని అనుగ్రహించి, పాదనిక్షేపరూపమైన క్రియతో భేదించి, జగత్తును సృష్టించిన మూలశక్తి అనీ, తెలుసుకొనగలుగుతున్నాము.

పరాశక్తి 'ఉమ' అనే పేరుగలది అయిన రీతిని- గణపతిముని-ఇల్లా నిర్ణయిం చారు. ఉ=శివునియొక్క; మా=మానశక్తి (పరిమాణశక్తి) కావున, ఉమ అని చెప్పఁబడును.

వి వ:— అమేయుఁడగు, కొలుచుటకు తెలిసికొనుటకు, శక్యము కానివాఁ డగు) ఈశ్వరునుండి పుట్టుచున్న, యసంఖ్యాకములగు లోకములన్నియు, నతని పరిమాణశక్తియగు మహాదేవిచే మితములు (కొలువఁబడునవి) అగుచున్నవనిభావము. 'ఉమేతిమాత్రా తపసోనిషిద్ధా, పశ్చాదుమాఖ్యాం సుముఖీజగామ'అని 'కాళిదాస మహాకవి' చేసిన, నిర్వచనం మనోజ్ఞంగా ఉన్నా, అది-పరిమితమూ వ్యక్తివిశేష నిర్వచనమూ, మాత్రమే అవుతుంది. గణపతిముని నిర్వచనం- అపరిమితమూ, అపూ ర్వమున్నూ. తిలకించండి:

'భవత్యసావతో భవాన్యనాదిరన్తవర్జితా
జగన్తి మాతి నిత్యమో రసాతదభ్యధాయ్యుమా।
రసాత్మికోశ్యతేఖిలైరసౌ తతశ్శివోచ్యతే
పరైవమీశితుశ్చితిస్త్రిధాబుధై రుదీర్యతే.

'ఒనర, ననాద్యనంత యగుచుండును' గాన 'భవాని యయ్యె' ఊ!
అనశివుఁడర్థ; మందాదవునట్టి జగంబుల, 'మాఖ్య'గొల్చుటన్
జను 'నుమ' నా; రసంబయి-వశాహ్వయధాతుసముశ్యమానమై,
తనరు 'శివా'ఖ్య, నిట్లు త్రివిధంబుగ తచ్చితి-సన్నుతంబగున్.
(ద్వి. స్త. 9)

పంచమూర్తివాదిసిద్ధాంతాన్ని గణపతిమునీంద్రులు ఇల్లావివరించారు.

'సరోరుహాక్షు వాగ్వధూమనోహరౌతు పూర్వవత్
సుధాంశు బిమ్బ పూరుషస్తురుద్ర సంజ్ఞకః శివే!
హిరణ్మయో న్తరిక్షజాత ఈశ్వరః, సదా శివః
సదేవ వస్తుకాఙ్క్షనాఙ్గి! పఞ్చమూర్తి వాదినామ్.

అనువాదవిశేషాలు:—

హరి-నరులందు, బ్రహ్మ-రవియందును రుద్రుఁడు-చంద్రునందు, దీ
వ్యరుచి వెలుంగుచుందురు; తదంబరవర్తి, హిరణ్మయాంగుఁ, డీ

శ్వరుఁడు; సదాఖ్యావస్తువగు శ్రీహస్తమె - దేవి! సదాశివుండు, 'శైవరచిత పంచమూర్తి శుభకరంగు' హిరణ్మయోజ్జ్వలా!

భువర్లోకాధిష్ఠాత్రియు, వ్యాపకురాలును, నను నీశ్వరుఁడే - యింకు తెలుపఁబడిన మహేశ్వరుఁడని యెఱుఁగుదము. ఇచ్ఛాప్రక్రియలు నీదేనియనుకేదు. నీవు తలఁపరాని యద్భుతములను సాధింప నెంతటి భారాలవు" అని వర్ణిస్తున్నారు- ఆమె విభుత్వాన్ని.

'శుద్ధాన్తేశ్వరి! శంభో
రిచ్ఛా చేత్ తవకాపి
ఘోరాగ్నిస్తృణగర్భాద్,
ఘోరాగ్నేరపి శైత్యమ్!—(ద్వి.శ.ద్వి.స్త. 20 శ్లో)

లక్ష్మీనారాయణశాస్త్రిగారి వ్యాఖ్య :- "తృణమనఁగా గడ్డిపరక. దాని నుండి ఘోరమగు నగ్ని యుదయించుట- అస్త్రవిద్యా ప్రసిద్ధము. అనుష్ణమగు తృణము నుండి, ఘోరమగు నగ్ని జనించుటచేత— శరవణజమగునగ్ని- సూచింపఁబడు చున్నది. అగ్నినుండి- శైత్యముదయించు ననుట చేత- 'అగ్నేరాపః'—అను శ్రుతి ప్రసిద్ధమగు తత్త్వము-ప్రవచింపఁబడినది." ఈయుమాసహస్రరచనలో, శ్రీగణపతి మునీంద్రులు—యోగవిద్యకు ఎంత ప్రాధాన్యం ఇచ్చారో; లౌకిక కావ్యవర్ణనాది సాహిత్య ప్రక్రియలో కూడా-అంత వైభవం ప్రదర్శించి; మహోత్తమ కావ్యంగా వెలయించారు. భగవతిని వర్ణించే పద్ధతిలో- ప్రాచీనమైనది— కేశాదిపాదాంత స్తుతి. అది.అసాధారణమైనధాటికలది.ఉదాహరణకు:-దేవికడగంటిచూపును వర్ణిస్తూ-

శ్రీకర్ణపథతవలోచనాఞ్చలే
భ్రాన్త్యాదయాదయితయా ప్రబోధితః
ఏతం సవిత్రి! మమకఞ్చనస్తవం
శ్రుత్వాతనోతుభరతావనేః శ్రియమ్, (తృ.శ,ద్వి.స్త.౧౩)

ఆయన-రాజయోగి. దీనిలో కడగంటి చూపును వర్ణిస్తూ భగవతి కర్ణమునుగలిపి తన స్తోత్రాన్ని వింటూన్న ఆమె చెవి భరతఖండానికి సంపదను చేకూర్చుగాక! అంటున్నారు. కావ్యలక్షణాలకు వెలితేని ఆమునిచంద్రుని రచనకు- వేరే సమీక్ష వ్రాసే అర్హతకలవాఁడేడీ? ఏదో భక్తిప్రపత్తులతో వ్రాసుకొనే మాటలివి.

వేదాలకూ; వేదాంతాలకూ; ప్రాచీనుల కావ్యాలకూ, పరమ ప్రామాణ్యాన్ని సిద్ధింపచేసే ఉద్దేశంతో, శ్రీవాసిష్ఠగణపతిముని- యీ ప్రబంధాన్ని రచించారు. ఆరహస్యం గుర్తిస్తే మనం ధన్యులం. ఆవిషయాన్ని సువిశాలహృదయంతో గ్రహించి; అనువాదం సులలితంగా చేసి, శ్రీపంతుల లక్ష్మీనారాయణ శాస్త్రిగారు-ధన్యులవడమే కాక తద్ద్వారా శ్రోతృప్రపంచం పుణ్యసంచయాన్ని మూటగట్టుకొనే భాగ్యం పట్టింది,

ఇంకొక చక్కని విషయం గురించి; కొంచెం ఉటంకించి- యీనాఅల్పజ్ఞ లేఖనం ముగిస్తున్నాను.

కవికులగురువైన కాళిదాస మహాకవి- తన కుమారసంభవకావ్యంలో, అష్టమ సర్గంలో; పార్వతీపరమేశ్వరుల శృంగారవిలాసాలను వర్ణించడంలో- కొంచెం లౌకికతను మరిచి ఔచిత్యం గ్రహించలేని వ్రాతలు వ్రాసినట్లు; మధురమంజులమైన విమర్శచేసి- శ్రీగణపతిముని కవికులగురువునకు ముద్దుగా బుద్ధిచెప్పడం ఈక్రింది విషయం:-

పార్వతీదేవితో విహరిస్తూ; పరమేశ్వరుడు- కాంచనశిలాతలాశ్రయుడై- సూర్యుణ్ణిచూచి; పార్వతీదేవితో అంటున్నాడు:-

'పద్మకాంతి మరుణత్రిభాగయోః
సంక్రమయ్యతవ నేత్రయో రివ
సంక్షయే జగదివ ప్రజేశ్వరః
సంహరత్యహరసావహర్పతిః-

అంటూ, ఈవిధమైన పద్ధతిలో శృంగారవిలాసావిర్భావకములైన మాటలాడడం ధారాళంగా వర్ణించాడు- మహాకవి కాళిదాసు.

శ్రీగణపతిమునికూడా- తన ఉమాసహస్రం మూడోశతకంలో కాళిదాసరచనను పోలి రథోద్ధతా వృత్తంతోనే ఆరంభించి; పార్వతీపరమేశ్వర శృంగార విలాసాలూ; వానికి దోహదాలైన కుసుమితోపవనాదివర్ణనలూ; వర్ణించారు. ఆశ్లోకాలు- కాళిదాసుని కరిగించి మూసలో పెట్టి తీసినట్లుంటాయి.

''మఞ్జుకుఞ్జ భవనాని మాలతీ
పుష్పరేణు సురభిః సమీరణః।

పేశలాచ పికబాల కాకలీ
మోహ మీశ్వరి ! హారస్య తేనిరే. (త్రి.శ.చ.స్త.౫)

"తాడితో మకర కేతు నాశ్వరై
రంసదేశమవలమ్బ్య పాణినా
ఏకహాయన కురఙ్గలోచనాం
త్వామిదం కిల జగాదశఙ్కరః" (త్రి. శ. చ. స్త. ౮)

కాకలీ కలకలంకరోత్యసౌ
బాలచూత మధిరుహ్య కోకిలా।
వాచముద్గిర సరోజ లోచనే!
గర్వమున్నతమయం విముఞ్చతు. ( " ౯)

ఇలా ఆజగత్పిత్రు వచోవిలాసాలు పరమపవిత్ర భక్తిభావవికాసంగా వర్ణించి కాళి దాసుని ఆత్మోత్కర్షకు ఎలాఁటి తెరవేశారో చూశారా!

"బ్రహ్మచర్య నియమాదచఞ్చలా
నాయికా యది లులాయమర్దినీ
నాయకశ్చ సుమబాణసూదనో
వేదకోరతిరహస్యమావయోః. (త్రి.శ.చ.స్త.౧౦)

'పామర స్త్రీపురుషోచితమగు మదనవిలాసము— పార్వతీపరమేశ్వరులయందారో పింపఁగూడదను నభిప్రాయమున; మీఁదిశ్లోకము— చెప్పఁబడినదని శ్రీ లక్ష్మీ నారాయణశాస్త్రిగారు విశదీకరించారు.

తన సారస్వత వైభవానికి; ఉమాకటాక్షవీక్షణప్రసారమే— మూలమని ఇలా అన్నారు గణపతిముని:

"యుష్మాకమగ్ర్యాం వితనోతు వాణీ
మేణీదృగేషా గిరిశస్యయోషా
యస్యాః కటాక్షస్య విసారివీర్యం
గిరామయం మేవివిధోవిలాసః— (చ. శ. ప్ర. స్త. ౫)

సర్వశక్తిసంపన్న అయిన, అపరదేవత కటాక్షవీక్షణభాగ్యం పొందినవారు కనుకనే-

'కిన్ను సుకృతం మయాకృత మఖిలేశ్వరి! కిం తపస్తప్తమ్।
క్రీడయసి మాం ప్రతిక్షణ మానన్దసుధానిధావన్తః. చ.శ.ద్వి స్త౧౨

అని; దేవి- తనను ఆనందసుధాబ్ధిలో ఓలలాడిస్తూన్నట్టు చెప్పుకోగలిగారు.
ఇంతకీ ఒక విశేషం; ఆయనే వాద్యంగా చెప్పారు ఇందులోనే-

> 'గణపతయే స్తనఘటయోః
> పదకమలే సప్తలోకభక్తేభ్యః
> అధరపుటే త్రిపురజితే
> దధాసి పీయూషమమ్బ! త్వమ్'-(తృ. శ. తృ. స్త.౨౦)

అన్నారు. పుత్రుడైన గణపతికి స్తన్యమునందమృతమును ప్రసాదించిందట అంబ కాకపోతే-

> 'గణపతిరితి కవికులపతి
> రతిదక్షో దాక్షిణాత్యోఽహమ్'

అని; లేతవయసులో సవాల్ చేయగలండా నవద్వీపం పండితమండలిలో?'ఆయనను 'నాయన' అన్నారు రమణమహర్షి- 'అయనం యస్య న విద్యతే (ఏకత్రి) స నాయనః'- 'సర్వత్ర అస్తిశాంభవీకృపయా' అని విశేషార్థం. ఆ యోగశాస్త్ర సమన్వయ కారుని-ఈ స్తోత్రసాహిత్యపరిబంధానికి అనువాదం వ్రాసిన, శ్రీపంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారికి- ఈనాటికైనా ఆంధ్రుల ప్రోత్సాహం లభించి- యీ మహాగ్రంథం 'ఇంటింటా' 'పారాయణగ్రంథం' కావడం - పరాశక్తి కరుణా లేశంపై ఆధారపడిఉంది.



ఓం నమోభగవతే శ్రీరమణాయ

ఆంధ్రీకృతమగు ఉమాసహస్రమునందలి 5, 6, 7, 8, 9, 10 శతకములను(600 శ్లోకములను) తృతీయభాగముగా ముద్రింపించుటకు తోడుపడిన, శ్రీమదుమాగణపతి రమణభగవద్

# భక్తమహాశయుల నామావళి



| నంబరు | భక్తమహాశయుని పేరు | వివరము |
|---|---|---|
| 1. | మ॥రా॥శ్రీ వేదుల రామమూర్తిపంతులుగారు (తగరంపూడి) | అనకాపల్లి |
| 2. | ,, చేంబోలు శ్రీరామశాస్త్రిగారు. | రిటైర్డు స్టేషన్‌మాష్టరు అనకాపల్లి |
| 3. | ,, చేంబోలు సూర్యనారాయణశాస్త్రిగారు | స్టేషన్‌మాష్టర్, నైన్‌పూరు |
| 4. | ,, చెళ్ళపిళ్ళ గుంపస్వామిగారు | స్టేషన్‌మాష్టర్; కొయిలారి |
| 5. | ,, గోవిందు అనంతపద్మనాభంగారు | , మూాలు |
| 6. | ,, అక్కినపల్లి జోగారావుగారు | ,, వాడెగాం |
| 7. | ,, బెండపూడి పేరాజుగారు | డాక్టర్ M.B.B.S. విశాఖపట్టణము |
| 8. | ,, పొన్నాడ సుబ్బారావు పంతులుగారు | M.P. ఢిల్లీ |
| 9. | ” యడవిల్లి రామమూర్తిపంతులుగారు | యకౌంటెంటు డి. ఇ. యస్. ఆఫీసు. కటకం |
| 10. | ” పి. యస్. వేణుగోపాల్‌గారు | స్టేషన్‌మాష్టర్, కటకం |
| 11. | ” జొన్నలగడ్డ కామేశ్వరరావుపంతులుగారు. | పార్సెల్ క్లార్క్ ” |
| 12 | ” అన్నదానం సత్యనారాయణపంతులుగారు | గూడ్సుక్లార్కు ” |
| 13. | ” యడవిల్లి వెంకటరామమూర్తిగారు (బి.ఏ.బి.యల్) | వకీలు, బరంపురం |

| నెంబరు | భక్తమహాశయుని పేరు | వివరము |
|---|---|---|
| 14. | మ॥రా॥శ్రీ మండా జగన్నాధరావుపంతులుగారు | ఎకౌంటెంటు స్టేషన్ కమిటీ, నైన్‌పూర్. |
| 15. | ” గోడా శివరామకృష్ణశాస్త్రిగారు | క్లార్కు డి. టి. యస్. ఆఫీసు; నైన్‌పూర్ |
| 16. | ” తలగిచెర్ల సూర్యప్రకాశరావు పంతులుగారు | బ్రిడ్జియినస్పెక్టర్, ఖర్గపూర్ |
| 17. | ” పీసపాటి కృష్ణమూర్తిగారు | హెడ్ సిగ్నలర్, నైన్‌పూర్ |
| 18. | ” దూసి నరసింహంపంతులుగారు | స్టేషన్‌మాష్టర్, సివ్నీ |
| 19. | ” M.V. రమణమూర్తిగారు | డి.టి.ఓ.ఆఫీసు, బిలాస్‌పూరు. |
| 20. | ” గన్నవరపుఅప్పలనరసింహపంతులుగారు | A.S.M. సింధువాహి |
| 21. | ” సామవేదులవెంకటనరసింహంపంతులుగారు | గార్డ్, చంద్‌వాడా |
| 22. | ” ఆరాధ్యుల, సత్యనారాయణపంతులుగారు | నైన్‌పూర్ |
| 23. | ” మంధా లక్ష్మీపతిగారు | S.P W. . I, విశాఖపట్నం |
| 24. | ” మంధా సాంబశివశాస్త్రిగారు | స్టెనోగ్రాఫర్, సింద్రి |
| 25. | ” పొక్కులూరి సత్యనారాయణమూర్తి పంతులుగారు | ” ” |
| 26. | ” కోడూరి భాస్కరరావుగారు. | ఎ.ఎస్.యమ్. వాల్తేరు |
| 27. | మ.రా.శ్రీ. O.S.R, మూర్తిగారు | గార్డు, గోండియా. |
| 28. | ” డి. వి. రావుగారు | గార్డు, గోండియా. |
| 29. | ” J.M. రావుగారు, | S. M. సోవంగే. |
| 30. | ” యల్లాపంతుల, కృష్ణమూర్తిగారు, | రిటైర్డు S. M. |
| 31. | ” యనమండ్ర, లక్ష్మీకాంతశాస్త్రిగారు, | వైర్‌లెస్ ఆపరేటరు, నైన్‌పూరు. |

| నెంబరు | భక్తమహాశయుని పేరు | వివరము |
|---|---|---|
| 32. " | మ॥రా॥శ్రీ ఓలేటి, రామలింగస్వామిగారు, | S.M. రాంటేక్ |
| 33. " | తాతా, రామారావు పంతులుగారు, | పోష్టుమాష్టరు, విజయనగరం. |
| 34. " | కె. రమణమూర్తిగారు, | మలేరియా ఇనస్పెక్టర్, నౌపడా. |
| 35. " | M V. కొండలరావుగారు, | ఛీఫ్ కంట్రోలర్, బుజిడి. |
| 36. " | వేముల, సూర్యనారాయణపంతులుగారు, | ప్రాసిక్యూటింగ్ యిన్స్పెక్టరు, కోరాపుట్టి. |
| 37. " | వడ్లమాని, వెంకటసుబ్రహ్మణ్యంగారు, | S.M పలాసా. |
| 38. " | బులుసు, నరసింహమూర్తి పంతులుగారు, | స్టాక్ వెరిఫైర్, ఖర్గపూర్, |
| 39. " | వేముల సుబ్బారావుగారు, | డి. టి. ఐ. నాగబీర్. |
| 40. " | అయలసోమయాజుల నరసింహమూర్తిగారు, | ఎ. యస్. యం. కోమటిపల్లి. |
| 41. " | మన్యపు సత్యనారాయణరావునాయుడుగారు, | S.M. కటంగి. |
| 42. " | కె. బుచ్చిరెడ్డిగారు, | S. M. సోండర్. |
| 43. " | ఉప్పల సన్యాసయ్యశ్రేష్ఠిగారు, | మర్చెంట్సు, భీమునిపట్నం |
| 44. " | గొల్లకోట, నరసింహమూర్తిపంతులుగారు | గ్డారు-నైన్పూర్ |
| 45. " | ఇప్పిలి చక్రపాణిగారు, | గోల్డుమర్చంట్సు, దిగమహాండే. (గంజాం) |
| 46. " | మంత్రిప్రగడ సన్యాసిరాజుపంతులుగారు. | గజపతినగరము. |

ఓమ్, తత్, సత్.

# విషయసూచిక

ఓం నమోభగవతే శ్రీ గణేశాయ.

# ఉమా సహస్రము

సప్తదశ స్తబకము.

పంచమ శతకమునందలి పదవ స్తబకము.

మూ॥ పాపవిధూతౌ నిర్మలగఙ్గా
తాపనిరాసే చన్ద్రమరీచిః
భర్గపురన్ధ్రీ హాసకలా మే
భద్రమమిశ్రం కాఽపి కరోతు॥ ౧

పాపములను తొలఁగించుటకు నిర్మలగంగయు, తాపములను నిరసించుటకు చంద్రమరీచియు, అనిర్వచనీయయునగు భర్గపురంధ్రీ హాసకల నాకు అమిశ్రమగు కల్యాణము నొసఁగుఁగాత!

ప్ర భ:—అజ్ఞానమును తొలఁగించు పరమేశ్వరునికి పురంధ్రియగుమాయమ్మ చిఱునవ్వు గంగవలెపాపములను రూపుమాపును. చంద్రికవలె తాపముల రూపుమాపును. అది యెట్టిదో చెప్పఁజాలము. అమిశ్రము = శుద్ధము-అసాంసర్గికము. కల్యాణము=భద్రము, మహేశ్వరీహాసకల. పాపశమనమున గంగయు, తాపహరణమున చంద్రకాంతియు, అని ద్వివిధముగా నుల్లేఖింపఁబడుటవలన ఉల్లేఖమలంకారమగుచున్నది.

మూ॥ శిష్టకులానాం సమ్మదయిత్రీ
దుష్టజనానాం సంశమయిత్రీ
కష్టమపారం పాదజుషో మే
విష్టపరాజ్ఞీ సా విధునోతు॥ ౨

శిష్టకులములకు (సజ్జనవంశములకు) సమ్మదమును గలిగించునదియు, దుష్టజనములను సంశమింపఁజేయునదియు నగు- ఆభువనేశ్వరి- పదసేవినగు నాయొక్క- అపారమగు కష్టమును తొలఁగించుఁగాత!

మూ॥ నూతన భాస్వద్ బిమ్బనిభాఙ్ఘ్రిం
శీతలరశ్మిద్వేషి ముఖాబ్జామ్।
ఖ్యాతవిభూతిం పుష్పశరారేః
పూతచరిత్రాం యోషితమీడే॥ 3

బాలసూర్యోపమ చరణయు, శీతకిరణద్వేషిముఖారవిందయు, విశ్రుతవిభూతియు, పూతచరిత్రయు, పుష్పబాణవైరియగు శివుని కాంతయు నగుపార్వతిని స్తుతించుచున్నాను.

మూ॥ ఉజ్జ్వలతారే వ్యోమ్ని లసన్తీ
సారసబన్ధౌ భాతి తపన్తీ
శీతలభాసా చిన్తనకర్త్రీ
పాతుకులం మే విష్టపభర్త్రీ॥ ౪

ఉజ్జ్వలతారమగు నాకాశమున క్రీడించునదియు, కమలమిత్రుఁడగు భాస్కరునియందు తపించునదియు, శీతకిరణునిచేత చింతించునదియు, అగు లోకభర్త్రి-నాకులమును రక్షించుఁగాత!

ప్ర భ:—"తప' ఆలోచనే" అనుధాతువువలన నిష్పన్నమగుటవలన 'తపించునది' అన ఆలోచించునదియని యర్థమగును. సూర్యునకు తపోధర్మమును చక్షుర్ధర్మమును గూడగలవు. కావున నచట తపించునదియని చెప్పఁబడినది. శీతకిరణుఁడన చంద్రుఁడు. చంద్రుఁడే మనస్సని శ్రుతియందు చెప్పఁబడినది. కావున చంద్రునిచేత ధ్యానించునది యనిచెప్పఁబడినది.

మూ॥ ప్రాణమనోవాగ్వ్యస్త విభూతి
ర్లోక విధాతుః కాచనభూతిః
పుష్కరపృథ్వీ పావకరూపా
శుష్కమఘం నః సా విదధాతు॥ ౫

ప్రాణముచేతను, మనస్సుచేతను, వాక్కుచేతను విభజింపఁబడిన విభూతిగలదియు, సర్వలోకస్రష్టయగు నీశ్వరునియొక్క అగ్ని

ర్వాచ్యభూతియు, నీరు-అన్నము- తేజస్సు (అగ్ని) అనునవి రూప ముగాఁగలదియు, నగు పరమేశ్వరి — నాదురితమును నిస్సారము నొనర్చుఁగాత !

ప్రభ :—జలాన్న తేజస్సులయొక్క అనిష్టాంశములు ఇచ్చట క్రమముగా, ప్రాణ, మనో, వాగ్ ధాతువులను విభూతులుగాఁజెప్పఁబడినవి. ప్రాణము-జలమయ మనియు, మనస్సన్నమయ మనియు, వాక్కు- తేజోమయమనియు, నింతకుముందే వ్యాఖ్యానింపఁబడినది. ప్రాణ- మనో- వాక్ కృతమగు పాపమును హరించు టకు జలాదిరూపిణియగు దేవి ప్రార్థింపఁబడినదని తెలియనగు.

మూ॥ ఇష్టఫలానా మమ్బ! సమృద్ధ్యై
కష్టఫలానాం తత్ క్షణ ధూత్యై
చేష్టి తలేశోద్దీపితశక్తిం
విష్టప భర్త్రీ త్వా మహ మీడే॥ ౬

జగద్రాజ్ఞీ! అమ్మా! అభీష్టములగు సుఖఫలములయొక్క సమృద్ధికొఱకును, కష్టఫలములయొక్క సద్యోనాశముకొఱకును, చేష్టిత లేశముచేత ఉత్తేజితమగు శక్తిగల నిన్ను స్తుతించుచుందును.

ప్రభ :—కష్టఫలములు=దుఃఖానుభవములు చేష్టితలేశము=ఈషచ్చలన విశే షము. అమ్మయొక్క అల్పమగు కదలికవలననే ప్రాణులయందలిశక్తియుద్దీపించును

మూ॥ భూమిరుహాగ్ర స్థాపిత భాణ్డాత్
యోమధుపాయం పాయ మజస్రమ్
విస్మృత విశ్వో నన్దతి మాతః !
తత్రకిల త్వం ధామ దధాసి॥ ౭

మాతా! వృక్షాగ్రమునందు స్థాపింపఁబడిన పాత్రమునుండి (తీయఁబడిన మదకరమగు) మధువును త్రాగి. త్రాగిప్రపంచమునుమర చి- ఎవ్వఁడు-ఆనందించునో, వానియందు నీవు స్థితినొందుచుందువు (వసింతువు) గదా!

ప్రభ :—ఇచ్చట వృక్షమే-శరీరము. దానియగ్రమే-శిరస్సు, దాని యందున్న సహస్రారమే-భాండము; అందున్నమధువు సోమరసమగు అమృతము.

తత్పానముచేత బ్రహ్మానందజమగు మదమును, దానిచేత ప్రపంచ విస్మరణము (మరపు)ను, గలుగుచున్నది. నారికేలతాలాదివృక్షముయొక్క అగ్రమున మట్టికుండనుగట్టి లోకమునందలి మనుష్యుఁడు మద్యమును గ్రహించుచున్నాఁడు. అత్యధికమగు తత్పానముచేత మత్తుఁడై జగత్తును మరచుచున్నాఁడు. ఇచట నుపమేయమగువిషయము—దేహాదికము. ఉపమానమగువిషయి—వృక్షాదికము. అందువిషయమగు దేహాదులను స్వశబ్దముచేఁ జెప్పక, విషయివాచకములగు వృక్షాదులనుమాత్రమే చెప్పుటవలన విషయనిగరణము చేయఁబడినది. కావుననిది "రూపకాతిశయోక్తి" అగును.

మూ॥ కోఽపిసహస్రైశేషముఖానాం
తేషఇతీడ్యః పన్నగరాజః
ఉద్గిరతీదం యద్వదనేభ్యో
దేవి! తనోమే తద్బతపాసి॥ ౮

"వీఁడు, ఇట్టివాఁడు" అని నిర్దేశించుటకు వీలుపడనివాఁడు కనుకనే పన్నగరాజగు ఆదిశేషుఁడు— సహస్రముఖములచే స్తుతింపఁదగిన వాఁడగుచున్నాఁడు. అతఁడు తనవదనమునుండి యీవిషమును నాశరీరమునఁ గక్కుచున్నాఁడు. కావున దానినుండి నన్ను రక్షించుచున్నావు. హా! ఎంతకష్టము !

ప్రభ :—అమృతమును మథించునపుడు అమృతోదయముకంటె ముందు గరలమువలె, దేవిచేత ననుగ్రహింపఁబడిన మహాయోగము ప్రచలితమగునపుడు ఒకానొకసిద్ధి కలుగుటకుముందు భరించుటకుశక్యముకాని తాపము బయలువెడలి, దేహము నావరించుచున్నది. దానినుండి నీవే నన్ను రక్షించుచున్నావని భావము. యోగనిష్ఠుఁడగు ఈకవి- స్వానుభవము నిచట నిట్లు ప్రస్తావించెనని తెలియునది.

మూ॥ సాకమమేయే! దేవి! భవత్యా
పాతు మహాన్తా యావదుదాస్యా
తావదియం తాం మూర్ఛయతీశే
పన్నగరాజోద్గారజధారా॥ ౯

అమేయవగు దేవీ! ఉద్గీర్ణమగుగరలమును నీతోఁగూడ త్రాగుటకు (అనుభవించుటకు) ఎంతకాలమీయహంత (అహంభావము)

ఉదాసీనతతో నుండునో, అంతకాలమును ఈ యాదిశేషుని విష ధార- ఆయహంతను మూర్ఛిల్లఁజేయుచుండును.

పరిభ :—అమృతవాహినివగు నీతో గూడ, అమృతమునకంటె పూర్వము బయలువెడలువిషమును భుజించుటను ఎంతకాలమీయహంత ఉదాసీనమై యుండునో, అంతకాలమునుగూడ ఈ విషధారచే మూర్ఛితనొందుచుండును. ఇందులకు నేనేమిచేయుదును? అని తాత్పర్యము. అమేయపు=మా నాతిశయు.

అవ —ఈ యవస్థయందు అనుభవింపఁబడుచున్న క్లేశములను మరలఁ దెలుపుచున్నాఁడు.

మూ॥ శామ్యతి చిన్తా జీవితమస్యా
మిన్ద్రియసత్తాఽప్యస్త ముపైతి
యాతినిరుద్ధాహంగలదేశే
సంశయమేషా మాతరహన్తా॥ ౧౦

మాతా! ఈ విషధారయందు- చింతనముయొక్క- జీవితము శాంతమగుచున్నది. ఇంద్రియసత్త (వర్తనము) నాశనమగుచున్నది. ఈయహంత— కంఠప్రదేశమున నిరుద్ధమై (స్తంభించినదై) సంశయమును పొందుచున్నది (కలిగించుచున్నది).

పరిభ ;—ఈవిషము- ప్రవహించునపుడు చింతనము-మృతప్రాయమగుచున్నది. చక్షురాదీంద్రియముల పటువడి కాల్పంపబడుచున్నవి. ఈ యహంత ('నేను' అనుదానియొక్క-భావము) కంఠమున నిరోధింపబడి-శక్తివిలాసవంతుఁడనై యోగమునందున్న నాకు మృత్యువు సంభవించినదా? అని సంశయింపఁజేయుచున్నది.

మూ. గౌరి! మహేశప్రాణసఖీనాం
పాహి విపన్నాం మాతరహన్తామ్।
సాయదిజీవేదీశ్వరి! తుభ్యం
దాసజనస్తామర్పయతేఽయమ్॥ ౧౧

గౌరీ! మహేశ్వరప్రాణసఖీ! జననీ! ఈదృశమగు నాపదనొందిన యీయహంతను రక్షింపుము. ఈశ్వరీ! అది జీవించునెడల- ఈ దాసజనుఁడు నీకొఱకు- ఆయహంతను సమర్పించుకొనును.

ప్ర. భ:—యోగసాధనవిశేషము. ప్రకృతి యనిన పురుష— ఈదృశ్యములగు అహాంతరక్లేశములు కలుగుచుండును. ప్వదెన్నఁగానుగూడ— ఈ అహంభావవిలయమును గోరఁదగదు. ఏలయనిన? ఈ అహంత— పరమేశ్వరికి సమర్పింపఁదగియున్నది. ఇది సుఖములయందు ప్రచురముగ సేవల తిరుగ, సుఖములు వృద్ధినొందుచు పుట్టుచునుండును, కావున నీవృశమగు ... గలుగఁగూడదని యిట్లు చెప్పఁబడినది.

అవ :—"అహంత—శుద్ధము కానియెడల నది యర్పింపఁదగినది కాదు" అను నభిప్రాయమునఁ జెప్పుచున్నాఁడు.

మూ॥ త్వత్ స్మృతి వీర్యాచ్ఛాన్తి సమృద్ధాం
మాత రహన్తాం శుద్ధతమాం యే
ఆత్మభుజిష్యాం కర్తుమిదానీం
శాన్తధియస్తే కోఽస్తి వికల్పః॥ ౧౨

మాతా! ప్రశాంతబుద్ధినగు నాయీయహంతను— నిన్నుస్మరించుట చేఁ గలిగిన బలమువలన నుదయించిన శాంతితో నిండినదానిని గాను, మిక్కిలి శుద్ధమగు దానిని గాను, ఆత్మభుజిష్యను (ఆత్మచే నియోగింపఁదగినదానిని) గాను, చేయుటకు—ఏల సంశయించుచున్నావు?

ప్ర భ :—"నియోజ్యకింకరప్రేష్యభుజిష్యపరిచారకాః" అను నమరోక్తి వలన 'భుజిష్య' శబ్దమునకు— కింకరుఁడని యర్థమగును. సంశుద్ధమగు నాయీయహంతను ఆత్మనియోజ్యనొనర్చుటకు నీవు వికల్పింపఁదగదని భావము.

మూ॥ మన్దరధారీ నామృతహేతుః
వాసుకి రజ్జు ర్నామృతహేతుః
మన్థనహేతు స్సాఽమృతహేతుః
సర్వబలాత్మా శర్వపురన్ధ్రీ॥ ౧౩

అమృతమును మథించునపుడు మందరగిరిని ధరించినకూర్మము (హరి) అమృతహేతువుకాదు. వాసుకియగుత్రాడు (గూడ) అమృత హేతువుకాదు. సర్వబలాత్మ యగుటవలన మంథనహేతువగు శర్వాణియే అమృతహేతువు.

ప్ర భ:—మందరధారియగు కూర్మముగాని, రజ్జువగు వాసుకిగాని అమృత లాభకారణముగా నేరము. సర్వబలాత్మ- అనగా సర్వబలమనకును జీవభూత, లేక. సమస్త బలమును శరీరముగాఁగలదియగు పరమేశ్వరియే— మథనమునకును, అమృత లాభమునకునుగూడ కారణమని భావము. అమృతమథన వృత్తాంతము యొక్క గూఢ మగుతత్త్వమును శ్లోకద్వయముచే దెలుపుచున్నాఁడు.

శ్లో॥ ప్రాణిశరీరం మన్దరశైలో
మూలసరోజం కచ్ఛపరాజః
పూర్ణమనస్తం క్షీరసముద్రః
పృష్ఠగవీణా వాసుకిరజ్జుః॥ ౧౪

ప్రాణిశరీరము—మందరపర్వతము. మూలాధారకమలము—కచ్ఛపరాజు. (కూర్మరాజు) పూర్ణమగు ఆకాశము-దహరమనుహృదయము క్షీరసముద్రము, వెన్నెముకయను కాదండము—వాసుకియగుత్రాడు.

మూ॥ దక్షిణనాడీ- నిర్జరసేనా
వామగనాడీ- దానవసేనా
శక్తివిలాసో— మన్థనకృత్యం
శీర్షజధారా—కాఽపిసుధోక్తా॥ ౧౫

దక్షిణనాడి—దేవసేన. వామగనాడి—అసురసేన. శక్తివిలాసము—మన్థనకృత్యము. శీర్షజమగు నోకానొకధార-అమృతము.

ప్ర భ: —శరీరమధ్యమునందున్న సుషుమ్నా నాడికి అపసవ్యభాగమునందున్న పింగళయను పేరుగల దక్షిణనాడి-అమరసేనయగుచున్నది. ఆసుషుమ్నకు సవ్యభాగ మునందున్న ఇలయను పేరుగల వామగనాడి-అసురసేనయగుచున్నది. శక్తియొక్క క్రీడయే- మథనమను కార్యమగుచున్నది. సహస్రారకమలమునుండి నిస్సరించిన (బయలువెడలిన) అనిర్వచనీయమగు ఆనంద ధార—అమృతమని చెప్పఁబడినది.

మూ॥ కర్ణనిరుద్ధే భూరివిషాగ్నె
ర్జైజసలిజ్గావాసిహరేణ

త్వద్ బలజాతం స్వాదమృతం కో
దేవి! నిపీయ ప్రేత ఇహాస్యాత్। ౧౬

దేవీ! అమృతమథన సమయమున, వాసుకిముఖమునుండి మొదట బయలువెడలిన మహావిషాగ్ని — తేజోమయలింగనివాసి యగు రుద్రునిచేత కంఠమున నిరోధింపఁబడునపుడు నీబలము చేనుద యించిన మధురమగు నమృతమును త్రాగి, యీలోకమునందున్న వాఁడెవ్వఁడు శరీరమునుడిగి ప్రేతలోకము నొందును?

ప్రభ :—అమృతమథనమున మొదట నిర్గమించిన గరలమును రుద్రుఁడు తనకంఠమున నిరోధించెను. తదుపరి నీప్రభావముచే జనించిన యమృతమును పాన మొనర్చినవాఁడు- మృతినొందఁడు అనిభావము. "తేజోమయలింగనివాసియగు హరునిచేత" అనుటచేత నీయంశము చెప్పఁదగియున్నది. షట్చక్రభేదమార్గము ననుసరించువారిమతమున మూలాధార- స్వాధిష్ఠాన- మణిపూర- అనాహత-విశుద్ధ- ఆజ్ఞాచక్రములారును- అగ్ని- సూర్య- సోమఖండములుగా వ్యవహరింపఁబడు చున్నవి- అందు, మొదటివగు మూలాధార- స్వాధిష్ఠానములు అగ్నిమండలమని వ్యవహరింపఁబడును. ఆయగ్నిమండలమే మూలాధారమునందలి తైజసలింగమని చెప్పఁబడును. అచ్చటనున్న హరుఁడు-విషప్రసారమును కంఠస్థలమునందే నిరోధించు ననియర్థము. ఇచట యోగనిష్ఠుఁడున, కవియునగు నీయాచార్యునకు—ఈ యరుణా చలక్షేత్రమున నివసించునపుడు- ఈ యనుభవము కలిగెను. అరుణాచలమునందలి శివలింగము- తైజసలింగమని పురాణములయందు ప్రసిద్ధమగుచున్నది. ఆ తేజోమయ మగు నరుణాచలలింగమున। వసించుచున్న భగవంతుఁడగు హరునిచేత విషమదధార- నాకంఠమునందే నిరోధింపఁబడినది. తరువాత నీబలముచే నుదయించిన యమృతమును త్రావితిని—అని భావము.

మూ॥ యేనవిభుస్తే మాద్యతి శర్వో
యత్ర శివే త్వం క్రీడసి హృష్టా
సమ్మదమూలం తం మదమాద్యే
వర్ధయపుత్రే౽నుగ్రహపాత్రే॥ ౧౭

శివా! భగవతీ! నీవిభుఁడగుశివుఁడు— ఏమదముచేత మదించు (హర్షించుచున్నాఁడో, నీవు— ఏమదమునందు సంతుష్టవై విలసించు

చున్నావో. సమ్మదమూలమగు-ఆమదమును, ఆద్యపుత్త్రుఁడగు (జ్యేష్ఠపుత్త్రుఁడగు) గణపతియందు వర్ధమానము నొనరింపుము.

ప్రభ:-మదించుచున్నాఁడో=మోదలహరి ననుభవించుచున్నాఁడో. వర్ధమానము నొనరింపుము=వృద్ధినొందింపుము.

మూ॥ యోమద మీదృఙ్మార్గము పేక్ష్య
స్వర్విభుపూజ్యే గర్వసమేతః।
ఆహరతి శ్రీబాహ్యసమృద్ధ్యా,
నాసురయావా సోఽసురఉక్తః॥ ౧౭

స్వర్గరాజపూజ్యవగు జననీ! గర్వ (అహంకార) సమేతుఁడగు ఏమనుష్యుఁడు- పూర్వశ్లోకమునఁ జెప్పఁబడిన సమ్మదమూలమగు నిటువంటిమార్గముగల మదమును (హర్షమును) ఉపేక్షించి (తిరస్కరించి) సంపదయొక్క- బాహ్యసమృద్ధిచేతఁగానీ, సురచేతఁగానీ, మదమును (హర్షమును) సంపాదించుచుండునో, వాఁడే - అసురుఁడని చెప్పబడియెను.

ప్రభ:—ఆసహజమగు ఆనందమునకు మూలమగు మదమునుగోరక, ధనసాధ్యమగు బాహ్యపూజాసామగ్రిచేతఁగాని, హాలచేత (కల్లుచేత) గాని మదమునాహరించువాఁడే- అసురుఁడు. అతఁడు దివ్యమార్గము నొందఁజాలఁడు. ఆదివ్యమార్గము ముందు- "కేఽపియజన్తే" ఇత్యాది శ్లోకములయందు చెప్పఁబడును.

మూ॥ తామ్యతి తీవ్రాఫేననిషేవీ
గ్లామ్యతి సంవిత్పత్రనిషేవీ
భ్రామ్యతిహాలాభాణ్డ నిషేవీ
శామ్యతి శీర్షద్రావ నిషేవీ. ౧౮

తీవ్రమగు అఫేనమును (అహిఫేనమును, అనఁగానల్లమందును) సేవించువాఁడు-ఖేదమునొందును. సంవిత్పత్రమును (మాదకద్రవ్య విశేషమగు గంజాయిని) నిషేవించువాఁడు- గ్లానినొందును. హాలాభాండమును (సురాపూర్ణమగు పానపాత్రమును) నిషేవించువాఁడు భ్రాంతినొందును. శీర్షద్రావమును నిషేవించువాఁడు శాంతినొందును.

ప్రభ—నల్లమందు నుపయోగించువానికి చివరకు ఖేదముకలుగును. జ్ఞానపత్త్రి మను పేరుగల గంజాయిని సేవించువానికి తుదకు హార్దము క్షీణించును. అమితమగు సురాపానము నొనర్చువానికి తెలివి నశించును. శీర్షమునుండి ద్రవించు సోమరసము నాస్వాదించువానికిమాత్రమే శాంతిలభించును. ఇట్లు 'నల్లమందు' మున్నగు మాదకద్రవ్యములవలనఁ గలిగినమదము-వినాశహేతువగును. సహస్రారసోమరసము వలన గలిగినమదము శాంతిజనకమగును— అనిభావము.

మూ॥ అస్తువిరేకే పథ్యమఫేనం
పత్త్రమజీర్ణేష్వస్తు నిషేవ్యమ్।
అస్తుహితం తద్వ్యక్షయేమద్యం
సంసృతిహారీ దేవి! రసస్తే॥ ౧౯

మాదకద్రవ్యమగు నల్లమందు- అతిసారాది రోగమునందు (అజీర్ణ్యాదిజన్యమగు విరేచనమునందు) పథ్యము- (హితము) కావచ్చును. గంజాయి-మందాగ్నిరూపములగు నజీర్ణములయందు, జఠరాగ్ని దీపనముకొఱకు సేవింపఁదగినది కావచ్చును. మద్యము (కల్లు) క్షయరోగమునందు హితముకావచ్చును. భవత్సంబంధియగు సోమరసము మాత్రము-సంసృతిని హరించునది యగుచున్నది.

ప్రభ:—నల్లమందు మొదలగు నిషాచేయువస్తువు-వైద్యమునందు ప్రయోగింపబడి గుణమునిచ్చును. తదితరసమయములందు దోషమునేకలిగించును. అనిభావము.

అవ:—సత్త్వగుణులగు మహాత్ములు వీనిని సేవించినను దోషయుక్తులు కానేరరనియాశంకించి- సత్వగుణసమృద్ధులగు మహాత్ములు— మార్గదర్శకులు, కావున వారుగూడ వీనిని సేవింపఁగూడదనుచున్నాఁడు.

మూ॥ నైవమహాన్తస్సత్త్వసమృద్ధాః
సర్వమదేష్వప్యమ్బ! చలన్తు
అల్పజనానాం మాదకవస్తు
ప్రాశనమీశే నాశనముక్తమ్॥ ౨౧

అమ్మా! ఈశ్వరి! సత్త్వగుణసమృద్ధులగు మహాపురుషులుగూడ కాఁడఁ తెలుపబడిగ మాదకద్రవ్యములను సేవింపఁగూడదు, అల్ప

సత్త్వులగు మనుష్యులకు మదకరవస్తుప్రాశనము- నాశనమని చెప్పఁబడినది.

ప్ర భ:— నాశకమగునని యిచట వాక్యమునర్థమును గ్రహించునది.

మూ॥ కేఽపియజన్తే యన్మధుమాంసైః
త్వాంతిప్రకారేర్జీవితనాథే!
అత్రనయాగో దూషణభాగీ
ద్రవ్యససక్తో దుష్యతియష్టా॥　　౨౨

త్రిపురారి జీవితేశ్వరివగు జననీ! కొందరు తాంత్రికులు-నిన్ను మధు-మాంసాదులచేత యజింతురు. (పూజించుచుందురు) ఈవిషయమున యాగము (యజనకర్మ) దూషణభాగి (నిందింపఁదగినవంతు గలది) కాదు. కాని యామధుమాంసాదికమగు ద్రవ్యమునందు- ఆసక్తిగలవాఁడగు యాజకుఁడు దోషియగుచున్నాఁడు.

ప్ర భ.— ఏదో యొకసాధనముచేత యజించుట-(యోగి మొనర్చుట) గుణసంపాదకమేయగును. మధుమాంసాదులగు వస్తువులయందలి యాసక్తిమాత్రము దోషకారియగునని భావము.

మూ॥ దక్షిణమార్గే సిద్ధ్యతిభక్తః
సవ్యసరణ్యాం సిద్ధ్యతివీరః
నేశ్వరి! సవ్యేనాఽప్యపసవ్యే
సిద్ధ్యతిదివ్యేత్వధ్వనిమానీ॥　　౨౩

ఈశ్వరీ! దక్షిణమార్గమునందు భక్తుఁడు సిద్ధుఁడగుచున్నాఁడు. సవ్య (వామ)మార్గమున వీరుఁడు—సిద్ధుడగుచున్నాఁడు. సవ్య(వామ) మార్గమునందును, అపసవ్య (దక్షిణ) మార్గమునందునుగూడ-మాని సిద్ధుఁడు కాఁడు? కాని దివ్యమార్గమున సిద్ధినొందుచున్నాఁడు.

ప్ర భ; —ఉపాసకుఁడుపాసింపఁదగినమార్గములు మూఁడున్నవి. (అవి— సవ్యము- అపసవ్యము- దివ్యము-అనుపేళ్ళు గలవి. అందు సవ్యమార్గము- వామమార్గమనియు, కులాచారపథమనియుఁ జెప్పఁబడును. ఈమార్గముచేత శక్తినుపా

సింమవారికి మధు-మాంసాదికమగు మకారపంచకము ప్రధానమనునంశము- దాని యందుఁ జెప్పఁబడినది. ఇది కులాచారమునకు సంబంధించినమార్గము. కావున నీకులమార్గము ననుసరించునతఁడు కౌలుఁడని చెప్పఁబడును. కావున నీవామమార్గము ననుసరించి మధుమాంసములచేత దేవి నుపాసించుకౌలుఁడు— "వీరుఁడు" అగును. అపసవ్యమనుమార్గము- దక్షిణమార్గమనియు, సమయాచారపథమనియుఁ జెప్పబడును. ఈసమయాచారము చేత దేవినుపాసించువాఁడు భక్తుఁడగును. సమయాచారము నందు భక్తియేప్రధానము. దివ్యమార్గము—మీఁది రెండుమార్గములకంటెను వేఱయినది మీఁది శ్లోకమున దానిస్వరూపము వివరింపఁబడుచున్నది. సవ్యాపసవ్యములనువిడిచి, యీదివ్యమార్గము నాశ్రయించునతఁడు జ్ఞానియగును. తాంత్రికులు- వామాచారునకువీరభావమును, సమయాచారునకు పశుభావమును, దివ్యమార్గస్థునకు దివ్యభావమును జెప్పుదురు. ఈశ్లోకమునందలి పూర్వార్ధమున పశు—వీరభావములును, ఉత్తరార్ధమున దివ్యభావమును, జెప్పఁబడినవని గ్రహించునది.

మూ. నార్చనభారో నాఽపిజపోఽస్యాం
దివ్యసరణ్యాం భవ్యతమాయామ్
కేవలమమ్బాపాదసరోజం
నిశ్చలమత్యా మృగ్యమజస్రమ్ ౨౮

భవ్యతమమగు-ఈదివ్యమార్గమున అర్చనభారముగాని, జపముగాని, లేదు. నిశ్చలమతితో నిరంతరమును దేవిపాదారవిందమునే యన్వేషింపవలయును.

ప్ర భ:—అత్యంతశుభమగు నీదివ్యమార్గము నాశ్రయించువానికి పూజోపకరణసామగ్రిసంపాదనభారములేదు. యథావిధిగా మంత్రమును పురశ్చరణము చేయనక్కఱలేదు. దివ్యమార్గగామియగునతఁడు—నిర్ధారితమగు దేవీపదాన్వేషణమును మాత్రమే చేయవలయును. (అతఁడు బహిరంగపూజాపద్ధతిని గాని, జపమును గాని యపేక్షింపఁడని భావము)

మూ॥ కాచిదమూల్యా చమ్పకమాలా
వృత్తనిబద్ధా మఞ్జులమాలా
అస్తుగణేశస్యేశ్వరకాన్తా
కణ్ఠవిలోలా చమ్పకమాలా॥

గణపతికి సంబంధించినదియు, అనిర్వచనీయమును, అగుచు చంపకమాలావృత్తరచితమును, అమూల్యము అగు మంజులమాలను, (మృదుమధురపదార్థ గుంఫితమగు పద్యపంక్తి, లేక కోమలమగుపూల దండ) చంపకమాలయై. ఈశ్వరకాంతయొక్క కంఠమున విశేషముగా చలించుఁగాత!

ప్ర భః— నా యీ స్తుతి-యీశ్వరీకంఠమున చంపకపుష్పమాలగా నొనర్పబడుఁగాతమని యర్థము. అమూల్య, మంజులమాలలు-శ్లిష్టములగు విశేషణములు "కంఠమున విశేషముగా చలించుఁగాత!" అనుచోట లక్షణచేత కంఠమునకు నాదమనర్థముగాఁజెప్పవలెనేని "భగవతీ కంఠధ్వనియందు నాకృతి ప్రచలితమగుఁగాత!" అనుభావమేర్పడును. "కంఠో వాచకశబ్దేస్యాత్ సన్నిధానే గళేధ్వనౌ" అని నానార్థరత్నమాల-చెప్పుచున్నది. ఏకాంతభక్తుఁడను, పుత్రుఁడను, అగు నాచేతరచితమగు నీస్తుతినాలించి యాదేవియహహ— ఈ నాపుత్త్రుఁడు— అమూల్యరమణీయమగు స్తుతిని నిబంధించెనని తానుగాఁ దీనిని నూత్నముగా పలుకుచుండునుగాత! ఇచట-ఉపమానమగు చంపకపుష్పమాల, ప్రకృతమునందుపయోగించి- విషయమగు చంపకమాలాస్తుతిరూపమున పరిణమించుటవలన— ఇది— శ్లేషోత్థాపితమగు పరిణామాలంకారమగుచున్నది.

ఇది- సవ్యాఖ్యమగు సప్తదశ (పదునేడవ) స్తబకము.



ఓం నమోభగవతే, శ్రీరమణాయ.

# ఉమాసహస్రము



## అష్టాదశ స్తబకము

( పంచమ శతకము - ద్వితీయ స్తబకము. )

అవ:—పదునెనిమిదవదియగు నీ స్తబకమున దేవీరూపము నభివర్ణించి పిండాండమునందు దానితత్త్వము నుగ్గడించుచున్నాఁడు.

మూ॥ ధున్వన్త్యస్తిమిరతతిం హరిత్తటీనాం
ధిన్వన్త్యః పురమథనస్యలోచనాని।
స్కన్దామ్బాహసితరుచో హరన్తుమోహం
సాన్ద్రంమేహృదయగతం ప్రసహ్యసద్యః॥ ౧

దిక్ప్రదేశములయందున్న తిమిరవిస్తృతిని తొలగించునవియు, రుద్రుని నేత్రత్రయమును సంతోషింపఁజేయునవియు, అగు సుబ్రహ్మణ్యజననీ మందస్మితప్రభలు-మదీయ హృదయగతమును, సాంద్రమును, అగు మోహమును వెంటనే బలాత్కరించి తొలఁగించుఁగాత!

ప్రభ:—జ్ఞానప్రదుఁడగు సుబ్రహ్మణ్యుని జననియగు పరమేశ్వరియొక్క మందస్మితప్రభలు-హృదయగతమగు మూలాజ్ఞానమునుతొలఁగించుఁగాతమని ప్రార్థింపఁబడినది. కావున హృదయస్థిత-తమోఽపహరణమునకొఱకు స్కందాంబ-(సుబ్రహ్మణ్యజనని) అని చెప్పుట- రమణీయమగు నౌచిత్యమును సంఘటించుచున్నది.

మూ॥ తన్వానా వినతహితం విరోధివర్గం
ధున్వానా బుధజన మోదమాదధానా
స్రమ్రాజ్ఞీ త్రిదివ ధరా రసాతలానాం
రుద్రాణీ భణతుశివాని మత్కులస్య. ౨

ప్రణతులకు హితము నొనర్చునదియు, విరోధివర్గమును కంపింపఁజేయునదియు, విద్వజ్జనమున కానందమును గలిగించునదియు,

స్వర్లోక- భూలోక- పాతాళలోకములకు సమ్రాజ్ఞియు అగు ఇంద్రాణి- మావంశమునకు మంగళము ననుగ్రహించుఁగాత!

ప్ర భ :— ప్రాణులు=ఎల్లరకు హితము=శ్రేయము. విరోధివర్గము=శత్రుసముదాయము, సమ్రాజ్ఞి=చక్రవర్తిని.

మూ॥ యోఽమ్బ! త్వాంహృది విదధత్ తటిత్ ప్రకాశామ్
పీయూషద్యుతిమదహృన్ముఖారవిన్దామ్।
అన్యత్తుస్మృతిపథతోధునోతిసర్వమ్
కామారేః సుదతి! నతస్య భువ్యసాధ్యమ్॥ 3

అమ్మా! కామారిసుందరీ! నిన్ను మెఱుపువంటి కాంతిగల దానినిగాను, అమృతాంశునిమదమును హరించు ముఖారవిందముగల దానినిగాను, హృదయమునందు-ఆకళించి (ప్రవేశింపఁజేసి) ఇతరము నంతను స్మృతిపథమునుండి దూరీకరించువానికి భూలోకమున సాధింపరానిది లేదు.

ప్ర భ :— మీఁదఁ జెప్పఁబడిన పరమేశ్వరీస్వరూపమును హృదయమున హత్తించి— తదితరప్రపంచవిస్మృతినొందిన ధ్యాతకు సర్వమును శక్యమగునని భావము.

మూ॥ కాలాభ్రద్యుతి మసమానవీర్యసారాం
శక్త్యూర్మిభ్రమకర శుక్లఘోరదంష్ట్రామ్।
యోధీరోమనసిదధాతి భర్గపత్ని!
త్వామస్య ప్రభవతి సఙ్గరేషుశస్త్రమ్॥ ౪

భర్గపత్నివగు జననీ! నిన్ను కాల(నీల) మేఘప్రభనుగాను, అద్వితీయపరాక్రమ సారనుగాను, శక్తితరంగ-భ్రమకర-శుక్లఘోర దంష్ట్రనుగాను, మనస్సునందు ధారణమొనర్చుచుండు ధ్యాతకు తాను ధరించినశస్త్రము యుద్ధములందు విజయసమర్థమగును.

ప్ర భ :—ప్రఖ్యాతవ్యాఖ్యాతలచేత—"శక్తితరంగభ్రమకరశుక్లఘోరదంష్ట్రాను" అనుపదమున కర్తవ్యాసము చెప్పఁబడినది. అర్థస్వారస్యమునఁ గనుగొనఁ భ్రమకళ్లను

నకు భ్రమణమే (తిరుగుటయే) అర్థము గాఁ జెప్పఁబడినది. అందు మొఁగటి యర్థము శక్తులతరంగములయందగు భ్రమణము లేఁడుగు కాంతులుగల- ధవళకరాళదంతములు గలది.(అనఁగా స్వీయధవలకరాళదంష్ట్రాంశువులే శక్తితరంగభ్రమణములని భావము. రెండవయర్థము. శక్తితరంగములందు భ్రమించుచున్న ధవలకరాళదంష్ట్రములుగలది (అనఁగా; "స్వీయధవళభీషణదంష్ట్రలచేత శక్తితరంగములయందు భ్రమ నొనర్చునది" అనిభావము)

మూ॥ యఃప్రాజ్ఞః, తరుణదివాకరోజ్జ్వలాఙ్గీం
తన్వఙ్గి! త్రిపురజితో విచిన్తయేత్త్వామ్
తస్యాజ్ఞాం దధతి శిరస్సుఫుల్లజాజీ
మాలాంవాధరణిజుషోభవన్తః॥ ౫

త్రిపురజిత్సుందరీ! దేవీ! నిన్ను- 'బాలసూర్యునివలె ఉజ్జ్వలమగు శరీరముగలదానినిగా ధ్యానించువానికి, భూలోకనివాసులంద అనుగూడ వశపడి, వానియాదేశమును, వికసించిన జాజీపుష్ప మాలనువలె శిరస్సులయందు ధరించుచుందురు.

ప్ర భ :—ఎవఁడు నిన్ను బాలసూర్యసన్నిభగా నుపాసించునో వాని యెడల ప్రీతివహించి, తదధీనులై, మానవులు-వానియాజ్ఞ ననుసరింతురని భావము.

మూ॥ యోరాకాశశధరకాన్తి సారశుభ్రాం
బిభ్రాణాం కరకమలేన పుస్తకంత్వామ్।
భూతేశంప్రభు మసకృత్ ప్రబోధయన్తీం
ధ్యాయేద్వాగ్భవతి వశేఽస్యనాకదూతీ॥ ౬

దేవీ! భగవతివగు నిన్ను పూర్ణిమా చంద్రకాంతి సారమగు నమృతమువలె తెల్లనిదగు పుస్తకమును కరకమలమున ధరించుచున్న దానినిగాను, ప్రభువగుపశుపతిని మాటిమాటికిని మేల్కొలుపుచున్న దానినిగాను, ధ్యానించుపురుషునికి వశపడి (వాక్కు) సరస్వతి-నాక దూతియగును.

ప్ర భ :—నిత్యసమాధినిష్ఠుఁడగు భగవంతుఁడు; పరమేశ్వరునకు— జగద్విషయకమగు ప్రబోధమును గలుగఁజేయుటకు నిత్యమును ప్రయత్నించుచున్న దానిని గాను, ప్రసన్నధవలపుస్తకహస్తనుగాను, నిన్ను వాసించుపురుషుఁడు- అమోఘ వాగ్వీర్యుఁడై, తనవాక్కును దేవతలుగూడ వినునట్లొనర్పఁగలుగునని భావము.

మూ॥ జానీమో భగవతి! భక్తచిత్తవృత్తే
స్తుల్యం త్వం సపది దధాసి రూపమగ్ర్యమ్।
ప్రశ్నోఽయం భవతి నగాధినాధకన్యే!
రూపం తే మదయతి కీదృశం స్మరారిమ్॥ ౭

భగవతీ! భక్తుని మనోవృత్తికనురూపమగు ప్రశస్తరూపమును వెంటనే ధరింతువను నంశమును మేమెఱుఁగుదుము. ఇదియొకప్రశ్న. పార్వతీ! నీకు సంబంధించిన కీదృశమగురూపము- స్మరరిపుని మోహింపఁజేయుచుండును?

ప్రభ :—నీవు స్వేచ్ఛచేత వివిధములగు రూపములను ధరించుటకు శక్తురాల వని మాకు తెలియును. కాని మదనారిని వశీకరించుకొనుటకు కేరూపమును ధరిం చెదవో చెప్పుము.

మూ॥ చాతుస్యా దల మితి వక్తు మమ్బ! శక్యం
రూపం తే నవదతి కోఽపి కీదృశం వా
సమ్మోహం పరముపయాన్తికాన్తిభాణ్డే
కామారే రపి నయనాని యత్రదృష్టే॥ ౮

అమ్మా! మదనారియగు శివుని మోహింపఁజేయుటకు- ఎంత సుందరమగు రూపము సరిపడునో (చాలునో) అంత సుందరమగు రూపము (ధరించెదవని) చెప్పుట సులభమే కాంతిభాండమగు- ఏనీ రూపము చూడఁబడినపుడు-కామారియొక్క నయనములు మూఁడును గూడ సమ్మోహము నొందినవో, ఆనీరూపము- ఎట్టిదో, (నరుఁడు గాని యమరుఁడుగాని) ఎవ్వఁడునుగూడ చెప్పకున్నాఁడు.

మూ॥ సజ్కల్పైః కిము తవ భూషణాన్యభూవ
న్నిచ్ఛాభిః కిము విదధుర్యథాఽత్రలోకే।
తత్స్వర్ణం భగవతి! కీదృశం మణీనాం
కిం రూపం భవతిచ తత్రయోజితానామ్।

భగవతీ! నీసంకల్పబలముచేతనే నీకు-భూషణములు ప్రాదుర్భవించినవా? ఈలోకమునందు వలెనే కలాకుశలులగు శిల్పీంద్రులు (స్వర్ణకారులు) నీయాభరణములను సంఘటించిరా? ఏబంగారముతో నీభూషణములు చేయఁబడినవో ఆబంగారమెట్టిది? ఆభూషణముల యందు ఖచితములగు రత్నముల స్వరూపమేమి?

మూ॥ యాన్యఙ్గాన్యఖిల మనోజ్ఞసారభూతా
న్యేతేషామపి కిము భూషణై రుమే! తే ।
ఆహోస్విల్లలితతమాని భాన్తిభూయో
భూషాభిర్వికృతతమాభిరప్యమూని॥ ౧౦

ఉమా! ఏ నీయంగములు- సకలరమణీయవస్తుసారభూతములో ఆయీయంగములకు భూషణములచే నగుప్రయోజన మేమున్నది? ఒకవేళ, నిసర్గరమణీయములగు నీయంగములు- వికృతతమములగు భూషణములచేతనుగూడ లలితతమములై విశేషించి భాసించును కాఁబోలు.

ప్ర భ :—సుందరతమములగు నీయంగములకు భూషణములచేతఁ గలుగు నుత్కర్షమున కవకాశము లేదు. ఈ భూషణములు కృతకములు. కావున మిక్కిలి వికృతములు, వీనికంటె నీయంగములు మిక్కిలికోమలములు. కావున కృతకమగు రామణీయకముగల భూషణములచేత నైసర్గికరామణీయకముగల నీయంగములు సుందరతమములై స్పష్టముగా ప్రకాశించుచుండునని భావము.

మూ॥ ముక్తాభిర్భవతి తవామ్బ! కిన్ను హారః
పీయూషద్యుతికరసారనిర్మలాభిః
ముక్తైర్వాఘులఘులశబ్ద మాదధద్భిః
సఙ్ఘర్షాత్ త్రిభువనసార్వభౌమభామే॥ ౧౧

అమ్మా! త్రిభువనసార్వభౌమభామా! నీహారము- అమృతాంశు కిరణసారమగు తుషారమువలె స్వచ్ఛములగు ముక్తామణుల చేతఁ గూర్పఁబడినదా? లేక అన్యోన్యమగు తీవ్రఘర్షణమువలనఘుల

ఘలాయమానమగు శబ్దము నొనర్చుచున్న ముండములచేతఁ (నరకళే బరములచేత) రచింపఁబడినదా?

ప్ర భ :—దక్షిణకాలీమూర్తి. ముండమాలాధారిణి యనునంశము- (తల పుఱ్ఱెలదండలను ధరించినదని) తంత్రశాస్త్రప్రసిద్ధమగుచున్నది.

మూ॥ వస్త్రంస్యాద్యది తవ సర్వశాస్త్రగమ్యే!
కార్పాసం దివిచ తదుద్భవోఽనుమేయః॥
క్షౌమంచేద్ భగవతి! తస్య హేతుభూతాః
కీటాఃస్యుర్గగనజగత్యపీతివాచ్యమ్॥ ౧౨

నిగమాగమాదిశాస్త్రగమ్యవగు జననీ! నీవస్త్రము-కార్పాసము (కార్పాసీఫలతంతు నిర్మితము అనఁగా ప్రత్తినుండి తీయఁబడిన దారముతో నేయఁబడినది) అగునెడల, ద్యులోకమునందుఁగూడ ప్రత్తినుండి తీయఁబడిన నూలుతో నేయఁబడినవసనముయొక్క-ఉత్పత్తి—అనుమానింపఁ (ఊహింపఁ) దగినది.

ప్ర భ: —భగవతీ! ఆవస్త్రము- క్షౌమము (కౌశేయము) అగునెడల, అంతరిక్షలోకమునందుఁగూడ దానికి హేతుభూతములగు కీటములున్నవని చెప్పవలయును. పట్టుపురుగు చేత తయారుచేయఁబడిన దారముతో నేసినచీర— 'క్షౌమము' అని చెప్పఁబడును.

మూ॥ రుద్రస్యప్రియ దయితేఽథవా సురద్రు
ర్భూషణాం మణికనక ప్రకల్పితానామ్
వస్త్రాణామపి మనసే పరం హితానాం
కామం తే భవతి సమర్పకః సమర్థః॥ ౧౩

రుద్రప్రియసివగు జననీ! ఒకవేళ- కల్పవృక్షము- మణికనక ప్రకల్పితములగు భూషణములను మనోహరములగు వస్త్రములను మిక్కిలి సమర్థమై సమర్పించుచున్నదా?

ప్ర భ: —కల్పవృక్షము— వస్త్రభూషణసమర్పణ నిపుణమగుచున్నదా ? అని ప్రశ్నము చేయఁబడినది.

మూ॥ సుస్కన్ధో బహువిటపః ప్రవాలశోభీ
సమ్ఫుల్ల ప్రసవ సుగన్ధవాసితాశః
వృక్షః కిం భగవతి! కల్పనామకోఽయం
సఙ్కల్పః కిము తవకోఽపి దేవి! సత్యః॥ ౧౪

భగవతీ! దేవీ! శోభనమగు స్కంధముగలదియు, బహుల మగు వృక్షవిస్తారముగలదియు, ప్రవాలములచేత శోభించునదియు, లెస్సగా వికసించిన పుష్పములయొక్క సుగంధముచేత వ్యాపింపఁ బడిన దిక్కులుగలదియు, కల్పనామకమగునదియునగు ఈవృక్షము సత్యమా? లేక నీకు సంబంధించిన యొకానొక సంకల్పమా?

ప్ర భ:—చక్కని బోదెతోఁగూడినదియు, అనేకవృక్షముల సముదాయ రూపమైనదియు, చిగుళ్ళచేత శోభించునదియు, వికసించినపూవుల పరిమళమును దిక్కులందంతటను ప్రసరించునదియు, కల్పమను పేరుగలదియు, నగువృక్షము-ఉన్నదా? లేక యది నీసంకల్పరూపమా? అని ప్రశ్నము చేయఁబడినది.

అవ:— కామధేను- కల్పవృక్షములకు సంబంధించిన అధ్యాత్మతత్త్వమును చెల్పుచున్నాఁడు.

మూ॥ సఙ్కల్పాన్న భవతి కల్పపాదపోఽన్యః
స్వర్ధోగ్ధ్రీపునరితరానకుణ్డలిన్యాః
యఃకుర్యాద్ ద్వయమిదముద్గతాత్మవీర్యం
కారుణ్యాత్తవభువిచాస్యనాకభాగ్యమ్॥ ౧౫

అమ్మా! సర్వవస్తుప్రదమగు కల్పవృక్షము— సంకల్పముకంటె వేరుకాదు. కామధేనువుకూడ- కుండలి నీశక్తికంటె నితరముకాదు. ఈసంకల్ప- కుండలీనీశక్తులు రెండింటిని-ఉద్ గతమగు-ఆత్మవీర్యము గలవానినిగా నొనర్చువానికి, నీకారుణ్యమువలన భూలోకమునందే స్వర్గలోకభాగ్యము కలుగును.

వి వ:—ఉద్గతము=ప్రబుద్ధము= మేలుకొలుపఁబడినది. ఆత్మవీర్యము = స్వబలము.

మూ॥ ఆపీనం భవతి సహస్రపత్రకఞ్జా
వత్సోఽస్యాః పటుతరమూలకుణ్డవహ్నిః
దోగ్ధాఽత్మాదహరసరోరుహోపవిష్టో
మానం స్యాత్ సురసురభే స్తనూష్ణుదోహః॥ ౧౬

సహస్రారకమలమే– పాలపొదుగు. కుండలినియగు కామధేనువునకు– మూలాధారమేయగు కులకుండమునందలి నిపుణతరమగు నగ్నియే=దూడ హృదయకమలాసీనుఁడగు 'ఆత్మయే– దోగ్ధ. (పాలు పితుకువాఁడు) సర్వవిషయములను నిరసించునదియు, శాంతితో నిండియుండునదియునగు మానమే– పొదుగునుండి పాలుతీయుట.

ప్రభ :—కుండలినుండి జనించిన మూలాగ్నియే వత్సము.(దూడ)

మూ॥ దోగ్ధ్రా త్వస్తే భగవతి! దోహనేన లబ్ధం
వత్సాగ్ని ప్రథమ నిపాన సద్రవాయాః।
దుగ్ధం స్వాద్వమృతమయం పిబన్మమాత్మా
సన్తృప్తో న భవతి దుర్భరోఽస్య కుక్షిః॥ ౧౭

దూడయను మూలకుండాగ్నియొక్క– ప్రథమనిపానముచేత చేపఁబడిన పాలుగల కామధేనువును పితుకుటచేత లభించినక్షీరమను మధురామృతమును త్రాగుచున్న నాయాత్మ (అనఁగా జీవాత్మ) సంతృప్తుఁడు కాకున్నాఁడు.వీని కుక్షినింపుట–కష్టము.

ప్రభ :—మూలాధారమను పేరుగల కులకుండాగ్నియగు వత్సము - కుండలినీ శక్తియగు కామధేనువును జన్మించినది. ఆవత్సము - తల్లియొక్క– పొదుగునందలి పాలను మొదట కుడువఁగా నామె చేపుచుండును. ఆదూడ మొదట త్రాగఁగా నురుగుతోఁగూడిన పాలుగల యా ధేనువును మరల పిదికి, (సహస్రారమను) పాల పొదుగునుండితీసిన (అమృతమను) క్షీరములను– ఈ జీవాత్ముఁడు త్రాగుచున్నాడు, లభించిన యీపాలతో సంతృప్తి నొందకున్నాఁడు. (ఇంతవఱకు త్రాగితినిగదా! చాలునని సంతుష్టి నొందకున్నాఁడు) దీనికి హేతువేమనిన; ఈ జీవాత్ముని కుక్షి– నింపుట శక్యము కానిదని. తిండిపోతునకు స్వల్పమగుభోజనము చాలదు– అని భావము.

మూ॥ వత్సోఽగ్నిః పిబతి దృఢాఙ్ఘ్రిరమ్బ! పశ్చాత్
అశ్రాన్తం పిబతి దుహన్ పురోఽన్తరాత్మా
వృద్ధిం చ వ్రజతి పయః ప్రతిప్రదోహం
దోగ్ధ్ర్యాస్తే ద్రవ ఇహ కుణ్డలిన్యపారః॥ ౧౮

వత్సమగు అగ్ని, వెనుకకు- ముందుకు, స్ఖలితముకాని దృఢ మగు పదప్రక్షేపముగలదై-పాలను త్రాగుచున్నది. పురోభాగమునం దంతరాత్మ- దోహనమునొనర్చుచు (పాలు పితుకుచు) విశ్రాంతి కలుగకుండ త్రాగుచున్నాడు. ప్రతిప్రదోహమునందును (పాలు పితుకుచున్న సమయములయందెల్ల [illegible]) పాలు వృద్ధినొందుచున్నవి. (అయినను) ఓ కుండలినీదేవి! కామధేనువగు నీక్షీరరసముఅపారమై యున్నది.

ప్ర భ :— [illegible] అసలికముగస్థితిగలిగి పీల్చు చున్నను, జీ[illegible]త్మ— [illegible] [illegible]రమునుండి జనించు చున్న యమృతరసముక్షీణింపక వృద్ధినే పొందుచున్న[illegible] . కావున కుండలినివలన ప్రసరింపఁబడుచున్న సోమరసము- [illegible]మితమని భావము-

మూ॥ సోమస్య ద్రవమిమమాహురమ్బ! కేచిత్
దుగ్ధాబ్ధేరమృతరసం గదన్తి కేఽపి
బాష్పం కేఽప్యభిదధతే తు కాలకుణ్డం
పీనోధస్స్రవమితరే భణన్తి ధేనోః॥ ౧౯

అమ్మా! ఈ రసమును కొందఱు సోమద్రవమని (సోమలతయం దలి రసమని, లేక చంద్రకిరణామృతమని) చెప్పుదురు. కొందఱు పాలసముద్రమునందలి అమృతరసమని చెప్పుదురు. మఱికొందఱు మాత్రము—మూలాగ్నికుండమునకు సంబంధించిన బాష్పమని (ఆవిరి యని) చెప్పుదురు. వేరొకకొందఱు మాత్రము- కామధేనువుయొక్క- బలసిన పొదుగునందలి పాలని చెప్పుదురు.

ప్ర భ :—ఇట్లు బహువిధముల నుల్లేఖింపఁబడుటవలన నిది— ఉల్లేఖాలంకార మగుచున్నది.

మూ॥ మూలేత్వం జ్వలదనలప్రకాశరూపా,
వీణాయాం ప్రబలమహోమదోష్మరూపా,
శీర్షాబ్జే సతతగలద్రసస్వరూపా,
భ్రూమధ్యే భవసిలసత్తటిత్స్వరూపా. ౨౦

అమ్మా! నీవు మూలాధారమున, మండుచున్న అగ్నియొక్క- ప్రకాశమే రూపముగాఁగలదానవు, వీణారూపమగు అస్థిదండమున- ప్రబలమగు మహోమదముయొక్క ఊష్మ రూపముగాఁగలదానవు శీర్షకమలమున(సహస్రారమున)సంతతము జారుచున్న సోమరసము- స్వరూపముగాఁగలదానవు భ్రూమధ్యమున(ఆజ్ఞాచక్రమున) ప్రకాశించుచున్న మెరుపు- స్వరూపముగాఁగలదానవు.

మూ॥ హార్దేచే దవతరసీహ పుణ్డరీకే
ఛాయావత్ సకలమపి ప్రపశ్యసిత్వమ్
ఆరూఢా దశశతపత్రమద్రిపుత్రి!
స్యాశ్చేత్ త్వం భణసి జగత్ సుధాసముద్రమ్॥ ౨౧

అద్రికుమారీ! ఈహృదయకమలమున నవతరించునపుడు నీవీ సకలమునుగూడ ఛాయను (నీడను) వలె [illegible]. దశశతపత్రము (సహస్రారము) నందారూఢవగుచు [illegible]ను సుధాసముద్రముగాఁజెప్పెదవు.

ప్రభ:—ఆత్మయే సర్వాత్మకము. కావున హృదయమున స్థితుఁడగు నాత్మకు తదితరమంతయుఁగూడ ఛాయామయమగును. సహస్రారమునందున్న యాత్మ—జగత్తు నంతను అమృతాత్మకముగా ననుభవించును. కావున నపుడాత్మకీవిశ్వమంతయుఁ గూడ అమృతమయమగును.

మూ॥ నేత్రాభ్యాం సరసిరుహాచ్ఛదాయతాభ్యాం
వక్త్రేణ ప్రవిమలహాసభాసురేణ।
ప్రత్యక్షా మమ మనసః పురః పురస్స్త్రీ
కామారేః పరిణతమస్మదీయ భాగ్యమ్.

శివప్రేయసియగు దేవి- సరసిరుహదళాయతములగు నేత్రముల తోడను, ప్రవిమలహాసభాసురమగుముఖముతోడను, నామనస్సు నెదుట సాక్షాత్కరించినది. నాభాగ్యము ఫలించినది.

ప్ర భ ;—ప్రసన్నయగుదేవి-ప్రత్యక్షమయినది. నేనొనర్చిన పుణ్యమునకు ప్రసన్నయగు దేవియొక్క దర్శనముకంటె మహత్తరమగు ఫలమేమున్నదనిభావము.

మూ॥ పుణ్యానాం పరిణతిరేవభూతభర్తుః
సిద్ధానాం బలనిధిరేవకోఽపిగూఢః।
భక్తానాం దృఢతరిరేవ శోకసిన్ధౌ
మగ్నానాం మమజననీ మహీధ్రపుత్రీ. ౧౩

నాజననియగు మహీధరపుత్రి- భూతేశ్వరుఁడగు శివునికి సుకృతపరిణతియే-(పరమేశ్వరతపస్సంపత్ ఫలమే) దేవయోనివిశేషులగు సిద్ధులకు- గూఢమగు నొకానొకబలనిధియే, శోకసముద్రమున మగ్నులగు భక్తులకు-దృఢనౌకయే.

ప్ర భ; - ఒక్కతెయగు పార్వతి- పరమేశ్వరతపఃపరిపాకముగాను, సిద్ధులకు-అణిమాదులగు- అష్టైశ్వర్యముల నొసఁగు అనిర్వచనీయమును గుప్తమును అగు బలనిక్షేపముగాను, శోకసాగరమున మునిఁగినభక్తులకు-అస్ఖలితమగు గతియగు ఓడగాను, ఉల్లేఖింపఁబడినది. కావున నిది ఉల్లేఖాలంకారమగుచున్నది. పుణ్యపరిణతి- బలనిధి- దృఢనౌకలు- పార్వతీరూపములు రూపింపఁబడుటవలన తాద్రూప్యరూపకముకూడ నగుచున్నది. ఈరూపకముచేతనే ఉల్లేఖము- ఉత్థాపితము. కావున రూపకమంగమును ఉల్లేఖము-అంగియు నగుచున్నది. కావున నిదిఅంగాంగిభావముచే నేర్పడిన సంకరాలంకారమగునని తెలియునది.

మూ॥ ఉద్ధర్తుం వినతజనం విషాదగర్తాత్
సంస్కర్తుం భువనహితాయ యోగయుక్తమ్
సంహర్తుం ఖలకులముద్ధతంచ దర్పాత్
భర్గస్య ప్రియతరుణీ సదాసదీక్షా॥ ౧౪

భర్గప్రియతరుణియగు దేవి- ప్రణతుఁడగు భక్తజనుని విషాదమనుగర్తమునుండి ఉద్ధరించుటకును, యోగనిష్ఠాయుక్తుఁడగు

జనుని లోకశ్రేయముకొఱకు సంస్కరించుటకును, దర్పమువలన గర్వించిన దుర్జనకులమును, సంహరించుటకును, ఎల్లప్పుడును దీక్షతోఁగూడినదై యున్నది.

ప్ర భ: —గిర్తము- నిమ్నస్థలము—గాత. ఉద్ధరించుటకు = బయటికిలాగుటకు, సంస్కరించుటకు=విశుద్ధునిచేయుటకు, సంహరించుటకు=ధ్వంసముచేయుటకుఁ దీక్షతో. గూడినది=వ్రతమును ధరించునది.

మూ॥ మృద్వీకాం మధురతయా సుధాంమహిమ్నా
గామ్భీర్యాత్ సురతటినీంచనిజయన్తీ
శర్వాణీచరితపరాప్రహర్షిణీనాం
శ్రేణీయం జయతు గణేశ్వరేణబద్ధా॥ ౨౫

మాధుర్యముచేత ద్రాక్షను, మాహాత్మ్యముచేత, అమృతమును, గాంభీర్యమువలన దేవనదియగుగంగను, నిర్జించునదియు, శర్వాణియొక్క కథయే ప్రధానముగాఁ గలదియు, గణపతిచే నిబంధింపఁబడినదియు నగు ఈప్రహర్షిణీవృత్తమాలిక-జయించుఁగాత!

ప్ర భ:—ప్రహర్షిణీవృత్తమాలిక, ఇచట బహువిధములుగా నుల్లేఖింపఁబడుటవలన, నిది యుల్లేఖాలంకారమని తలంపఁదగదు. మాధుర్యాదులచేత-ద్రాక్షాదులను నిర్జించునదియని ఉపమానూచకమగు 'నిర్జించునది' అనుపదము యొక్క ప్రయోగమువలన ఒకవస్తువునకు- అనేకములగు నుపమానములు చెప్పఁబడుటవలన-ఇది- ఆర్థియగు మాలోపమాలంకారమగునని తెలియునది.

ఇది సవ్యాఖ్యమగు ఉమాసహస్రమునందలి అష్టాదశస్తబకము.
(పదునెనిమిదవ స్తబకము)



ఓం నమోభగవతే, శ్రీరమణాయ.

# ఉమా సహస్రము

## పందొమ్మిదవ స్తబకము

( పంచమ శతకము – ఏకోనవింశతి స్తబకము. )

మూ॥ ప్రఫుల్ల కల్పపాదప ప్రసూన సద్యశోహరమ్
మహారుజం ధునోతు తే మహేశసున్దరీ స్మితమ్॥ ౧

వికసించిన కల్పతరు ప్రసూనముయొక్క సత్కీర్తిని హరించునదియగు మహేశ్వరసుందరియొక్క హాసితము–మీయొక్క మహారోగమును (సంసారమనురోగమును) తొలఁగించుఁగాత!

ప్ర భ :– అమరలోకజన్యమగుటవలన సర్వాభీప్సితప్రదమును, సర్వరోగనివారణమును, స్పృహణీయదర్శనమును, అగు ప్రఫుల్లకల్పవృక్షకుసుమముయొక్క ఖ్యాతినిగూడ హరించుచున్న మహేశ్వరీమందస్మితము_ రోగములన్నిఁటియందును గొప్పదగు భవరోగమును నశింపఁజేయునుగాతమని తాత్పర్యము.

మూ॥ మునీన్ద్రమూలవేదిభూధనఞ్జయప్రబోధనమ్।
యతీన్ద్రహార్దపేటికా కవాటబన్ధభేదనమ్॥ ౨

మునీంద్రులయొక్క మూలాధారమేయగు వేదిభూమి (పరిష్కృతమగుభూమి) యందలి యగ్నిని ప్రబోధించునదియు, యతీంద్రుల హృదయమను పేటికయొక్క కవాటమును (తలుపు) తెఱచునదియు.

మూ॥ యథావిధిక్రియాపర ద్విజాతి చిత్తశోధనమ్।
మహామ్బికాస్మితం భవత్యఘప్రతాపరోధనమ్ 3

శాస్త్రవిధి నతిక్రమింపక క్రియాపరులగు ద్విజులచిత్తములను పరిశుద్ధముల నొనర్చునదియు,అగు శ్రీమహాంబయొక్క మందస్మితము మీయొక్క పాపముల ప్రతాపమును నివారించునది యగుఁగాత!

వి భ ;—యోగమార్గము నవలంబించువారి మూలాగ్ని నుజ్జ్వలింపఁజేయు నదియు, జ్ఞానమార్గము నాశ్రయించువారి హృదయము నున్మీలింపఁజేయునదియు, శాస్త్రోక్తమార్గమున ప్రవర్తించువారి చిత్తమును శోధించునదియు నగు దేవీమందహాసము- నాపాపములను తొలఁగించుఁగాతమని భావము.

మూ॥ సువర్ణసాలభఞ్జికా చరేవశోభయాఽధికా
అతీవమార్దవాన్వితా నవేవపుష్పితా లతా॥ ౪

కదలుచున్న బంగారుబొమ్మవలె అమితమగు కాంతిగలదియు, క్రొత్తదియు, పుష్పించినదియు నగు లతవలె అధికమగు మార్దవముతోఁ గూడినదియు,

మూ॥ సుపర్వమౌలిరత్నభావిరాజిహేమపాదుకా
మరాలికానిమన్త్రిక ప్రశస్తరత్ననూపురా॥ ౫

అమరులయొక్క కిరీటములందలి రత్నముల కాంతులచేత విరాజిల్లుచున్న బంగారు పాదుకలు గలదియు, ప్రశస్తమును, రత్నఖచితమును అగు కాలియందెలచేత-హంసీబృందము నాహ్వానించునదియు,

మూ॥ వలక్షదీధితిప్రభావిశేషహృన్నఖావలీ
మునీన్ద్రశుద్ధమానసప్రమేయ పాదసౌష్ఠవా॥ ౬

ధవళాంశుఁడగు చంద్రుని ప్రభావిశేషములను హరించునఖావలిగలదియు, మునీంద్రులయొక్క పరిశుద్ధమగు మనసుచేత తెలియఁదగిన పాదసౌష్ఠవము గలదియు

మూ॥ ఘనీభవత్ తటిత్ప్రభా ప్రవాహకల్ప జఙ్ఘికా
మతఙ్గజేన్ద్రనాసికా మనోజ్ఞసక్థిశోభినీ॥ ౭

ఘనీభవించిన విద్యుత్ప్రవాహమునకు సరియగు జంఘికలు (పిక్కలు) కలదియు, మతంగజేంద్రునినాసిక (తొండము) వలె మనోజ్ఞములగు తొడలు గలదియు,

మూ॥ ప్రసూనసాయకాగమ ప్రవాద చుఞ్చుకాఞ్చికా
విశాలకేశచుమ్బితోల్లసన్నితమ్బమణ్డలా॥ ౮

ప్రసూనబాణతంత్రప్రవాదచుంచువగు (కామతంత్రప్రవచన నిపుణమగు) కాంచిగలదియు, విశాలశిరోజచుంబితమును, విభాసితమును, అగు నితంబమండలము గలదియు,

మూ॥ అజాణ్డపిణ్డసంహతి ప్రపూర్ణకుక్షిశాలినీ
అపారదివ్యకాన్తివార్నిధాన నాభిదీర్ఘికా॥ ౯

బ్రహ్మాండ-పిండాండ- సమూహముచేత బాగుగానిండిన బొజ్జచేత విలసిల్లునదియు, అపారమైన జలములవంటి దివ్యకాంతులనిధి, గల దీర్ఘిక (నడబావి) వంటినాభిగలదియు,

మూ॥ బిసప్రసూనసాయకచ్ఛురాభ రోమరాజికా
జగత్త్రయీవసజ్జనోప జీవ్యదుగ్ధభృత్కుచా॥ ౧౦

బిసయుక్తమగు ప్రసూనమును బాణముగాఁబూను మదనుని ఛురిక (కత్తి) వంటి రోమరాజిగలదియు, జగత్త్రయియందు వసించుచున్న జనులచేత నుపజీవ్యమగు స్తన్యమును (పాలను) వహించుచున్న పాలిండ్లు గలదియు,

మూ॥ మహేశకణ్ఠబన్ధక ప్రశస్త బాహువల్లరీ
సమస్తవిష్టపాభయప్రదాయి పాణిపఙ్కజా॥ ౧౧

మహేశ్వర కంఠాలింగనము నొనర్చుచున్న ప్రశస్తములగు బాహువల్లరులుగలదియు, (మంజరులవంటి శ్రేష్ఠములగు బాహువులు గలదియు) సమస్తలోకమునకునుగూడ అభయ (రక్షణ) ప్రదాయియగు పంకేజమువంటి పాణిగలదియు,

మూ॥ విలోలహారమౌక్తిక ప్రతాన సంవదత్స్మితా
విశుద్ధసున్దరస్మితప్రకాశభాసితామ్బరా॥ ౧౨

విశేషించి చలించుచున్న కంఠమాలాముక్తావలితో సంవాదము (సామరస్యము) నొందుచున్న మందహాసితముగలదియు, నిర్మలమగు సుందరస్మితముయొక్క ప్రకాశముచేత విభాసితమగు ఆకాశముగలదియు, [మహోజ్జ్వలగు ఉమాస్మితము-సర్వవ్యాపి.]

మూ॥ సకోపకంపనోష్ఠక... భీతదుర్జయాసురా।
సుయుక్తకున్దకుడ్మలప్రకాశదన్తపఙ్క్తికా॥ ౧౩

మిగుల మృదులమగు నీ కెమ్మోవియొక్క కదలికవలన మిక్కిలి భయపడిన దుర్జయులగు నసురులుగలదియు, చక్కనికూడికగలదియు మల్లెమొగ్గలకాంతివంటి కాంతిగలదియునగు దంతపంక్తిగలదియు

మూ॥ శరత్ సుధాంశుమణ్డలప్రభావిగర్హణాననా
సుధామరన్దవజ్జపా సుమోపమాధరాధరా। ౧౪

శరదృతువునందలి చంద్రమండలప్రభను విగర్హించు (నిందించు) ముఖముగలదియు, సుధాపూరమును, మకరందవజ్జపాకుసుమోపమమును (తేనెతోఁగూడిన మంకెనపూవుతో సాటియగునదియు) అగు అధరాధరముగలదియు. [క్రిందిపెదవి గలదియు,]

మూ॥ తిలప్రసూనచారుతావహాసిభాసినాసికా।
నవీనభాభనాసికా విలమ్బిదివ్యమౌక్తికా॥ ౧౫

నూవుపూవుయొక్క మనోహరత నపహసించునదియై ప్రకాశించుచున్న నాసికగలదియు. క్రొత్తదగు నక్షత్రముయొక్క మెరుపువంటి మెరుపుగల నాసికయందు వ్రేలుచున్న దివ్యమగు మౌక్తికము గలదియు,

మూ॥ విశుద్ధగణ్డబిమ్బిత స్వరూపరత్నకుణ్డలా
మహామహాస్తరఙ్గిత ప్రభావశాలిలోచనా॥ ౧౬

విశుద్ధములగు కపోలములయందు ప్రతిబింబించిన స్వరూపములుగల కర్ణభూషణములగు రత్నఖచితకుండలములు గలదియు మహాతేజస్తరంగముల నుదయింపఁజేయుచున్న ప్రభావము (అనుభావము) చేత నొప్పుచున్న లోచనములుగలదియు,

మూ॥ దలాన్తరస్థయామినీప్రభుప్రభాలికస్థలీ।
మయూరబర్హగర్హణప్రకృష్టకేశభాసినీ॥

సహాసగమధ్య ప్రసన్న చంద్రుని ప్రభవంటి ప్రభగల లలాటస్థలిగలదియు, శిఖిబర్హాగ్రహణముగు (నెమలిపురి నతిశయించు) ప్రకృష్ట కేశపాశముచేత భాసించునదియు,

మూ॥ దివాకరాయుతోజ్జ్వలా హిమాంశులక్ష శీతలా
తటిత్సహస్రభాసురా, నిరఙ్కచన్ద్రశేఖరా॥ ౧౮

దశసహస్రసూర్యుల యుజ్జ్వలతవంటి యుజ్జ్వలతగలదియు, లక్ష చంద్రుల శీతలతవంటి శీతలతగలదియు, సహస్రవిద్యుత్తులకుఁ గల మెఱుపువంటి మెఱుపుగలదియు, నిష్కళంకుఁడగుట బాలచంద్రుఁడు సిగపూవుదండగాఁగలదియు,

మూ॥ నభోఽన్తరాలచారిణీ, మహావిచిత్రకారిణీ
కులాగ్నికుణ్డశాయినీ జగత్కథావిధాయినీ॥ ౧౯

ఆకాశాంతరాళమున సంచరించునదియు, మహావిచిత్రమును రచించునదియు, కులాగ్ని (మూలాధారాగ్ని) కుండమున శయించునదియు, జగత్కథను ఘటించునదియు,

మూ॥ నభస్తలే బలేశ్వరీ, ధరాతలే క్రియేశ్వరీ
దివాకరే విభేశ్వరీ సుధాకరే రసేశ్వరీ॥ ౨౦

నభస్తలమున- బలేశ్వరియు (బలరూపమగు నైశ్వర్యము గలదియు) భూతలమున- క్రియేశ్వరియు (క్రియారూపమగు నైశ్వర్యముగలదియు) దివాకరునందు, విభేశ్వరియు, (ప్రభారూపమగు నైశ్వర్యముగలదియు) సుధాకరునందు రసేశ్వరియు, (రసరూపమగు నైశ్వర్యముగలదియు)

మూ॥ మహేశవేశ్మదీపికా, జగత్త్రయప్రమాపికా
అశేషశీర్షశాసినీ సమస్తహృన్నివాసినీ॥ ౨౧

మహేశ్వరగృహదీపికయు, జగత్త్రయ ప్రమాపికయు, (త్రైలోక్యజ్ఞానప్రవర్తికయు) అశేషశీర్షశాసినియు, (సర్వప్రాణుల సహస్రా

రములందును శాసించుచుండునదియు) సమస్తహృన్నివాసినియు (అందఱిహృదయములందును వసించుచుండునదియు)

మూ॥ గుణస్తవే గుణస్తవే గుణప్రకర్షదాయినీ
విచిన్తనే విచిన్తనే విశిష్టశక్తిదాయినీ॥ 22

ప్రతిగుణస్తవమునందును స్తుతినొనరించువారికి గుణోత్కర్షము నొసంగునదియు, ప్రతిధ్యానమునందును అత్యధికమగుశక్తి నిచ్చునదియు,

మూ॥ భ్రమాకులేన దుస్తరా, భవాలసేన దుర్గమా
అమన్త్రకేణ దుర్భరా జగత్త్రయేణ దుర్జయా॥ 23

భ్రమచేత విక్షేపము (చలనము) నొందుచున్న మనస్సుగల మనుష్యునకు దుఃఖముచేత నెట్లో దాటుటకు శక్యమైనదియు, భవము చేత (జననమరణరూపమగు సంసారముచేత) మందుఁడగు మనుజునకు పరిశ్రమచేత- నెట్లో పొందుటకు శక్యమైనదియు, మంత్రము జ్ఞానరూపమగు విచారణము) లేనిమనుష్యునకు కష్టముచేత- నెట్లో భరించుటకు శక్యమైనదియు, జగత్త్రయముచేతఁగూడ జయించుటకు శక్యముకానిదియు,

మూ॥ సువర్ణచేలధారిణీ సమస్తమోదకారిణీ
విలాసినీ నిరామయా విచిన్త్యతాం మనస్త్వయా॥ 24

బంగారుచీరెను ధరించునదియు, అందఱకును ఆనందమును గూర్చునదియు, రోగములేనిదియు, విలాసవతియునగు దేవి—ఓ మనమా! నీచేత ధ్యానింపఁబడుఁగాత!

ప్ర భ: —4వ సంఖ్యగల శ్లోకమునుండి, 24వ శ్లోకమువఱకునుగల 21 శ్లోకములలోను దేవీస్వరూపము ప్రతిపాదింపఁబడినది. ఆశ్లోకములక్రింద వానియర్థము మాత్రమే సంగ్రహింపఁబడినది. ఇచ్చట వాని విశేషార్థ-భావార్థములు తెలుపఁబడును. ఇందు-ఉద్ఘాటింపఁబడిన దేవీస్వరూపమును సాధకుఁడు ధ్యానించి-యోగసిద్ధి నొందునది, 'జగజ్జననియగు లలితాదేవి- అమితప్రభగల సువర్ణసాంభం

జిక (బంగారుబొమ్మ) నడచుచున్నట్లుండును. కోమలమగు శరీరముగలిగి, ప్రియగ్రి కుసుమమితవల్లివలె, కమనీయమగు శోభగలిగియుండును. తన బంగారుపాదుకలచెంత దేవతలు మోకరిల్లునపుడు వారి కిరీటములయందలి రత్నముల కాంతులు వానియందు ప్రసరించి తళుక్కులీనుచుండును. కాలియందెలచేత ఆడుహంసలను పిల్చుచున్నదా, యనునట్లు—ఆమె హంసీగమనము విలసిల్లుచుండును. ఆమెనఖావళి— తెల్లనికిరణములు గల చంద్రుని కాంతి విశేషములను లాగికొన్నట్లుండును ఆమె పాదస్పర్శనము (పాదముల ప్రశంసనీయత)ను— మునీశ్వరుల పరిశుద్ధమానసములుతక్క— నింకేవియు గ్రహింపజాలవు. ఆమె జంఘికలు (పిక్కలు) విద్యుత్ కాంతిప్రవాహములు ఘనీభవించినట్లుండును. ఆమె యూరువులయందు — మతంగజేంద్రశుండాసౌంద ర్యము మూర్తీభవించునట్లుండును. ఆమహేశ్వరి మణిమేఖల (మొలనూలు) స్మర తంత్రశాస్త్రప్రవచనప్రవీణ, నితంబమండలము—విశాల వినీల శిరోజచుంబితము. ఆయుదరము— బ్రహ్మాండములతోడను పిండాండములతోడను, నిండియున్నది. నాభిదీర్ఘిక (నడబావివంటిబొడ్డు) అంతులేని దివ్యకాంతులను జలములకు నిధివలె నుండును. రోమరాజి— మృణాళకలితమగు అరవిందబాణమును ధరించు మన్మ థుని చిన్నకత్తివలె నుండును. ఆయమ్మ పాలిండ్లు— ముల్లోకములందునుగూడ నివ సించుచున్న ప్రజలందఱునుగూడ త్రాగదగినంతపాలుగలిగినవి, త్రిలోకములం దునుగల ప్రాణులాయమ్మ స్తన్యము నే త్రాగుచున్నారు. ప్రశంసింపదగినమంజరుల వంటి తనబాహువులచేత నాయమ్మ— మహేశ్వర కంఠాలింగనము నొనర్చుచుండును. ఆమెప్రాణి— సమస్తజగదభయప్రదాయి. ఆచిరునవ్వు— తనగళమునందున్న హారమునందలి ముక్తావళితో నేకీభవించినట్లుండును. ఆవిశుద్ధసుందరస్మితముచేత ఆకాశముగూడ విభాసించుచుండును. ఆమెయధరము— సుకోమలము. అయినను రోషలాంఛనమగు ఆయధరస్పందనమాత్రముచేతనే దుర్జయులగు రాక్షసులందఱును మిక్కిలి భయపడుచుందురు. దంతపంక్తి—చక్కనికూర్పుగలిగి— మల్లెమొగ్గల కాంతి వంటి కాంతిగలిగియుండును. ఆమెయాననము— శరచ్చంద్రప్రభను తిరస్కరించును. కెమ్మోవి— అమృతముతోఁ గూడినదై, తేనెతోఁగూడిన మంకెనపూవువలె ప్రకా శించును. నాసిక— తిలప్రసూనసౌందర్యము నపహసించి విభాసించును. ఆనాసిక యందలి మౌక్తికము— నవీనమగు నక్షత్రముయొక్క శోభవంటి శోభను గలిగియుం డును. కర్ణభూషణములగు రత్నకుండలములు— స్వచ్ఛములగు నామెచెక్కిళులయందు ప్రతిబింబించుచుండును. ఆమె నేత్రప్రభావము—తరంగములఁబోలినమహాతేజోంశ ములనుదయింపఁజేయుచుండును. లలాటస్థలి సహస్రసారకమలాంతరస్థితుఁడగు చంద్రుని ప్రభవంటి ప్రభగలిగి విరాజిల్లుచుండును. కేశపాశము— శిఖిపింఛమును

నిందించు పరిశ్రుష్టతనుగలిగి యొప్పారుచుండును. ఆమె యుజ్జ్వలత—కాంతి.పదివేల సూర్యులకు సరియగును. శీతలత— లక్షచంద్రులకు సాటివచ్చును. ఆ-భాసురత- (మెరుపు) వేయిమెరుపులకు సమమగును. ఆమహేశ్వరి-మచ్చలేని చంద్రుని క్రొత్త సిగయందు పూలదండవలె ధరించునది. ఆకాశాభ్యంతరమున సంచరించును. మహా ద్భుతముల నొనరించును. 'కు' శబ్దవాచ్యమగు భూమియా కులయించును గావున మూలాధారమును-కులమని తాంత్రికులు చెప్పుదురు. ఆకులమునందలి యగ్నికుండము నందీయమ్మ-(కుండలినీశక్తియను నామమున) పరుండియుండును, జగత్కార్యము నడుపుచుండును. ఆకాశమున బలరూపముచేతను, భూతలమున, క్రియారూపము చేతను, సూర్యమండలమున విభా (కాంతి) రూపముచేతను, చంద్రమండలమున రసరూపముచేతను, తన్మయియై భాసించుచుండును. గృహిణిలేనిగృహము- అంధ కారమయమగును. కావున నాయమ్మ-మహేశ్వరగృహమున దీపికవలె విరాజిల్లును. ముల్లోకములయందునుగల తెలివి- యామెవలననే ప్రవర్తింపఁజేయఁబడుచుండును. కావున సర్వప్రాణుల శిరస్సులందును వెలసి సంకల్పవికల్పములనొనర్చుచుండును. ఎల్లరిహృదయములయందును నివసించుచుండును. ఆమెగుణములను స్తుతించువారికి ప్రతిగుణస్తవమునందునుగూడ గుణాతిశయమును ఘటించుచుండును. ధ్యానించు వారికి ప్రతిధ్యానమునందునుగూడ విశిష్టమగు శక్తిని విధించుచుండును. ఆమె సాక్షాత్కారము- భ్రాంతిశూన్యునికే లభించును. ఆమె- ఆలసతలేనివానికే సుగమయగును. మంత్రములేనివాఁడామెను ధరింపజాలఁడు. ఆమెనీముల్లోక ములనుగూడ జయింపఁజాలవు. ఆయమ్మ సువర్ణవస్త్రధారిణి. సమస్తమోదకారిణి. విలాసిని. నిరామయ. కావుననే తన్నాశ్రయించినవారికారోగ్యము నొసంగును. ఓమనసా! పూర్వోక్తమగు స్వరూపముగల ఆజగన్మాతను నీవు ధ్యానింపుము.

మూ॥ పదాబ్జవన్దినః కవేరియం ప్రమాణికావలీ
మహేశమానసేశ్వరీ గృహేమహోయకల్పతామ్॥ ౨౫

పదారవిందస్తుతిపాఠకుఁడగు గణపతికవిచేత విరచితమగు ప్రమాణికావృత్తనిబద్ధమగు కృతిమాల – మహేశ్వరహృదయేశ్వరీ గృహమున మహోత్సవమును ఘటించుఁగాత!

ఇది సవ్యాఖ్యమగు ఏకోనవింశస్తబకము.
[పందొమ్మిదవ స్తబకము]

---

ఓం నమోభగవతే, శ్రీరమణాయ.

# ఉమా సహస్రము

## పంచమ శతకము - వింశ స్తబకము.

## [ఇరువదవ స్తబకము]

అవ: —ఈ స్తబకమున-యోగనిష్ఠుఁడగు కవిసార్వభౌముఁడు-సర్వేశ్వరి కీవిశ్వమునందుఁగల విభూతులను ప్రతిపాదించుచు, కవితా రామణీయక విసారులును, నిగమాగమసారభూతములును, అగు పర తత్త్వసాక్షాత్కారసాధనములను గానముచేయుచు, సర్వసారమయి యగు దేవిని స్తుతించుచున్నాఁడు.

మూ॥ ప్రీతివికాసే స్వల్పతమో రోషవిశేషే భూరితరః
అద్భుతహాసో విశ్వసువో రక్షతు సాధుం హన్తుఖలమ్॥౧॥

ప్రీతి—వికసించునపుడు, మిక్కిలి స్వల్పమును, రోషము—ప్రకాశించునపుడు, మిక్కిలి యధికమును, అగు జగన్మాతయొక్క ఆశ్చర్యకరమగు హాసము— సజ్జనుని రక్షించుగాత! దుర్జనుని నిగ్రహించుఁగాత!

ప్ర భ:— జగజ్జననిహాసము— మందతమమగునపుడు (చిరునవ్వుగానున్న పుడు) ప్రేమ—వికసించుచుండును— అది యధికమగునపుడు (అట్టహాసమగునపుడు) రోషము—స్ఫురించుచుండును. ఇట్లు ఒక్కటియే యగుహాసముచేత, అల్పత్వ—అన ల్పత్వముల నాశ్రయించి-విరుద్ధమగుపని జరుపఁబడుచున్నది. కావుననే హాసము— ఆశ్చర్యకరమగుచున్నది. అందు మొదటిదగుచిరునవ్వు— సజ్జనుని, రక్షించుగాత! అనియు రెండవదగుఅట్టహాసము—దుర్జనుని శిక్షించుగాతమనియు క్రమముగాఁ జెప్పఁ బడినది. కావున నిది— యథాసంఖ్యాలంకారమగుచున్నది.

మూ॥ సజ్జనచిత్తానన్దకరీ సంశ్రితపాపవ్రాతహరీ
లోకసవిత్రీనాకచరీ స్యాన్మమభూయో భద్రకరీ॥ ౨

సజ్జనచిత్తానందవిధాయినియు, ఆశ్రితజనపాపప్రణాశినియు, స్వర్లోకసంచారిణియు, అగు జగజ్జనని- నాకు- అధికమగు కళ్యాణ మును గలిగించుగాత!

మూ॥ అర్చనకాలే రూపగతా, సంస్తుతికాలే శబ్దగతా,
చిన్తనకాలే ప్రాణగతా తత్త్వవిచారే సర్వగతా॥ 3

పూజించునపుడు- రూపగత. (మూర్తివిశేషమున ప్రసన్న యగునది) సంస్తుతించునపుడు- శబ్దగత (శబ్దస్వరూపిణి) ధ్యానించు నపుడు-ప్రాణగత (ప్రాణమునందుండునది) తత్త్వవిచారమున, సర్వ గత (సర్వస్వరూపిణి)

ప్ర భ:—దేవీరూపము నర్చించునపుడు నేత్రేంద్రియమునకు- దేవీరూపము నందును, స్తోత్రకర్మము నొనర్చువాక్కునకు-శబ్దమునందును, ధ్యానము నొనర్చు నపుడు మనస్సునకు-ప్రాణమునందును ప్రతిష్ఠ (స్థితి) కలుగును. తత్త్వమును విచా రించునపుడుమాత్రము ప్రజ్ఞ - సర్వత్ర- ప్రతిష్ఠ కలిగియుండును. ఇట్లు- అర్చన- స్తవన- ధ్యాన- తత్త్వవిచారములయందు వానివాని కుచితమగు ప్రతిష్ఠను పొంది నది-భగవతియే. కావున ధ్యేయస్వరూపిణియగు నామె వైభవమిచటకీర్తింపఁ బడినది.

మూ॥ ఉజ్జ్వలరూపే నృత్యకరీ, నిష్ప్రభరూపే సుప్తికరీ
గోపితరూపే సిద్ధికరీ, గోచరరూపే బన్ధకరీ॥ ౪॥

శోభమానమగు రూపమున (ఆకృతివిశేషమునందు) లాస్యము నొనర్చునది, నిష్ప్రభమగు (నిశ్శోభమగు) రూపమున, నిద్రించు నది, గూఢమగు (రహస్యమగు) రూపమున (దహరము, సహస్రా రము, మొదలగువానియందు) సిద్ధినిగూర్చునది, గోచరమగు (స్థూల మగు దృశ్య) రూపమున బంధమును ఘటించునది.

ప్ర భ:—లోకమునందలి లావణ్యమంతయు నామెయుజ్వలితమగు నృత్యమే. అట్లని అనుజ్జ్వలమగు వస్తువునందామె లేదని చెప్పఁగూడదు. అచ్చట నామె శోభా నిద్ర నొనర్చుచుండును. దహరాకాశమునందును, సహస్రారాదికమలములయందును గూడ నాయమ్మ సిద్ధులనొసంగుచుండును. బాహ్యవిషయము ప్రజ్ఞను స్పష్టముగా

బంధించును. అది జ్ఞానము నావరించును. కావుననే యది- జ్ఞానబంధకము. కావున దేవి బాహ్యవిషయప్రసక్తునకు బంధమును ఘటించుచుండునని చెప్పఁబడినది.

మూ॥ అమ్బరదేశే శబ్దవతీ పావకతాతే స్పర్శవతీ
కాఞ్చనవీర్యే రూపవతీ సాగరకాఞ్చ్యాంగన్ధవతీ॥ ౫॥

మంగళస్వరూపిణియగు పరమేశ్వరి; ఆకాశదేశమున- శబ్దవతి అగ్నిజనకమగు వాయువునందు స్పర్శవతి. కాంచనవీర్యమగు తేజస్సునందు రూపవతి. సాగరకాంచియగు పృథివియందు గంధవతి.

ప్రభ:—"శబ్దముకలది కావున నశబ్దవతి" అనువ్యుత్పత్తి యేర్పడుచున్నది. ఆకాశగుణము—శబ్దము, గుణములేనియెడల నాయాకాశాదికమునకు గుణిత్వము సిద్ధింపదు, ఇచట పరమేశ్వరి-ఆకాశాదులందున్న శబ్దాదిగుణముగలదిగా ప్రతిపాదింపఁబడినది. కాఁగా, తాదాత్మ్యసంబంధముచేతఁగాని, సమవాయసంబంధముచేతఁగాని, ఇంకేసంబంధముచేతఁగాని, భగవతియే-ఆకాశాదికమునకుగుణాధాయినిగా వివక్షింపఁబడినది. మఱియు "శబ్దవతీ" ఇత్యాదులందున్న 'మతుప్' ప్రత్యయముచేత పరమేశ్వరికి శబ్దాదికముయొక్క-స్వామ్యము చెప్పఁబడినది. ఇట్లు చెప్పుటచేత-దేవియే ఆకాశాదిగుణిస్వరూపమున వర్తించుచున్నదియగును. కావునసర్వస్వరూపమునుగూడ నామెయేయగుననికూడగమ్యమగుచున్నది-కావున నామెయొస్వరూపమగు నాకాశాది దేశమున-శబ్దాదిగుణవతి యగుచున్నదనునది ఫలితము. "వాయోరగ్నిః" అనుశ్రుతి వలన వాయువు- అగ్నిజనకమగుచున్నది. వాయువునకు స్పర్శము- గుణమగుచున్నది కావున వాయుస్వరూపిణియగుదేవిస్పర్శ-గుణవతియగును. గనియందుపుట్టిన బంగారము- తేజస్సుయొక్క- వికృతియని చెప్పుదురు. కావున- తేజస్సు- సువర్ణమునకు. వీర్యమగుచున్నది- రూపము- తేజస్సుయొక్కగుణము. తేజోరూపిణియగు పరమేశ్వరి- రూపగుణవతియగుచున్నది. ఇట్లే పృథివీరూపిణియగు నాయమ్మ గంధవతి యగునని గ్రహించునది.

మూ॥ అప్స్వమలాసుస్పష్టరసా చన్ద్రవిభాయాం గుప్తరసా
సంస్మృతిభోగే సర్వరసా, పూర్ణసమాధావేకరసా॥ ౬

నిర్మలములగు జలములయందు-స్పష్టమగు రసముగలది, చంద్రప్రభయందు- గుప్తమగురసముగలదియు, సంస్మృతిభోగమునందు (లోకవిషయానుభవమునందు) (అనుభవైకవేద్యములును, శృంగా

రాదులును అగు) సర్వరసములును గలది, పూర్ణసమాధియందు-ఏక మగు ఆనందరసముగలది.

ప్రభ:—పూర్ణసమాధి=సంపూర్ణమును, నిస్తరంగమును, అగుమనోనిశ్చలత.

మూ॥ చక్షుషిదృష్టి శ్శాంతతమా, చేతసిదృష్టిశ్చిత్రతమా।
ఆత్మనిదృష్టి శ్శుద్ధతమా బ్రహ్మణిదృష్టిః పూర్ణతమా॥ ౭

నేత్రేంద్రియమునందు తీవ్రతమమగుదృష్టి, మనస్సునందు అత్యద్భుతమగుదృష్టి, ఆత్మయందు శుద్ధతమమగు దృష్టి, బ్రహ్మము నందు పూర్ణతమమగు దృష్టి.

ప్రభ:—జగన్మాత-దృగ్వీర్యమును-మనోవైచిత్ర్యము-నైసర్గికదృష్టియు, సర్వమును జూచునదికావున, పరిపూర్ణదృష్టియు, కలుగుచుండునని భావము.

మూ॥ శీర్షసరోజే సోమకలా భాలసరోజే శక్రకలా।
హార్దసరోజే సూర్యకలా, మూలసరోజేవహ్నికలా॥ ౮

శీర్షకమలమున (సహస్రారమున) సోమకల, భాలకమలమున (ఆజ్ఞాచక్రమున) ఇంద్రకల (ఇంద్రప్రభయగు విద్యుత్తు)హృదయకమలమున (అనాహతచక్రమున) సూర్యకల. మూలాధారకమలమున అగ్నికల. (అగ్నిజ్వాల)

ప్రభ:—సహస్రారకమలమున చంద్రమండలము గలదనుటది ప్రసిద్ధము. కావున భగవతియగుదేవి-సహస్రారకమలమున చంద్రకల యగుచున్నది. ఆజ్ఞాచక్రకమలమగుభ్రూమధ్యమున ఇంద్రకల యని చెప్పబడునదియగు తటిత్ప్రభ-అదియే యని తంత్రవేత్తలు చెప్పుదురు. హృదయము- సూర్యమండలాత్మకమనియు, మూలాధారము—అగ్నిమండలాత్మకమనియు యోగిజనప్రసిద్ధము. కావుననామెయే హృదయకమలమున సూర్యకలయు, మూలాధారమున అగ్నిజ్వాలయు, నగుచున్న దనిభావము.

మూ॥ స్థూలశరీరే కాన్తిమతీ ప్రాణశరీరే శక్తిమతీ।
స్వాన్తశరీరే భోగవతీ బుద్ధిశరీరే యోగవతీ॥ ౯

పాంచభౌతికమగు శరీరమున కాంతిమతి (కాంతిగలది) ప్రాణశరీరమున (భౌతికజీవనధారణమగుప్రాణమయదేహమున)

శక్తిమతి (శక్తిగలది) మనశ్శరీరమున భోగవతి. (భోగముగలది) బుద్ధిశరీరమున యోగవతి (యోగముగలది)

ప్ర భ;—ఈ స్థూలశరీరమునందలి కాంతియు, ప్రాణమునందలి శక్తియు, సుఖదుఃఖోపలబ్ధిసాధనమగు మనస్సునందలి భోగమును, మనస్సుకంటెనుగూడ సూక్ష్మమగు బుద్ధియందలి యోగమును, (ఆత్మస్వరూపనిష్ఠయు), ఆభగవతికి సంబంధించినవే అని భావము.

మూ॥ సారసబన్ధోరుజ్జ్వలభా కైరవబన్ధోస్సున్దరభా
వైద్యుతవహ్నేరద్భుతభా భౌమకృశానోర్దీపకభా. ౧౦

కమల మిత్రుడగు భాస్కరుని యుజ్జ్వలకాంతి, కువలయబంధుడగు చంద్రుని సుందరకాంతి, వైద్యుతాగ్నియొక్క అద్భుతప్రభ, భౌమాగ్నియొక్క దీపక (జ్వలన) ప్రభ.

ప్ర భ ;—సూర్యునియందున్న, ఉజ్జ్వలదీప్తియు, చంద్రునియందున్న రమణీయశోభయు, విద్యుదగ్నియందున్న విచిత్రప్రభయు, భూమియందగునగ్నియందున్న జ్వలనదీప్తియు, పరమేశ్వరియే యగునని భావము.

మూ॥ యోధవరాణామాయుధభా । యోగివరాణామీక్షణభా॥
భూమిపతీనామాసనభా । ప్రేమవతీనామాననభా ౧౧

యోద్ధలలో శ్రేష్ఠులగు (వీరుల) ఆయుధప్రభ యోగీంద్రుల దృష్టిప్రభ భూపతులసింహాసనప్రభ ప్రేమవతుల (స్త్రీల) ఆననప్రభ,

ప్ర భ :—యుద్ధవీరుల భయంకరమారణాస్త్రములయందున్న దీప్తియు, యోగారూఢులయందున్న ప్రజ్ఞానస్ఫూర్తియు, ధరానాయకులయందున్న, అధికారవ్యాప్తియు, అనురాగవతుల (స్త్రీల) యందున్న ముఖవికాసమును మహేశ్వరీస్వరూపమే యగుచున్నదని భావము.

మూ॥ శస్త్రధరాణాం భీకరతా, శాస్త్రధరాణాం బోధకతా
యన్త్రధరాణాం చాలకతా మన్త్రధరాణాం సాధకతా॥౧౨

శస్త్రధరుల భీకరత, శాస్త్రధరుల బోధకత, యంత్రధరుల చాలకత, మంత్రధరుల సాధకత.

ప్ర భ :—ఖడ్గధారులగు మనుష్యులు భయమును గలిగింతురు; శాస్త్రవిద్వాంసులు చక్కఁగా బోధింతురు, యంత్రశాలలయందుఁ బనిచేయువారికి చాలననిపుణత ప్రసిద్ధమైయున్నది. రహస్యాలోచనము నొనర్చువారు సాధింపని సిద్ధులుండవు. వీరియందున్న- భీకరత్వ- బోధకత్వ- చాలకత్వ- సాధకత్వములు- పరమేశ్వరి కంటె వేఱు కావని భావము.

మూ॥ గానపటూనాం రఞ్జకతా, ధ్యానపటూనాం మాపకతా
నీతిపటూనాం భేదకతా, ధూర్తిపటూనాం క్షేపకతా॥ ౧౩

గాననిపుణులకుఁగల రంజకత, ధ్యాననిరతులకుఁగల మాపకత, నీతిచతురులకుఁ గల భేదకత, ధూర్తిపటువులకుఁగల క్షేపకత.

ప్ర భ :—శ్రోతలు రంజించునట్లు- గీతినిపుణులు గానముచేయుదురు కావున గానమునకు రంజకతయేముఖ్యము. నిశ్చలమగు నైకాగ్ర్యమనస్సు చేత నాలోచించుధ్యాననిరతులు, సత్యమగువిషయమును నిర్ణయింపఁజాలుదురు. కావున ధ్యానమునకు మాపకతయే (మానకారకత్వమే) ముఖ్యము. లోకమునందుఁగాని రాజ్యతంత్రమునందుగాని, సామాద్యుపాయ రూపమగు నీతియందు చాతుర్యముగలవారు భేదమునుగలిగించుటయందు సమర్థులైయుందురు. కావున సామాదిరూపమగు నీతికి భేదకతయేముఖ్యము. ఇతరులను కదలించుటయందు నేర్పుగలవారికి క్షేపణ సమర్థతయుండును. వారేధూర్తిపటువులని చెప్పఁబడిరి. ధూర్తికి క్షేపకతయే ముఖ్యము. ఇట్లు, రంజకతా- మాపకతా-భేదకతా- క్షేపకతా-రూపముననుండునది పరమేశ్వరియే యగునని భావము.

మూ॥ దీధితిధారా లోకయతాం జీవితధారావర్తయతామ్।
జ్ఞాపకధారాచిన్తయతాం మాదకధారాద్రావయతామ్॥

చూచుచున్నవారికి-దీధితిధార (తేజోధార) వర్తించుచున్నవారికి-(జ్వలజ్జీవనులకు) జీవితధార, ధ్యానించుచున్నవారికి- జ్ఞాపకధార (జ్ఞప్తిధార) (సోమమును) ద్రవింపఁజేయువారికి-మాదకధార.

ప్ర భ :—లోకులు- చాక్షుషమగు తేజస్సుచేత వీక్షింతురుగదా. వారి దృష్టియందలి అవిచ్ఛిన్నమగు తేజస్సంతతి- పరమేశ్వరియే. జ్వలింపఁజేయఁబడిన జీవనముగల మనుష్యులయొక్క- జీవితధారయు, ధ్యానమునొనర్చువారికి సంబంధించిన జ్ఞాపకధారయు, (సహస్రారమున) సోమమును స్రవింపఁజేయు యోగులకుఁ గాని బహిర్యాగమున సోమమును పానముచేయు యజమానులకుఁగాని మదమును జనింపఁజేయునది యగు మాదకధారయు— పరమేశ్వరియే యగుచున్నదని భావము.

మూ॥ మన్త్రపరాణాం వాక్యబలం యోగపరాణాం ప్రాణబలమ్।
ఆత్మపరాణాం శాన్తిబలం ధర్మపరాణాం త్యాగబలమ్. ౧౫

మంత్రజపపరాయణులకు వాక్యబలము, యోగనిష్ఠులకు ప్రాణబలము, జ్ఞాననిష్ఠులకు శాంతిబలము, ధర్మపరులకు త్యాగబలము.

ప్ర భ:— మంత్రజపప్రధానులగు పురుషులయందు దామెయే వాగ్రూపమగు వీర్యమైయున్నది. యోగపరులయందుండు ప్రాణరూపమగుబలమామెయే. జ్ఞాననిష్ఠులకు శాంతిరూపమగు బలముకలుగును ఆశాంతి- పరమేశ్వరియే, ధర్మపరాయణులకు దానమునకు హేతుభూతమగు త్యాగసామర్థ్యముండును. వారియందున్న త్యాగబలము— పరమేశ్వరికి సై చేయు [illegible]ము.

మూ॥ సూరివరాణాం వాదబలం, వీరవరాణాం బాహుబలమ్।
మర్త్యపతీనాం సైన్యబలం, రాగవతీనాం హాసబలమ్॥ ౧౬

పండితశిరోమణులకు గలవాదబలము, వీరవరశ్రేణులకుఁగల బాహుబలము, మహారాజులకుఁగల— సైన్యబలము. రాగవతులకుఁగల హాసబలము.

ప్ర భ:— వాదబలము- ప్రవచనసామర్థ్యము, బాహుబలము=భుజపరాక్రమము- సైన్యబలము= సేనయే రాజుబలము, హాసబలము=చిరునవ్వునందలి విక్రమము.

మూ॥ వైదికమన్త్రే భావవతీ తాన్త్రికమన్త్రే నాదవతీ
శాబరమన్త్రే కల్పవతీ సన్తతమన్త్రే సారవతీ॥ ౧౭

గాయత్ర్యాదిరూపమగువైదికమంత్రమున-భావవతి, శ్రీవిద్యాదిరూపమగు తాంత్రికమంత్రమున నాదవతి ప్రాకృతవ్యవహారసిద్ధమగు శాబరమంత్రమున-కల్పవతిఅజపాఖ్యమగుసంతతమంత్రమున-సారవతి.

ప్ర భ:— జగన్మాతయే- వేదమంత్రములందలి యర్థముచేత ప్రతిపాదింపఁబడినది. కావున అర్థజ్ఞానములేకున్ననుగూడ స్వాధ్యాయము (వేదమంత్రపఠనము) ఫలవంతమగును. అయినను ఆవేదమంత్రములయొక్క అర్థజ్ఞానము ముఖ్యమైయున్నది. అందలిభావము— పరమేశ్వరికి సంబంధించినదియే. శ్రీవిద్యాదిరూపమగు తాంత్రికమంత్రమునందామె- నాదస్వరూపముచేత వెలయుచుండును. మంత్రజపపురశ్చరణమువలన పరమేశ్వరీప్రసాదము లభించునను ఆగమవేత్తల సమ

యము ననుసరించి, తత్సాధకులయందామె నాదము నభివ్యక్తీకరించును. ప్రాకృతుల భాషచేత సిద్ధించిన శాబరమంత్రమున— "కల్పము" అనఁగా ద్రవ్యోపకరణాదిక్రియాకలాపము—ప్రధానమగుచుండును. కావున నందలి కల్పము— జగజ్జననికి సంబంధించినదియే యగుచున్నది. సంతతమంత్రమనఁగా; ఉచ్ఛ్వసిత నిశ్వసితాద్యకేక్షణరూపమును, 'అజపాఖ్యమును అగు హంసమంత్రము, ఆమంత్రమున సాధకునకు స్థిరత్వము కలుగును. ఆస్థిరాంశమే యిచటసారమని చెప్పఁబడినది. ఆ, సారము గలది పరమేశ్వరియే యగుచున్నదని భావము. ఇట్లు— భావవతియు, నాదవతియు, కల్పవతియు, సారవతియు,గూడ పరమేశ్వరియే యగునని తాత్పర్యము.

మూ॥ బ్రహ్మముఖాబ్జే వాగ్వనితా, వక్షసివిష్ణోః శ్రీర్లలితా।
శమ్భుశరీరే భాగమితా, విశ్వశరీరే వ్యోమ్నితతా॥ ౧౮॥

బ్రహ్మదేవుని ముఖారవిందమున వాగ్దేవి. విష్ణుని వక్షస్థలియందు లావణ్యమయయగు శ్రీదేవి. శివశరీరమునందు-అర్ధభాగమునొందిన ఉమాదేవి. విశ్వశరీరమగు ఆకాశమున వ్యాపించిన విశ్వేశ్వరి. [ఈ రూపభేదములన్నియు లలితకు సంబంధించినవియే.]

మూ॥ భూగ్రహగోలైః కన్దుకినీ, విష్టపధానే కౌతుకినీ,
యావదనన్తం వై భవినీ, ప్రాణిషుభూయసమ్భవినీ॥ ౧౯॥

భూమ్యాదిగ్రహములును, ఖగోళములును, (నక్షత్రములును( క్రీడాకందుకములుగాఁగలది. లోకధారణమున కుతూహలముగలది. ఆకాశమునందంతటను విభుత్వము (వ్యాపకత్వము) గలది. ప్రాణుల యందు పునర్జన్మగలది.

శ్రీ భ:—జగన్మాతయగు పరమేశ్వరి- గ్రహ- గోళములతో నాడుచు, లోకధారణమున కౌతుకముగలిగి, ఆకాశమునందంతటను వ్యాపించి,ప్రాణిరూపమున మాటిమాటికిని జనించుచుండునని భావము.

మూ॥ కణ్ఠభవాణ్డేమణ్డలినీ, ప్రాణిశరీరే కుణ్డలినీ,
పామరభావేసల్లలనా, పణ్డితభావే మోదఘనా॥ ౨౦॥

బ్రహ్మాండమున మండలిని. ప్రాణిశరీరమున (పిండాండమున) కుండలిని. పామరభావమున– నల్లలన. పండితభావమున–మోదఘన.

ప్ర భ:— సర్వేశ్వరియగు ఉమాదేవి. బ్రహ్మాండమున సూర్యాదిమండల రూపిణి. ప్రాణులశరీరమున ఆధారశక్తియగు కుండలిని. అజ్ఞానులయభిప్రాయమున పతియగుకాంత. పండితాభిప్రాయమున సాంద్రసుఖానందమే రూపముగాఁ గలది. అని భావము.

మూ॥ నార్యపి పుంసా మూలవతీ, తన్వ్యపి శక్త్యా వ్యాప్తిమతీ,
వ్యాప్తిమతీత్వే గుప్తిమతీ, చిత్రవిచిత్రాకారా ఽపి సతీ॥ ౨౧॥

నారియయినను పురుషుఁడే మూలముగాఁగలది. తన్వి (సూక్ష్మరూపిణియగుసుందరి) అయినను, వ్యాప్తిగలది. (విభ్వి) అంతటను వ్యాపించినను, గూఢమగు స్వరూపముగలది. (కావుననే) ఆమె– అద్భుతాద్భుతయగు ఒకానొక సతి యగుచున్నది.

ప్ర భ:—ఇచట నంతటను విరోధముండుటవలన అద్భుతత్వము సిద్ధించుచున్నది. ఇందలి విరోధము. విశ్వేశ్వరికిఁగల అపారవైభవస్వభావమువలన పరిహరింపఁబడును. కావున నిది విరోధాభాసమే యగుచున్నది. [శక్తుఁడగుపురుషుని కామెశక్తిని] అని భావము.

మూ॥ దీధితిరూపా చిత్తమయీ, ప్రాణశరీరాప్యద్వితయీ,
బ్రహ్మశరీరం బ్రహ్మవిభా, బ్రహ్మవిభూతి ర్బ్రహ్మపరమ్॥

దీధితిరూప (జ్యోతిస్స్వరూప) యయినను చిత్తమయి, ప్రాణశరీరయయినను– అద్వితయి. [భేదములేనిది] బ్రహ్మశరీర. అయినను బ్రహ్మప్రభ. బ్రహ్మవిభూతి యయినను– పరబ్రహ్మము.

ప్ర భ:—జ్ఞాన–తేజస్సులకు భేదము లేకుండుటవలనను, జ్ఞానమే చిత్తరూపమున నుండుటవలనను, జ్యోతిస్స్వరూపిణియగు పరమేశ్వరి– చిత్తస్వరూపిణీ యగుచున్నది. ఆమె– ప్రాణమే శరీరముగాఁ గలది యయినను ద్విప్రకారము గలది కాదు. (అద్వైతస్వరూపిణియే) ఆజగన్మాత– బ్రహ్మమునకు శరీరమును, ప్రభయుఁ

గూడ నగుచున్నది. పరశక్తి- బ్రహ్మమునకు సంబంధించిన యాశ్వరీయవిభూతి యయినను పరబ్రహ్మముకూడ నగునని భావము.

మూ॥ విష్టపమాతా భూరికృపా, విష్టపరాజ్ఞీ భూరిబలా
విష్టపరూపా, శిష్టనుతా, విష్టపపారే శిష్టమితా॥ ౨౩॥

విష్టప (లోక) మాతయగు సతి- బహుళమగు కారుణ్యము గలది. విష్టపరాజ్ఞియగు విశ్వేశ్వరి బహుశక్తిగలది. శిష్టనుతయగు విష్టపరూప (లోకస్వరూప) విష్టపమున కావలఁగూడ శిష్టినొంది (మిగిలి)యున్నది. [‘త్రిపాదస్యామృతంబహిః’ అగు బ్రహ్మమేయది.]

(ప్ర భ: —లోకమాతయగు పరమేశ్వరి తల్లియందుండవలసిన కారుణ్యమంతయుఁగలిగి, లోకేశ్వరి యుండవలసిన బలమంతయుఁ గలిగి, శిష్టజనులచే నుతింపఁబడుచు, లోకస్వరూపమై యున్నదిగూడ- కాలత్రయమునందును లోకముల కావలఁగూడ నవశేషించియుండునని భావము. ‘శిష్టిమితా’ అను నింకొకపాఠముగూడ మూలమునకుఁ గలదు.) [బ్రహ్మరూపమున నాయమ్మయే లోకములకు వెలుపలనున్నది.]

మూ॥ దుర్జనమూలోచ్ఛేదకరీ, దీనజనార్తిధ్వంసకరీ
ధీబల లక్ష్మీనాశకృశం పుణ్యాకులం నః పాతుశివా॥ ౨౪॥

దుర్జనులయొక్క-మూలము నుచ్ఛేదించియునదియు, దీనజనుల యార్తిని ధ్వంసముచేయునదియు, మంగళస్వరూపిణియు, నగు ఉమాదేవి- బుద్ధియు, బలమును, సంపదయు, నశించుటచేత- కృశించియున్న, మాపుణ్యకులమును రక్షించుఁగాత!

ప్ర భ:—మాకులము ననఁగా, ‘మానవకులమును’ అనిగాని, విశేషించి భారతీయకులమును’ అనిగాని. యర్థమును గ్రహించునది.

మూ॥ చన్ద్రకిరీటాంభోజదృశః, శాన్తిసమృద్ధం స్వాన్తమిమే
సమ్మదయన్తు శ్రోత్రసుఖాః సన్మణిబన్ధాః సూరిపతేః ౨౫॥

శ్రవణసుఖములగు పండితసార్వభౌముని సన్మణిబంధముల చంద్రమౌళిసుందరియొక్క శాంతిసమృద్ధమగు స్వాంతమును సమ్మోదింపఁజేయునుగాత !

ప్ర భ:—దోషము లేనివియు, గుణముగలవియు, గణపతిబుధరాజవిరచిత మణిబంధవృత్తనిబద్ధములును, శ్రవణశుభగములును, అగు ఈస్తుతులు—పరిపూర్ణశాంతిగల పరమేశ్వరి మానసమును నానందింపఁజేయుగాతమని తాత్పర్యము.

ఇతి శ్రీమహర్షి రమణభగవత్ పాదాన్తేవాసినో వాసిష్ఠస్య
నరసింహ సూనోః గణపతిమునేః కృతావుమా
సహస్రే వింశః స్తబకః సమాప్తః.
సమాప్తంచ పఞ్చమం శతకమ్.

ఇది-శ్రీమహర్షి రమణ భగవత్ పాదశిష్యుఁడు, శఠమర్షణసగోత్రుఁడు,
శ్రీమత్ పంతుల పేరయశాస్త్రి పౌత్రుఁడు, వేంకటరామబుధేంద్ర
పుత్రుఁడు, లక్ష్మీనారాయణశాస్త్రిచే నాంధ్రీకరింపఁబడిన
ఉమా సహస్రమను స్తోత్రకావ్యమున
ఇరువదవ స్తబకము. (5వ శతకము) సమాప్తము

ఓం నమోభగవతే, శ్రీరమణాయ.

# ఉమాసహస్రము

## ఆరవ శతకమునందలి యొకటవ స్తబకము.

## [ఏకవింశ స్తబకము]

అవ:— ఇరువదియొకటవస్తబకమున— పరమేశ్వరు నర్ధాంగమగు పార్వతియొక్క స్తుతి—కావింపఁబడుచున్నది.

**మూ॥** ఇతఃపీత్వాకుచం స్కన్దే ప్రసారితకరే తతః
జయతి స్మిత ముద్భూతం శివయో రేక దేహయోః॥ ౧॥

శిశువగు సుబ్రహ్మణ్యుఁడు, ఈవలనున్న కుచమునుద్రావి ఆవలిప్రక్కకు తనహస్తములను చాపునపుడు— ఏకదేహులగు శివుల కొదవిన మందస్మితము— సర్వోత్కృష్టమై వెలయుచున్నది.

ప్ర భ:—సుబ్రహ్మణ్యుఁడు=స్కందుఁడు-కుమారస్వామి. ఏకదేహులు= ఒకేశరీరము గలవారు. శివులు=శివయగు పార్వతియు, శివుఁడగు పరమేశ్వరుఁడును, స్తనంధయుఁడగు కుమారుఁడు- వామభాగమునందలి స్తన్యమును త్రాగి-తల్లియొక్క దక్షిణకుచమును స్తన్యమునకై గ్రహించుటకు హస్తములను ప్రసరింపఁజేయుచున్నాఁడు.తండ్రియగు శివుఁడు తల్లియొక్క దక్షిణభాగమైయున్నాఁడు.అక్కడ కుచమెక్కడిది? ఆయంశము నీశిశువెట్లెఱుఁగును? తల్లిదండ్రులేకదేహులనిస్తన్యపాయికి తెలియదుగదా! ఒకకుచమును త్రాగినపిదప వేఱొకకుచమును ద్రావుటకు చేయిచాచుట శిశువులకు స్వభావముచేతనే కలుగును. తమకు జనించిన బిడ్డయొక్క యీయవస్థ నీక్షించిన తల్లిదండ్రులకు పుత్రవిషయమగు రతి—చిరునవ్వుచేత ప్రకాశింపఁజేయఁబడుచున్నది.

ఇచట ఆలంబనవిభావము—స్కందుఁడు, ఉద్దీపనవిభావము—స్తన్యపానము, అనుభావము—దక్షిణస్తనముకొఱకయిన కరప్రసారణము, సంచారిభావము—హర్షాదికము. ఇట్లు—విభావ—అనుభావ—సంచారిభావ సంయోగమువలన పుత్రవిషయమగు రతి— అభివ్యక్తమగుచున్నది. ఇచట తల్లిదండ్రులు లేకదేహులగుటవలన కుమారుని

హాస్తప్రసారణమునకుఁ గలిగిన వైఫల్యమువలన స్థాయిభావమగు హాసము–ధ్వనింపఁ జేయఁబడుచున్నది. అయినను అది వ్యభిచారిత్వమునే భజించి పుత్రవిషయమగు రతినే పరిపోషించును. "రత్యాదయోఽప్యనియతే రసేస్యుర్వ్యభిచారిణః" "అనియతమగు రసమున–స్థాయిభావములగు రత్యాదులుకూడ– వ్యభిచారులగును" అను లక్షణమువలన స్థాయిభావమగు హాసముకూడ నిచట వ్యభిచారియగుట విరుద్ధము కానేరదు. పుత్రవిషయరతియగు శృంగారమిచ్చట ఉచ్ఛేదింపఁదగినది కాదు. కావున నిచట రతియే స్థాయిభావమని గ్రహింపవలయును. ఉత్తములకొదవు హాసము–అల్పమై యుండును. ఉత్తములకు–స్మిత–హసితములును, మధ్యములకు–విహసిత–అవహసితములును, నీచులకు–అపహసితమును కలుఁగునని దర్పణకర్త చెప్పియున్నాఁడు. ఇచట జగజ్జనకులగు శివులకు [శివాశివులకు] సముచితమగునుత్తమహాసితము–స్మితపదముచేతఁ జెప్పఁబడినది.

అపత్యముచేత ఫలించిన అపూర్వదాంపత్యసంపదగల పరదేవతలు విషయముగాఁగల కవిగతమగురతిభావము (భక్తి) కూడ నిచట ధ్వనించుచున్నది. దీనికి–ఆలంబనము–ఏతన్మూలమైన ప్రతిపాద్యమగునర్థము. అనుభావము–శ్లోకప్రయోగము. 'జయతి' అనుదానిచేత నమస్కారము నెట్లో లాగికొనవచ్చును, స్వభావోక్త్యలంకారము–స్పష్టమైయున్నది. "స్వభావోక్తిస్తు డిమ్భాదేః స్వక్రియారూపవర్ణనమ్" అనునది లక్షణము.

అవ:— క్రిందిశ్లోకమునుండి పదునేడవశ్లోకమువఱకును గల యర్థము– ఏకవాక్యమైయున్నది.

మూ॥ ఏకతో మణిమఞ్జీర క్వాణాహూతసితచ్ఛదమ్
అన్యతో నూపురాహీన్ద్రఫూత్కారకృతతద్భయమ్॥ ౨॥

ఒకవంక (వామార్ధమున) మణిఖచితములగు మంజీరముల యొక్క నాదముచేత ఆహూతములగు హంసములుగలది. (వామార్ధము) ఇంకొకప్రక్క– (దక్షిణార్ధమున) నూపురమగు సర్పరాజు యొక్క ఫూత్కారముచేత వానికి (హంసలకు) భయమును గలిగించునది (దక్షిణార్ధము.)

ప్ర భ:—పదునేడవ శ్లోకమునందుఁ జెప్పఁబడిన– రామాపుమాకారము అనఁగా స్త్రీ–పురుషుల యాకారముకంటె ఆ కారముగల ఏకస్వరూపము– దీనియం

దును— తరువాతిశ్లోకములయందును పరిస్తుతింపఁబడుచున్నది. ఒకవంక రత్నఖచితము లగు పాదకటకములధ్వనిచేత హంసలు పిలువఁబడుచున్నవి. వే ... క పాద భూషణమగు నాగుపాము బుసకొట్టుటచేత నాహంసలు భయపడుచున్నవి. అని భావము. 'ఒకవంక' అని యందు చెప్పఁబడిన వామభాగము స్త్రీ రూపమనియు, 'ఇంకొకపక్క' అని యందు చెప్పఁబడిన దక్షిణభాగము పురుషరూపమనియు గ్రహించునది. ఇందు మొదటిది సౌమ్యదర్శనము. రెండవది రౌద్రదర్శనము, ఈ భంగ్యంతరము నాశ్రయించి, వామదక్షిణార్ధములుగల పార్వతీపరమేశ్వరులనట వ్యంజింపఁజేయఁబడుచున్నారు. కావున ... చెప్పఁగోరిన యర్థమును. వేరొకభంగి నాశ్రయించి ప్రతిపాదించుట—పర్యాయోక్తము" అను రసగంగాధరకర్త జగన్నాథపండిత రాజమతము ననుసరించి యిది పర్యాయోక్తాలంకారమగుచున్నది, ఇది యుక్తమగు నభిమతమై యున్నది. ఈయలంకారమున వ్యంగ్యము-వాచ్యపరమగు చున్నది. కావున నిది-వాచ్యసిద్ధ్యంగమగు గుణీభూతవ్యంగ్యభేదమగునని ధ్వనికారాదులయాశయములు చెప్పును.

ఇక్కడనుండి పదునాలుగు శ్లోకములవఱకుగల పద్యములన్నింటను పర్యాయోక్తమే యలంకారమగుచున్నది.

పదునేడవశ్లోకమున "వస్తు మే హృది సన్నిదధాతు" "స్త్రీపురుషాకారమగు వస్తువు నాహృదయమున నివసించుఁగాత" అనివాక్యము సమాప్తము చేయఁబడినది.

మూ॥ గీర్వాణస్మృతనాపాలం బాలం లాలయ దేకతః ।
ఉన్నద్ధే గణసమ్రాజమర్భకం బిభ్రదన్యతః॥ 3॥

ఒకదెస (సవ్యభాగమున) దేవసేనాపతికాఁగల కుమారుని (స్కందుని) ఆడించునది, వేరొకదెస (అపసవ్యభాగమున) గణములకు సమ్రాట్టుకాఁగల బాలుని — అంకమున ధరించునది, అగు (స్త్రీపురుషాకారమగు వస్తువు నాహృదయమున నివసించుఁగాత!)

ప్ర భ.—ఎడమపక్కను సుబ్రహ్మణ్యు నాడించునది- కుడిపక్కను గణపతిని ధరించునది. అని చెప్పుటవలన తల్లిచేతలాలింపఁబడు కుమారుఁడు శక్తియొక్క అంశమధికముగాఁ గలవాఁడును- కావుననే శక్తిధరుఁడును, గణపతికంటె చిన్నవాఁడును, అగుననునర్థము నిశ్చయింపఁదగియున్నది. అట్లే తండ్రిచేత

సుత్సంగమునందుంచుకొని లాలింపఁబడుచున్న ఓంకారవదనుఁడగు గణపతి—అధిక మగు శివాంశము గలవాఁడును, జ్యేష్ఠుఁడును, అగుననునర్థము నిశ్చయింపఁదగి యున్నది.

మూ॥ విడమ్బిత బ్రహ్మచారి కోకైక స్తనమేకతః ।
కవాటార్థనిభం బిభ్రద్వక్షః కేవల మన్యతః॥ ౪॥

ఒకవంక (వామభాగమున బ్రహ్మచారి (భార్యలేనిది) యగు చక్రవాకము ననుకరించు ఒకేస్తనముగలది— వేఱొకవంక (దక్షిణ భాగమున) కవాటార్థసదృశమును, కేవలమును, (వక్షోజరహితమును) అగు వక్షస్థ్సలముగలది.

ప్ర భ:—చక్రవాక మిధునమును స్తనయుగళముతోఁ బోల్చుట సుప్రసిద్ధమైయున్నది. కావున, దక్షిణార్థమునందలికుచములేనివామభాగమునందలి కుచముతో, బ్రహ్మచారియగు చక్రవాకముపమింపఁ బడినది. దక్షిణభాగమునం దేమున్నది? అనుప్రశ్నకు ప్రత్యుత్తరముగా "అచట కవాటముయొక్క అర్థభాగము వలెనున్న కేవలమగు వక్షస్థలమే యున్నది" అని చెప్పఁబడినది. ఇట్లు భిన్నమగు రూపముగల పార్వతీ పరమేశ్వరీవస్తువు—నాహృదయమున నివసించుఁగాతమని పదు నేడవశ్లోకముతో నన్వయించునది.

మూ॥ సేనాన్యాస్వాదిత స్తన్య మనుఫూత్కుర్వతైకతః।
ఫూత్కారముఖరం నాగముగ్రం జాగ్రతమన్యతః॥ ౫॥

ఒకభాగమున, అనుసరించి ఫూత్కారము నొనర్చుచున్న స్కందునిచేత నాస్వాదింపఁబడుచున్న స్తన్యముగలది. వేఱొకభాగమున శ్వసితఫూత్కారముచే శబ్దాయమానమగుచున్న ఉగ్రమును, అనిద్రితమును, అగు సర్పమును భరించునది.

మూ॥ ఏకతోదోర్లతాంబిభ్రే మృణాళ శ్రీవిడమ్బినీమ్।
శక్రశుణ్డాలశుణ్డాభం చణ్డం దోర్దణ్డమన్యతః॥ ౬॥

వామభాగమున పద్మనాళశోభనపహసించు భుజలతను భరించునది— దక్షిణభాగమున నైరావతముయొక్క తుండముతో సదృశమగు ప్రచండబాహుదండమును భరించునది.

మూ॥ కు్రతాప్యవిద్యమానేఽపి వన్దనీయే తదాతదా
పరస్పర కరస్పర్శలోభతో విహితాఞ్జలిః     ౭॥

(పార్వతీపరమేశ్వరులచేత) వందనీయమగు వస్తువేదియు లేకున్నను అప్పుడప్పుడు- ఒండొరుల హస్తములను స్పృశించుట యందలి లోభమువలన విహితమగు అంజలిగలది. (హస్తద్వయ సంయోగరూపమగు నమస్కారముగలది.)

ప్ర భ:—వామహస్తమును-దక్షిణహస్తమును-అన్యోన్య స్పర్శసుఖమునం దలి కోరికచేత మిళితములయినవని భావము. పరమేశ్వర వస్తుసంబంధియగు వామార్ధ దక్షిణార్ధద్వయము-సర్వలోక వందనీయము. తదీయకరసంయోగరూపమగు అం జలిబంధను- దుష్కరవిషయము. కావున సమర్థనము నపేక్షించుచున్నది. "పరస్పర స్పర్శలోభముచేత" అనుపదార్థగతహేతువుచేత- ఆ యంజలిబంధము-సమర్థింపఁబడి నది. కావున "హేతోర్వాక్య-పదార్థత్వే కావ్యలిఙ్గముదాహృతమ్" అను లక్ష ణమువలన నిది కావ్యలింగాలంకార మగుచున్నది.

మూ॥ శక్రనీలసవర్ణత్వాద్ భాగయోరుభయోరపి।
ఊర్ధ్వాధరాఙ్గసాపేక్ష సన్ధిజ్ఞానగలస్థలమ్॥     ౮॥

ఆ-వామ-దక్షిణభాగములు-రెండునుగూడ కంఠప్రదేశము లందు ఇంద్రనీలముతో సమానమగు రంగుగలవి. కావున- తత్ కంఠస్థలముయొక్క- సంధిజ్ఞానము- ఊర్ధ్వాధరాంగ- సాపేక్షము. అట్టి గళస్థలముగలదియగు వస్తువు నాహృదయమునందు నివసించుఁగాత!

ప్ర భ:—కాళియగు దేవి-నీలవర్ణముగలది. కావున వామభాగమునందలి కాళీమాతకంఠము- ఇంద్రనీలమువంటిరంగుగలది యగుచున్నది. శివుఁడు-శ్వేత వర్ణము గలవాఁడు. అయినను విషపానముచేత దక్షిణభాగమునందున్న యతనికంఠము కూడ ఇంద్రనీలమువంటి రంగుగలదియే యగుచున్నది. ఇట్లు కంఠమంతయు నీల వర్ణమగుచుండునపుడు "ఇది పార్వతి కంఠభాగము-ఇది శివుని కంఠభాగము" అని యెట్లు తెలియును? అని యాశంకించి, ఉత్తరార్థముచేత సమాధానము చెప్పఁబడు చున్నది. దక్షిణభాగమునందలి శివుని కంఠముమీఁది తెల్లదనమును, కంఠముక్రింది తెల్లఁదనమును పరిశీలించి- పార్వతీ-పరమేశ్వరుల కంఠములయొక్క సంధి నెఱుఁగ వలయును. ఇట్లు పరమేశ్వరుని-ఊర్ధ్వ-అధర- శరీరముల పరీక్షవలన తెలియఁ

దగిన సంధిజ్ఞానముగల గళస్థలముగల— వస్తువు నాహృదయమున నివసించుఁగాతమని
యిదువేఁపవ శ్లోకార్థముతో నన్వయించునది.

మూ॥ ఏకతః కైరవశ్రేణీ నిద్రామోచన లోచనమ్
అన్యతః కమలావాస శ్రీణాధాయకవీక్షణమ్॥ ౯॥

వామభాగమున- నిద్రించుచున్న కలువపూవు మొత్తములను మేల్కొల్పు నేత్రముగలది. దక్షిణభాగమున- లక్ష్మీనిలయమగు కమలమున కుత్సవమును గలిగించు నేత్రముగలది.

ప్ర భ:—పరమేశ్వరుని వామనేత్రము -చంద్రుఁడనియు, దక్షిణనేత్రము సూర్యుఁడనియుఁ జెప్పుట ప్రసిద్ధమై యున్నది. కలువలను వికసింపఁజేయు చంద్రుఁడను నేత్రముగల పార్వతియు, కమలములను వికసింపఁజేయు సూర్యుఁడను నేత్రము గల పరమేశ్వరుఁడును, ఏకస్వరూపులై యొకేవస్తు వగుచున్నారు. ఆవస్తువు నాహృదయమున నివసించుఁగాతమని తాత్పర్యము.

మూ॥ ఏకతశ్చక్షుషా చారుతారకాధీతవిభ్రమమ్।
అన్యతః పాణిపాథోజే ఖేలతో మృగబాలతః॥ ౧౦॥

వామభాగమున- సుందరమగు కనీనిక (కంటిపాప) గల నేత్రముచేతను, దక్షిణభాగమున— హస్తకమలమున క్రీడించుచున్న బాలహరిణముచేతను, నేర్చుకొనఁబడుచున్న విభ్రమము (విలాసము) గలది.

ప్ర భ:—చక్కని కంటిపాపగల పార్వతినేత్రము_శివుని కరకమలమునందున్న బాలహరిణముయొక్క దృష్టియందలి విలాసమును, శివుని చేతియందాడుకొనుచున్న బాలహరిణముయొక్క నేత్రము- పార్వతియొక్క దృష్టియందలి విలాసమును నేర్చుకొనుచున్నదని భావము.

మూ॥ ఏకతో భాలఫలకే కాశ్మీరేణ విశేషితమ్।
అన్యతో ఽర్ధేక్షణేనైవ రతిభూవిభ్రమద్రుహా॥ ౧౧॥

వామపార్శ్వమున— ఫలకమువంటి లలాటమున— కాశ్మీరదేశమునం దుద్భవించిన సుగంధద్రవ్యముచేత నలంకరింపఁబడినది-

దక్షిణవామపార్శ్వమున- మన్మథకాంతయగు రతియొక్క- భ్రూవిలాసమును దహించినదియగు అర్ధదృష్టిచేతనే అలంకరింపఁబడినది.

ప్ర భ:—మూలమునందు ప్రయోగింపఁబడిన కాశ్మీరపదముచేత- కాశ్మీర దేశమునం దుదయించిన కుంకుమపూవుపొడి అర్థమగుచున్నది. మన్మథుని దహించిన తృతీయమగు అగ్ని నేత్రముయొక్క- అర్ధభాగమే-దక్షిణమునందలి శివభాగమున మిగిలియుండెను. ఆయర్ధనేత్రముచేతనే యాభాగ మలంకరింపఁబడినది.' 'అర్ధదృష్టి చేతనే' అనుటచేత పూర్ణమగు నేత్రము- రతి కాంతుని దహించుట కావశ్యకము గాకపోయెనని భావము.

మూ॥ ఏకతః శీతలాలోకం సాధులోకశివఙ్కరమ్
అన్యతః ప్రజ్వలత్ ప్రేక్షం దుష్టగోష్ఠీభయఙ్కరమ్ ॥౧౨॥

వామార్ధమున- శీతలాలోకముగలది - సజ్జనసంఘమునకు క్షేమమును గలిగించునది. దక్షిణార్ధమున- దుర్జనసంఘమునకు భీతి గలిగించునది- ప్రజ్వలించుచున్న దృష్టిగలది.

మూ॥ ఏకతో మణితాటఙ్కప్రభాధౌతకపోలకమ్
అన్యతః కుణ్డలీభూత కుణ్డలీభూత కుణ్డలి॥ ౧౩॥

ఒకప్రక్క- మణిఖచితమగు కర్ణభూషణముయొక్క- ప్రభచేత తెల్లనయిన కపోలముగలది- ఇంకొకప్రక్క- కుండలీభూతమును కుండలీభూతమును అగు కుండలిగలది.

ప్ర భ:—మణితాటంక శోభచేత ధౌతమగు కపోలముగల వామభాగమును, కుండలము (మండలాకారము) కాకున్నను, కుండలముగా (మండలాకారముగా) చేయఁబడి, కుండలముగా (చెవియందలి భూషణముగా) చేయఁబడిన, కుండలి (సర్పము) గల దక్షిణభాగమును గల వస్తువు-నాహృదయమున నివసించుఁగాతమని పదునేడవశ్లోకముతో నన్వయము. కుండలియనఁగా పాము- తిన్నని దీర్ఘరూపము గల చుట్టగాచుట్టబడి (కుండలీభూతమై) కుండలముగాఁజేయఁబడినదని (కుండలీభూతమయినదని) గ్రహించునది.

మూ॥ ఏకతః కున్తలాన్ బిభ్రద్ స్నిగ్ధనీలోపమద్యుతీన్।
అన్యతః పావకజ్వాలా పాటలాంశుచ్ఛటాజటాః॥ ౧౪॥

ఒకదెస- ఇంద్రనీలసదృశకాంతులగు కుంతలములను భరించునది. ఇంకొకదెస- అగ్నిజ్వాలలయొక్క శ్వేతరక్తకాంతిరేఖలుగఁ జటలను వహించునది.

మూ॥ ఏకతః కేశపాశేన కీర్ణేనోరసి భాసురమ్।
అన్యతో లమ్బమానస్య భోగినో హారతాశ్రియమ్॥ ౧౫॥

కుడిప్రక్క హారముగాఁ జేయఁబడి వ్రేలాడుచుచున్న సర్పముయొక్క శోభనపహరించుచు- ఎడమప్రక్కనుగల వక్షస్థలమున చెదరియున్న కేశపాశముచేత భాసురమగు వస్తువు నాహృదయమున నివసించుఁగాత!

ప్ర భ:—వమవక్షమున కీర్ణమగు దేవీకాల కేశపాశము- శివునిహారమగు సర్పముయొక్క శోభ నతిశయించుచున్నదని భావము.

మూ॥ అవతం సితమమ్లాన పారిజాతస్రజైకతః
విమలోల్లోలమాలిన్యా విబుధాపగయాన్యతః॥ ౧౬॥

స్త్రీభాగమున నూతనమగు పారిజాతపుష్పమాలచేత—అవతంసితము. (అలంకృతము) పురుషభాగమున- విమలములగు మహాతరంగములయొక్క పంక్తిగల దేవనదియగు గంగచేత అవతంసితము. (అలంకృతము)

ప్రి భ:—వామ శీర్ష భాగమున నవపారిజాత పుష్పమాలయు, దక్షిణశీర్ష భాగమున గంగానదియు, భూషణములుగాఁ జేయఁబడిన వస్తువు—నాహృదయమున నివసించుఁగాత!

మూ॥ రౌప్యాచలకృతావాసం ప్రాప్యం యుక్తేనచేతసా।
వస్తురామాపుమాకారం హృదిసన్నిదధాతుమే॥ ౧౭॥

రజతాద్రియందు (వెండికొండయందు) నివసించునదియు, యోగాభ్యాసముగల మనస్సుచేత తెలియఁదగినదియు, స్త్రీ—పురుష స్వరూపముగలదియునగు వస్తువు- నాహృదయమున నివసించుఁగాత!

(హృదయమున సాన్నిధ్యము నొసఁగుఁగాత) 2వ శ్లోకమునుండియు–
తెలుపఁబడిన యర్థమంతయుఁగూడ– స్త్రీ పురుషాకారము గలదియగు
వస్తువు నాహృదయమున నివసించుగాత! అను పదునేడవశ్లోకము
నందలి యంతిమార్థముతోఁగూర్చి సమన్వయించుకొనవలయును.

మూ॥ కాన్తార్థ విగ్రహేము త ర్జటార్ధా శ్చికురా స్తవ ।
దధత్యదభ్ర సన్ధ్యాభ్ర యుక్తకాలాభ్ర విభ్రమమ్॥౧౮॥

కాంతార్థవిగ్రహమవగుజననీ! (పతియొక్క– అర్ధశరీరమవగు
తల్లీ!)శివుని జటాభాగమునకు సమమగు భాగముగల నీ చికురములు–
సంధ్యాకాలమునందలి యాకాశముతోఁ గూడియున్న శ్యామల జల
దముల విభ్రమమును– ధరించుచుండును.

ప్రభ:—శివుని జటలు– సంధ్యా కాలమునందలి యాకాశమువలె జేగురు
రంగు గలిగియుండును. ఆజటలకు వామభాగమున సగపాలయియున్న నీవి కేశకలా
జములు_సంధ్యాకాలమునందలి యాకాశముతోఁగూడిన నీలమేఘముల విలాసము
వంటి విలాసమును వహించుచుండునని భావము. ఇక్కడ–చికురములు–కాలమేఘ
ములుగా నారోపింపఁబడినవి. కావున నిందలి యలంకారము_నిదర్శనమగుచున్నది.

మూ॥ దమ్పత్యోర్యువయో రేవలోపో యన్నా స్తిశైలజే! ।
వామం పార్శ్వం విభో శ్శేతుం దాతుం తే దక్షిణః కరః॥౧౯॥

పార్వతీ! నీవిభుఁడగు శివునికి శయనించుటకు వామపార్శ్వము
లేదు. నీకు– దానమొనర్చుటకు దక్షిణహస్తములేదు. మీదంపతు
లకుఁ గలలోపమిదియే.

ప్రభ:—వామపార్శ్వము– నీచేత నపహరింపఁబడుటవలన శివునకు శయ
నించుటకు వామపార్శ్వమును, శివార్ధము నందుండుటవలన నీకు దక్షిణకరమును
లేకుండుటయే మీయిరువురికిని గల లోపమని భావము. మీఁది కారణమువలననే
దేవీ వామహస్తము– దానమునందు ప్రసిద్ధమనునంశమును, తనకుతానే యాశ్రయుఁ
డగుటవలన శివుఁడు, పార్శ్వము నపేక్షింపఁడను నంశమును గమ్యమగుచున్నది.
కావుననిది– గమ్యమగు హేతూత్ప్రేక్షాలంకార మగుచున్నది.

మూ॥ లోకే స్త్రీ స్తనయుగ్మేన పుష్ణాత్యేకం సుతం నవా
స్తన్యేనైకేన శర్వాణి! పుష్ణాసిత్వం జగత్త్రియమ్॥ ౨౦॥

లోకమునందొక స్త్రీ— స్తనయుగ్మముచేత— ఒకపుత్త్రిని పోషించునో లేదో, సంశయింపవలసియున్నది, శర్వాణీ! నీవు— ఒకే స్తనముచేత జగత్త్రియమును పోషించుచున్నావు.

ప్రి భ:—నిస్సంశయముగా నేకస్తనముచేతనే ముల్లోకములనుపోషించుచుండుటవలన నీమహిమ మద్భుతమని భావము.

మూ॥ ఖిద్యన్తి యోషితః కుక్షౌ వహన్త్యోర్భకమేకకమ్।
అర్ధకుక్షౌ దధాసిత్వం త్రిలోకీమమ్బ! లీలయా॥ ౨౧॥

అమ్మా! స్త్రీలు— తమ సంపూర్ణకుక్షియందు— శిశువునొక్కనినే వహించుచు ఖేదమునొందుచున్నారు. అట్లుగాక నీవు— అర్ధకుక్షియందు— ముల్లోకములను— అనాయాసముగా ధరించుచున్నావు.

ప్రి భ:— కుక్షియం దర్ధభాగము—శివునికి సంబంధించినది. కావున పార్వతి—తనవామార్థమునందే ముల్లోకములను ధరించుట కుదురుచున్నది.

మూ॥ అనురూపా శివస్యత్వ మనురూపః శివస్తవ।
అలఙ్కారోఽనురూపో వామలఙ్కారోఽర్భకః శశీ॥ ౨౨॥

నీవు— శివునకు తగినదానవు, శివుఁడు— నీకు తగినవాఁడు. కలంకరహితుఁడగు బాలచంద్రుఁడు. మీ కిద్దఱకును తగినయలంకారము.

ప్ర భ:—ప్రసిద్ధుఁడగు చంద్రునికంటె నతిరిక్తుఁడగు బాలచంద్రుఁడు—మీ కనురూపమగు నలంకారము. పూర్వార్ధమునందలి యలంకారము—అన్యోన్యము. ఉత్తరార్ధమునందలి యలంకారము సమము.

మూ॥ త్వమేవ తవ దేహాంశో హరస్యైవహరస్య యః।
ప్రాణాస్తు జగతాం ధాత్రి! హరస్యత్వం హరస్తవ ॥ ౨౩॥

నీ దేహాంశము- నీదే. హరుని దేహభాగము- హరునిదే. అయినను ఓలోకభర్త్రీ! హరునకు నీవు ప్రాణములు. హరుఁడు నీకు ప్రాణములు.

ప్ర భ:—వామభాగమగు నీశరీరాంశమున శివునికి స్వామ్యములేదు. దక్షిణభాగమగు శివశరీరాంశమున నీకు స్వామ్యములేదు. ఇట్లు మీయుభయుల శరీరభాగములును విభక్తములైయున్నను, మీరొకరికొకరు ప్రాణములై యున్నారు. అని భావము. ఇచ్చటఁగలది- అన్యోన్యాలంకారము.

మూ॥ అవిభక్తం భవాని! త్వం భవస్య తవచోభయోః ।
సకృత్ సకరుణం చేతః సఙ్కల్పయతు నశ్శివమ్॥ ౨౮॥

భవానీ! భవునకును నీకును- ఉభయులకును, విభక్తము కాని (ఏకమైయున్న) సకరుణమగు మనస్సు మాయొక్క కల్యాణము నొక్కమారు సంకల్పించుఁగాత!

ప్ర భ:—మీశరీరము-విభక్తము. ప్రాణములు నీవు- శివునకు. శివుఁడు-నీకు. కాని మనస్సొక్కటే, ఆమనస్సంకల్పము-అమోఘ-సద్యః ఫలదాయకమగుటచేత- ఒక్కమారే కోరఁబడినది.

మూ॥ భవస్యభాగముత్సృజ్యభవానీభాగమాత్మనః।
భజత్వనుష్టుభామాసాం సృష్టానాం నారసింహినా ॥ ౨౯॥

భవానియగు దేవి- నరసింహాపుత్త్రుఁడును, కవియునగు గణపతిచేత నిర్మింపఁబడి- సమర్పింపఁబడిన అనుష్టుప్కృతులలో భవుని భాగమును భవునకువిడిచి, (ఆత్మ) తనభాగమును తాను స్వీకరించుఁగాత!

ప్ర భ:—భవుని భాగమనఁగా; శివవర్ణనపరమగు పద్యభాగము.

ఇది-సవ్యాఖ్యమగు ఏకవింశ (ఇరువదియొకటవ) స్తబకము.



ఓం నమో భగవతే, శ్రీరమణాయ.

# ఉమా సహస్రము

## ఆరవ శతకమునందలి ఇరువదిరెండవ స్తబకము.

## [ద్వావింశ స్తబకము]

అవ:—ఇరువదిరెండవదియగు నీ స్తబకమున కైలాసనాథుని ప్రభావము వర్ణింపఁబడునప్పుడు తత్కాంతాసౌభాగ్యమును వర్ణింపఁబడుచున్నది మఱియు శివకుటుంబకము కీర్తింపఁబడును. స్తబక ప్రారంభమున వెనుకటివలెనే హసితము స్తుతింపఁబడుచున్నది.

మూ॥ అఖిలస్య వికాసకారణమ్
వ్యసని జ్ఞానిజనావనేషు నః ।
వితనోతు విశేషతః శివం
శివరాజీవదృశో దరస్మితమ్॥ ౧॥

సర్వమునకును ఉన్మీలనహేతుభూతమును, జ్ఞానులగు మనుష్యులను పాలించుటయందు వ్యసనముగలదియు, అగు శివసుందరియొక్క మందస్మితము— మాకు మంగళము నిచ్చుఁగాత!

ప్ర భ:—వ్యసనమను పదము - కామమువలనఁ గలిగిన దోషమున వర్తించును. అయినను జ్ఞానులయందుఁగల వాత్సల్యాతిశయమును ప్రదర్శించుట కీచట ప్రయోగింపఁబడినది, దేవీమందస్మితము. తఱచు ముఖమునందు వికసించును. దానిచేత నీవిశ్వము మేల్కొనును. ఆమందస్మితము-ఉజ్జ్వలము. కావున ప్రకాశపాలనము దానికి స్వాభావికమగును. కావుననే అబోధమున కంతకును ప్రబోధమును కలిగించునదియు, ప్రబోధము నొందిన జనముయొక్క బోధమును రక్షించునదియు నగును. కావున నిట్లు అప్రాప్తలాభరూపమగు యోగమును, ప్రాప్తరక్షణరూపమగు క్షేమమును, గలిగించుచు, ఆమందస్మితము మాకు కల్యాణము నొసఁగుఁగాతమని ప్రార్థింపఁబడుచున్నది.

మూ॥ వికలే సకలే సురవ్రజే। వ్రజతిశ్యామలిమానమచ్యుతే।
జగతస్సదయోహాలాహలంచులుకీకృత్యభయంనునోదయః ॥౨

నిర్జరగణమంతయు విషాదమునొందుచుండ, అచ్యుతుఁడు (విష్ణువు) శ్యామలిమ (నల్లఁదనము) నొందుచుండ, పరమకారుణికుఁడైన యేభగవానుఁడు హాలాహలమును (మహావిషమును) (ఆపోశనముగాని) పుడిసిలిగొని లోకముయొక్క భయమును తొలఁగించునో,

వి భ:—అమృతమథనసమయమున- మొదట వాసుకియను సర్పరజ్జువుయొక్క- శిరస్సునుండి బయలువెడలిన మహావిషముయొక్క- పరితాపమువలన దేవగణము- విషణ్ణము కాఁగా, వ్యాతిలేని విష్ణువుకూడ- నిష్ప్రభుఁడు కాఁగా, సదయుఁడు హరుఁడు—దానినంతనుగూడ, అనాయాసముగాఁ ద్రాగి జగద్భయము నడఁచెనని భావము. ఈశ్లోకమునుండి 10వశ్లోకమువఱకును గల 8శ్లోకములును 10శ్లోకమునందలి "తేన, భవేన" "అటువంటిభర్తతో" అనుదానితో నన్వయించునని తెలియునది.

మూ॥ నిగమైస్తురగీ భువారథీ
విధినాసారథిమాన్ బిభేదయః।
కనకాద్రివరేణ కార్ముకీ
కమలాక్షేణశరీ పురత్రయమ్॥ 3॥

వేదములు- గుఱ్ఱములుగాను, భూమి- రథముగాను, బ్రహ్మదేవుఁడు- సారథిగాను, మేరుపర్వతము- విల్లుగాను,విష్ణువు—బాణముగాను, గలవాఁడై యేభగవానుఁడు (త్రిపురయుద్ధమున) పురత్రయమును (త్రిపురమును) భేదించెనో.

మూ॥ అజితస్య చ గాఢమత్సరైః
కమలాకాన్త పురస్సరైస్సురైః।
పదజాయుధధారయారయాద్
వధమాధత్త జలన్ధరస్యయః॥ 4

దృఢమగు మత్సరము (ద్వేషము)గల విష్ణుప్రముఖులగు దేవతలచేతఁగూడ జయింపఁబడని జలంధరుఁడనురాక్షసుని, ఏభగవా

నుఁడు-పదనఖమేయగు (తనకాలిగోరగు) ఆయుధముయొక్క నిశితాగ్రముచేత వధించెనో.

ప్ర భ:—లింగపురాణమున జలంధరాసురవధమిట్లు చెప్పఁబడినది. జలమండలమున జన్మించుటవలన జలంధరుఁడను పేరుగల రాక్షసుఁడు ప్రసిద్ధుఁడగుచున్నాఁడు. వాఁడు-అంతకసదృశుఁడు. తపోలబ్ధ విక్రముఁడు.....అతని వాక్యమును విని శూలి-లీలచేత-ఆమహాబలమున భయంకరమగు రథాంగమును తన పాదాంగుష్ఠముచే విసరెను......(దానిచేత) మహాబలశాలియగు నాదైత్యుఁడు రెండవ యంజనాద్రివలె పడియెను. (లింగపురాణము 97వ అధ్యాయము చూచునది)

మూ॥ కమలాసనకఞ్జలోచనౌ । ఛలలిఙ్గస్య శివో౽ఙ్ఘ్రివీక్షితుమ్।
బత! హంసవరాహభూమికౌ।యతమానావపియస్యనప్రభూ॥౫

కమలాసనుఁడగు బ్రహ్మయు, కమలాక్షుఁడగు విష్ణువును,హంసవేషమును, వరాహవేషమును ధరించి, ప్రయత్నము నొనర్చినను గూడ- మాయా(ఛల) లింగాకృతియగు నేపరమేశ్వరునియొక్క శీర్షమును, పాదములను, గుర్తించుటకుపాపముసమర్థులుకాఁజాలకుండిరో.

ప్ర భ:—ఇందలి కథాంశము నిట్లుండఁగునది. బ్రహ్మ-విష్ణువులకు తమలో నెవ్వఁడధికుఁడను విషయమున వివాదము కలిగెను. అప్పుడచట నాద్యంతరహితమగు మాయాలింగస్వరూపమున శివుఁడావిర్భవించెను. ఆలింగముయొక్క శీర్షమునుగాని, పాదములనుగాని, వీక్షించినవాఁడు తమలో నధికుఁడని వారునిర్ణయించుకొనిరి. బ్రహ్మ శివునిశీర్షము నవలోకించుటకు హంసయై యాకాశమున కెగిరెను. విష్ణువు-వరాహమై పాదములను సమీక్షించుటకు భూమియందుఁజొచ్చెను. కాని యెంత వెదకినను గూడ వానినిఁజూడఁజాలరయిరి. ఆద్యంతవర్జితుఁడగువాని యాదిని, అంతమును, తెలిసికొనుట కెవ్వఁడు శక్తుఁడగునను నర్థమిందు గమ్యమగుచున్నది. ("యతమానౌచ నయస్యశక్నుతః" అను నింకొక పాఠము మూలమునఁ గలదని తెలియునది)

మూ॥ నయనం నిటలాన్తరస్థితం విఘటయ్యోషదవాన్వితోరుషా।
భువనత్రయనిర్జయోన్నతం మదనంగాఢమదం దదాహయః॥౬

ఏభగవానుఁడు— లలాటమధ్యమునందున్న, అగ్నినేత్రమును రోషముచేత నించుక తెఱచి- త్రిలోకజయోన్నతుఁడగుటవలన, మిక్కిలి గర్వించిన మన్మథుని దహించెనో.

మూ॥ సకలేధవలః కలేబరే హారినీలోపలమఞ్జులః క్వచిత్
అమృతాంశురివాదధాతియః పరమామక్షిముదం ప్రపశ్యతామ్॥ ౭

ఏభగవానుఁడు— సకలకళేబరమునందును ధవళవర్ణముగలిగి, ఒక్కచోట (కంఠమునందు) ఇంద్రనీలమణివలె మంజులమగురూపము గలిగి, మృగాంకుఁడగు సితాంశుని (చంద్రుని)వలె అవలోకించుచున్న జనులకుత్కృష్టమగు నయనానందమును ధరించునో,

ప్ర భ:—సర్వాంగశుభ్రుఁడై కంఠమున ఇంద్రనీలశ్యామలుఁడగు శివుఁడు-మచ్చగల చంద్రునివలె నున్నాఁడని చెప్పఁబడినది. ఒకచో నీలిమగలిగియుండుట-సర్వాంగమును తెల్లగానుండుట-నేత్రానందమును గలిగించుట, అనునవి-శివ-చంద్రులయందుఁగల సమాధర్మములు. కావుననిందుపమాలంకారము స్పష్టమగుచున్నది.

మూ॥ అవతంసతుషారదీధితి! ద్యుతిభిర్యస్యయశోభరైరపి।
సమమచ్ఛతరీకృతో దిశామవకాశస్సతరాం ప్రకాశతే॥ ౮

ఏభగవానునియొక్క శిరోభూషణహిమాంశు (చంద్ర)కాంతులచేతను, యశోఽతిశయములచేతనుగూడ, సమముగా దిగవకాశము- నిర్మలీకృతమై ప్రకాశించుచున్నదో,

ప్ర భ:—దిగవకాశము=దిక్కులయందలి యవకాశము; అనగాఁ సర్వదిశలయందును గల ఆకాశము. శివునియొక్క శిరస్సునందలి చంద్రద్యుతులవలె శివుని కీర్త్యతిశయములుకూడ సర్వదిశలనునిండించుచున్నవనిభావము. ఇందుహారశిరశ్చంద్రకాంతులు-యశోభరసహితములగుట చమత్కృతిని గలిగించుచున్నది. కావున నిది సహోక్త్యలంకారమగుచున్నది.

మూ॥ గగనానిలజీవనానిలక్షితిసోమారుణసోమయాజిభిః।
మహతోబత! యస్యమూర్తిభిర్భువనంక్రాన్తమిదంసమన్తతః॥

మహామూర్తుఁడగు ఏభగవానునికి సంబంధించిన ఆకాశము-వాయువు, అగ్ని, జలము, భూమి, చంద్రుఁడు, సూర్యుఁడు, సోమయాజి అను అష్టమూర్తులచేత- అంతటనుగూడ నాశ్చర్యముగా నీజగత్తు వ్యాపింపఁబడియున్నదో.

ప్ర భ:—పరమేశ్వరుఁడు-అష్టమూర్తి యనువంశము శ్రుతి-స్మృతిప్రసిద్ధము

మూ॥ సహ తేన భవేన రాజతే, వసుధాధారిణికాఽపిరాజతే
వనితా భవతాపనాశినీ చరణప్రేష్యనివేదితాశినీ॥ ౧౦

అట్టిభర్తతోఁగూడ వెండికొండయగు కైలాసమున సంసార తాపమును నశింపఁజేయునదియు, పాదకింకరుఁడగు భక్తునిచే నివేదింపఁబడినవస్తువు ననుభవించునదియు, నగు ఒకానొక (అనిర్వాచ్యయగు)స్త్రీయగు పరమేశ్వరి-సర్వోత్కృష్టయై యున్నది.

ప్రభ:—ఉమాదేవి సర్వేశ్వరసనాథయై కైలాసమున నివసించుచు వెలయుచున్నదని భావము. ఇందలి రెండవశ్లోకమునుండియుఁ గల శ్లోకములన్నియు నీశ్లోకార్థముతో నన్వయించునని గ్రహించునది.

మూ॥ వనితాపురుషౌ పురాతనౌ విమలేవ్యోమని దేవదమ్పతీ।
భువనత్రితయస్యతౌ విభూరజతాద్రావిహసిద్ధదమ్పతీ॥౧౧॥

పురాతనులగు స్త్రీపురుషులు చిన్మయులై యాకాశమున దేవ దంపతులైయున్నారు. ముల్లోకములకును ఈశ్వరులగువారు—ఇచ్చట (భూమియందు) కైలాసమున సిద్ధపురుషులగు దంపతులగుచున్నారు.

ప్రభ:—ద్యులోకమున తేజోమయస్వరూపమున దేవదంపతులైయున్న యీశ్వరులు-పార్వతీ శివులై యిచట కైలాసమున నివసించు సిద్ధదంపతు లగుచున్నారని భావము.

మూ॥ గజచర్మధరః కపాలభృత్ గృహనాథోగృహిణీతుకాళికా
రుధిరావిలముణ్డమాలినీ కథితౌ తౌబత! పణ్డితైః శివౌ॥౧౨॥

గృహపతియగు నీశ్వరుఁడు— గజచర్మమును ధరించువాఁడును కపాలమును భరించువాఁడును,అగుచున్నాఁడు. గృహిణియగు కాళిక- రక్తముచేత కలుషితమైన శీర్షములయొక్క మాలికలుగలిగి యున్నది. ఇట్లుండినను వారిని నిత్యమంగళులని పండితులు జెప్పుదురు.

ప్రభ:—ఆ దంపతు లిద్దఱునుగూడ-ఘోరదర్శనులును, అశివస్వరూపులును, అగుచున్నను విజ్ఞులు వారిని శివస్వరూపులని చెప్పుదురని భావము. ఇది విరోధమై యున్నది. వేషముచేత అశివరూపులైనను స్వరూపముచేత నిత్యమంగళస్వరూపులును, పండితవేద్యులును. అగుదురు. కావున-మీఁదివిరోధము-ఆభాసమే (ఉన్నట్లు తోఁచునదియే) యగును. కావున నిది విరోధాభాసాలంకార మగుచున్నది

మూ॥ సకిమిన్దుకలాశిరోమణిః కిమతాల్లీకకపాలభూషణః
కిముమే భవతీకపాలినీ కిమువిభ్రాజితరత్నమాలినీ॥ ౧౩॥

ఆశివుఁడు- చంద్రకళాశిరోమణియా? లేక ... కపాలభూష ణుఁడా? ఉమాదేవీ! నీవు- ...రత్నమా... ? ... కపాల మాలాధారిణివా?

ప్ర భ:—మీరిద్దఱు ... సుందరవే... ... లా? లేక అనురూపములగు ఘోరవే...ములు గలవారలా! అని భా...

మూ॥ రమసేఽమ్బ! కపాలమాలినీ। క్వచిదీశేన కపాలమాలినా।
అతులప్రభనిష్కమాలినా। క్వచిదత్యుత్తమరత్నమాలినీ॥౧౪

అమ్మా! నీవు- ఒకవేళ- ఒక దేశమున కపాలమాలినివై కపాల మాలియగు నీశునితోఁగూడి క్రీడించుచుందువు. ఇంకొకవేళ, ఇం కొకదేశమున— ఉత్తమరత్నమాలినివై అనుపమప్రభాయుతసువర్ణ మాలియగు శివునితోఁగూడి క్రీడించుచుందువు.

మూ॥ యువయోర్మరుతస్తనూభువో,బలవన్తో భువనప్రకమ్పనాః
శశిదీధితిహారియద్యశో నిగమేపావనమమ్బ! గీయతే॥ ౧౫॥

మీతనూభువులగు మరుత్తులు (మరున్నామకులును వాయువు లును అగు దేవతలు-) బలవంతులును, లోకములను ప్రచలింపజేయు వారును, అగుచున్నారు. చంద్రకాంతివలె రమణీయమగు వారికీర్తిని మంత్రద్రష్టలు వేదమున గానమొనర్చియున్నారు.

ప్ర భ:—పార్వతీశ్వరులు మరుత్తులకు తల్లిదండ్రులని ... వలన పార మైశ్వర్యార్థకమగు ఇంద్రత్వము వారికే చెప్పఁబడనదగి యున్నది. తత్పుత్రులగు- గణ్ణకుమారులే_మరుత్తులని చెప్పఁబడినట్లగుచున్నది. ఈయంశము ముందు చెప్పఁ బడును.

మూ॥ గురుముత్తమమభ్రచారిణా।మసమబ్రహ్మనిధాననాయకమ్
తవదేవి!శివే! తనూభువాం।మహతామన్యతమం ప్రచక్షతే॥౧౬

దేవీ! శివా! ద్యులోకచారులలో శ్రేష్ఠుఁడగు బృహస్పతిని అద్వితీయ— వేదమంత్రనిధాననాయకుఁడగు బ్రహ్మణస్పతియనియు,

నీతనూభవులగు మరుత్తులలో నొకఁడనియు, వేదవేత్తలు చెప్పు చున్నారు.

ప్ర భ:—బృహస్పతియు-బ్రహ్మణస్పతియు 'నొక్కఁడే'యనియు. అతఁడు వేదమంత్రముల కధిష్ఠానదేవతయనియు, వేదవిదులు చెప్పఁగగు ఆబ్రహ్మణస్పతి-పురాణములయందు నామభేదమును, రూపభేద... ఁడుగాఁ దెలుపఁ బడి యున్నాఁడు.

అవ:—పురాణములం బ్రహ్మణస్పతికిఁగల నామరూప విశేషమును దెలుపుచున్నాఁడు.

మూ॥ ద్విరదంవదనే మహోమదం, సిరదన్తచ్ఛ నిధౌతదిక్తటమ్।
ఇతరత్రిముఖాన్నరాకృతిం విదురస్యైవవివర్తమద్భుతమ్॥ ౧౭

మహోమదము (అధికమగు దానజలము) గలవాఁడును, తెల్లని దంతముయొక్క కాంతులచేత శోభింపఁబడిన దిక్తటములుగలవాఁడును, ముఖమునందు- రెండుదంతములుగల గజస్వరూపమును, ఆముఖముకంటె నితరమగు శరీరమునందు నరస్వరూపమును గల విఘ్నేశ్వరుని-వెనుక చెప్పఁబడిన మరుత్తులలో నొకఁడగు బ్రహ్మణస్పతి యొక్క విచిత్రమగు వివర్తమని విజ్ఞులు చెప్పుచున్నారు.

ప్ర భ:—బ్రహ్మణస్పతియే రూపభేదమునొంది విఘ్నేశ్వరుఁ డయ్యెననియు, గజముఖము-నరరూపము-గలదగుటచేత యీ వివర్తము(రూపభేదము నొందినయాకారము) అద్భుత మగుచున్నదనియు. గ్రహించునది. బ్రహ్మణస్పతి-గణపతుల కభేదమును ప్రతిపాదించుచున్నదియగు నొకమంత్రవర్ణముగలదు. "గణానాంత్వా గణపతిం హవామహే కవింకవీనా ముపమశ్రవస్తమమ్। జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిఃసీదసాదనమ్॥ ఇతి.

అవ:—ఇట్లు జ్యేష్ఠుఁడగు గణపతిని ప్రస్తావించి, కనిష్ఠుఁడగు కుమారుని ప్రస్తావించుచున్నాఁడు.

మూ॥ అఖిలామరనిర్జరయోన్నతః ప్రథనేతారకదానవోబలీ
హృతవీర్యమదోబభూవయద్-ఘనశక్త్యాయుధతేజసాజ్ఞసా॥౧౮

దేవతలనందఱను నిర్జించుటచేత సమున్నతమయిన కీర్తిగలవాఁడును, బలవంతుఁడును, అగు తారకాసురుఁడు— ఏ దేవునియొక్క— సత్త్వభరితమగు శక్తియను నాయుధముయొక్క— తేజము (ప్రతాపము) చేత— శీఘ్రముగా నపహరింపఁబడిన వీర్యమదము (వీర్యమువలని దర్పము) గలవాఁడయ్యెనో, ("అగుహుఁడు" అను 23వ శ్లోకార్థముతో నన్వయము)

ప్ర భ:— ఏ భగవానుఁడు ... బలిష్ఠమగు శక్త్యాయుధముచేత— తారకాసురుని జయించెనో, "ఆ గుహుఁడు.. నీకు క్షేమాస్పదమగు శుభ..." అని 23వ శ్లోకార్థముతో నన్వయించునది.

మూ॥ అమలే హృది నిర్మలాశనాచ్ఛిన్న గ్రన్థి... యే నరాయ యః
పరిపక్వధియే ప్రదర్శయేత్ । తమసః పారమపారవైభవః॥

పరిశుద్ధమగు నాహారమువలన హృదయము నిర్మలము కాఁగా, అవిద్యాగ్రంథిసమూహము విడివడఁగా, పరిపక్వమయిన బుద్ధిగల మానవునకు— నిరవధికమగు (అంతములేని) వైశ్వర్యముగలవాఁడగు— ఏ భగవానుఁడు (సనత్కుమారుఁడు) తమస్సుయొక్క— పారమును (చీకటియొక్క— అంతమును) ప్రదర్శింపఁజేసెనో.

ప్ర :— మహర్షులకు ... ఆహారము గొనుటవలన హృదయము నిర్మలమగునని ... హృదయ కషాయ విముక్తుఁడగు నారదునకు బోధించి ... సనత్కుమారుని ... ఁడని చెప్పుదురు." అని ఛాందోగ్యమునందుఁ జెప్పఁబడినది.

మూ॥ ద్రవిడేషు శిశుత్వమేత్య యో గిరిశశ్లోకవిశేషగాయినీమ్
అమృతద్రవసారహారిణీం నిగమాభాం నిబబన్ధసంస్తుతిమ్॥ ౨౦

జ్ఞానసంబంధమూర్తియనుపేరుగల ఏ భగవానుఁడు— ద్రవిడదేశమునందు పుట్టించి శైశవమునందే శివయశోవిశేషమును గానము చేయునదియు, అమృతరససారాంశము నగుదాని నతిశయించునదియు, వేదతుల్యమగునదియు, అగు సంస్తుతిని నిబంధించెనో.

మూ॥ సగుహోఽతిమహో మహోమహా
స్త్రిదశానాం ప్రథితశ్చమూపతిః।
జగతామధిరాజ్ఞి! కోఽపి తే
సుతరాం ప్రీతిపదం కుమారకః॥ ౨౩

జగచ్చక్రవర్తిని! ఆగుహుఁడు— అమితమగు సత్త్వముగలవాఁడును, గొప్ప తేజస్సుగలవాఁడును, ప్రఖ్యాతుఁడును, దేవసేనాపతియును, అనిర్వచనీయుఁడును, నీకు— అత్యంత ప్రేమాస్పదుఁడును అగు కుమారకుఁడు (బాలుఁడు) అగుచున్నాఁడు.

ప్ర. భ:—గణపతి-శివాంకము నందుండువాఁడని వెనుక చెప్పినపుడు శక్తిధరుఁడగు స్కందుఁడు శక్తిప్రియుఁడని చెప్పఁబడినది. చిన్నవాఁడు-తల్లికి వాత్సల్యపాత్రుఁడుగదా?

మూ॥ జయతి త్రిపురారిభామినీ, గణపత్యాదిమరుత్ప్రసూరుమా।
తమసూత సురారిఘాతయే। త్రిదశానామపియా చమూపతిమ్॥

అసురధ్వంసమునకొఱకు దేవతలకుఁగూడ సేనాపతియగు కుమారుని, గణపతి మొదలుగాఁగల మరుత్తులను, కన్నతల్లియగు త్రిపురారిభామిని (శివకాంత) యుమ ప్రకర్షచే వెలయుఁగాత!

ప్ర. భ:—"గురుముత్తమమ్". అను శ్లోకమున బ్రహ్మణస్పతి-మరుత్తని చెప్పఁబడినది. తరువాతి శ్లోకమున-అబ్రహ్మణస్పతియే గణపతియనియు, జ్యేష్ఠుఁడనియు చెప్పఁబడినది. సురారులగు రాక్షసులను సంహరించుటకు జగన్మాతయగు పార్వతి దేవసేనానియగు స్కందుని గనియెనని భావము.

మూ॥ స్వకుటుంబకథాభిధాయినీ ర్గణనాథస్య వియోగినీరిమాః
అవధారయతు ప్రసన్నయా నగనాథప్రియనన్దినీ ధియా॥ ౨౪

తనకుటుంబముయొక్క కథలను దెలుపునవియగు గణపతికవియొక్క వియోగినీవృత్తనిబద్ధములగు ఈస్తుతులను- పర్వతరాజప్రియపుత్త్రియగు నుమాదేవి- ప్రసన్నమగు బుద్ధిచేత నిశ్చయించుఁగాత!

ప్ర. భ:—నాచే సుశ్లోకింపఁబడిన స్వకుటుంబకథలు-సమీచీనములో, కావో, తద్విజ్ఞయగు జగదంబయే పర్యాలోచించుఁగాతమని భావము.

ఇది-సవ్యాఖ్యానగు-ద్వావింశ స్తబకము. (ఇరువది రెండవ స్తబకము.)

ఓం నమో భగవతే, శ్రీరమణాయ.

# ఉమా సహస్రము

ఆరవ శతకమునందలి మూడవ స్తబకము.

## [త్రయోవింశ స్తబకము]

అవ:—ఇరువది మూడవదియు, ఇరువదినాలుగవదియు నగు స్తబకములు ప్రకీర్ణకములు— అందీయిరువదిమూడవస్తబకము—గాయత్రీగర్భితము. ఇందు- 'తత్' అనునది మొదలుకొని, 'యాత్' అనునది తుదిగాఁ గల గాయత్రీమంత్రమునందలి యిరువదినాల్గు వర్ణములు క్రమముగా, క్రిందిశ్లోకములయందలి తృతీయపాదములయందలి చతుర్థవర్ణములై కాన్పించును.

మూ॥ కిరదిహామృతం, కిరణమాలయా
జయతి తత్ స్మితం, శివవధూస్మితమ్॥ ౧

కిరణమాలచేత- అమృతమును వర్షించునదివలెనున్న శుభ్రము— ఆశివవధూస్మితము— జయించుచున్నది.

ప్ర భా:—సితస్మితప్రసారము — అమృతమును వర్షించుచున్నట్లు సంభావింపఁబడినది. కావున నిందలి యలంకారము-ఉత్ప్రేక్ష. దీనిచేత శివవధూముఖమునకు చంద్రునితోడి యుపమానము గమ్యమగుచున్నది. గాయత్రీమంత్రమునందలి మొదటియక్షరము 'తత్' అనునది- ఇందలి మూడవపాదమునందలి నాలుగవయక్షరముగా గ్రహింపఁబడినదని తెలియునది.

మూ॥ తవ పదం పరే మమ గుహాన్తరే
స్ఫురతుసర్వదా, వికసితంముదా॥ ౨॥

ఉత్తమురాలవగుజనన్ని! నీపాదము—నాగుహాంతరమున(హృదయమునందు) ముదముచేత వికసితమై యెల్లప్పుడునుగూడస్ఫురించుఁగాక!

ప్ర భా:—శ్రుతులయందు హృదయము-గుహాగా వినఁబడుచున్నది. "నిహితం గుహాయామ్" (హృదయమునందుంచునది) అనుపదము శ్రుతిప్రసిద్ధముగదా!

మూ॥ పదమధోఽమ్బుజాన్నిఖిలభిద్య తే
మదనవిద్విషః సదనరాజ్ఞి! తే॥ 3॥

మదనరిపుఁడగు శివునిగృహమున కీశ్వరివగు జననీ! నీచర ణము- క్రిందికమలమగు హృదయము (అనాహతము) కంటె వేఱుకాదు. గాయత్రీ మంత్రమునందలి 'వి' ఇందున్నది.

ప్ర భ:—నీపదమే-కమలము. కావుననే వెనుకశ్లోకమునందు-ఆకమలము (పాదము) నాహృదయము నందెల్లపుడునుగూడ వికసితమై స్ఫురించుఁగాతమని ప్రార్థింపఁబడినది. మీఁదనున్న కమలము సహస్రారము. కావున క్రిందనున్న కమ లము నీపాదమే యని చెప్పఁబడినది. దీనికి "పదమదోఽమ్బుజాత్" అనుపాఠాం తరము గూడనున్నది.

మూ॥ విభుతయోరరీకృతబహూద్భవౌ ।
విదధతుస్తుర్జగత్ త్రయమిదం శివౌ॥ 4॥

సర్వవ్యాపకత్వముచేత- బహూద్భవము నంగీకరించిన పార్వతీ పరమేశ్వరులు- భూలోక, భువర్లోక, స్వర్లోకములను (త్రిభువన మును) నిర్మించిరి.

ప్ర భ:—సర్వవ్యాపకభావముచేత నానాత్వమునంగీకరించి శివులు-త్రైలోక్య విధాతలయిరని భావము. (తుర్)

మూ॥ తవతుఖేలనే! నలినజాణ్డకమ్ ।
గిరిశవల్లభే! భవతికన్దుకమ్॥ 5॥

శివప్రియసీ! ఈజగత్త్రయము- మీచేత నిర్మింపఁబడినది. అయినను ఈ బ్రహ్మాండము- నీకొక క్రీడాకందుకమైయున్నది.

ప్ర భ:—(మాదృష్టికిది-అపారము యినను-నీదృష్టికిది అత్యల్పమను నర్థమును, నలినజాండకమ్" అను పదమువలనఁ దెలియునది.) (వ)

మూ॥ సకలమస్త్యుమే! సదభయఙ్కరే!
తవకరేపరే కిమపినోనరే॥ 6॥

ఉమాదేవీ! సజ్జనుల కభయమునిచ్చునదియు, ఉత్తమమును, అగు నీహస్తమునందు సర్వమునుగలదు. నదునియందేమున్నది? (రే)

ప్ర భః—సర్వమును త్వదధీనము. మనుష్యున కధీనమయిన దేదియును లేదు. మనుష్యున కధీనమయినట్లు కన్పించువస్తువుగూడ యథార్థముగా మనుష్యున కధీన మయినది కాదు.

మూ॥ కిమివవర్ణ్యతాం కశశికుణ్డలా,
ఉడుమణిస్రజా ప్రవిలసద్గలా. ౭

సూర్య- చంద్రులు కర్ణాలంకారములుగాఁగలదియు, నక్షత్ర రూపమగు రత్నమాలచేత నుజ్జ్వలమగు కంఠముగలదియు, అగు జగన్మాత-ఎట్లు వర్ణింపఁబడును?

ప్ర భః—అత్యుజ్జ్వలములు-అత్యంతదూరస్థములు అగు సూర్య-చంద్ర-నక్షత్రములు-కర్ణభూషణ_కంఠాభరణ స్థానములుగా గలదగుటవలన అత్యుజ్జ్వలయు, అమేయయు, బృహద్రూపయు, అగు అపరమేశ్వరిని వర్ణించుటకు శక్యము కానేరదని భావము. (ణి)

మూ॥ భణనిరన్తరం బహుగుణాముమామ్
గతభయం విధేహ్యమలవాణి! మామ్॥ ౮

ఓ నిర్మలమగువాక్యమా! బహుగుణయగు ఉమను నిరంతరము పొగడుచుండుము. ఇట్లు— ఉమానామోచ్చారణముచేత నన్ను భయవర్జితు నొనరింపుము.

ప్ర భః—ఎల్లప్పుడునుగూడ-ఉమయొక్క-నామమును కీర్తించుటచేత భీతియంతయు పరుగెత్తునని భావము.

మూ॥ అవజహీహివా ననుభజామ్యహమ్
భువనభర్త్రి! తే, చరణమన్వహమ్. ౯

నీవు రక్షింపుము. లేక వర్జింపుము. (పాలముంచెదవో నీటముంచెదవో) ఓ భువనభర్త్రి! నేనెల్లపుడును నీపాదమును సేవించుచునే యుందును.

ప్ర భః—నేను నీపాదభజనమును నిత్యము నొనర్చుచుందును. పాలముంచెదవో నీటముంచెదవో భారము నీయదియే. ఫలము నపేక్షింపక భజించుటయే నాకు స్వాభావికము. అదియు నీప్రసాదమేయని భావము. (భర్)

మూ॥ గణపతేః శిరఃకమలచుమ్బినీ॥
భవతు గోపతిధ్వజకుటుమ్బినీ॥ ౧౦

వృషభధ్వజకుటుంబినియగు పార్వతి— గణపతినగు నాయొక్క శీర్షమును చుంబించుగాత!

ప్ర భ:—యోగవిభవమువలన వికసించిన గణపతి శిరఃకమలము—మకరందభరితమను నంశము గమ్యమగుచున్నది. ఆమకరందము నాస్వాదించుటకు సమర్థతగలదగుటవలన పరమేశ్వరి మధుకరమగుగాతమనునర్థ మాక్షేపింపఁబడుచున్నది. ఇచ్చట దేవి- భోక్త్రియు-భక్తుఁడగుయోగి - భోగ్యమును నగుచున్నారని గ్రహించునది. (గో)

మూ॥ దహరమజ్జనం విదధతం జనమ్
పరమదైవతే నయసి ధామ తే॥ ౧౧

పరమదేవతవగు జననీ! దహరమను పేరుగల హృదయమున మజ్జనమునొనర్చుచున్న మనుజుని నీయొక్క ధామమును పొందించెదవు.

ప్ర భ:—హృదయమునందున్న ఆత్మవస్తులాభముకొఱకు హృదయకూపమున ప్రవేశించినవానికి నీస్వరూపము లభించునని భావము. నీవేహృదయగతమగు పరమవస్తువవని భావము. (దే)

మూ॥ జనని విజ్ఞతా భవతు ధీమతామ్
అనుభవస్తు తే కరుణయాసతామ్॥

జననీ! ధీమంతులగు జనులకు పాండిత్యము కలుగవచ్చును. కాని సజ్జనులగువారికి అనుభవము (అపరోక్షమగు సాక్షాత్కారము) నీయొక్క కృపచేతనే కలుగును.

ప్ర భ:—పండితులకు శాస్త్రీయమగు జ్ఞానముమాత్రమే కలుగును. తత్త్వసాక్షాత్కారము మాత్రము భగవతీప్రసాద లభ్యమేయగును. పండితుఁడయినను, పండితుఁడు కాకున్నను, సజ్జనుడే-ఆయనుగ్రహమునకు పాత్రుఁడగును. దీనికింకొక విధమగు నర్థముగూడఁ గలదు. "ధీమంతులకు పాండిత్యము లభించినను, పరమేశ్వరీస్వరూపసాక్షాత్కారము మాత్రము-సత్పురుష ప్రసాదద్వారముననే లభించును." (వస)

మూ॥ అచలయాధియా హృదిగవేషణమ్
వృషహయప్రియా నగరశోధనమ్॥ ౧౩

నిశ్చలమగు బుద్ధిచేత హృదయమునందు వెదకుటయే వృషభవాహనుని ప్రియురాలగు పార్వతియొక్క నివాసస్థలమగు నగరమును (జ్ఞానస్వరూపమును) శోధించుటయగును.

ప్ర భ:—గవేషణకర్మయే-హృదయశోధనము. హృదయము— శుద్ధమగునపుడు-సిద్ధస్వరూపిణియగు భగవతి యిచ్చట సాక్షాత్కరించునని భావము. (య)

మూ॥ నవిజహామి తే చరణనీరజమ్
అవని ధీమతా మవ నవానిజమ్॥ ౧౪

దేవీ! బుద్ధిమజ్జనరక్షిణీ! నీవు రక్షించినను రక్షింపకున్నను నీచరణసరోజమును విడువను. (ధీ)

మూ॥ పదముమేఽమ్బ! తే హృది విచిన్వతే
పలితమస్తకాః పరమదేవతే॥ ౧౫

పరమదేవతవగు జననీ! ఉమా! ముసలితనముచేత శిరస్సు పండినవృద్ధులు- నీపదమును హృదయమునందు వెదకుచున్నారు.

ప్రి భ:—బహువత్సరములు ధ్యానమునొనర్చుచున్న వారిశిరస్సులు— వయోవృద్ధిచేత నెరసినవెండ్రుకలుగలవగుచుండును. నీవందలకును సుఖముగాలభించుదానవు కావు. ధ్యానించుచు, ధ్యానించుచు, దేహము వయస్సుచేత జీర్ణించును.(మ)

మూ॥ స్వయమనామయేసకలధాత్రి సి
నిజమహిమ్నిసా త్వమయి తిష్ఠసి॥ ౧౬

అమ్మా! నీయొక్క సాక్షాత్కారము కలుగకున్నను కాలవశముచేత ధ్యాతలకు జర ప్రాప్తించుచున్నది. నీవుమాత్రము- అనామయవై సర్వమును పోషించుదానవగుచున్నావు. రోగస్పర్శలేని స్వీయమగు మహాత్మ్యమునందున్నావు.

ప్ర భ:— మనుష్యునిశరీరము ఎంత కాలము నీమహామహిమయందుస్థితి పొందకుండునో,అంత కాలము జరాహేతువగు రోగాదికమును— పొందుచునేయుండునని భావము. (హి)

మూ॥ స్థితిమసాధయం; స్త్వపదామ్బుజే
　　విధిమధిక్షిపత్యలసధీరజే॥　　　౧౭

జన్మరహితమగు నీపదపద్మమునందలి నిష్ఠను సంపాదింపక అలసమగు బుద్ధిగలమనుష్యుఁడు, దైవము(విధి)నధిక్షేపించుచుండును. (నిందించుచుండును)

ప్ర భ:—అలసబుద్ధి యనగా మందమగుబుద్ధిగలవాఁడు; నీచరణస్థితినొందుటకు పురుషప్రయత్నము కావలసియుండ, దానిసెఱుఁగక మందుఁడగుపురుషుఁడు— ప్రారబ్ధమువలన నాకు పరమేశ్వరీపదసాక్షాత్కారము కలుగుటలేదని విధిని దూషించుచుండును. (ధి)

మూ॥ స్వతు మదాపదం శివవధూపదమ్
　　యదృషయో విదుస్త్రిభువనాస్పదమ్॥　　　౧౮

ఋషులు— దేనిని త్రిలోకములకును ఆశ్రయమగుస్థానమని తెలియుచున్నారో, ఆశివవధూచరణము — నాయాపదను బాపుఁగాక! (యో)

మూ॥ గుణగణం గృణన్ స్తవ శివే శివమ్
　　గతభయోఽభవం మదమితో నవమ్॥　　　౧౯

శివా! నీకల్యాణగుణగణమును గణించుచు (స్తుతించుచు) క్రొత్తసంతోషమునొందిన నేను భయవర్జితుఁడ నయితిని.

ప్ర భ:— ప్రసిద్ధమగు నీకల్యాణగుణగణస్తవమహిమ— అభినవహర్షలాభమును భయప్రణాశమును, గూడ— కలిగించునని భావము. (యో)

మూ॥ తవకృపావశాత్ తదిదమవ్యయే!
　　జనని! స్ఫూర్తి— స్తవ యదఙ్ఘ్రయే॥　　　౨౦

అవ్యయమగు జననీ! నీచరణముకొఱకయిన మాఉద్గమనము— నీకరుణావిలాసమువలననే సంభవించుచున్నది.

ప్ర భ:—భవదీయచరణోన్ముఖగమనము— నీకరుణకధీనమైనదిరయే. ఈయున్ముఖగమనమునందు మాపౌరుషము(పురుషప్రయత్నము)హేతువుకానేరదు. (వా వ్)

మూ॥ నయనదృశ్యయోరయి యదన్తరమ్
తదమరస్తుతే! తవవపుఃపరమ్॥ ౨౧

ఓ దేవవినుతా! జననీ! చూచునదియగు నేత్రమునకును— చూడఁదగినవస్తువునకునుగల అంతరము (అవకాశము) నీయుత్తమ శరీరమగుచున్నది.

ప్రశ్న:—దృగ్-దృశ్యములకు (నేత్రమునకు- బాహ్యపదార్థమునకు) సంబంధించిన యంతరాకాశమేయగును. దృగ్-దృశ్యములయంతరము దర్శనక్రియచేత వ్యాపింపఁదగినదియు, దర్శనము (చూచుట) జ్ఞానరూపమును అగుటవలన ఆదృగ్-దృశ్యములనడుమనున్న యవకాశము- చిన్మయాకాశమేయగునని విజ్ఞులు తెలియుదురు. కావున పరమేశ్వరి శరీరము— చిదాకాశమేయని తెలియునది. (ర)

మూ॥ అహమితిస్మృతిః క్వానువిభాసతే
ఇతి విచోదయన్ మహామలీయతే॥ ౨౨
అమృతసఙ్ఞకే సుఖచిదాత్మకే
మతిమదర్థితే జనని! ధామ్ని తే॥ ౨3

"నేను' అనుస్మృతి (తలంపు) దేనియందు విభాసించును" అని విచారించుచు (వృత్తిని ప్రేరేపించుచు) పురుషుఁడు మహద్ (బృహద్) రూపమును, అమృతసంజ్ఞకమును (అమృతమను పేరుగలదియు)సుఖచిదాత్మకమును (సుఖము- చైతన్యము, స్వరూపము గాఁగలదియు) మతిమదర్థితమును (బుద్ధిమంతులచేతఁ గోరఁదగినదియు) అగునీయొక్క ధామమున(స్థానమున)లయించును.) ఇది రమణోపదేశము

ప్రభ:—'నేను' అనుబుద్ధియొక్క భావమెచ్చటిది? అనఁగా; అహమను జ్ఞానమునకు మూలము- ఎక్కడనున్నది? అని సూక్ష్మమగు బుద్ధిచేత విచారించుచు, పురుషుఁడు= అమృతమను పేరుగలదియు, చిత్తు- ఆనందము- స్వరూపము గాఁగలదియు, అగు నీయొక్క స్థానమున (గమ్యస్థానమున)లయమునొందునని భావము. ఈయర్థము— నిజాచార్యుఁడగు రమణభగవానుని యుపదేశమైయున్నది. గణపతికవి- ఆ యుపదిష్టాంశము నిచట ప్రదర్శించెనని పాఠకులు గ్రహించునది) దీనివి నిత్యము కథించునది. (వ్య)

మూ॥ అయిముదాస్పదం స్పృశతి తేపదమ్
శ్వసితయాత్రయా సతతదృష్టయా॥ ౨౮

సాధకుఁడగుజనుఁడు- ఎల్లప్పుడును వీక్షింపఁబడుచున్న శ్వసితయాత్రిచేత (రాకపోకలుగల ప్రాణవాయుసాధనముచేత) ప్రీతిస్థానమగు నీచరణమును స్పృశించుచుండును.

ప్రి వ:—కృతార్థుఁడగుపురుషుఁడు- శ్వాసముయొక్క యాతాయాతవిహారము నన్వేషించుటయే యనుసాధనముచేత ఆనందనిలయమగు నీపదము నొందునని భావము. ఊపిరియొక్క రాకపోకలను గుర్తించుటవలన-దేవీస్వరూపమగు ఆనందము లభించును.

మూ॥ దధతుసత్కవేర్గణపతేరిమాః
నగభువోముదం, నరమనోరమాః॥ ౨౯

దోషరహితమును, శబ్దార్థమాధుర్యాదిగుణసహితమును, అగు కావ్యమును రచించు గణపతికి సంబంధించిన 'నరమనోరమా'వృత్తనిబద్ధములగు ఈస్తుతులు నగకుమారికి ప్రీతినొసఁగుఁగాత!

ఇది-సవ్యాఖ్యమగు త్రియోవింశ (ఇరువదిమూఁడవ) స్తబకము.

ఓం నమో భగవతే, శ్రీరమణాయ.

# ఉమాసహస్రము

## చతుర్వింశ స్తబకము

ఆరవ శతకమునందలి నాలుగవ స్తబకము.

అవ:—ఇరువదినాలుగవదియగు నీస్తబకముకూడ- ప్రకీర్ణకమై యున్నది.

మూ॥ చన్ద్రికాసితం చణ్డికాస్మితమ్।
భూతలేసతాం భాతుభూతయే॥ ౧

తా॥ వెన్నెలవలె తెల్లనిదగు చండిక చిరునవ్వు- ఈలోకమునందలి శిష్టులకైశ్వర్యము నొసఁగుటకై వెలయుఁగాత!

మూ॥ భాలచక్షుష, శ్చక్షుషాం ఘనమ్।
కిఞ్చిదస్తుమే శ స్త వర్ధనమ్॥ ౨

లలాటనేత్రుఁడగు హరుని నేత్రత్రయమునకు భోగ్యమగు ఉమావస్తువు (ఉమాదేవి) నాయొక్క-క్షేమమును వృద్ధినొందించునది యగుఁగాత!

వ్రి భ:—భావుకము, భవుకము, భవ్యము, కుశలము, క్షేమము, శస్తము, అను వవి క్షేమశబ్దమునకు పర్యాయపదములు. హరత్రినేత్ర తర్పణమగు ఉమాఖ్యమగు ఘనము-నా క్షేమమును ఘటించుఁగాత! అని యర్థము.

మూ॥ సాధుస న్తతి క్షేమకారిణీ
ఘోరదానవానీకదారిణీ॥ ౩॥

సాధుజనసంతతికి క్షేమము నిచ్చునదియు, భయంకరమగు దానవసైన్యమును భంజించునదియు,

ప్ర భ:—ఈశ్లోకార్థమునకును, దీనితరువాతిదానికిని, గూఢ-రీతి శ్లోకార్థమునతో నన్వయమున్నను గ్రహింపవలెను.

మూ॥ యోగయుక్త సచ్చిత్తచారిణీ
పాదసేవక ప్రాజ్ఞతారిణీ॥ ౪॥

యోగసాధనముతోఁ గూడుకొనిన సత్పురుషుల చిత్తముల యందు చరించునదియు, పాదసేవకులగు ప్రాజ్ఞులను భవసముద్రము నుండి తరింపఁజేయునదియు,

మూ॥ పుష్పబాణజిన్నేత్రహారిణీ।
పాతుమాం జగచ్చక్రధారిణీ॥ ౫॥

పుష్పబాణుఁడగు మన్మథుని జయించిన హరుని నేత్రముల నాకర్షించునదియు, జగచ్చక్రమును ధరించునదియు, (భువనసామ్రాజ్యమును భరించునదియు) అగు సుమాదేవి- నన్ను రక్షించుఁగాత!

మూ॥ ద్వాదశాన్త- భూ జాతశారికా
సర్వవాఙ్మయస్యైకకారికా॥ ౬॥

ద్వాదశాంత- వృక్షమునందున్న శారిక, సర్వవాఙ్మయమునకును ఏకమగు కారిక,

ప్ర భ:—సహస్రార చక్రముమీఁదనున్న చక్రమును- ద్వాదశాంతమని చెప్పుదురు. ఆద్వాదశాంత చక్రమనెడి వృక్షమునందున్న పక్షివిశేషమగు శారికయే-ఉమ. శబ్దప్రపంచమునకంతకు సూత్రప్రాయమగు పద్యరూపమగు శారికయే-(సమస్తశబ్దబ్రహ్మసారాంశమే) ఉమయగును. స్వల్పాక్షరములచేత నేఆనల్పార్థమును బోధించునది-కారికయని లాక్షణికులు చెప్పుదురు.

మూ॥ పుణ్యకర్మసు స్వచ్ఛమస్తకా।
యోగశాలిషు చ్ఛిన్నమస్తకా॥ ౭॥

పుణ్యకర్మ గలవారి శీర్షమునందు నివసించుటవలన దానిని స్వచ్ఛముగాఁ జేయునదియు, యోగశాలుల శిరోగ్రంథి విశేషములను భేదించునదియు,

ప్ర భ:—యోగనిష్ఠుల శిరోగ్రంథిభేదనముచేత పరమేశ్వరియొక్క ప్రసాదధార-నిరర్గళముగా ప్రవర్తించునని భావము. ప్రచండచండీ ప్రస్తావమున ఛిన్నమస్తా

(శిరోగ్రంథశేషము) తత్త్వమును దెలుపు నవసరమునందీయంశము విస్తరింపఁబడును. కావున నచట పాఠకులీయర్థమును గుర్తించునది.

మూ॥ ఆత్మనిష్ఠితేః సమ్ప్రదాయికా
సర్వజన్మినాం సమ్ప్రవర్తికా॥ ౮॥

ఆత్మనిష్ఠను సమకూర్చునదియు, సర్వదేహులను చక్కఁగా ప్రవర్తింపఁజేయునదియు,

ప్రతి భ:—ఆత్మనిష్ఠవలన పునర్జన్మను నివర్తింపఁజేయునదియు, దేహులకందఱి కును పునర్జన్మను ప్రవర్తింపఁజేయునదియు, గూడ-పరమేశ్వరియే యగునని భావము.

మూ॥ మాం పునాతుసత్ పూజ్యపాదుకా
ఫాలలోచన- ప్రాణనాయికా॥ ౯॥

సజ్జనులచేత పూజింపఁదగిన పాదుకలుగలదియు, లలాటలోచనుని హృదయేశ్వరియు, నగుపార్వతి నన్ను పవిత్రునిగాఁ జేయునుగాత!

మూ॥ దానతోయశః, పౌరుషాద్రమా,
సమ్పదోమదః, శీలతః క్షమా॥ ౧౦॥

దానము (ఇతరులకు ద్రవ్యమునిచ్చుట) వలన కీర్తియు, పౌరుషము (పురుషప్రయత్నము) వలన రమయు, (లక్ష్మియు) సంపదవలన మదమును, (హర్షమును) శీలమువలన (సత్ప్రవర్తనమువలన) క్షమయు, (సహనశక్తియు) కలుగును.

మూ॥ సత్యతో జగత్యత్రగౌరవమ్
యజ్ఞతో దివి స్థాన ముజ్జ్వలమ్॥ ౧౧॥

సత్యవచనమువలన— ఈలోకమున గౌరవము (పూజ్యత్వము) కలుగును. యజ్ఞమువలన స్వర్గమునం దుజ్జ్వలమగుస్థానములభించును.

మూ॥ సంయమా దఘవారిత వీతతా।
యోగతో మహాసిద్ధిశాలితా॥ ౧౨॥

సంయమము (ఇంద్రియనిగ్రహము, లేక ధారణా, ధ్యాన, సమాధ్యభ్యాసము)వలన పాపములు తొలఁగును. యోగమువలన (అధ్యాత్మయోగనిష్ఠవలన) మహాసిద్ధులు లభించును.

మూ॥ శర్వనారి! తే పాదసేవయా ।
సర్వసత్ఫలావాప్తిస్స్యాత్‌॥ ౧౩॥

రుద్రపత్నివగు జననీ! శ్రేష్ఠమగు నీపాదసేవచేత— సర్వ—సత్— ఫలములునుగూడ ప్రాప్తించును

ప్ర భ:—దానము, పౌ[illegible] మొదల[illegible] — [illegible] కీర్తి లక్ష్మి మున్నగు లాభములు కలుగుననుట సత్యమే [illegible] నీ పాదసేవచేత [illegible] యుఁ గూడ లభించును. కావున నీ [illegible] సేవయే- సర్వ [illegible] లను [illegible] ని భావము.

మూ॥ నోద్యమేనయా సిద్ధిరుత్తమా ।
విశ్వనాయికా వీక్షితేనసా॥ ౧౪॥

ప్రయత్నముచేత లభింపనిసిద్ధి (కూడ) విశ్వేశ్వరీవీక్షితముచేత లభించును.

మూ॥ సమ్పదాం రమా భారతీ గిరామ్।
త్వం శివే! ప్రభుః ప్రాణసంవిదామ్॥ ౧౫॥

సంపదలకుఁ ప్రభువు లక్ష్మి. వాక్కులకు—నాయిక సరస్వతి. శివా! ప్రాణ—సంవిత్తులకీశ్వరివి నీవు.

ప్ర భ:—జీవన_ధారణ-క్రియాకరణాదులకు హేతుభూతములగు ప్రాణములకును, బాహ్యజ్ఞానేంద్రియ మనోబుద్ధ్యాదుల కాధారభూతములగు చిత్తులకును—అధీశ్వరివి-నీవే. అనఁగా, నీవే- క్రియా-జ్ఞానశక్తుల కీశ్వరివని భావము.

మూ॥ చక్షుషానభో లక్ష్యధారిణా
సిద్ధ్యతీవ తే దేవి! ధారణా॥ ౧౬॥

దేవీ! ఆకాశమేయగు లక్ష్యమును ధరించునదియగు నేత్రముచేత భవత్స్వరూపగ్రహణధారణ-సిద్ధించును.

ప్ర భ:—ఆకాశమే లక్ష్యముగా నేత్రముచేత ధరింపఁబడునేని వేరొక దృశ్యము లేకుండుటవలన శూన్యముగా నవభాసించునదియు, వ్యాపకత్వముతో నొప్పునదియు, నగు దేవీస్వరూపమునుగ్రహించుటయందగు ధారణ సిద్ధించునని భావము. ఔపనిషదమగు సమయము నవలంబించి-ఇదియే-అక్షిపురుష విద్యయగును.

మూ॥ ఆశిరో దధన్నాభితోఽనిలమ్
దేవివిన్దతి త్వన్మునిర్బలమ్. ౧౭

నాభిప్రదేశమునుండి శిరోదేశమువఱకును ప్రాణవాయువును ధరించుచున్నముని నీ వలన బలమునొందును.

ప్ర భ:—నాభిస్థలమునుండి మస్తకమువఱకును ప్రాణమును ధరించుటచేత శక్తిమంతుఁడగును. ఇచ్చట- ప్రాణాయామముచేత శ్వాసమును స్తంభించునను నంశ ముపదేశింపఁబడుటలేదు. ప్రాణాయామము లేకున్నను ధ్యానబలముచేతనే యీస్థితి కలుగునని స్ఫురింపఁజేయుటకు ముని (మననముగలవాఁడు) అనుపద ముపయోగింపఁ బడినది. ఇది_ఔపనిషదియగు సంవర్గవిద్య.

మూ॥ హృద్గృహాన్తరే యద్విశోధనమ్
తత్ సవిత్రి! తేస్యాదుపాసనమ్॥ ౧౮॥

సవిత్రి! హృదయగుహాంతరమునందు పరీక్షించుట- నీయుపాసనమగును.

ప్ర భ:—ఇది-దహర విద్య. అక్షిపురుషవిద్య, సంవర్గవిద్య, దహరవిద్య అనునవి-యుపాసనలు. అవి యుపనిషత్తులచేత నుపదేశింపఁబడినవి. ఆవిద్య లిచట భాషాభేదము నాశ్రయించి సులభముగా ప్రతిపాదింపఁబడినవి. ఈ గ్రంథాంతము నందు చేర్పఁబడిన, అనుబంధమునందీవిద్యలు వివరింపఁబడును.

మూ॥ కాఽప్యహమ్మతి ర్గోచరం వినా
లోకధాత్రి! తే రూపభావనా॥ ౧౯॥

లోకభర్త్రి! 'ఇది' అను విషయములేని అనిర్వచనీయమగు అహమ్ మతి-('నేను' అనుతలంపు) నీరూపమును భావించుటయగును. (భవత్ స్వరూపనిష్ఠయగును) దేహాదినిష్ఠముకాక, ఆత్మనిష్ఠమగు అహంమతియే మాతృరూపభావన.

ప్ర భ:—'ఇది' అని గోచరించునది-విషయము. ఇదియను ప్రతీతిలేకుండ, 'లేను' అను ప్రత్యయార్థముయొక్క- జ్ఞానము కలుగదు. కావుననే మూలమున 'కాఽపి' (అనిర్వచనీయమగు) అని చెప్పఁబడినది. ఇదంభావము లేకుండ, 'ఉన్నాను' అను సత్తామాత్రమగు జ్ఞానము- శుద్ధమగు బుద్ధియగుచున్నది. ఇది యోగశాస్త్రమునందు "అస్మిత" అని పేర్కొనఁబడినది. ఈయస్మిత-నీస్వరూపము నందలి నిష్ఠయగునని భావము. ఈవిద్య-ఛాందోగ్యశ్రుతియందు- 'వైశ్వానరవిద్య' అగుచున్నది.

మూ॥ అశ్యామఖణ్డనం కోఽపి విద్యయా।
ఖణ్డనంపరః ప్రాహ నా యయా॥		౨౦॥

ఒక విద్వాంసుఁడు- నీవు- విభజింపఁదగని చిత్తుగలదానవని చెప్పెను. ఇంకొకమనుజుఁడు- నీవు- విభజింపఁదగిన చిత్తుగలదాన వనిచెప్పెను.

ప్ర భ:—పక్షములు-రెండున్నవి. నీచితికి భేదము లేదనునది-ఒకపక్షము. భేదము కలదనునది-వేరొకపక్షము.

మూ॥ మాతరేతయా జీయతేత్వయా
ఏకయాతనూ- భిన్నయాధియా॥		౨౧॥

ఒక్కతెవగు-ఈ నీవు- శరీరములయందగు భిన్నబుద్ధిచేత జయించుచున్నావు.

ప్ర భ:—శరీరదృష్టిచేత_భేదముగలదానవును, తదితరదృష్టిచేత- భేదము లేని దానవును (అఖండస్వరూపవును) అగుచున్నావని తాత్పర్యము.

మూ॥ బాహ్యాదర్శనే విశ్వపఙ్కిలా।
అన్యథాభవస్యమ్బ! కేవలా॥		౨౨॥

బాహ్యదృష్టియందు- దృశ్యమును, జడమును, భిన్నమును అగువిశ్వరూపముచేత-పంకిలవై (అస్వచ్ఛవై) యుందువు. సూక్ష్మ దృష్టియందు- ఏకమగు స్వరూపముచేత-స్వచ్ఛవై యుందువు.

మూ॥ ఖణ్డవన్మృశాం భాసి భోగినామ్।
అస్యభిన్న చిత్ కాఽపి యోగినామ్॥ ౨౩॥

నీవఖండస్వరూపవైనను, భోగులకు (విషయభోగవంతులగు వరులకు) ఖండస్వరూపిణివలె భాసింతువు. యోగులకు (యుక్తచేత స్కులగు జ్ఞానులకు) అనిర్వాచ్యవగు చితివగుచున్నావు.

మూ॥ బన్ధవిషయద్- భాసిఖణ్డితా
మోక్షవిషయద్ భాస్యఖణ్డితా॥ ౨౪॥

నీవు భేదవంతురాలవై- భాసించుటయే - బంధము. అభేద స్వరూపవై -భాసించుటయే-మోక్షము.

(ప్ర భ:—భేదదర్శనము బంధము. అభేదదర్శనము-మోక్షము.

మూ॥ ఏతదీశితుః పత్ని! హృన్ముదే
సుప్రతిష్ఠ సద్ గీతమస్తు తే॥ ౨౫॥

ఈశ్వరపత్నీ! నాచేత రచింపఁబడిన సుప్రతిష్ఠావృత్తసంబంధి యగు సద్గీతము-నీహృదయమునకు ప్రీతినొసఁగుఁగాత!

ఇతి శ్రీమహర్షి - రమణభగవత్ పాదాన్తే వాసినోవాసిష్ఠస్య
నరసింహసూనోః గణపతిమునేః కృతావుమాసహస్రే
చతుర్వింశః స్తబకః-సమాప్తః।

ఇది - శ్రీమహర్షి రమణభగవత్పాదశిష్యుఁడు, శతమర్షణ సగోత్రుఁడు
శ్రీమత్ పంతుల పేరయ్యశాస్త్రి పౌత్రుఁడు, శ్రీ వేంకటరామబుధేంద్ర
ద్వితీయ పుత్త్రుఁడు, లక్ష్మీనారాయణశాస్త్రి చేత నాంధ్రీక
రింపఁబడిన ఉమాసహస్రమను స్తోత్రకావ్యమున
చతుర్వింశస్తబకము (౫వ శతకము)-సమాప్తము.

ఓం నమోభగవతే. శ్రీరమణాయ.

# ఉమాసహస్రము

[ పంచవింశ స్తబకము ]

సప్తమ (ఏడవ) శతకమునందలి ఒకటవ స్తబకము

అవ:—భరతఖండమున—ఆసేతుహిమాలయస్థితములగు పుణ్యక్షేత్రముల నధిష్ఠించి— విశ్రుతములగు దేవీమూర్తుల సీయిరువదయిదవ స్తబకమున ప్రస్తావించుచున్నాఁడు. అందు దక్షిణదేశమునందలి దేవీమూర్తులు-మొదట ప్రస్తావింపఁబడుచున్నవి అందు మిక్కిలి నూతనమైన కన్యాకుమారీనామమున ప్రసిద్ధమగు క్షేత్రమునందధివసించిన కన్యాకుమారిని స్తుతించుచున్నాఁడు.

ఉపా॥ కన్యాకుమారీ నితరాం వదాన్యా
మాన్యా సమస్తైః ప్రకృతేరనన్యా
ఆక్షేపకం సాగర బుద్బుదానాం
హాసం విధత్తాం జగతఃసుఖాయ॥ ౧॥

అత్యధికమగు దానకుశలతగలదియు, నరులచేతను సురలచేతనుగూడ పూజింపఁదగినదియు, ప్రకృతికంటె వేఱు కానిదియు. అగు కన్యాకుమారి-(బాలయగు దేవి) సాగరబుద్బుదముల నాక్షేపించునదియగు హాసమును — లోకముయొక్క సుఖముకొఱకు ప్రసరించుఁ గాత!

ప్ర భ:—'అనవరతోత్తరం గధవల ఫేన బుద్బుదాక్షేపకమగు హాసము' అని చెప్పుటవలన, అభినవనిత్యోదయ శుభ్రశోభాతిశాయియగు కుమారీహాసము-జగన్మాంగలికమని స్తుతింపఁబడుచున్నది.

అవ:—రామేశ్వరక్షేత్రము— సేతుబంధమని ప్రసిద్ధము. అచ్చట ప్రసన్నయగు పర్వతవర్ధనీదేవిని స్తుతించుచున్నాఁడు.

మూ॥ రక్షస్స్వాచేతో మదమత్సరాదే
ర్భిక్షస్స్వకాలే తనురక్షణాయ
వీక్షస్స్వరామేశవధూపదాబ్జం
మోక్షస్స్వలాభే యది తేఽభిలాషః॥

ఓ ముముక్షువూ! మోక్షమనుధనమునందు నీకభిలాషముండిన యెడల మదమత్సరాదులనుండి నీమనస్సును రక్షించుకొనుము. శరీర రక్షణముకొఱకుచితమగుకాలమునభిక్షను గైకొనుము. రామేశ వధువగు పర్వతవర్ధనీదేవియొక్క పదాబ్జమును వీక్షింపుము.

ప్ర భ:—మనస్సునుండి మదమాత్సర్యాదులను తొలఁగించుట, శరీరధార ణముకొఱకుభిక్షఁ గొనుట, పర్వతవర్ధనీదేవీపాదములను దర్శించుట, అను నీ మూఁడింటిని ముఖ్యకర్తవ్యములుగా స్వీకరించు వానికి ఆత్మాభిలాషము సిద్ధించు నని భావము.

అవ:—మధురాక్షేత్రమున కధిదేవతయు, సుందరేశ్వరసనాథయు అగు, మీనాక్షీదేవిని స్తుతించుచున్నాఁడు.

మూ॥ లోకస్యదూరీకృతభక్తశోకం
హాలాస్యనాథేక్షణపుణ్యపాకమ్
భీతిః సఖేచేద్భవతః పవిత్రమ్
జ్యోతిర్విశేషం జలచారినేత్రమ్॥ 3

సఖా! నీకు జననమువలని భయముకలుగునెడల, భక్తలోకము యొక్క శోకమును తొలఁగించునదియు, హాలాస్యక్షేత్రనాథుఁడగు (మధురాక్షేత్రనాథుఁడగు) సుందరేశ్వరుని దృష్టియొక్క పుణ్యాము నకు ఫలభూతమగునదియు, మీనములవంటి నేత్రములుగలదియు, [మీననేత్రము (పోషణము) వంటి నేత్రము (పోషణము) గలదియు] పవిత్రమయినదియు, నగు జ్యోతిర్విశేషమును, వీక్షింపుము.

ప్ర భ:—మధురాక్షేత్రమునకు సుందరేశ్వరుఁడు నాయకుఁడై యున్నాఁడు: ఆసుందరేశ్వరుని నాయిక మీనాక్షి. "ఆమె భక్తుల శోకమును తొలఁగించును.

మీనమువలె దృష్టిమాత్రముచేతనే భక్తులగు ప్రజలను పోషించుటచేతనుగాని, మీనములవంటి నేత్రములు గలదగుట చేతనుగాని, ఆమె మీనాక్షియనుచున్నది. ఆమె జ్యోతిస్స్వరూపిణి, భక్తుల పాపములను తొలఁగించును" అని తాత్పర్యము.

అవ:—జంబుకేశ్వరక్షేత్రమూర్తియగు అఖిలాండనాయికను స్తుతించుచున్నాఁడు.

మూ॥ యో లోకతే తామఖిలాణ్డరాజ్ఞీ
మజ్ఞాన విధ్వంసవిధానవిజ్ఞామ్।
అమ్బాం పరాం జీవనలిఙ్గశక్తిం
భూయః సకాయం నభవేలభేత॥　　౮॥

సర్వానర్థహేతువగు అజ్ఞానమును ధ్వంసముచేయు విధానము నెఱుఁగునదియు, జీవనలింగమగు (జలమునందున్న లింగమగు) జంబుకేశ్వరునిశక్తియు, పరాంబయు, అగు అఖిలబ్రహ్మాండనాయికను దర్శించినమనుష్యుఁడు-పునర్జన్మము నొందఁడు.

ప్ర భ:—దక్షిణదేశమున ప్రసిద్ధములగు పంచభూతక్షేత్రములలో జంబుకేశ్వరక్షేత్రమును-ఆప్యమని (జలసంబంధియని) చెప్పుదురు.

మూ॥ బిభ్రత్ సహస్రంచ ముఖానిశక్తో
వక్తుం గుణాన్ కః కమలాలయస్య।
జన్మాఽపి యత్రప్రభవే జ్జనానాం
ముక్త్యై మునీనామపి దుర్లభాయై॥　　౯॥

చోళమండలమునందున్నదియు, 'తిరువారూర్' అను ద్రవిడనామమున ప్రసిద్ధమగునదియు, త్యాగరాజసనాథయగు త్రిపురసుందరీదేవిచేత అధిష్ఠింపఁబడినదియు, నగు కమలాలయక్షేత్రముయొక్క-గుణములను వర్ణించుటకు సహస్రముఖములను వహించువాఁడయినను గూడ నెవ్వఁడును శక్తుఁడు కానేరఁడు. ఆక్షేత్రమున జన్మించుట కూడ— ధ్యాననిష్ఠులగు మునులకుఁగూడ దుర్లభమగుముక్తి నొసఁగుటకు సమర్థమగుచున్నది.

ప్ర భ:—తిరువారూరునందు జననముగూడ-మోక్షప్రదమని భావము.

మూ॥ వ్యాఘ్రాంఘ్రిశేషాశనపూజితస్య
నాట్యస్థలీనాయికయా శివస్య
క్షేత్రాగ్ర్యభాజా శివకామయా వో
మిత్రాః కామాః ఫలినో భవన్తు॥ ౬॥

మిత్రులారా! వ్యాఘ్రపాదునిచేతను, శేషావతారుఁడగు పతంజలిచేతను, పూజింపఁబడిన, చిదంబర నటరాజస్వామియొక్క నాట్యస్థలీనాయికయు, మిాప్రసిద్ధిపథము నొందినదియు, అగు శివకామేశ్వరీ దేవిచేత-మిామనోరథములు ఫలించుఁగాత!

ప్రశ్న:—చిదంబర క్షేత్రనాథుఁడగు నటరాజస్వామియొక్క ప్రియురాలగు శివకామేశ్వరియొక్క సందర్శనముచేత-అభీష్టార్థసిద్ధి కలుగుఁగాతమని తాత్పర్యము. పంచభూతక్షేత్రములయందలిచిదంబరక్షేత్రము-ఆకాశక్షేత్రమని ప్రసిద్ధమగుచున్నది.

మూ॥ ఆలోకతేఽపీతకుచామయి త్వా
మాలోలచిత్తా మరుణాచలేయః
నిర్వేదవాన్ సర్వసుధాంసువక్త్రే
సర్వేవశేతస్య భవన్తికామాః॥ ౭॥

పూర్ణచంద్రవదనవగు జననీ! తైజసలింగమగు అరుణాచలమున (అరుణాచలేశ్వరునియందు) అనురాగవిలసితమగు చిత్తముగలదానవును, 'అపీతకుచ' అనుపేరుగలదానవును అగు నిన్ను- విలోకించిన నిర్వేదవంతుఁడగు మనుష్యునకు కోరికలన్నియును వశపడును.

ప్రశ్న:— అరుణాచలసనాథయగు అపీతకుచాంబికను దర్శించుటవలన విషయములయందు ద్వేషముగల చిత్తవృత్తిగల మనుజునకు కామములన్నియు స్వాధీనములగునని భావము. గణపతిమునికీక్షేత్రమునందే స్వగురు (రమణమహర్షి) దర్శనమును, చిరకాలవాసమును లభించి-దివ్యములగు సిద్ధులుగలిగెనని గ్రహించునది.

మూ॥ యః కుణ్డలీపట్టణరాజధానీ
మాలోకతే కామపి కృత్తమస్తామ్।
నిస్సారమానన్దకథావిహీనం
సంసారమేతం స జహాతి బుద్ధ్యా॥ ౮॥

కుండలీపట్టణము (పఝైపేడు) రాజధానిగాఁగలదియు, ఛేదింపబడిన శిరస్సుగలదియు, చెప్పుటకు శక్యముకానిదియు, అగు రేణుకాఁదేవిని- వీక్షించినభక్తుఁడు సారములేనిదియు, ఆనందమనుమాటకూడ లేనిదియు, అగు జననమరణరూపమగు ఈసంసారమును బుద్ధిచేత విడిచి విరక్తుఁడగును.

ప్ర భ:—ద్రావిడభాషచేత 'పఝైపేడు' అని చెప్పఁబడిన కుండలీపురము- (ప్రసిద్ధమగు రేణుకాక్షేత్ర) మగుచున్నది. గణపతిమునీంద్రుఁడు తపము నొనర్చిన స్థలములయందిది యొక ముఖ్యక్షేత్రమని తెలియునది.

మూ॥ దృష్ట్వావధూమాదిపురీశ్వరస్య
యో లోచనారోచక మాధునోతి।
తస్యాన్తరఙ్గం ధుతసర్వసఙ్గం
భూయోభవారోచకమావృణోతి॥ ౯॥

ఆదిపురీ (తిరువొత్తియూర్) క్షేత్రేశ్వరునివధువగు త్రిపురసుందరీదేవిని దర్శించి దర్శించి— దర్శనీయమగు నీతల్లిస్వరూపమును మరల వీక్షింతునని, దృశ్యవస్తువునందలి జుగుప్సను నేత్రయుగళము నుండి తొలఁగించి సఫలనేత్రుఁడగు వాని యంతఃకరణము- సంగరహితమయి, పునర్జన్మమునందలి జుగుప్సను ఆచ్ఛాదించును.

ప్ర భ:—త్రిపురసుందరిని జూచినవానికి నిజాంతరంగము- నిస్సంగమగును. కావున పునర్జన్మమునందాయమ్మ దర్శనము మరల లభించును. కావున వానికి పునర్జన్మమునందు జుగుప్స కలుగదని భావము.

మూ॥ కాఞ్చీరమణ్యాః కురుతాం గృహస్థే
క్వాణైర్ముదం కామపి కిఙ్కిణీనామ్
కాఞ్చీభువః పుణ్యపురీ యతీన్ద్ర
త్వా మమ్బికానామరనైగ్రహోతు॥ ౧౦॥

గృహస్థునకు- తనప్రియురాలి కాంచి-(మొలనూలు)— కింకిణీక్వాణములచేత అనిర్వాచ్యమగుప్రీతిని కలిగించుఁగాక. ఓయతీంద్రా!

భూదేవికి కాంచియగు కాంచి (కాంచియను పుణ్యనగరి) కామా
క్షీనామధ్వనులచేత నిన్ను సంతోషింపఁజేయునుగాత!

ప్ర. భ:—దక్షిణదేశమున కాంచీక్షేత్రమున్నది. తదధీశ్వరి-కామాక్షి.
పంచభూతక్షేత్రములయందిది పృథివీక్షేత్రమని చెప్పుదురు.

అవ:—ఇట్లు దక్షిణదేశస్థలముల నభిస్తుతించి ఆంధ్రదేశస్థల
మగు శ్రీకాళహస్తిక్షేత్రమును గానముచేయుచున్నాఁడు.

మూ॥ శ్రీకాలహస్తిస్థలదర్శనస్య
కైలాసవీక్షాం పునరుక్తిమాహుః।
జ్ఞానం ప్రదాతుం చరణాశ్రితేభ్యో
జ్ఞానామ్బికా యత్రనిబద్ధదీక్షా॥ ౧౧

క్షేత్రమాహాత్మ్యము నెఱిఁగినపెద్దలు—కైలాసదర్శనముకంటె
శ్రీకాళహస్తిక్షేత్రదర్శనము వేరుకాదని చెప్పుదురు. అచ్చట నిజ
చరణశరణులగు పుణ్యపురుషులకు జ్ఞానమునొసఁగుటకు జ్ఞానాంబిక
దీక్ష వహించుచుండును.

ప్ర. భ:—శ్రీకాలహస్తిక్షేత్రదర్శనమనినను, కైలాసదర్శనమనినను, ఒక్క
టియే. ఆక్షేత్రమున కధీశ్వరియగు జ్ఞానాంబిక-భక్తులకు మోక్షమునిచ్చుటకు ధృత
వ్రతయై యున్నది. ఈక్షేత్రము-వాయుక్షేత్రమని విశ్రుతమగుచున్నది.

మూ॥ శ్రీశైలశృఙ్గస్య విలోకనేన
సఙ్గేనహీనో భవితా మనుష్యః
ధామాస్తి యత్ర భ్రమరాలకాయాః
శాన్తభ్రమం తద్భ్రమరామ్బికాయాః॥ ౧౨॥

దత్తమండలమనుపేరుగల ఆంధ్రదేశభాగమున ప్రసిద్ధమగు
శ్రీశైలశిఖరమును సందర్శించినమనుష్యుఁడు-నిస్సంగుఁడగును. అది-
భ్రమరాలకయగు భ్రమరాంబిక నివసించు భ్రాంతివివర్జితమగుస్థాన
మగుచున్నది.

ప్ర. భ:—శ్రీశైల క్షేత్రాధీశ్వరి-భ్రమరాంబిక.

అవ:—పశ్చిమసముద్రతీరమునందలి యుత్తరకేరలభాగము నందున్న గోకర్ణక్షేత్రమున విరాజమానయగు భద్రకర్ణీదేవియొక్క మహిమను ప్రశంసించుచున్నాఁడు.

మూ॥ తీరే విపశ్చిద్వరపశ్చిమాబ్ధే
ర్గోకర్ణగాం లోకయభద్రకర్ణీమ్।
బుద్ధిం శివాం సర్వమనోరథానాం
సిద్ధిం చ యద్యస్తి మనోఽధిగన్తుమ్॥ ౧౩॥

ఓ విద్వదగ్రణీ! కల్యాణమయియగు బుద్ధిని- సర్వమనోరథ సిద్ధిని-గూడ పొందుటకు నీకు మనస్సుకలిగినయెడల పశ్చిమసముద్ర తీరమునందలి గోకర్ణక్షేత్రమున నివసించిన భద్రకర్ణీనామమున ప్రసిద్ధయగు కాలిని- వీక్షింపుము.

అవ:—మహారాష్ట్రదేశగతమగు కరవీరక్షేత్రమును ప్రశంసించుచున్నాఁడు.

మూ॥ ధామ్ని ప్రసిద్ధే కరవీరనామ్ని
పుణ్యాభిధానాం కృతసన్నిధానామ్।
దేవీం పరాంపశ్యతి యో విరక్తో
ముక్తేః స పాణిగ్రహణాయశక్తః॥ ౧౪॥

'కరవీర' నామమున ప్రసిద్ధమగు క్షేత్రమున సాన్నిధ్యము ననుగ్రహించిన, పుణ్యాభిధాన(పవిత్రమగు నామముగలది లేక 'పుణ్యా' అనుపేరుగలది) అగు పరాదేవిని- విరక్తుఁడగునెవ్వఁడు—చూచునో, అతఁడు—ముక్తి(కాంతా) పాణిగ్రహణమునకు యోగ్యుఁడగును.

మూ॥ జ్ఞానేద్యృధా తే యది కాఽపి కాఙ్క్షా
నాఽనేహసం మిత్ర! ముధాక్షిపేమమ్।
సేవస్వదేవీం తులజాపురస్థాం
నైవస్వరూపాదితరాకిలేయమ్॥ ౧౫॥

మిత్రమా! నీకు జ్ఞానమునందు దృఢమగు వాంఛయున్న యెడల గడచుచున్న యీకాలమును వ్యర్థము నొనర్పకుము. తులజాపురమునందున్న దేవిని సేవింపుము. ఈయమ్మ- ఆత్మస్వరూపము కంటె వేరుగాదట!

ప్ర భ:—సర్వమును నాత్మకంటె నితరముగాక విరాజిల్లుచున్న తులజాపురస్థయగు దేవిని భజింపుమని యర్థము.

అవ:—ఉత్కలదేశమునందున్న రెండుస్థలములను స్తుతించుచున్నాఁడు

మూ॥ గోపాలినీవేషభృతం భజస్వ
లీలాసఖీంతాం భువనేశ్వరస్య
ఇష్టం హృదిస్థం తవహస్తగంస్యాత్
కష్టంచ సంసారభవం నభూయః॥ ౧౬॥

గోపాలినీవేషమును ధరించునదియు, (ఉత్కలదేశమునప్రసిద్ధుడగు) భువనేశ్వరునకు లీలాసఖియు, నగు ఆదేవిని భజింపుము. నీహృదయమునందున్న యభీష్టము- హస్తగతమగును. (ఫలించును) జననమరణభ్రమరూపమగు సంసారమునుండి, యుద్భవించునదియగు కష్టము- నీకు మరల కలుగదు.

ప్ర భ:—గోవులను కాచు తరుణీమంటిరూపమునుధరించి, గోపాలినీనామమున ప్రసిద్ధురాలగు పరమేశ్వరి- భువనేశ్వరక్షేత్రాధీశ్వరియని తెలియునది.

మూ॥ ఆరాధ్యతే వైతరణీ తటస్థా
యేనేయ ముఖ్యా విరజోఽభిధానా
ఆరాధితం తేన సమస్తమన్యత్
సారోద్ధరాయా మయమార్యగీతః॥ ౧౭॥

వైతరణీనదీతీరమునందధివసించిన విరజోఽభిధానయగు, (విగతమగురజస్సుగలదియనుపేరుగల) ఈవిరజోదేవిని-ఎవఁడారాధించునో, వాఁడు-తదితరమగు సర్వమునుగూడ నారాధించినవాఁడగును, విరజో

దేవీభజనమే భూమియందు సారమని యార్యులచేత గానము చేయఁబడినది.

ప్ర భ:—విజ్ఞులు-విరజాదేవిభజనమే సర్వసారమనియు, తదితరమంతయు నిస్సారమనియు, చెప్పుచుందురనియు, విరజాదేవి—సర్వస్వరూపిణి కావున నామె నారాధించుట- సర్వమును ఆరాధించుటయే, యనునదియు భావము తెలియునది

అవ:—వంగ దేశమునందలి క్షేత్రమును ప్రస్తావించుచున్నాఁడు.

మూ॥ సఙ్గీయమానం స్థలమార్యబృన్దై
ర్వృన్దారకాణాం సరిత స్తటేఽస్తి।
యః కాలికాం పశ్యతి కాలకేశీం
తత్రాస్య కాలాదపి నైవ భీతిః॥ ౧౮॥

ఆర్యసంఘములచేత సంకీర్తింపబడుచున్న క్షేత్రము- దేవనదీ (గంగా) తీరమునందున్నది, ఆస్థలమునందున్న కాలకేశియగు (నల్లని జుట్టుగల) కాలిని సందర్శించిన భాగ్యశాలికి- కాలుని (మృత్యువు) వలనఁగూడ భీతికలుగదు.

ప్ర భ:—మృత్యువువలనఁగూడ భీతి కలుగనివానికి తదితరమువలన భీతి కలుగనేరదు. కావున కాళీదర్శనవంతుఁడు—అకుతోభయుఁడగునని భావము.

అవ:—కామరూపదేశమునందున్న కామరూపక్షేత్రమును కీర్తించుచున్నాఁడు.

మూ॥ నీలాచలం సిద్ధసమూహసేవ్యం
లీలానికేతం ప్రవదన్తి యస్యాః।
భద్రా పరా కాచన గృహ్యాముద్రా
కామేశ్వరీ సా భువనస్య మూలమ్॥ ౧౯॥

సిద్ధగణసేవ్యమగు నీలాచలక్షేత్రమును- దేవికి—లీలాభవనమని పండితులు చెప్పుదురు. ఒకానొకరహస్యచిహ్నరూపముద్రయగు భద్రయు, పరయు, అగు ఆకామేశ్వరి— ప్రపంచమునకు మూలమగుచున్నది.

ప్ర భ:-సర్వజగత్తునకును 'దేవియే జన్మస్థల'మని సూచింపఁజేయుటకు తాంత్రికులు-ఆమెను గుహ్యముద్ర (యోనిముద్ర) అని చెప్పుదురని భావము.

అవ:—మగధదేశమునందలి క్షేత్రమును కీర్తించుచున్నాఁడు.

మూ॥ మాంగల్యగౌరీపదదర్శనస్య
కర్తా తుభూత్వా సుకృతస్యభర్తా।
ఆచారపూతైరధిగమ్యమగ్ర్యం
స్థానం ప్రపద్యేత యతో న పాతః॥ ౨౦॥

మాంగల్యగౌరీ (మంగళమయియగు గౌరీదేవి) పాదదర్శనకర్త- సుకృతభర్తయై, సదాచారపవిత్రులగు పురుషులచేత అధిగమ్యమగు శ్రేష్ఠస్థానము నొందును. ఆస్థానమునుండి పతనము కలుగదు.

ప్ర భ:—మంగలగౌరీపదదర్శనకర్త - సదాచారపూతులగు పురుషులచేఁ బొందఁదగినదియు, పునఃపతనము లేనిదియునగు పరమపదము నొందునని భావము.

అవ:—ఉత్తర దేశమునందున్న స్థలద్వయమును ప్రస్తావించుచున్నాఁడు.

మూ॥ వారాణసీ శుభ్రగిరే రనూనం
క్షేత్రం పవిత్రం భువనత్రయేఽపి।
అర్థే ప్రజానాం విధృతాన్నపాత్రా
గౌరీస్వయం యత్రవిశాలనేత్రా॥ ౨౧॥

వారాణసీక్షేత్రము- త్రైలోక్యమునందునుగూడ- పవిత్రము. శుభ్రగిరియగు కైలాసముకంటె నది తక్కువదిగాదు. ఆపవిత్రక్షేత్రమునందు విశాలనేత్ర (విశాలాక్షి) యగు గౌరీదేవి-ప్రజలను పోషించుటకు స్వయముగా, అన్నముతోనిండిన పాత్రనుధరించి-అన్నపూర్ణయై విరాజిల్లుచున్నది.

మూ॥ బృన్దారకారాధితపాదపద్మాం
నన్దామిమామిన్దుసమానవక్త్రామ్।

ఆలోక్యవిన్ధ్యాచలవాసినీం నా
నాలోచయేత్ సంసృతితో భయాని॥ ౨౨॥

బృందారకులచేత- ఆరాధింపఁబడు పాదపద్మములుగలదియు, ఇందుసుందరముఖియు, వింధ్యపర్వతవాసినియు, భగవతియు, అగు ఈనందాదేవిని- సందర్శించిన నరుఁడు- సంసారమువలని భయము నెఱుఁగడు.

ప్ర భ:—వింధ్యపర్వతము నందున్న నందాఖ్యయగుమూర్తి నీక్షించుటవలన సంసారభీతి- తొలఁగునని భావము.

అవ:—మాలవదేశమునందున్న అవంతీపురీశ్వరిని స్తుతించుచున్నాఁడు.

మూ॥ ఆనన్దదేహా మిహాముక్తి సంజ్ఞాం
నారీం పరీరబ్ధు మనా మనుష్యః
దూతీం వృణోతు ప్రమథేశ్వరస్య
కాన్తా మవన్తీపురనాయికాంతామ్॥ ౨౩॥

ఆనందమేయగు దేహముగల 'ముక్తి' అను సంకేతము గల నారిని, ఈలోకమునందే పరీరంభించుటకు మనస్సుగల నరుఁడు- ప్రమథగణేశ్వరుఁడగు శివుని కాంతయగు, ఆయవంతీపురీశ్వరిని- దూతినిగాఁ గోరునుగాత!

ప్ర భ:—ముక్తినారిని కామించిన పురుషునకు- ఆమెతోడి కలయికనుగూర్చుటకు భగవతియగు అవంతీపురీశ్వరి దౌత్యకర్మమును నెరపునని తాత్పర్యము. మోక్షముఁగోరినవాని కీయవంతీపురీశ్వరి-మోక్షమునే యొసగునని భావము.

అవ:—కైలాసమును స్తుతించుచున్నాఁడు.

మూ॥ యత్రాచలచ్ఛిద్రిక్రతా సహాసం
భ్రాత్రాముహుః ఖేలితవాన్ వనేషు।
తం సిద్ధదేవర్షినుతం స్మరామి
కైలాసమావాసగిరిం జనన్యాః. ౨౪

ఈ కైలాసమునందలి వనములయందు, పర్వతమునకు రంధ్రము కావించిన (ప్రాపకుండగు) సుబ్రహ్మణ్యునితోఁగూడి గణపతినగు నేను నిత్యమును ఆడుకొంటినో, సిద్ధులచేతను, దేవతలచేతను, ఋషులచేతను స్తుతింపఁబడుచున్నదియు, తల్లియగు పార్వతి - నివసించునదియు, అగు ఆ కైలాసపర్వతమును ధ్యానించుచుందును.

అవ. — స్తబకము నుపసంహరించుచున్నాఁడు.

ఉపా॥ ప్రసన్నామ్బరే శీతకరేఽధికారం
బిభ్రత్యగేన్ద్రే ధవళే సలీలా।
క్షేత్రేషు కాశ్యాదిషు గుప్తశక్తి
ర్గౌరీన్ద్రవజ్రాసుచ సన్నిధత్తామ్. ౨౫

తెల్లనిదగు హిమాచలేంద్రమునందు లీలతోఁగూడినదై, ప్రసన్నమగు ఆకాశముగల శీతకరునియందు (చంద్రునియందు) స్వీయమగు నధికారమును ధరించుచు, (ఆచంద్రునికంటెనుగూడ అధికమగు శోభగలదై) కాశ్యాది క్షేత్రములయందు గుప్తమగు శక్తిగలదగు గౌరీదేవి- ఇంద్రవజ్రావృత్తనిబద్ధములగు ఈస్తుతులయందుఁగూడ-(కాశ్యాదుల యందువలెనే) సాన్నిధ్యమును నొసఁగుఁగాత !

ప్రయో:— ఈస్తుతులు దృష్టఫలకములును, వీర్యవంతములును, అగుఁగాత!

ఇది సవ్యాఖ్యమగు పంచవింశస్తబకము.



ఓం నమో భగవతే శ్రీరమణాయ, శ్రీ శాంత గురవే నమః.

# ఉమా సహస్రము

షడ్వింశ స్తబకము [ఇరువది యారవ శతకము]

సప్తమశతకమున రెండవ స్తబకము.

అవ:—ఈ యిరువదారవ స్తబకమున, అరుణాచలక్షేత్రమున ప్రసన్నయగు అపీతకుచాంబికను స్తుతించుచున్నాఁడు.

మూ॥ అగమవిన్మతికైరవిణీనాం
బోధమజస్రమసౌ విదధానః ।
పాతు మహేశవధూవదనేందో
హాసశశీసకలానికులాని. ౧

వేదాదులగు ప్రమాణశాస్త్రజ్ఞుల బుద్ధులనుకలువపూవులకు- నిత్యము, బోధమును, వికాసమును, కలిగించు మహేశ్వరీ ముఖమండల కలయగు హాసచంద్రుఁడు కులముల నన్నింటిని రక్షించుఁగాత!

ప్రశ్న:—ఇచ్చట 'హాసచంద్రుఁడు' అనుచోట 'హాసమే యగు చంద్రుఁడు' అని [illegible] శ్రయణమువలన [illegible] కార మగు [illegible] పమున పరిణామము నొందనయెడల— [illegible]

ప్రశ్న:—'హాసము-చంద్రునివలె' అని ఉపమితసమాసాశ్రయణమువలన పూర్వపదమగు హాసమునకు ప్రాధాన్యము కలుగదా?

ఉ:—''ఉపమితం వ్యాఘ్రాదిభిస్సామాన్యాప్రయోగే'' అను వ్యాకరణానుశాసనమువలన సామాన్యధర్మము ప్రయోగింపఁబడనప్పుడే, ఉపమితసమాసమాశ్రయింపవలయును. ఇచ్చట 'బోధమును కలిగించువాఁడని సామాన్యధర్మము ప్రయోగింపఁబడినది. కావున ఉపమితసమాసము నాశ్రయింపఁగూడదు. కావున ఉత్తరపదమును విషయముగ చంద్రునకు ప్రకృతోపయోగమునకు హాసరూపమున పరిణామమును వారించుటకు శక్యము కానేరదు. [illegible] రూపకమే - అలంకారము.

మూ॥ ఆయతలోచన చుమ్బితకర్ణా
దానయశోజిత తోయదకర్ణా
శోణనగేశమనః ప్రియవర్ణా
నాశయతాజ్జగదార్తి మపర్ణా. ౨

శ్రోత్రములను చుంబించుచున్న దీర్ఘములగు లోచనములు గలదియు, దానముచేతఁ గలిగిన యశస్సుచేత- తోయదమువంటి కర్ణుని జయించినదియు, అరుణాచలేశ్వరుని మనస్సునకు ప్రియమగు వర్ణము (రాగము) గలదియు, అగు అపర్ణ (దుర్గ) జగత్తునందలి యార్తిని తొలఁగించుఁగాత!

ప్ర ఘ:—ఆకర్ణాంత విశాలనేత్రయు, కర్ణయశోతిశాయినియు, అరుణాచలేశ్వర హృదయరంజనియు, అగు మహాదేవి— లోకమునందలి పీడను ధ్వంసమొనర్చుఁగాతమని తాత్పర్యము.

మూ॥ వేదతురఙ్గవిలోచనభాగ్యం
వేదశిరోనిచయై రపిమృగ్యమ్
శోకవిదారి సుధాకిరణాస్యం
శోణగిరౌ సమలోకి రహస్యమ్॥ 3

వేదములు గుఱ్ఱములుగాఁగల శివునియొక్క- నేత్రములకు భాగ్యమును, వేదశిరో (వేదాంత) నివహములచేత(ఉపనిషత్తులచేత) మృగ్యమును, శోకమును విదళించునదియగు సుధాంశుని వంటి ఆస్యముగలదియుఅగు 'రహస్యమును' (గూఢమగుతత్త్వమును) నేనరుణాచలమునం దవలోకించితిని.

ప్ర ఘ:—భాగ్యమనఁగా: పుణ్యఫలము. మృగ్యమనఁగా: వెదుకఁదగినది. రహస్యమనఁగా, పరమేశ్వరీస్వరూపము. ఈమహాయోగి నిగూఢమగు పరమేశ్వరీస్వరూపము నరుణాచలమున సందర్శించెనని భావము.

మూ॥ ముఞ్చసమస్త మనోరథలాభే
సంశయమద్య కరామలకాభే

దృక్పథమాప నగేన్ద్రతనూజా
సోఽహమితః పరమన్తరరాజా॥　　౭

ఓ మనసా! నగరాజకుమారి నాదృష్టిపథము నొందినది. (సాక్షాత్కరించినది) కావున సర్వమనోరథలాభము-నీకు హస్తామలకము. కావున నిప్పుడు సమస్తకామసిద్ధివిషయమున సంశయము నుడుగుము. నేనిఁక ముందుహృదయరాజునగుచున్నాను.

ప్రభ:—హస్తామలకము=చేతియందున్న యుసిరికపండువంటిది. సర్వకామప్రాప్తి-సులభసాధ్యమని భావము. 'హస్తామలకమునందున్నది' అను లోకోక్తి నిచట నుపయోగించుటవలన నిది— లోకోక్త్యను నలంకారమగుచున్నది. 'హృదయరాజు నగుచున్నాను' అనఁగా 'హృదయమును శాసించువాఁడ నగుచున్నాను.' అనియు 'హృదయము- రాజుగాఁ గలవాఁడ నగుచున్నాను' అనియు అర్థద్వయము నెఱుఁగునది. నేనిఁక బాహ్యవశంగతుఁడనై యితరుల కధీనుఁడనగు వాఁడనుగానని భావము. సాక్షాత్కారమే దీనికిఁగూడ— హేతువని గ్రహింపనగును. ఇందు పుష్కరమగు సమస్తమనోరథలాభము—సమర్థనము నపేక్షించుచున్నది. పార్వతీ దర్శనలాభముచే నది సమర్థింపఁబడినది. కావున నిది వాక్యార్థహేతుకమగు కావ్యలింగాలంకారమని తెలియునది.

మూ॥ శిల్పవిదః ప్రతిమాం ప్రవిశన్తీ
స్వల్పవిదాం తరణాయ చకాస్తి
శోణధరాభృతి సమ్ప్రతి లబ్ధా
హన్త! చిరాదియమేవ మమామ్బా॥　　౮॥

శిల్పకలావిదునిచేత నిష్పాదితమగు ప్రతిమయందు స్వీయమగు అంశముచేత ప్రవేశించిన పరమేశ్వరి- వేద—వేదాంతాదిపాఠముల చేత సంస్కృతబుద్ధులుకాని మందజ్ఞానులను జననమరణప్రవాహము నుండి తరింపఁజేయుటకై వెలయుచున్నది. చిరకాలమునుండియు తెలియఁబడని యీయమ్మయే-అరుణాచలమునందిప్పుడు నాకు సాక్షాత్కరించినది. ఆశ్చర్యము!

ప్రభ:—ఈయమ్మ నెఱుఁగకయే యింతకాలమువఱకు జీవితమును వ్యర్థముగాఁ గడపితిని. ఇప్పుడెఱిఁగి-కృతకృత్యుఁడనైతినని భావము.

మూ॥ భారతభూతలయోగ్యక్షేత్రవితానే
సన్త్యపరాణి బహూన్యపి గృహాణి
అస్త్వవినీతసుధాకరబిమ్బా
శోణగిరావుత వేశ్మసమమ్బా॥ ౬॥

భారతభూతలమునందు దేవి నివసించుటకు అనేకములగు నాలయములుండిన నుండుఁగాక! అయినను— ఈయరుణాచలమునందే. చంద్రబింబమును నిందించు ముఖబింబముగల మాయమ్మ— యుమాశక్తి వసించుచున్నది.

ప్రభ:— భారతభూమియందు పావనములును, రమణీయములును, అగు దేవ్యాలయము లనేకములుండవచ్చును. అయినను ఈ యరుణాచలమునందే యాపరమేశ్వరి— పూర్ణచంద్రముఖబింబముతో వెలయుచున్నదని భావము.

మూ॥ వారితసంశ్రితపాతకజాలా
వారిధివీచినిరంకుశలీలా
వారిజపత్త్రవిడమ్బననేత్రా
వారణరాజముఖేన సపుత్రా॥ ౭॥

ఆశ్రితజనుల పాపజాలమును నివారించునదియు, సముద్రోర్ములవలె నిరంకుశములగు లీలలుగలదియు, కమలదళముల నుపహసించు నేత్రములు గలదియు, గజముఖునిచేత పుత్రవతియు, (అగుతల్లి మాకు శరణము.)

ప్రభ:— మొదటి శ్లోకార్థమునకు తరువాతి శ్లోకార్థముతో నన్వయము నెఱుంగునది.

మూ॥ ఆయతవక్రఘనాసితకేశీ
తోయజబాణరిపోర్హృదయేశీ
కాశసుమాచ్ఛయశాః పరమైషా
పాశభిదస్తుతవేన్దువిభూషా॥ ౮॥

దీర్ఘ—కుటిల—సాంద్ర—కృష్ణ—కేశములుగలదియు, కమలపుష్ప బాణుఁడగు మన్మథునికి శత్రువగురుద్రునికి హృదయేశ్వరియు, కాశ

(రెల్లు) పుష్పమువలెఁ దెల్లనిదగు కీర్తిగలదియు, చంద్రుఁడు శిరో
భూషణముగాఁగలదియు శ్రేష్ఠయు నగు నీజగదంబ— నీయొక్క పాశ
మును ఛేదించుఁగాత!

ప్ర భః—సంశ్రితపాపనివారిణియు, విశృంఖల నవహావోన్మేష విలాపిశాలి
నియు, కమలశోభాతిశాయి నేత్రియు, గణపతిజననియు. దీర్ఘ-కుటిల-సాంద్ర
వినీలకేశియు, కాశకుసుమ శుభ్రకీర్తియు. చంద్రచూడయు, పరమయు అగు జగ
దంబ-అవిద్యకమగు నీజన్మబంధమును ఛేదించుఁగాత' అని పూర్వోత్తరశ్లోకార్థ
సమన్వయమును గ్రహించునది.

మూ॥ పఙ్కజసమ్భవపూజితపాదా
పఙ్కవినాశన పావననామా।
కిఙ్కరకల్పలతా పరమేయం
శఙ్కరనేత్రసుధాశరణం నః॥ ౯

బ్రహ్మదేవునిచేత పూజింపఁబడిన పాదములుగలదియు, పాప
మును నశింపఁజేయునదియగు పవిత్రనామముగలదియు, సేవకులగు
భక్తుల కిష్టార్థముల నిచ్చునదియు, శంకరలోచనముల కమృతాయ
మానయు, అగు తల్లి! మాకు రక్షణమగుచున్నది.

మూ॥ చఞ్చలదృగ్విభవా మరవల్లీ
పఞ్చపృషత్కశరాసనఝిల్లీ
కాఞ్చనగర్భముఖప్రణుతేయం
పఞ్చముఖప్రమదా శరణం నః॥ ౧౦

విలాసవిశేషముచేత చలించుచున్న దృష్టులుగలదియు, పంచ
బాణుని శరాసనమగు (విల్లయిన) భ్రూలతలుగలదియు, హిరణ్య
గర్భాదులచేత ప్రస్తుతింపబడునదియు, పంచముఖుఁడగు పరమేశ్వరు
నకు ప్రమదయు, నగు పరమేశ్వరి- మాకు రక్షణమగుచున్నది.

ప్ర భః—ఈశాన-తత్పురుష-అఘోర-వామదేవ సద్యోజాత - నామములు
గల పంచముఖములుగల పరమేశ్వరుఁడు-పంచముఖుఁడు.

మా॥ అమ్బ! విధూయ భటాన్ మదనాదీన్
నూపురనాదభీషికయైషః।
హన్త! జహార బలేనమనో మే
శోణనగాక్షి్రనివేశిని! తేఽఙ్ఘ్రిః॥ ౧౧

అమ్మా! శోణాచలపాదప్రదేశవాసినీ! నీయీపాదము-నూపుర నాదబిభీషికచేత (పాదకటకధ్వనిచేత) కామాదులగు భటులను తొలఁగించి, స్వయముగానే నామానసమును బలముచే నాకర్షించి నది. ఆహా!

ప్ర భ:- మదనాదులచేత రక్షింపఁబడిన నామనస్సు-నీపాదము నొందుటకు నిరవకాశమై యుండెను. నీపదకటక ధ్వనిచేత-వారిని తరిమివైచి, తథావిధమగు నామానసమునపహరించితివి! నీ పాదమహిమ-ఎంతయాశ్చర్యదాయకము! అని భావము.

మా॥ కర్ణపుటే కురుముగ్ధ! మమోక్తిం
ముఞ్చధనాదిషు మానససక్తిమ్।
శోణగిరీంద్రవధూపదభక్తిం
శీలయశీలయ యాస్యసిముక్తిమ్॥ ౧౨

మూఢమానసమా! నామాటవినుము, ధనకాంతాదివిషయ భోగములయం దాసక్తి నుడుగుము. (సంగము విడువుము) అరుణా చలేశ్వరవధూపదభక్తిని ఆచరింపుము. ఆచరింపుము. మోక్షము నొందుదువు.

మా॥ జీర్ణతరే జరయాఖిలదేహే
బుద్ధిబలంచ విలుమ్పతిమోహే
హన్త! సవిత్రి! తపస్మృతిరన్తే
సేవితుమిచ్ఛతి నా చరణం తే॥ ౧౩॥

సవిత్రి! శరీరమంతయు వయోవృద్ధిరూపమగు ముసలితనము చేత-మిక్కిలి జీర్ణమగునపుడు, మోహము- (జ్ఞానలోపము) బుద్ధిబల మును క్షీణింపఁజేయునప్పుడు, దేహావసానసమయమున, అయ్యో!

పశ్చాత్ తాపార్తమగు బుద్ధిగల మర్త్యుఁడు- నీచరణమును సేవింపఁ గోరుచుండును.

ప్ర భా:—శరీరేంద్రియములు బలిష్ఠములై యున్నపుడు ప్రాయశః మనుష్యునకు నీచరణసేవ యందాసక్తి కలుగుటలేదు. ఇది శోచనీయమయిన కష్టమని భావము.

మూ॥ తన్త్రవిదో నవయోనితు చక్రం
శోణధరాధరరూపముశన్తి।
అర్ధమముష్య వపుర్మదనారే
రర్ధమగేన్ద్రసుతే! తవగాత్రమ్॥ ౧౪॥

తంత్రవిదులు (శాక్తాగమముల నెఱిఁగినవారు) నవయోనియగు శ్రీచక్రమునే- అరుణాచలరూపమునుగా చెప్పుచున్నారు, పార్వతీ! శ్రీచక్రరూపమగు నీయరుణగిరియందలి యర్ధభాగము- శివశరీరము. అర్ధభాగము- నీశరీరము.

ప్ర భా:—తంత్రశాస్త్రములయందు శ్రీపురమని విశ్రుతమగు శ్రీచక్రమే- అరుణాద్రిరూపమున విరాజిల్లు చున్నదని చెప్పుచున్నారు. ఆయరుణాచలమునం దర్ధభాగము నీవును, అర్ధభాగము-శివుఁడును, అనుదురని కూడ చెప్పవలసియున్నది. శ్రీచక్రమంతయుఁగూడ_నీశరీరము కానట్లు, అరుణాచలమంతయు-శివశరీరము కాదు.

చతుర్భిః శివచక్రైశ్చ శక్తిచక్రైశ్చ పఞ్చభిః
నవయోన్యాత్మకం చక్రం శ్రీచక్రం శివయోర్వపుః ॥

'నాలుగు శివచక్రములతోడను, అయిదు శక్తి చక్రములతోడను, గూడి-నవయోనిస్వరూపమగు చక్రమగు శ్రీచక్రము- ఉమామహేశ్వర శరీరము'' అను ప్రమాణమువలన- శ్రీచక్రమేయగు అరుణాచలమంతయు శివశరీరమనుట సత్యము కానేరదు. అందు నీశరీరభాగముకూడ నున్నదని భావము.

మూ॥ అస్తు నగేశ్వరనన్దిని! లిఙ్గం
తైజసమేతదిహాపి తవాంశః।
పీతగుణస్య వినాతవ యోగం
దేవి! శివస్యకుతః ఖలు తేజః॥ ౧౫॥

ఓనగరాజనందినీ! 'కాంచి' మొదలగు పంచభూతక్షేత్రముల యందు- అరుణాచలమనునది- తైజసలింగమగుఁగాక! అరుణాచలము

నందేకాక (గిరియందేగాక యీతైజసలింగమునందుఁగూడ- నీభాగ మున్నది. దేవి! పరబ్రహ్మస్వరూపుఁడగుటవలన నిర్గుణుఁడగు శివు నకు నీతోడి యోగము-(సంబంధము) లేనియెడల- తేజస్సెట్లుకలుగును?

(ప్ర ఘః- భారతదేశమున-పృథివ్యాది భూతములయిదింటికిని సంబంధించిన క్షేత్రములయిదు గలవు. అందు దక్షిణదేశమునందున్న అరుణాచలము-తేజోమయ మగుచున్నది. అరుణాచలమన-ఎఱ్ఱనికొండ. ఈకొండకు క్రిందిభాగమున అరుణా చలేశ్వరాలయముగలదు. ఆపర్వతము-పరమేశ్వరస్వరూపమే. దానిక్రిందనున్న యాలయమున, నున్నలింగము-పురాణములయందు తైజసలింగమని చెప్పఁబడు చున్నది. ఆపర్వతమునందు మాత్రమే కాక- ఆతైజసలింగమునందుఁగూడ- పరమే శ్వరి యంశముకలదని సమర్థించుచున్నాఁడు. నిర్గుణుఁడగు పరమపురుషునకు శక్తి యోగమువలననే సగుణత్వము కలుగును. తేజస్సు-గుణము. కావున- తైజసమగులిం గము-గుణి (గుణముగలది) యగును. గుణమగు తేజస్సు లేనియెడల-గుణియగులింగము తైజసము కానేరదు. ఇందలి గుణ-యోగ-తేజశ్శబ్దములచేత- "స్పష్టపడనిగుణముగల ద్రవ్యవిశేషమునకు భైషజ్యయోగమున-తేజము (వీర్యము) కలుగును." అను భేషజా ర్థము స్ఫురింపఁజేయఁబడుటవలన-ఉపమ ధ్వనించుచున్నది. 'తైజసలింగమునందలి యర్థభాగము-దేవీశరీరము' అనునంశ మిందు సమర్థనీయము. దీనిని-ఉత్తరార్థమునం దలి వాక్యార్థముచేత-('పరబ్రహ్మ'ఇత్యాదికముచేత)సమర్థించుటవలన, నిది-కావ్య లింగాలంకార మగుచున్నది.

మూ॥ స్థాపితమూర్తిరియం తవనమ్యా
పూజయితుం జగదీశ్వరి! రమ్యా
శోణనగార్థమిదం తవ రూపం
కీర్తయితుం నగజే! ధుతపాపమ్॥ ౧౬॥

జగదీశ్వరి! నమస్కరింపఁదగిన నీయీస్థాపితమూర్తి- అనఁగా, శిల్పులచేత రచింపఁబడిన యీప్రతిమ-పూజించుటకు రమ్యమై యున్నది. పాపముల నూడ్చివైచునదియగు అరుణగిరియందలి యర్థ భాగమగు నీరూపము- కీర్తించుటకు రమ్యమగుచున్నది.

(ప్ర ఘః-కర-చరణాద్యవయవ సుందరమును, శిల్పికృతమును, అగునీమూర్తి- కాయికపూజావిషయమును, పర్వతార్థమగు నీమూర్తి-వాచికపూజావిషయమును అగుచు రమణీయకమైయున్నది-మానసపూజ-ఉభయత్ర గమ్యమగుచున్నది.

మూ॥ శోణనగార్ధతనో ఽనిశమఙ్కే
ధారయసే ఽయి! గుహం రమణాఖ్యమ్।
అగతమప్యయి! హా! ముహురమ్బా
చ్చాటయసే గణపం ననుకస్మాత్॥ ౧౭

అరుణాచలార్థాంగీ! ఎల్లప్పుడును, గుహావతారుఁడగు రమణ మహర్షిని నీయంకమున ధరించుచున్నావు. అమ్మా! మాటిమాటికిని వచ్చుచున్నను గణపతిని ఏకారణముచేతనో దూరముచేయుచున్నావు.

పరి భః—"చిన్నకొడుకగు కుమారస్వామిని (రమణమహర్షిని) తొడయందుఁ గూర్చుండఁజేసికొని లాలించుచున్నావు. పెద్దకొడుకగు గణపతిని (నన్ను) ఏల దూరీకరించెదవు" అని యర్థము. భగవానుఁడగు రమణమహర్షి—అరుణాచలకటకము నధిశయించియున్నాఁడు. (ఇప్పటికిని తత్పాదమును విడుచుటలేదు) "గణపతి మునియో—అప్పుడప్పుడు (మాటిమాటికిని) అచ్చట నివసించుచుండెను." అని తాత్పర్యము.

మూ॥ అఙ్కజుషే రమణాయ ను దాతుం
మానవవేషధరాయ గుహాయ
శోణనగార్ధతనో బహుదుగ్ధం
మాతరపీతకుచేహ విభాతి॥ ౧౮

అరుణగిరీశ్వరార్ధాంగివగు జననీ! మానవవేషధరుఁడును, నీ యుత్సంగము నొందియున్నవాఁడును, గుహుఁడును, (నీపుత్త్రుఁడును) అగు రమణునికి విస్తారమగు స్తన్యము నొసఁగుటకు ఈక్షేత్రమునందు అపీతకుచవై వెలయుచున్నావు కాఁబోలును!

పరి భః—అపీతకుచ యనఁగా, పానముచేయఁబడని కుచములు గలది. అరుణాచలమునందున్న దేవీనామము—అపీతకుచాంబ.

మూ॥ పూర్ణసమాధివశాత్ స్వపిషి త్వం
పీతమపీతకుచేఽమ్బ! న వేత్సి।
అఙ్కజుషా రమణేన సుతేన
ప్రీత్యయథేష్ట మురోరుహదుగ్ధమ్. ౧౯

అమ్మా! సంపూర్ణసమాధివలన, (సకలమగు బాహ్యప్రపంచమును గూడవిస్మరించిన దానివివలె) నిద్రించుచున్నావు; కావుననే, నీయంకమునందున్న పుత్రుఁడగు రమణునిచేత-భవదురోజదుగ్ధము(స్తన్యము) యథేష్టముగాఁజూచి పానముచేయఁబడుటను తెలిసికొనకున్నావు.

మూ. జ్ఞాన రసాహ్వాయ మమ్బ! నిపీయ
స్తన్యమసౌ రమణో మునిరాట్ తే
జ్ఞానమయోఽభవదీశ్వరి! సర్వః
పుష్యతి యేనతనుం హి తదాత్మా॥ ౨౦

అమ్మా! ఈశ్వరీ! మునిరాట్టగు ఈరమణుఁడు-జ్ఞానరసమను పేరుగల నీ స్తన్యమును మిక్కిలి త్రాగి- జ్ఞానమయుఁడై సర్వస్వరూపుఁడయ్యెను. కావుననేజ్ఞానరసాత్ముఁడై దేహమునుపోషించుచున్నాఁడు.

మూ॥ ప్రీతిపదాయ పయోధరకుమ్భాత్
పార్వతి! ధీమయదుగ్ధమపీతాత్
అస్తుగుహాయశివే బహుదత్తం
కిఞ్చిదివేశ్వరి! ధారయమహ్యమ్. ౨౧

పార్వతీ! అపీతమగు (పానముచేయఁబడని) కుచకుంభము నుండి-బుద్ధిమయమగు (జ్ఞానరసమయమగు) దుగ్ధమును-ప్రేమాస్పదుఁడగు గుహునికొఱకు (రమణునికొఱకు) అమితముగా నిచ్చిన నిమ్ము. ఈశ్వరీ! నాకొఱకు స్వల్పముగానైనను ప్రసాదింపుము.

ప్ర భ:—నీస్తన్యమును గుహునకు యథేష్టముగానిమ్ము. కాని నాకు స్వల్పముగానైననిమ్ము. 'ఇచ్చుటకుఁగాని, యీయకుండుటకుఁగాని, ప్రభ్వివి నీవే' యని సూచించుటకు—అమ్మాయని సంబోధింపక— 'ఈశ్వరీ' అని సంబోధించెనని గ్రహించునది.

మూ॥ ప్రౌఢమిమం యదివేత్సి తనూజం
శైలసుతే! మదవారి దధానమ్।

మాస్తు పయో వితరానఘమన్నం
యేనదధాని మహేశ్వరి! శక్తిమ్॥ ౨౨

శైలకుమారీ! గజముఖుఁడగుటవలన మదజలమును ధరించు చున్న పుత్రుఁడగు ఈగణపతిని ప్రాఘునిగా (ప్రవృద్ధునిగా) తెలియుదువేని స్తన్యము నీయవలదు. అనఘమును (దోషరహితమును) శ్రేయస్కరమును అగు అన్నమునిమ్ము. మహేశ్వరీ! ఆయన్నముచేత నేను శక్తిగలవాఁడ నగుదును.

ప్ర భ:—"వీఁడు-చంటిబిడ్డ కాఁడు. స్తన్యపానదశ నతిక్రమించి పెరిగిన యువకుఁడని తలంచినయెడల శక్తిధారణ సామర్థ్యము నిచ్చునదియగు అన్నము నిమ్మని భావము.

మూ॥ స్వార్జితమేవ మయా యది భోజ్యమ్।
సమ్మద ఏవ మమాఖిలమాతః!
ఆశిషమగ్ర్యతమామయి దత్వా
ప్రేషయ యాని జయాని ధరిత్రీమ్. ౨౩

విశ్వజననీ! నీవు స్వార్జితమేయగు నన్నమే భుజింపవలయునందువా? అదియు నాకు సమ్మదమేయగును. ఈలోకమునందు నాకు జయప్రదములును, శ్రేష్ఠతమములును, అగు ప్రాస్థానిక మంగళాశీర్వచనముల నొసఁగి నన్నుపంపుము.

మూ॥ విద్యుతి విద్యుతి వీక్ష్యవిలాసా
వీక్షితకర్మణి లక్ష్యరహస్యా।
పార్వణచన్ద్రముఖీ లలితాఙ్గీ
తైజసలిఙ్గసఖీశరణం నః. ౨౪

ప్రతివిద్యుత్తునందును చూడఁదగిన విలాసముగలదియు, దర్శనకర్మయందు (చూచుటయను వ్యాపారమునందు) లక్షింపఁ

దగిన (సూక్ష్మముగాఁ దిలకించుటకుఁ దగిన) రహస్యము గలదియు, పూర్ణచంద్రముఖియు, లలితాంగియు, తైజసలింగమగు అరుణాచలే శ్వరుని ప్రేయసియు, అగుపరమేశ్వరి—నాకు శరణమగుచున్నది.

ప్ర భ:—ఏకొక్క మెరుపువందును దేవీవిలాసమే కాన్పించును. ఆమెకు దృష్టియే-స్వరూపము. కావున దృశ్యమునుండి వేరొనర్చి- రహస్యమగు నామె స్వరూపమును గుర్తింపవలయును. పార్వణచంద్రముఖియు, లలితాంగియు, తైజస లింగసఖియు. అగు నాజగన్మాతయే-నన్ను రక్షించునని భావము.

మా॥ మాతరపీతకుచేఽరుణశైలా
ధీశ్వరభామిని! భామహనీయే
సాధువిధాయ సమర్పయతే తే
దోధకమాల్యమిదం గణనాథః. ౨౫

అరుణాచలేశ్వరభామినీ! ప్రభామహనీయా! అంబా! అపీత కుచా! దోధకవృత్తగ్రథితమగు మాల్యమును(పుష్పమాలను) నిర్దుష్ట మును, గుణశోభితమును అగునట్లు రచించి, గణపతి-నీకు సమర్పించు చున్నాఁడు. (అంగీకరింపుము)

ఇది-సవ్యాఖ్యమగు షడ్వింశ స్తబకము.

(ఇరువదారవ స్తబకము)

ఓం నమో భగవతే, శ్రీరమణాయ.

# ఉమాసహస్రము

## [ సప్తవింశ స్తబకము ]

సప్తమ (ఏడవ) శతకమునందలి మూడవ స్తబకము.

అవ:—'ప్రచండచండి' అనునది ఈమహాకవి కభీష్టయగు భగవతీమూర్తి. ఈ యిరువదేడవ స్తబకమునం దామూర్తిని స్తుతించుచున్నాఁడు.

మూ॥ విధున్వన్ ధ్వాన్తాని ప్రతిదిశమధర్మం పరిహరం
చ్ఛ్రియం వ్యాతన్వానస్సపదిశమయన్ దుఃఖపటలమ్
సహస్రారామ్భోజే ద్రవమసదృశం మే ప్రజనయన్
ప్రచణ్డాయాశ్చణ్డ్యాస్స్మితహసితలేశో విజయతే॥ ౧॥

సర్వదిశలయందును- చీకటులను విరియఁజిమ్ముచు, నిశ్శ్రేయసప్రతిబంధకమగు అధర్మమును (పాపమును) పరిహరించుచు, సంపదనుగలిగించుచు, దుఃఖపటలమును వెంటనే తొలఁగించుచు, నాశిరస్సునందున్న సహస్రారకమలమునందు సాటిలేని యమృతధార నొదవించుచు, ప్రచండయగు చండీదేవియొక్క- తెల్లనిమందహాసము వెలయుచున్నది.

ప్రశ్నోత్తరః:—మిక్కిలి యుగ్రమగు మూర్తిగల ప్రచండచండీదేవియొక్క- శుభ్రమగు మందహాసితము-సకల పురుషార్థ విధాయకమను నంశము-మూలమునందలి పూర్వార్థముచేతను, కవి యనుభూతి-తృతీయపాదముచేతను తెలుపఁబడినది.

అదెట్లనిన-'అధర్మమును పరిహరించుచు' అనుదానిచేత- ధర్మసిద్ధియు, సంపదను గలిగించుచు, అనుదానిచేత- అర్థలబ్ధియు, 'దుఃఖపటలమును దొలఁగించుచు' అనుదానిచేత- సుఖప్రదమగు కామప్రాప్తియు, 'చీకటులను విరియఁజిల్చుచు,'అనుదానిచేత- మోక్షోపయోగియగు ప్రకాశోపలబ్ధియుఁ, దెలుపఁబడినవి. ఇట్లు ప్రభావిశిష్టమగు దేవీమందహాసము - శిరస్సునందలి సహస్రదళకమలమున వెలయుచు

అమృతమును స్రవింపఁజేయుచున్నదని ప్రాఁపుభూతి ప్రదర్శింపఁబడినది. ఇట్లు- ధర్మ-అర్థ-కామ-మోక్ష-ప్రాప్తియు. ప్రాఁపుభూతియు. దేవీశుభ్ర మందహాసిత ప్రభావమునసే లభించినవని ప్రకటింపఁబడెనది.

మూ॥ అరీణాం శ్రోత్రేషు జ్వలితదవకీలిద్రిసదృశం
వినమ్రాణాం శ్రోత్రేష్వమృతకరబిమ్బేనతులితమ్।
విరోధిధ్వాన్తానాం తరుణతరశేషాభిభవహారం
ప్రిచణ్డాయాశ్చణ్డ్యాశ్చరణమసతాం హన్తు విభవమ్ ॥౨॥

శత్రులశిరస్సులయందు- మండుచున్న శ్రేష్ఠమగు దవాగ్నికి సదృశమగునదియు, వినతులగుభక్తుల శ్రోత్రములయందు- అమృతకర బింబముతో తుల్యమగునదియు, విరోధులగు ధ్వాంతములకు (జ్ఞాన ప్రతిబంధకములగు చీకటులకు) బాలార్క-నికంబెను పటుతరమగు నదియు, అగు ప్రిచణ్డచండీచరణము- దుర్జనుల ఐశ్వర్యమును నశింపఁ జేయుగాత!

ప్ర భ:—"భక్తుల శ్రోత్రములయందు- అమృతకరబింబముతో తుల్యమగునది" అనఁగా, "ఉపాసకుల సహస్రదళకమలమునందుండి యమృతమును వర్షించునది" అని యర్థము తెలియుచున్నది. ఇచట-ఒక్కటియే యగుచరణము-అగ్ని-చంద్ర- సూర్యులొనర్చు కార్యముల నతిశయించు కార్యముల నొనర్చునట్లు లేఖించుటవలన- ఉల్లేఖాలంకారమును, అగ్ని మొదలగువానితోడి యుపమానమును దెలుపుటవలన- ఉపమాలంకారమును గలవు. ఈయలంకారములు రెండును- స్పష్టముగాఁ దెలియఁ బడుచు- తిలతండులములవలె, మిళితములై 'సంసృష్టి' అనునలంకార మగుచున్నవని గ్రహించునది.

మూ॥ భజేభాసాం శాలాం నిఖిలధిషణానాం జనిభువం
బలానామాధాత్రీం నిఖిలభువనేన్ద్రిస్యదయితామ్।
భజన్తే యాంగీతైర్మధుసమయమాద్యత్ పికవధూ
కలాలాపాహ్లాద్యైర్యవదనపఙ్కేరుహదృశః॥ ౩॥

వసంతసమయమున మదించిన స్త్రీకోకిలలవలె అవ్యక్తమధుర స్వరములుగల కిన్నరపంకజాక్షుల హృదయంగమములగుగీతములచేత- స్తుతింపఁబడునదియు, జ్యోతులకాశ్రయస్థానమును, లౌకికములును-

శాస్త్రీయములును-అగు సకలశబ్దజాలకును జన్మభూమియు, విద్యా-బుద్ధి- పరాక్రమాదిబలముల నుత్పాదయిత్రియు, సర్వలోకేశ్వర దయితయు, అగు దేవిని- (పార్వతిని) భజించెదను.

ప్ర భ:—మహాకవి కాళిదాసు- కుమారసంభవమున "భిన్దన్తి మన్దాం గతిమశ్వముఖ్యః" అని హిమాలయమునందున్న అశ్వముఖులగు కిన్నరస్త్రీలను వర్ణించియున్నాఁడు. కావున నిట్టి కిన్నరస్త్రీలచేత- సేవింపఁబడినదేవి_ హిమాచలవాసినియగు పార్వతియే యని తోచుచున్నది.

మూ॥ జ్వలన్తి తేజోభిస్త్వన్మహిషమథనే యాతవతను-
ర్లసన్తి లావణ్యైర్గిరిశరమణే యాతవతనుః।
వినా క్రోధప్రీతీ నకిమపి తయోర్భేదకమభూత్
తయోరాద్యా దుర్గా భవతి లలితాన్యా మునినుతే॥ ౪॥

మునిస్తుతవగు దేవీ! మహిషాసురుని మర్దించువిషయమున నీ శరీరము—తేజస్సులచేత (ప్రతాపములచేత) జ్వలించునదయ్యెను. శివరతివిషయమున, నీశరీరము—లావణ్యములచేత విలసిల్లునదయ్యెను. ఈశరీరముల నిట్లు వేరుపఱచినది క్రోధము, ప్రీతియుం గాక, ఇంకేదియుంగూడఁ గానేరదు. ఈమూర్తిద్వయమున మొదటిది దుర్గాదేవి. రెండవది లలిత (గౌరి).

ప్ర భ:—ఒకతివేయగు నీవు క్రోధవిశిష్టవగువపువు-జ్వలన్మూర్తివై దుర్గవును, ప్రీతివిశిష్టవగువపువు_లసన్మూర్తివై లలితవును. అనుట భావము. 'తేజస్సులచేత' అనుచోనున్న బహువచనముచేత, సర్వాంగములనుండియు శత్రుహృదయభేదకమును, రౌద్రతావహమును, అగు ప్రతాపము- విస్తారముగా విజృంభించుట- ద్యోత్యము. అట్లే 'లావణ్యములచేత' అనుచోనున్న బహువచనముచేత - శివరతిపోషకమగు సర్వాంగసౌందర్యవిలసితము-గమ్యము.

మూ॥ సహస్రం భానూనాం భవతి దివసానామధిపతేః
సహస్రం శీర్షాణాంభవతి భుజగానామధిపతేః
సహస్రం నేత్రాణాం భవతి విబుధానామధిపతేః
సహస్రం బాహూనాం భవతి సముద్దామవతి! తే। ౫॥

దివసములకధిపతియగు సూర్యునకు కిరణసహస్రముకలదు. భుజగములకధిపతియగు శేషునకు- శిరస్సహస్రముకలదు. దేవతలకధిపతియగు నింద్రునకు- నేత్రసహస్రముకలదు. హైమవతీ! సమయము (అవసరము) కలుగునప్పుడు- నీకు- బాహుసహస్రముకలదు.

ప్రి భ:—దుష్టశిక్షణసమయము ప్రాప్తించిన కాలమున-నీపరాక్రమము-బహువిధములు విజృంభించునని భావము.

మూ॥ ప్రసన్నో వక్త్రేన్దుర్న చ నయనయోః కోఽప్యరుణిమా।
నకమ్పో బిమ్బోష్ఠే స్మితమపి లసత్ కాశవిశదమ్।
సరోజాభః పాణిః కిణవిరహితః కోమలతమః।
జ్వలచ్ఛూలం త్వాసీజ్జనని! తవ శుమ్భాయ భయదమ్ ॥౬॥

జననీ! నీముఖచంద్రుడు- ప్రసన్నుడు. అచట రోషలాంఛనము కొంచెముకూడ-కాన్పింపదు. నేత్రములయందు క్రోధసూచకమగు నరుణిమ యేదియులేదు. బింబాధరమున క్రోధవ్యంజకమగు కంపములేదు. మందహాసముకూడ- కాశపుష్పమువలె తెల్లనై వెలయుచుండును. కమలసన్నిభమును, కోమలతమమును, అగు పాణి-మాటిమాటికిని ఆయుధమును గ్రహించుటచేతఁ గలిగిన గ్రంథిరూపమగు కిణములులేనిది. అయినను జ్వలించుచున్న నీశూలాయుధము మాత్రము- శుంభునకు భయప్రదమయినది.

ప్ర భ:—ముఖచంద్ర-నయన-బింబాధర-మందస్మిత-పాణికమలము లిట్లు లావణ్యమయములును, ప్రియదర్శనములును, అగుచున్నను-ప్రజ్వలించుచున్న శూలాయుధమొక్కటియే- శుంభునకు భయమును కలిగించెనని భావము. ముఖప్రసన్నతాది సౌమ్యగుణములకు-అనురూపము గాని భయంకరశూలమున కిచట — ప్రసక్తి చెప్పఁబడుటవలన- నిది విషమాలంకార మగుచున్నది. 'అననురూపసంసర్గము—విషమము!' అనునది-రసగంగాధరలక్షణము— ఇచట సమన్వయించును.

మూ॥ వధే శుమ్భస్యాసీత్ తవ జనని! యా కాచన తనుః
దధానా గాత్రైః శక్తీః శశికిరణసానోపమరుచిః।

ఇమాం ధ్యాయం ధ్యాయం స్మరహరసఖి వ్యాకులమిదం
మనోమేవిశ్రాన్తిం భజతి భజతాం కల్పలతికే॥ ౭॥

జననీ! కామారిప్రియసీ! భక్తాభీష్టదాయినీ! శ్రేష్ఠములును, బ్రిహ్మాణీ ప్రముఖములును, అగు శక్తులను భరించుచున్నదియు, చంద్రకిరణసారమగు నమృతముతో నుపమింపఁదగిన శోభగలదియు, అనిర్వాచ్యయగునదియు, అగు ఏ నీమూర్తి- శుంభాసురుని వధించెనో, ఆ యీ (సంపూర్ణ)మూర్తిని, ధ్యానించి, ధ్యానించి, వ్యాకులమగు నాయీ మనస్సు- విశ్రాంతి నొందుచున్నది.

మూ॥ యదిత్వం సంసారే పటురసిసవిత్రి! త్రిజగత
స్తదేతత్ త్వాంయాచే సరసిరుహగర్భాదివినుతే!
ఇమేమే పాప్మానోభగవతి! నదన్తోబహువిధా
స్తదేషుప్రఖ్యాతం ప్రతిభయతమం దర్శయబలమ్ ॥౮॥

త్రిజగజ్జననీ! బ్రహ్మాదిసంస్తుతా! దేవీ! నీవు సంహారకార్యమున సామర్థ్యముగలదానవగునెడల నిన్ను నాబుద్ధియందున్న యీ యభిలాషము నడుగుచున్నాను. భగవతీ! బహువిధములగు నా యీ పాపములు- గర్జించుచున్నవి. కావున వానిని ధ్వంసమొనర్చుటకు, ప్రఖ్యాతమును భయంకరతమమును అగు నీబలమును-ప్రదర్శింపుము.

ప్ర భ:__వీర్యవంతములగు నాయీపాపములను తొలగించు విషయమున- నీ సంహార నైపుణ్యమును ప్రదర్శింపుమని భావము.

మూ॥ బిభేదోరః క్రోధాత్ కనకకశిపో రబ్ధతనయా।
కుచగ్రావోల్లీఢైరతిశితశిఖైర్యః కిలనఖైః।
త్వయాదత్తాశక్తిర్నరహరి శరీరాయజగతాం
వినేత్రేపుంసేఽస్మై జనని! రణరఙ్గస్థలరమే॥ ౯॥

యుద్ధరంగమున విజయధాత్రివగు జననీ! (లక్ష్మీ!) క్షీరసాగర పుత్రియగు లక్ష్మియొక్క- కుచములను శాణోపలములయందు (సానరాళ్ళయందు) ఘర్షితములయినవియు(పదునుచేయఁబడినవియు), కావు

ననే మిక్కిలి వాడియగు శిఖలు (చివరలు) గలవియు, అగు నఖముల చేత-దైత్యనాయకుఁడగు హిరణ్యకశిపునియొక్క వక్షమును-రోషము వలన విదారించిన (చీల్చిన) జగన్నియంత్రుపురుషుఁడగు నరసింహు నకు నీవే శక్తినొసఁగితివట.

ప్ర భ:—హిరణ్యకశిపుని వధించుటకు నరసింహమూర్తికి-నీవే—నారసింహి యనుశక్తి నొసఁగితివి. అయినను లోకమునందలి జనులు-విష్ణువు-హిరణ్యకశిపుని సంహరించెనని చెప్పుదురని భావము.

మా॥ అజేయస్త్రైలోక్య ప్రకటితపతాకః ఫలభుజాం
బిడౌజాయత్ కారాగృహపరిచయీ పఙ్క్తివదనః
సహస్రారం సాక్షాద్ధృత నరశరీరం తమజయత్
త్వదైవావేశేన ప్రియపరశురమ్బ! ద్విజశిశుః॥ ౧౦

అమ్మా! జయించుటకు శక్యుఁడుకానివాఁడును, త్రిలోకములయందును ప్రకటింపఁబడిన జయపతాకగలవాఁడును, మాంస భోజనులగు రాక్షసులకు నాయకుఁడును. అగు దశముఖుని(రావణుని) కారాగారపరిచయముగలవానినిగా నొనర్చినవాఁడును, సహస్రార చక్రముచేత ప్రత్యక్షముగా ధరింపఁబడిన మానవశరీరము గలవాఁడును, అగు కార్తవీర్యార్జునుని- ప్రియమగు పరశువు (కుఠారము) గలవాఁడును, బ్రాహ్మణబాలుఁడును, అగు పరశురాముఁడు- నీ యొక్క ఆవేశబలముచేతనే జయించెను.

ప్ర భ:—సహస్రదళచక్రము - మానుషవిగ్రహమును స్వీకరించి సహస్ర బాహుఁడగు కార్తవీర్యార్జునుఁ డయ్యెను. అతఁడు త్రిలోకవిజయుఁడగు రావణుని కారాగారమున బంధించిన మహాపరాక్రమవంతుఁడు. పరశుధారియగు ద్విజశిశువు పరశురాముఁ డతనిని జయించెను. అపూర్వమగు నీశక్తి—పరశురామునకు, నీయావేశ బలముచేతనే కలిగినదని భావము. "'జమదగ్ని'అను మునియొద్ద నొక కామధేనువుం డెను. కార్తవీర్యార్జునుఁడు దాని నడుగగ నామునీంద్రుఁ డీయఁడయ్యెను. కోపా దృప్తుఁడగు కార్తవీర్యుఁ డతనిని వధించెను. తత్పుత్త్రుఁడు పరశురాముఁడు తత్ ప్రతీకారముకొఱకు మొదట— కార్తవీర్యుని, తరువాత నిరువదియొక్కమారులు క్షత్త్రియవంశమును నిర్మూలించెను.''అను పురాణగాథ నిచట ననుసంధించునది.

మూ॥ త్వదీయా సా శక్తి స్సకలజగదస్తవ్యసనలసా!
పురా కార్యస్యాన్తే తనయమయిహిత్వా స్వపితరమ్!
అవిక్షత్ కాకుత్స్థం దశముఖకులోన్మాథవిధయే
సహస్రాంశుం హిత్వాశశినమివ మున్రేగలతిభాః ॥ ౧౧ ॥

జననీ! సర్వలోకములను నశింపఁజేసియుఁగూడ- విశ్రమింపని నీయాశక్తి- దినాంతకాలమునందు సహస్రాంశుఁడగు సూర్యునివిడిచి- చంద్రునియందు సంక్రమించిన ప్రభవలె, పరశురామునిచేత ప్రతిజ్ఞ చేయఁబడిన క్షత్త్రియవధరూపకార్యము ముగిసినపిదప- క్షత్త్రియశత్రు వగు పరశురాముని విడిచి-కాకుత్స్థుఁడగు శ్రీరాముని- రావణ (రాక్షస) కులధ్వంసముకొఱకు ఆవేశించెను.

ప్రభ:—సాయంకాలమున సూర్యునివిడిచి- చంద్రునాశ్రయించిన వెలుతురువలె, కార్యాంతమున పరశురామునివిడిచి, నీసంహారశక్తి- శ్రీరాము నాశ్రయించెనని భావము. పరశురాముఁడును, శ్రీరాముడును, సమకాలికులును రామాయణకథా ప్రసిద్ధులును అగుచున్నారు. ఈ యిరువురునుగూడ- నవతారపురుషులగుట యెట్లు సంఘటించునను సంశయము-మీదిశ్లోకమున పరిహరింపఁబడినది. అవతార తత్త్వవేత్తయును, నైష్ఠికుఁడును కవియునగు, ఈయాచార్యుని యభిప్రాయమిది- అవతారము లన్నిఁటియందునుగూడ-అవతారపురుషద్వారమున-మహాశక్తియే కార్యమును నిర్వహించుచుండును. భుజబలదర్పాంధులగు క్షత్త్రియులనువధించుటచేత- తపోబలమును ప్రవర్తింపుట-పరశురామావతారముయొక్క కార్యము. ఆ కార్యము ముగిసినపిదప-ఆశక్తి-ధర్మవిద్వేషియగు రాక్షసకులమును నిర్మూలించుటకు రాముని యం దావేశించెను. కావున పరశురాముఁడును, శ్రీరాముఁడును శ్రీమహావిష్ణుని యవతారమూర్తులై వేర్వేరుపనులను గావించుట-సంఘటించుచున్నది. మూలమునందలి కులపదముచేత- రావణునికి సంబంధించిన రాక్షసకులము గ్రహింపఁదగుచున్నది. కాని వాని కుటుంబముమాత్రమే గ్రహింపఁదగదు. ఇచ్చట-"పర్యాయో యది పర్యాయేణైకస్యానేక సంశ్రయః" అను లక్షణమువలన ఒక్కటియేయగు ప్రభ- సూర్యుని, చంద్రుని, నాశ్రయించినట్లు చెప్పుటవలన పర్యాయ మలంకారమగుచున్నది. మఱియు నిచ్చట-బ్రాహ్మణబాలుఁడగు పరశురామునివిడిచి- శ్రీరామునియందు ప్రవేశించిన శక్తికిని- సూర్యునివిడిచి-చంద్రునియందు ప్రవేశించిన ప్రభకును—ఒక యాశ్రయమును విడిచి యింకొకయాశ్రయము నాశ్రయించుట

యను సాధర్మ్యమువలన ఉపమ యలంకార మగుచున్నది. ఇందుపమ—ప్రధానమును, పర్యాయమంగమును, అగుచున్నది. కావునని ది–యంగాంగిభావముచేనగు సంకర మగుచున్నది.

మూ॥ హా తేలోకత్రాతే భగవతి! భవత్యేవ స పురా
మరిః కీర్తింలబ్ధుం చతురమతి రాయాతిసమయే
త్వయాలోకత్రాణేజనని! రచితే రాక్షసవధాద్
యశోఽవాప్తుం విష్ణుర్నిలతిచకుతోఽప్యేషనిపుణః ॥౧౨॥

భగవతీ! లోకవ్రాతమంతయు నీచేతనే సంహరింపఁబడుచుండ- చతురమతియు, త్రిపురాంతకుఁడును, అగుహరుఁడు- ప్రలయకర్త (సంహారకర్త) అనుకీర్తినొందుటకు కార్యావసానసమయమున వచ్చుచుండును. జననీ! రాక్షసవధమువలన నీచేతనే జగద్రక్షణము కావింపఁబడుచుండ, ఏదోస్థానమునుండి నిపుణుఁడగు ఈవిష్ణువు 'లోకరక్షకుఁడు' అనుకీర్తినొందుటకు వచ్చుచుండును.

పరి భః—హరునియందుఁగల సంహారకారిణియగు శక్తియు, విష్ణునియందున్న స్థితికారిణియగుశక్తియు నీవేయగుచున్నావు. లేక ఉభయరూపమగు ఆశక్తి-నీయదియే అనిభావము.

మూ॥ స్వరూపంతే వజ్రం వియతి రజసాం సూక్ష్మమహసా
ముపాధిస్తే స్తోమోభవతి చపలాకాఽపితనుభా।
అరుద్ధా తేవ్యాప్తిర్బలమఖిలదత్తం బలనిధేః
సహస్రాంశః స్వస్యపరిభవసి సమస్తస్యచ శివే!॥ ౧౩॥

శివా! వజ్రాయుధము- నీస్వరూపము. (ప్రకృతి) ఆకాశమునందున్న సూక్ష్మమగు జ్యోతిస్సమూహము-నీయుపాధి. (ఆశ్రయము) మెరుపు- అనిర్వచనీయమగునీశరీరప్రభ. నీసర్వవ్యాపిత్వము—అప్రతిహతము. బలనిధివగు నీయొక్క- సహస్రాంశము- అఖిలవిశ్వమునకును దత్తమగు బలమగుచున్నది. సర్వలోకమునకునుగూడ—నీవు పరిభువవు.

ప్ర భ:—విశ్వముయొక్క ఫలము— జ్యోతిర్మయివి, సర్వవ్యాపినివి, అగు నీయొక్క అమేయబలమునందలి సహస్రాంశమే (అత్యధికమగు భాగమునందలి అత్యల్పభాగమే) అగును. అని భావము.

మూ॥ యతః కాలవ్యాజాత్ పచసి భువనం వైద్యుతమహః—
ప్రభావాత్ కాలీం త్వామయి విదురతః పణ్డితవరాః।
ప్రభోః శస్త్రం భూత్వాదహసి యదరీన్ వజ్రవపుషా
ప్రచణ్డాం చణ్డీం తద్ భగవతి! భణన్త్యక్షయబలే! ౧౪॥

అమ్మా! కాలవ్యాజముగల (కాలమనుమిషగల) విద్యుత్ సంబంధియగు జ్యోతిస్సుయొక్క ప్రతాప విశేషమువలన, భువనమును పక్వముచేయుటవలన విజ్ఞులు నిన్ను కాలివని గ్రహించుచుందురు. అక్షయబలా! భగవతీ! ప్రభువగు (పరమేశ్వరుఁడగు) ఇంద్రునకు నీవాయుధమవై వజ్రరూపమగు శరీరముచేత — శత్రువులను దహింతువు. కావున పండితశ్రేష్ఠులు నిన్ను— ప్రచండవగు చండివని (ప్రచండచండీదేవివని) చెప్పుదురు.

ప్ర భ:—భగవతియగుదేవి కాలమనుసాధనముచేత— సర్వమును పాకము చేయునను ప్రతీతియున్నది. కాని వైద్యుతమగు జ్యోతిః ప్రభావముచేతనే యథార్థముగా పాకము నిర్వహింపఁబడును. కావున పాకము— కాలముచేత నొనర్పఁబడుననునది సత్యము కాదని యుపపన్నమము. కాలీ—కాలగతమగు భేదము— లింగమాత్రమేయని పూర్వోక్తమగు నంశము నిచట స్మరించునది. 'ఇది' పరమైశ్వర్యే, అను ధాత్వర్థము ననుసరించుటవలన "ఇంద్రుఁడే పరమేశ్వరుఁడు, ఆతనిశక్తియగు ఇంద్రాణియే ప్రచండచండి" అనునది కవియభిప్రాయము. మహాకాలుఁడగు రుద్రునిపత్నియగుకాలియు, ఇంద్రుని పత్నియగు ప్రచండచండియుఁగూడ నొక్కతెయే యయినను కార్యభేదము వలన నామభేదమేర్పడినదనిభావము.

మూ॥ అయి త్వామేవేన్ద్రం కథయతి మునిః కశ్చిదజరే!
త్వయాశస్త్రాధ్యంతం భణతి తు పరస్త్వద్విదృషిః
యువాం మాతాపుత్రౌ భగవతి! విభాజ్యౌ న భవతః
తతోఽధీనాం ద్వేధా విబుధజనగోష్ఠీషు గతయః॥ ౧౫॥

నిత్యయౌవనవగు జననీ! ఒకఋషి (తత్త్వదర్శి) నిన్నే యిం ద్రునిగాఁ జెప్పుచున్నాఁడు. ఇంకొక తత్త్వవిదుఁడగుఋషి- ఆయిం ద్రునికి నీవే ఆయుధమని చెప్పుచున్నాఁడు. భగవతీ! శక్తివగునీవును, భగవంతుఁడగు నాయింద్రుఁడును, ఎడబాటులేని మాతాపుత్రులగు చున్నారు. కావుననే విద్వజ్జనపరిషత్తులయందు బుద్ధిగతులు—ద్వివిధ ములగుచున్నవి.

ప్ర భ:—గతిశబ్దముచే నిచట మార్గమని యర్థము. ఒకఋషి—లింగభేదము యథార్థము కాదను తలపున 'నీవే యింద్రుఁడవు' అనఁగా 'పరమేశ్వరుఁడవు' అని చెప్పుచున్నాఁడు. ఇంకొక తత్త్వజ్ఞాని "నీవిం దు్రఁడవు కావున నీవు పరమేశ్వరుఁ డగు నాయింద్రుని శక్తివి." అని చెప్పుచున్నాఁడు. ఇట్లు విద్వజ్జనాభిప్రాయము ద్వివిధమై యున్నదని యర్థము.

మూ॥ వికుర్వాణావిశ్వం వివిధగుణభేదైః పరిణమద్
విధున్వానాభావా౯ భువనగతిరోధాయ భవతః।
వితన్వానాశర్వం చలవదచలం కాచిదవితుం
విచిన్వానాజన్తోః కృతలవమపీశా విజయతే॥ ౧౬॥

పరిణమించుచున్న విశ్వమును సత్త్వాదిగుణతారతమ్యవినిమ యముచేతనగు(గుణ)భేదములచేత పరివృత్తినొందించునదియు,ప్రచం డగమనము నడ్డగింపఁబూనిన భావములను (చేష్టలను) నివారించున దియు,అచలుఁడగు(కదలికలేని)పరమేశ్వరుని చలించువానినివలె విస్తరిం పఁజేయునదియు,జంతువులచే నొనర్పఁబడిన కర్మముయొక్క ఫలలేశమును గూడ రక్షించుటకు గవేషించునదియు, ఇట్టిదని చెప్పుటకు శక్యము కానిదియు, అగు ఈశ్వరి- జయించుచున్నది. (విశేషించి వెలయు చున్నది.)

ప్ర భ:—పరమేశ్వరి- అనిర్వచనీయస్వరూపిణి. ఆయమ్మ- పరిణామియగు జగత్తును నానావిధ గుణభేదవిశిష్టముగాఁ జేయుచు, విశ్వగతిప్రతిబంధకములగు ఆసురచేష్టలను నివారించుచు, చలనరహితుఁడగు స్వీశ్వరుని చలనసహితునివలె నొన రించుచు, ప్రాణుల కర్మలేశమునుగూడ జాగరూకయై వెదకుచు, విభాసించునని యర్థము.

మూ॥ ప్రభాభానోర్యద్వద్ భవసి సకలస్యాపి తపనీ
ప్రచణ్డాశక్తిః సత్యఖిల భువనేశస్య తపతః।
సుధాంశోర్జ్యోత్స్నేవ ప్రమదయసి చేతః ప్రవిశతో
భవస్త్రి భూతాదేర్దహరకుహరం మోదలహరీ॥ ౧౭॥

అమ్మా! సూర్యునికి—ప్రభవలె, సర్వలోకాశ్రయుండగు నీశ్వరునికి నీవు ప్రచండయగు శక్తివై - సర్వలోకమునకునుగూడ తపనశక్తివగుచున్నావు. సుధాంశుని జ్యోత్స్నవలె హృదయాకాశమును ప్రవేశించిన భూతాదియగు (పృథివ్యాదులకుగాని, ప్రాణులకుఁగాని మూలభూతుఁడగు) ఆత్మకు (అంతరాత్మకు) మోదలహరివై, మనస్సును ప్రహర్షింపఁజేయుచున్నావు. సూర్యప్రభవలె ఉగ్రవై శక్తిని ప్రకటించుచున్నావు, చంద్రప్రభవలె సౌమ్యవై ఆనందమును గలిగించుచున్నావు.["అఙ్గుష్ఠమాత్రః పురుషోఽన్తరాత్మా" అని వినఁబడుచున్నదిగదా!]

మూ॥ ప్రచణ్డాగౌరీవాత్వమసి వసురుద్రార్క-వినుతే!
స భీమః శమ్భుర్వా విభురభయదః పాదసుహృదామ్।
తయోరేకంరూపం తవ సహవిభోః ఖేలతి మహా
త్యముష్మిన్నాకాశే ధవలమహసి క్రీడతిపరమ్॥ ౧౮॥

(భూర్భువః స్వర్లోకములకధికారులగు) వసు-రుద్ర-ఆదిత్యులచేత సన్నుతవగు జననీ! నీవు ప్రచండవుగాని, (ఉగ్రవగు చండివిగాని) గౌరివిగాని, (సౌమ్యవుగాని) అగుదువు. పాదబంధువులగు భక్తుల కభయమునిచ్చువాఁడగు ఆయీశ్వరుఁడు- భీముఁడుగాని, (ఉగ్రుఁడుగాని) శంభుఁడుగాని, (సుఖమయుఁడగు సౌమ్యుఁడుగాని) అగును, ఇట్లు- సేశ్వరవగు (విభునితోఁగూడినదానవగు) నీకు-అందు మొదటిరూపము (చండీరూపము) ఈమహాకాశమున ఖేలనమొనర్చుచుండును. రెండవది (గౌరీరూపము) ధవలజ్యోతియగు సోముని యందు విహరించుచుండును.

ప్రభః—సూర్యప్రభవలె ఉగ్రవై శక్తిని ప్రకటించుచున్నావు. చంద్రప్రభవలెసౌమ్యవై ఆనందమును గలిగించుచున్నావు.

మూ॥ విభక్తా యాద్వేధాత్వమపి గగనే శీతమహస
స్తథారమ్యే బింబే జ్వలితలలితస్త్రీ తనువిధా
తయోర్యా ప్రిహ్యాశానే జనని! కతమా మే జననభూః
పురాజన్మన్యాసీ ద్వికటమథవాఽగ్రే విసుషువే॥ ౧౯॥

నీవు ద్వివిధముగా విభజింపఁబడి జ్వలితమగు (ప్రతప్తమగు) స్త్రీ శరీరవిధమువంటి విధముగల చండివి, లలితమగు (కోమలమగు) స్త్రీ శరీరవిధమువంటి విధముగల గౌరివి, అగుచు ఆకాశమునందును- శీతకిరణుని మనోహరబింబమునందును- నివసించుచున్నావు. ఈశ్వరి వగు జననీ! ఆ చండీ-గౌరీమూర్తులయందు- ఏమూర్తి- పూర్వజన్మమున నాకు జన్మస్థానమయినదో చెప్పుము. ఒకవేళ- ఆకాశమునందున్న చండీమూర్తియే వికటనాముఁడనగు నన్నుఁ గన్నదా!

ప్ర భ:—నాజన్మభూమి - చండీగర్భమా? గౌరీగర్భమా? లేక ఆకాశమునందు జ్వలించుచున్న చండియే-'గజముఖుఁడగుటచేత వికటుఁ'డని చెప్పఁబడిన గణపతిని గనినదా? మీఁదిశ్లోకముచేత- దీనికి సమాధానమును దానేచెప్పుచున్నాఁడు.

మూ॥ దృశోర్భేదాద్దృష్టే ర్నభవతి భిదాకాఽపికరయో
ర్నభేదాద్భిన్నంస్యాత్కృత, మభివిమానైక్యవశతః।
భిదాతన్వోరేవం నభవతి భిదాయై తవ శివే!
వియద్దేశే చణ్ద్యాం సితమహసి గౌర్యాంచ భవతీ॥ ౨౦॥

దృక్కులు వేరయినను, దృష్టి యేదియుఁగూడ వేఱుకాదు. (కన్నులు రెండయినను, చూపునందు భేదమేదియులేదు) చేతులు వేరయినను, పనివేరుకానేరదు. శివస్వరూపిణివగు జననీ! ఇట్లు స్వీయమగు ఉత్కృష్టావబోధనముయొక్క- ఏకత్వవశమువలన- వియద్దేశమునందున్న చండియందును, సితకరునియందున్న గౌరియందునుగల శరీరభేదము- నీకు భేదమును కూర్పఁజాలదు.

ప్రభ:—నేత్రములు రెంటికినిగూడ-దర్శనమొక్కటియే యగును. దర్శనమునందు భేదముండదు. హస్తద్వయముచేత నొనర్పఁబడిన కార్యము-హస్తభేదమువలన భేదించునది కాదు. ఇట్లే అభిన్నమగుటవలన నీస్వరూపముకూడ - చండీ-గౌరీ-శరీరభేదముచేత- భేదించునది కాదని భావము. దృక్కులు రెండున్నను, దృష్టులు రెండు కావు. హస్తములు రెండున్నను పనులు రెండు కావు. ఇట్లే-చండీ-గౌరీ శరీరములు- రెండయినను దేవీస్వరూపములు రెండు కావని చెప్పఁబడినది. ఇచ్చట—దృక్కులు రెంటికిని 'దర్శన' మొక్కటియే యగునట్లును, హస్తములు రెంటికిని 'కార్య' మొక్కటియే యగునట్లును, 'చండీ-గౌరీ శరీరములకు శరీరియగు స్వరూప మొక్కటియే' అని యుపమ గమ్యమగుచున్నది. ఇట్లనుటచేత— దర్శనమునకు దృగ్ద్వయమువలె. దేవీస్వరూపమునకు - చండీ-గౌరీ శరీరద్వయము స్వభావసిద్ధమనునంశము స్ఫురింపుచున్నది. "అనుమితికర మగుటవలన సామాన్య-విశేషములచేత ఆలింగితము కానిదియు, ప్రకృతము నర్థము నుపపాదించునదిగా వివక్షింపఁబడినదియు, నగు అర్థము-కావ్యలింగము" అని రసగంగాధరకారులు తెలిపియున్నారు. కావున నిచట "శరీరభేదమువలన - స్వరూపభేదము కలుగదు" అను ప్రకృతోపపాద్యమగు నర్థమునకు-పూర్వార్థమునందుఁ జెప్పఁబడిన "దృక్కులు వేరయినను" ఇత్యాది వాక్యద్వయము-అనుమితికరముగాఁ జెప్పఁబడుటవలన నిది—కావ్యలింగాలంకారమగుచున్నది. ఇందు-ప్రకృతాప్రకృతములకు సామాన్యవిశేషభావము- కానిపింపకుండుటవలన-నిది యర్థాంతరన్యాసమని శంకింపఁదగదు.

మూ॥ తవచ్ఛిన్నం శీర్షం విదురఖిలధాత్రీగమవిదో
మనుష్యాణామస్తే బహులతపసా యద్ విదలితే
సుషుమ్నాయాం నాడ్యాం తనుకరణసమ్పర్కరహితా
బహిశ్శక్త్యాయుక్తా విగతచిరనిద్రా విలసతి॥ ౨౧॥

విశ్వాభర్త్రి! గాఢమగు తపస్సుచేత- మనుష్యులశీర్షము—ద్వివిధముగా చీల్పఁబడునపుడు— జ్యోతిర్వాహినియు, సుషుమ్నాఖ్యయు, నగు మధ్యనాడియందు దేహేంద్రియాది సంబంధవర్జితవు, బ్రహ్మాండగతమగు బహిశ్శక్తితో (మహాశక్తితో) సంయుక్తవు, నిద్రను విడిచి మేల్కొన్నదానవు, అగు కుండలినివై— విలసిల్లుదువు. కావున ఆగమవిదులగు తాంత్రికులు - నీశీర్షము - ఖండింపఁబడినదని (నీవు ఛిన్నమస్తవని) తెలిసికొనుచున్నారు.

ప్రి భ:—"కుండలినీశక్తి- యోగులయందు మేల్కొని, సుషుమ్నయందు ప్రవహించుచు, శరీరము నాశ్రయింపక-శీర్షకపాలమును భేదించుకొని - బయటికి వెడలి, వెలుపలనున్న బ్రహ్మాండశక్తితోఁగూడినదై- వెలుపలికిని లోపలికిని రాక పోకలు గావించుచు- విలసిల్లును" అను నీయభిప్రాయమును స్వానుభవముచేత నితర శ్లోకములయందుఁగూడ నీకవి చెప్పుచున్నాఁడు. 'తవచ్ఛిన్నంశీర్షమ్' అనుటకు బదులు 'తవచ్ఛిన్నఁమస్తమ్' అను పాఠాంతరముగూడఁ గలదని గ్రహించునది.

విశే:—జీవించియున్న యోగియొక్క- శీర్షకపాలమునుగూడ భేదింపఁబడునను నంశము—శ్రుతిసిద్ధమును, అనుభవసిద్ధమును, అగుచున్నది, "వ్యపోహ్య శీర్షకపాలే అని తైత్తిరీయక శ్రుతి చెప్పుచున్నది. శీర్షకపాలభేదమువలన- ఏయోగి ప్రాణము- సుషుమ్నా ద్వారమున వెడలునో, అతఁడు బ్రహ్మలోకము నొందును. మృతినొందిన తురీయాశ్రమిపుని (సన్యాసియొక్క) శరీరమును ఖననమొనర్చుటకు (పాతుటకు ముందు నారికేళఫలముచేత వానిశిరస్సును పగులఁగొట్టు సంప్రదాయము— ఇప్పటి కిని గలదు. (అది- బ్రహ్మలోకప్రాప్తి హేతువుగానున్నను) ఈసంప్రదాయము— యోగి—ప్రాణములు- బ్రహ్మరంధ్రమునుండి నిర్గమించునను యభిప్రాయమునే స్మరింపఁజేయుచున్నవి.

మూ॥ ఉతాహోతన్వఙ్గ్యాం భృగుకులవిధాత్ర్యాం పితృగిరా
తనూజేనచ్ఛిన్నే శిరసి భయలోలాక్షినలినే
న్యధాస్తేజోభీమం నిజమయి యదత్యుద్రమనఘం
తదాహుస్త్వామమ్బ! ప్రథితచరితే కృత్తశిరసమ్॥ ౨౨

దేవీ! నీవు ఛిన్నమస్తవగుటకిది హేతువుకానియెడల-భయము చేత చకితములగు నయనకమలములుగల రేణుకశిరస్సును తండ్రి యొక్క- ఆదేశముచేత పుత్రుఁడగు పరశురాముఁడు ఛేదించునపుడు, భృగువంశవిధాత్రియు, సుందరియు, జమదగ్ని భార్యయు,నగుఆరేణుక యందు నీవు ఉత్తమమును, పవిత్రమును, ఉగ్రమును అగు నిజతేజ మును ప్రవేశింపఁజేసితివాయేమి? విశ్రుతచరిత్రవగు జననీ! కావుననే నిన్ను ఛిన్నమస్తనుగా (ఖండింపఁబడిన శిరస్సుగలదానినిగా) చెప్పు చున్నారు.

ప్రి భ.—పరశురాముఁడు- మాతృశీర్షమును ఛేదించునపుడు- భగవతియగు ప్రచండచండి.ఆమెయందు తన తేజమును ంచెను.స్వ తేజోనివాసభూమియగు రేణుక—ఛిన్నశిరస్కయగుటవలన, ప్రచండచండికూడ- 'ఛిన్నమస్త' అని కీర్తింపఁబడు చున్నదని భావము.

మూ॥ హుతం ధారాజ్వాలా జటిలచటులే శస్త్రదహనే
తపస్విన్యాః కాయం భగవతి, యదామ్బ! త్వమవిశః।
తదాతస్యాఃకణ్ఠాత్ప్రగలదసృజః కృత్త శిరసః
కబన్ధేన ప్రాప్తో భువననినుతః కోఽపిమహిమా। ౨౩

అమ్మా! అవిచ్ఛిన్నమును, ధారాకారమును, అగు జ్వాలచేత జటిలమును, (సాంద్రమును) చటులమును, [శీఘ్రమును, కావున నే, ప్రచలమును] అగు ఖడ్గాగ్నియందు హోమముచేయఁబడిన తపస్విని యగు రేణుక దేహమునందు — నీవు ప్రవేశించినపుడు ఛిన్నమస్త యగు రేణుకయొక్క కంఠమునుండి బయలువెడలుచున్న రక్తము నుండి— లోకసంస్తుతమగు నేదోమహిమ- శిరోవియుక్తమగు కళేబర మగు కబంధముచేత—పొందఁబడియుండవచ్చును.

ప్రి భ:— కబంధమనఁగా, తలలేని మొండెము—కబంధరూపిణియగు రేణుకా దేవి- లోకమునందిప్పటికిని పూజింపఁబడుచున్నది.

మూ॥ నిధేస్త్వత్తో హృత్వా భగవతి! ఐలజ్జే భువిసృజన్
రసక్షోణీర్వాణీ స్త్వదమలయశస్సౌరభజుషః
నృపోద్యానాత్ సూనోత్కరమనహరన్ భక్తినటనం
వితన్వానస్తస్మై ముహురుపహరం స్తేనవకఇవ॥ ౨౪

భగవతీ! స్వచ్ఛములగు నీయశస్సుల సౌరభమును సేవించు నవియు, రసభూములును, అగు వాణులను— సర్వరసమధురవాఙ్మయ నిధివగు నీనుండి (నీయొద్దనుండి) హరించి (దొంగిలించి, తీసికొని) యీలోకమున కావ్యరూపమున సృజించుచున్న నేను ప్రభుని యుద్యానమునుండి పుష్పరాశి నపహరించి ఆప్రభునియందు భక్తిని

(సగౌరవానురాగమును) నటించుచు— అతనికి మాటిమాటికిని కాను
కగా నొసఁగుసేవకుని వలె, నేలజ్జించువాఁడను కాకున్నాను.

ప్ర భ:- నృపాలుని యుపవనమునుండి కుసుమరాశిని దొంగిలించి- స్వీయ
మగుదానివలెఁ జేసికొని— బాహ్యచేష్టితముల చేత-భక్తినటనమును గావించుచు,అప్ర
భువునకు మాటిమాటికిని కుసుమోపాయనమును గావించుకింకరునివలె నీయొద్ద
నుండి హరించిన రసమయవాక్కుల చేత- కావ్యనిర్మాణము నొనర్చుచున్న నేను
లజ్జితుఁడను కాకున్నానని భావము. 'నిధివగు నీనుండి' అనుటవలన— ఈకవిత_
దేవీప్రసాదవిశేషలబ్ధమని స్ఫురింపఁజేయఁబడుచున్నది. 'ఈలోకమున సృజించు
చున్న'దని అనుటచేత 'ఈసృష్టి— అభినవము' అనునంశము- ద్యోతితము.

మూ॥ దధానాస్సన్తోషం మనసి సుకవీనామతితరాం
దధానాః ప్రత్యగ్రం విబుధసదసే భావమలఘుమ్
కులానాముత్సాహం సపదివిదధానా శ్శివవధూ
పరాణాం శోభన్తాం జగతి శిఖరిణ్యో గణపతేః॥ ౨౫

రసాస్వాదననిపుణులును, నిర్మత్సరులును, అగు సత్కవుల మన
స్సునందు సంతోషము నతిశయింపఁజేయునవియు, విద్వత్పరిషత్తు
నకు- అనల్పమును,అభినవమును,అగు అభిప్రాయము నొసఁగునదియు;
శివవధువగు భగవతియే ప్రధానముగాఁగల దేవీభక్తులయొక్క- సం
ఘములకు వెంటనే యుత్సాహమును గూర్చునవియు, శిఖరిణీవృత్త
ములచే రచింపఁబడినవియు, అగు గణపతి కృతస్తుతులు—లోకమునం
దుద్దీపించుఁగాత!

ఇది-సవ్యాఖ్యమగు సప్తవింశ స్తబకము.

(ఇరువదేడవ స్తబకము)



ఓం నమో భగవతే, శ్రీరమణాయ.

# ఉమా సహస్రము

## [ అష్టావింశ స్తబకము ]

సప్తమ (ఏడవ) శతకమునందలి నాలుగవ స్తబకము.

మూ॥ అన్తర్విలక్షపరిధి భ్రమమాదధానో
వక్త్రస్య పూర్ణతుహినద్యుతి మణ్డలస్య
హాసః కరోతు భవతాం పరమం ప్రమోదం
శుద్ధాన్త పఙ్కజదృశః ప్రమథేశ్వరస్య॥ ౧

ప్రమథగణముల కీశ్వరుఁడగు పరమశివుని యొక్క అంతఃపుర సుందరియగు పార్వతియొక్క వదనపూర్ణచంద్రబింబమునకు చుట్టును, శుభ్రమగు పరివేషభ్రమము నుత్పాదించునదియగు, నామెహాసము- మీకు పరమానందము నొసఁగుఁగాత!

ప్ర భ:—ముఖము చుట్టునుగూడ-హాసప్రభచేత మండలాకారమగు విలాసము-గలదని స్ఫురింపఁజేయుటకు-ముఖచంద్రునికి హాసము-పరివేషము నాశ్రయించినట్టున్నదని చెప్పఁబడినది. అలంకారము-రూపకము.

మూ॥ సమ్మోహనాని తుహినాంశుకలాధరస్య
సఞ్జీవనాని సరసీరుహ సాయకస్య
సన్దీపనాని వితనోతు జనేషు శక్తేః
సంహర్షణాని మమ సన్తు శివాస్మితాని॥ ౨

చంద్రకళాధరుఁడగు శివునికి సమ్మోహనములును, అరవింద బాణుఁడగు మదనునికి సంజీవనములును, వినతులగుభక్తజనులశక్తికి సందీపనములును, అగు పార్వతీమందహాసితములు- నాకు 'సంహర్షణములు' అగుఁగాత!

ప్ర భ:—శివుని మోహింపఁజేయునవియు, హరనేత్రదగ్ధుఁడగు మన్మథుని జీవింపఁజేయునవియు; వినమ్రులగు భక్తులశక్తి నుత్తేజింపఁజేయునవియు, నగు

పార్వతీస్మితములు-నాకు హర్షమును గలిగించుఁగాతమని భావము. ఇచట-పార్వతీఁ స్మితములకు- సమ్మోహన— సంజీవన- సందీపన- సంహార్షణత్వములు-'అనేకములు' ఉల్లేఖింపఁబడుటవలన నిది యుల్లేఖాలంకారమనుచున్నాను.

మూ॥ పాపానిమేహరతు కాచనకృత్తశీర్షా
మాతాపదామ్బుజ భుజిష్యవితీర్ణహర్షా
యాభక్తలోకవరదానవిధౌ వినిద్రా
వాసం కమణ్డలుధునీపులినేకరోతి. ౩

భక్తలోకమునకు వరముల నొసగుటయందు జాగరూక యగుచు, పావనమగు కమండలునదీ సైకతప్రదేశమునందు నివసించు నదియు, పదపద్మభుజిష్యనూణులకు (భక్తులకు) హర్షమునిచ్చు నదియు, కృత్తశీర్షయు, (ఛిన్నశిరస్కయు) అనిర్వచనీయయు, అగు (రేణుకా) దేవి-నాపాపములను తొలఁగించుఁగాత!

ప్రభ:— "యఃకుణ్డలీపట్టణరాజధానీ" (25 స్త. 8 శ్లో) అనుశ్లోకమున- ఏక్షేత్రమున ప్రతిష్ఠితయగు మూర్తి-స్తుతింపఁబడియెనో, ఆక్షేత్రమునందే-కమండ లునది యున్నది. కావున నచటనున్న రేణుకయే-యిచట కీర్తింపఁబడినదని గ్రహించునది. ఈ రేణుకాక్షేత్రమునందే- సంకటసమయమున దైవప్రేరణముచేత నైష్ఠికుఁడగునీకవి రేణుకాగీతమును గానమొనర్చెను. గీతమాలాంతర్గతమును, ఉజ్వల ప్రతాపమును, 'అగు నిది-కాలాంతరమున ముద్రితమై యున్నది.

మూ॥ షష్ఠావతారజననావని రేకవీరా
భీమాధునోతు దురితానిగణాధిపస్య!
యాభక్తరక్షణవిధావతిజాగరూకా
పుణ్యైకమణ్డలుధునీపులినే చకాస్తి॥ ౪

భక్తజనరక్షణవిధియం దత్యంతమును సావధానయై, పవిత్ర మగు కమండలునదీపులినమున విరాజిల్లుచున్నదియు, షష్ఠావతార మగు పరశురామునికి జననభూమియు, ఏకవీరయు,(అద్వితీయవీరయు) లేక, 'ఏకవీర' అను ప్రసిద్ధిగలదియు, భీమయు, (చండియు, లేక,భీమ

అను నామమున విఖ్యాతయు) అగు దేవి- (రేణుక) గణపతియొక్క-
పాపములను నివారించుఁగాత!

మూ॥ ఛేదాయ చేద్ గతరజా మునిరాడి దేశ
చిచ్ఛేదచేద్ బహుగుణస్తనయః సవిత్రీమ్।
దాహ్యం శరీరమఖిల ప్రభుదీశశక్తి
ర్వ్యదావివేశ చకథా పరమాద్భుతేయమ్. ౭

రజోగుణ (క్రోధ) రహితుఁడగు జమదగ్నిముని- (రేణుకా) శిరఃకర్తనమునాజ్ఞాపించినయెడలను-అనేకసద్గుణవంతుఁడగు పుత్రుఁడు (పరశురాముఁడు) నిజమాతను భేదించినయెడలను- సర్వేశ్వరియగు నీశ్వరశక్తి-దాహ్యమగు శరీరమునందు (మృతమగుకళేబరమగుటచేత దహింపఁదగిన దేహమునందు) ప్రవేశించినయెడలను- ఈకథ-పరమాద్భుతమే యగును,

ప్ర భ:—సాత్త్వికుఁడగుటచేత-శాంతుఁడగు ముని—కి క్రోధమును, పుత్రునకు—మాతృశిరచ్ఛేదమును, ఈశ్వరశక్తికి-మృతశరీరప్రవేశమును, సంభవించుటెడల నిది పరమాశ్చర్యకరమని భావము.

మూ॥ పుత్రః ప్రియస్తవ శిరః సహసాచకర్త
కృత్తాచ హర్షభరితా భవతీ ననర్త
నోతస్య పాపమపి నోతవకాఽపిహాని
ర్నాశోఽస్య హా భుజభువా మభవద్ విపాకః॥ ౮॥

ప్రియపుత్రుఁడగు పరశురాముఁడు- అవిచారితముగా నీశీర్షమును ఖండించెను. నీవో, ఖండింపఁబడినదానవైనను, ఆనందపూరితవై నృత్తము నొనర్చితివి. అతనికి మాతృవధవలన పాపముకలుగదయ్యెను. నీకుఁగూడ శిరచ్ఛేదమువలన హానియేదియుఁ గలుగలేదు. కాని ఈఘోరకర్మము- భుజభువులగు క్షత్త్రియులకు వినాశముగాఁ బరిణమించెను! ఆశ్చర్యము!

ప్ర భ:—ఈకథ—అసంభవముగాఁ దోఁచుచున్నదని భావము.

మూ॥ అస్యైవ సా సురభి రర్జునభూపతిర్వాం
వీర్యార్జితాం సచభార్గవ ఆజహార।
తస్యాగృహాత్ పరగృహస్థితిరేవ హేతుః
గన్ధర్వదర్శనకథా రిపుకల్పితైవ॥ ౭॥

ఆ కామధేనువు- అంబయే. ఆమెనే అర్జునమహారాజు (కార్త్య వీర్యుఁడు) వీర్యమువలన హరించెను. ఆమెనే భార్గవుఁడగు పరశురాముఁడు తీసికొనివచ్చెను. పర (శత్రు) గృహనివాసమే - పరశురాముఁ డాయమ్మను చంపుటకు హేతువు. గంధర్వదర్శనకథ- (రేణుకాదేవి గంధర్వునిఁజూచి మోహమునొందినదను గాథ)(భార్గవ) శత్రువులచేత కల్పింపఁబడినదియే యగును.

ప్రశ్న:- కార్తవీర్యార్జునునిచేత-బలశక్తిచేత- అపహరింపఁబడి-మరల పరశురామునిచేఁ దీసికొనిరాఁబడినది, కామధేనువు కాదు. ఆమె రేణుకాంబయేయగును. జమదగ్ని యామెను వధింపుమనుటకుఁ గారణము- ఆయమ్మ- పరగృహమునందుఁ గొంతకాలము వసించుటయే కాని యింకొకటి కాదు. ఒక గంధర్వునిజూచి మోహితయగుటచేత అపరాద్ధయగు రేణుకను జంపుటకు జమదగ్ని - ఆజ్ఞాపించెనను గాథ భార్గవశత్రువులచేత కల్పింపఁబడినది కాని యథార్థము గానేరదు. ఈసమన్వయము- నవీనులకు సమీచీనము.

మూ॥ ఛిన్నానినోకతి శరీరభృతాం శిరాంసి
తత్ పూజ్యతే జగతి రైణుకమేవ శీర్షమ్।
కృత్తాః కళేబరవతాం కతినాభయో న
చేతోధినోతి సురభిర్మృగనాభిరేకః॥ ౮॥

దేహధారులగు శిరస్సు లెన్ని ఛిన్నములు కాలేదు? (అనేక శిరస్సులు ఛేదింపఁబడుచున్నవి) అయినను వానియందు, రేణుకకు సంబంధించిన (రైణుకమగు) ఆశిరస్సొక్కటియే- లోకమునందు పూజింపఁబడుచున్నది. శరీరులగు జంతువుల నాభులు- (మధ్యవర్త్యలగు బొడ్డులు) ఎన్నికృత్తములు కాలేదు? అయినను వానియందు కస్తూరికామృగనాభియొక్కటియే-మనస్సునకుఁ దృప్తినొందించుచున్నది.

మూ॥ ప్రాణావసన్తి శిరసారహితే శరీరే
లీలాసరోజతిశిరస్తుకరేఽస్యకృత్తమ్
తన్నిఘ్నమేతదఖిలంచ ధియైవధీరాః
పశ్యన్తుశన్దనగరే తదిదం విచిత్రమ్॥ ౯॥

శిరోహీనమగు దేహమునందు ప్రాణములు వసించుచున్నవి. ఈ శరీరమునకు సంబంధించిన హస్తమునందు— ఖండితమగుశిరస్సు లీలార్థమగు సరోజమువలె నాచరించుచున్నది. ఈవిశ్వమంతయుఁ గూడ— హస్తముచే ధరింపఁబడినశిరస్సుగల మొండెమునకు—అధీన మగుచున్నది. నందనగరమునందు (కుండలీపత్తనమునందు) గల ఆ యీ విచిత్రమును (అద్భుతమును) ధీరులు — బుద్ధిచేతనే విచారింతురుగాత!

ప్రి భ:— పూర్వము వర్ణింపఁబడిన కుండలీపురమను క్షేత్రమునందు మీఁద చెలుపఁబడినరూపముగల రేణుకామూర్తి- పూజింపఁబడుచున్నది. "ధీరులు బుద్ధి చేతనే విచారింతురుగాత!" అనుటచేత దశమహావిద్యలయందు ప్రిసిద్ధయగు ఛిన్న మస్తయొక్క— గూఢతత్త్వము— ఈవిచిత్రరూపవర్ణముచేత-విద్వాంసులకు విదితమగు నని యభిప్రాయము. ఇంకొకచోట ప్రచండచండీప్రస్తావమునందుఁగూడ— ఈయం శము ప్రతిపాదింపఁబడినది.

మూ॥ ప్రాణేశ్వరీ విధిపురే లసతః పురారే
రఙ్గీకరోతు శరణాగతి మమ్బికామే।
లబ్ధం నిపీయ యదురోరుహకుమ్భదుగ్ధమ్।
సమ్బన్ధమూర్తి రభవత్ కవిచక్రవర్తీ॥ ౧౦॥

ఏయంబికయొక్క— ఉరోజఘటములయందలి స్తన్యమునుగ్రోలి (జ్ఞాన) సంబంధమూర్తియను శైవసమయాచార్యుడు— కవిచక్రవర్తి యయ్యెనో, బ్రహ్మపురమునందు విలసిల్లుచున్న శివునియొక్క— ప్రాణేశ్వరియగు నాయంబిక-నాశరణాగతిని (ప్రపత్తిని) అంగీకరించుగాత!

ప్రి భ:— చోళదేశమునందున్న బ్రహ్మపురము— సంబంధమూర్తికి— జన్మ క్షేత్రము. మూడు సంవత్సరముల మాత్రమే వయస్సుగల బాలుఁడగు సంబంధమూర్తి

దేవార్ (తేవార్) అను పేరుగల ద్రావిడవేదప్రబంధమును నిర్మించి- శివునారాధించెను. భగవతియగు నంబిక-ఆతనికి స్తన్యము నొసఁగెను. తన్మహిమయే-తదీయమగు వాగ్విలాసము.'' అని మైతిహ్యముగలదు. ఈస్థలము ద్రావిడదేశమున 'శీర్గాళి' అని ప్రసిద్ధము.

మూ॥ అప్రాప్యలోకరచనావనపాతనేషు
యస్యాస్త్రయోఽపి పురుషాః కరుణాకటాక్షమ్।
నైవేశతే కిమపి సా జగదేకమాతా
భద్రా పరాప్రకృతి రస్త్వఘనాశినీ నః. ౧౧

బ్రహ్మ-విష్ణు-రుద్రులను, పురుషులు ముగ్గురును- లోకసృష్టి-రక్షణ- సంహారములయందు - ఏదేవతయొక్క- కరుణాపూర్ణమగు నేత్రాంతదర్శనము లభింపక, సృష్ట్యాదికర్మమును దేనినిగూడ చేయుటకు శక్తులుకారో, ఆజగదేకమాతయు, మంగళయు, అగుపర ప్రకృతి (భగవతియగు- మూలప్రకృతి-మహామాయ) మాయొక్క- పాపములను విధ్వంసము నొనర్చుగాత!

ప్ర భః:— 'పాపనాశ'మను, చోళదేశక్షేత్రముగలదు. అచట విరాజమానయగు మూర్తి-స్తుతింపఁబడినది.

మూ॥ రక్తాప్రబోధశశినో హృదయోదయస్య
నైకావిపజ్జలనిధౌ పతతాం జనానామ్
వేదధ్వజస్య లలితా త్రిరుచిః పతాకా
కాచిన్మమాస్తు శరణం శివమూలటీకా. ౧౨

హృదయ (సాగర)ముునుండి యుదయించిన ప్రబోధ (జ్ఞాన) చంద్రునికి-రాకయు, (పూర్ణిమయు) ఆపత్సముద్రమునందుమునిఁగిన జనులకు-నౌకయు, (తారిణియు) వేదధ్వజుఁడగు (వేదములు, కేతనముగాఁగలిగి వేదగిరీశుఁడని ప్రసిద్ధుఁడై, కాంచీమండలమునందున్న క్షేత్రవిశేషమున కధిష్ఠాతయైయున్న) యీశ్వరునికి- (లోహితశుక్ల కృష్ణములగు రజస్సత్త్వతమఃప్రభలచేత) త్రిరుచియగు పతాకయు,

(వైజయంతియు) శివమూలటీకయు, (దురవగాహమగు సూత్రమునకు టీకవలె, శివుఁడనుమూలస్వరూపమును ప్రకాశింపఁజేయునదియు) అనిర్వాచనీయయు అగు లలితా (త్రిపురసుందరీ) దేవి-నాకు శరణమగుఁగాత!

ప్ర॥ భ:- కాంచీమండలమునందున్న వేదారణ్యక్షేత్రమున నధీశ్వరియగు నంబికకు 'త్రిపురసుందరి' అను నామము ప్రసిద్ధమగుచున్నది, ఈయమ్మ- హృదయమునుండి జ్ఞానమును వికసింపఁజేయుచు, ఆపదనుండి కాపాడుచు, రజస్సత్త్వతమఃప్రభ అను వెలయించుచు, శివరహస్యమును ప్రకాశింపఁజేయుచుండును. ఆలలితా(త్రిపుర సుందరీ)దేవి-నన్ను రక్షించుఁగాతమని తాత్పర్యము. ఇచట:-లలితా- రాకా. నౌకా, పతాకా, టీకా, శ్లేషరూపమున నాలోచింపఁబడినది. కావున రూపకమలంకారమగుచున్నది. మఱియు, రాకాదిరూపముల ననేకముగ నుల్లేఖింపఁబడుటవలన రూపకశిరస్కమగు ఉల్లేఖముకూడ'నలంకారమగుచున్నది.

మూ॥ మాలా మహేన్ద్రసుదృశస్సుమనోనికాయ
సంశోభితే సదసిమాన్య ఇవాభిజాతః।
రేణుశ్చ యచ్చరణభూర్లభతేఽగ్రపీఠమ్
త్రాణాయసాభవతు భూతపతేర్వధూర్నః॥ ౧౩॥

ఏదేవియొక్క- చరణములనుండి యుద్భవించిన రేణువుకూడ- సుమనోనికాయ (పుష్పసమూహ) సంశోభితమగు మహేంద్రసుందరీ మాళియందు, సుమనోనికాయ (శుద్ధమనస్కులగు దేవతలయొక్క- సమూహముచేత) సంశోభితమగు సభయందు మాన్యమగు (పూజ్యమగు) సత్కులజుఁడువలె, అగ్రపీఠమును (ప్రథమాసనమును)పొందుచుండునో, భూతపతియగురుద్రునివధువగునా దేవి - మమ్ము రక్షించుఁగాత!

ప్ర॥ భ:—భగవతీచరణరేణువు మహేంద్రసుందరీమాళయందు పూజ్యమగు స్థానము నొందుఁగాత! అని భావము. సుమనశ్శబ్దము, పుష్పములను-దేవతలను. తెలుపుటచేత-శ్లిష్టమని వ్యాఖ్యానింపఁబడినది. అలంకారము-పూర్ణోపమ.

మూ॥ అమ్బా వృణోతి పరితోఽప్యయమన్ధకారో
నాత్మానమేవ మమకింతు కులంచ దేశమ్।
శీఘ్రం మదీయ హృదయోదయ పర్వతాగ్రే
శ్రీమాను దేతు తవ పాదమయూఖమాలీ॥ ౧౪

అమ్మా! ఈచీకటి-(పోవఁదగినబాటయొక్క ప్రకాశము నావరించునదియగు అజ్ఞానము) కేవలమగు నాయాత్మనేగాక మానుష సంఘమును, భారతదేశమునుగూడ- అంతటను ఆవరించుచున్నది. మదీయహృదయమను ఉదయాద్రియొక్క శిఖరమునందు శ్రీమంతమగు (పాదపక్షమున-లక్ష్మీవంతమును, సూర్యపక్షమున-రోచిష్మంతమునుఅగు) పాదమనుసూర్యుఁడు-శీఘ్రముగా నుదయించుఁగాత!

ప్ర శ:— "నన్నును. (భారతీయు) మానవసంఘమును, మాదేశమును, గూడ పూర్ణముగా నావరించియున్న త్రిరహితమగు నంధకారమును నివారించుటకు భగవతీపాదమే-సమర్థము." అనువస్తువు- హృదయమును_ఉదయపర్వతముగను, పాదమును- సూర్యునిగను ఆరోపించునదియగు రూపకముచేత-అనుప్రాణితమగుచున్నది.

మూ॥ కష్టం ధునోతుమమ పర్వత పుత్రికాయాః
ప్రత్యగ్రపఙ్కరుహ బాన్ధవకాన్తికాన్తమ్।
అమ్భోరుహాసన ముఖామరమౌలిరత్న
జ్యోతిర్విశేషితగుణం చరణారవిన్దమ్. ౧౫

కమలబాంధవుఁడగు బాలార్కునికాంతివలెకాంతివంతమును, కమలాసన ప్రభృతులగుఅమరులమౌళుల యందలిరత్నముల జ్యోతులచేత ప్రకాశించుచున్న (పావిత్ర్యాది) గుణముగలదియు, అగపర్వతకుమారియొక్క చరణపద్మము-నాకష్టమును తొలఁగించుఁగాత!

మూ॥ వ్యాశిఞ్జితాని సమరే గిరిశంజిగీషోః
కామస్యహంసనివహాస్య సిమస్త్రిణాని।
ధున్వన్తు మేదురిత మద్రికుమారికాయాః
పాదారవిన్ద కటకక్వణితాని తాని॥ ౧౬

యుద్ధమునందు గిరీశుని జయింపఁగోరిన కాముని కు జ్యాకింజితములును, (వింటినారియొక్క ధ్వనులును) హంసనినాదమునకు నిమంత్రణములును, పార్వతీయములును, అగు 'ఆ'పాదారవిందకటక క్వణితములు-నాదురితమును తొలఁగించుఁగాత!

ప్ర భ:—దేవియొక్క కాలియందెలయొక్క-శివుని వశీకరింపఁగోరిన మదనునకు ధనుర్జ్యానినాదములవలెను. గమనమును నేర్పుటకు హంసలను పిలుచునవివలెను, ధ్వనించుచుండునని భావము. "ఆ"=అనిర్వచనీయములగు ధ్వనులు.

మూ॥ యః సర్వలోక మథనం మహిషం జిగాయ
యస్యైవకర్మ దమనంచ తదన్తకస్య
నారీనరాకృతి భృతో మహసస్తమక్ష్ణ్యం
మఞ్జీరనాదమధురం శరణం ప్రజామి. ౧౭

ఏపాదము—సర్వలోకములను మథించుచున్న మహిషుని జయించెనో, ఏపాదముయొక్క మహిషవిజయరూపమగు 'ఆ'కర్మ-అంతకుని (యముని) గూడ-నిగ్రహించినదయ్యెనో, స్త్రీపురుషాకారధారిణియగు జ్యోతిస్సుయొక్క- మంజీరనాదమధురమగు ఆపాదమును-శరణముగా నొందుచున్నాను.

ప్ర భ:—"యమునకు-గూడ-జయింపశక్యముకాని మహిషుని జయించుటవలన-పాదకృతమగు మహిషధ్వంసకర్మము చేత- అంతకుఁడుగూడ- జయింపఁబడియె"నను నర్థాపత్తి సిద్ధించుచున్నది. స్త్రీ-పురుషరూపధారియగు జ్యోతిస్సు-అర్ధనారీశ్వరస్వరూపమని గ్రహించునది.

మూ॥ ఆపన్మహోగ్రవిషరాశి నిమగ్నమేతం
దీనం త్వదీయచరణం శరణం ప్రపన్నమ్
ఉద్ధర్తుమమ్బ! కరుణాపరిపూర్ణచిత్తే!
విత్తేశమిత్రకులనారి! తవైవభారః. ౧౮

ధనాధిపమిత్రుఁడగు శివుని కులాంగనవగు జననీ! కరుణాపరిపూర్ణహృదయా! ఆపదయను మహాఘోరవిషసాగరమునందు మునిఁగినవాఁడను, నీచరణమును శరణమునొందినవాఁడను, దీనుఁడను అగు ఈ నన్నుద్ధరించుటకు నీదియే భారము.

ప్ర భ:—'దీనుఁడనగు నేను-త్వదేకశరణుఁడ'నని భావము.

మూ॥ లోకాధిరాజ్ఞి! పతితం విపదన్ధకూపే
సంరుద్ధదృష్టి మభిత స్తిమిరచ్ఛటాభిః।
మాతః! సముద్ధర కృపాకలితే! మృడాని!
పుత్రం కరేణ జగతామభయఙ్కరేణ॥ ౧౯

జగదధీశ్వరీ! దయాకలితా! మృడానీ! ఆపదంధకూపమున (ఆపదయను తమోవ్యాప్తమగు నూతియందు) పడియున్నవాఁడను, తిమిరచ్ఛటలచేత నివారింపఁబడిన దృష్టిగలవాఁడను, పుత్త్రుఁడను, అగునన్ను లోకములకభయంకరమగు హస్తముచేత—సముద్ధరింపుము. (వెలుతురులోనికిఁ దీసికొనిరమ్ము).

మూ॥ అస్య త్వదీయపదపఙ్కజకిఙ్కరస్య
దుర్భాగ్యపాకవిఫలీకృతపౌరుషస్య
ప్రాణేశ్వరి ప్రమథలోకపతే రుపాయం
వీక్షస్వ తారణవిధౌనిపుణే! త్వమేవ॥ ౨౦

ప్రమథలోకపతియగు శివునికి ప్రాణేశ్వరివగు పార్వతీ! త్వదీయపదారవిందభక్తుఁడను, దుర్భాగ్యపరిణామముచేత విఫలముగాఁ జేయఁబడిన పురుషకారముగలవాఁడను అగు నన్ను తరింపఁ జేయుటకుపాయమును నిపుణురాలవగు నీవే పరికింపుము.

ప్ర భః—పురుషప్రయత్నమును జయించిన దైవమును—జయించుటకు తగిన యుపాయమును ప్రసన్నురాలవగు నీవే చూడవలయునని భావము.

మూ॥ మృత్యుఞ్జయోరుమణిపీఠతలే నిషణ్ణే!
తాటఙ్కకాన్తి బహులీకృతగణ్డశోభే!
మాణిక్యకఙ్కణలసత్కరవారిజాతే!
జాతే కులాచలపతే ర్జహి పాతకం నః॥ ౨౧

మృత్యుంజయుఁడగుశివుని—వామోరువనుమణిమయపీఠతటమునం దాసీనురాలవును, తాటంకములను కర్ణాభరణములయొక్క కాంతులచేత బహులముగాఁ జేయబడిన కపోలశోభగలదానవును, మాణిక్యఖచితములగు వలయముచేత—శోభించుచున్న హస్తకమలము గలదానవును, కులాచలపతిపుత్త్రికవును, అగుజననీ! మాపాపములనునశింపఁజేయుము.

మూ॥ కిం తేవపుర్జనని తప్తసువర్ణగౌరం
కామారిమోహిని కిమిన్దుకలావలక్షమ్
పాకారినీలమణిమేచకకాన్త్యుతాహో
బన్ధూకపుష్పకలికారుచివా స్మరామి। ౨౨

జననీ! శివసమ్మోహినీ! తప్తసువర్ణగౌరమగు నీశరీరమును స్మరింతునా? చంద్రికలాధవలమగు నీశరీరమును స్మరింతునా? లేక ఇంద్రనీలమణిశ్యామలకాంతియగు నీశరీరమును స్మరింతునా? బంధూకపుష్పకలికారుచియగు నీశరీరమును స్మరింతునా?

ప్రభ:—ఏవర్ణముగల నీవు నాకు ధ్యానగోచరవగుదువని నాలుగురంగులుగల మూర్తులనుదాహరించి యడుగుచున్నాడు. పుటము పెట్టఁబడిన బంగారమువలె పచ్చనిరంగుగల గౌరీమూర్తినా? సోమకలాధవలమగు సరస్వతీమూర్తినా? లేక ఇంద్రనీలాభమగు కాళీమూర్తినా? బంధూకకోరకము (మంకెనపూవుయొక్క మొగ్గ)వలె నరుణవర్ణముగల లక్ష్మీమూర్తినా? నేను ధ్యానింపవలయుననిప్రశ్న. బహుమూర్తిభేదములుగ దేవియొక్క తెరయే—గుణభేద—ఫలభేదముల నావిష్కరించుటకు సమర్థరాలగుచున్నది. కావున నిట్లు ప్రశ్నింపఁబడినది. 'తప్తసువర్ణవర్ణా' అను నింకొకపాఠముగూడఁగలదు. దశమహా విద్యారూపిణియగు భగవతిని రెండుశ్లోకములచేత వ్యాఖ్యానించుచున్నాఁడు.

మూ। త్వం సున్దరీ నృపతిజాతిజితస్త్వమమ్బ
ధూమావతీ త్వమజరే భువనేశ్వరీ త్వమ్
కాలీత్వమీశ్వరి శుకార్భకధారిణీత్వం
తారాత్వమాశ్రిత విపద్దలనాసిధారా. ౨౩

నీవు త్రిపురసుందరివి. నీవు క్షత్రియజాతిని జయించిన పరశురామునకు మాతవగు రేణుకవు. (ఛిన్నమస్తవు) అజరవగు నీవు ధూమావతివి. (జ్యేష్ఠవు) ఈశ్వరీ! నీవు భువనేశ్వరివి. (దక్షిణకాలివి) నీవు శుకబాలుని హస్తమున ధరించిన శ్యామలవు. (మాతంగివి) నీవే—ఆశ్రితజనుల ఆపదలను ఛేదించు ఖడ్గధారగల తారాదేవివి.

ప్రభ:—త్రిపురసుందరీదేవినే—శ్రీవిద్యారూపిణియని చెప్పుదురు. ధూమావతినే—ధూమ్రవారాహీదేవియని చెప్పుదురు. నీల, సరస్వతి, ఏకజట, అనుమూర్తులు తారాదేవీ భేదములని గ్రహించునది. [ఇందు 6 మూర్తులు చెప్పఁబడినవి.

మూ॥ త్వం భైరవీ భగవతీ బగలాముఖీత్వం
రామాచ సా కమల కానన చారిణీత్వమ్।
కైలాసవాసి నయనామృతభానురేఖే
కోవేద తే జనని! జన్మవతాం విభూతీః, ౨౮

నీవు భగవతివగు భైరవివి. (త్రిపురభైరవివి) నీవు - బగలాముఖివి. (సర్వస్తమ్భనకరివి, పీతవర్ణవు. అగు బకముఖివి) కమలవన సంచారిణివగు లక్ష్మివినీవే. కైలాసవాసియగు శివుని నయనములకు అమృతభాను (చంద్ర) రేఖవును, ప్రాణులకు మాతవును, అగు నీ విభూతుల నెవ్వఁడు తెలియఁగలఁడు?

ప్ర భా:— ఇట్లు—దశమహావిద్యామూర్తులను తెలిపి—అసంఖ్యాకములగునీవిభూతుల నెవ్వఁడును తెలియఁజాలఁడని చెప్పఁబడినది.[ఇందు 4మూర్తులుచెప్పఁబడినవి.]

మూ॥ ధున్వన్తు సర్వవిపదః సుకృతప్రియాణాం
ధున్వన్తు చాఖిలసుఖాన్యఘలాలసానామ్।
ఆవర్జ్యభూరికరుణం పురజిత్తరుణ్యా
శ్చిత్తం వసన్తతిలకాః కవిభర్తురేతాః॥ ౨౯

కవీశ్వరుఁడగు గణపతిచేత రచితములును, వసంతతిలకా వృత్తనిబద్ధములును, అగు ఈస్తుతులు- శివసుందరియగు పార్వతి యొక్క విస్తారమగు కరుణగలహృదయమునాకర్షించి సుకృతప్రియులగు సాధుజనుల యాపదలనన్నిఁటిని ధ్వంసముచేయుఁగాత! దుష్కృతముల యందభిలాషముగల దుర్జనుల సుఖముల నన్నిఁటిని తొలఁగించుఁగాత!

ఇతి— శ్రీమహర్షి రమణభగవత్పాదాన్తేవాసినో వాసిష్ఠస్య, నరసింహసూనోః గణపతిమునేః కృతావుమాసహస్రే అష్టావింశస్స్తబకః సమాప్తః.

ఇది-శ్రీమహర్షి రమణభగవత్పాదశిష్యుఁడు,శతమర్షణసగోత్రుఁడు, శ్రీమత్పంతుల పేరయశాస్త్రి పౌత్త్రుఁడు, వేంకటరామ బుధేంద్రపుత్త్రుఁడు, లక్ష్మీనారాయణశాస్త్రిచే నాంధ్రీకరింపఁబడిన ఉమాసహస్రమను స్తోత్రకావ్యమున ఇరువది యెనిమిదవస్తబకము, [సప్తమ శతకము]

సమాప్తము.

ఓం నమో భగవతే శ్రీరమణాయ. శ్రీ భారతీదేవ్యై నమః.

# ఉమా సహస్రము

## ఏకోనత్రింశ స్తబకము (ఇరువది తొమ్మిదవ స్తబకము)

### ఎనిమిదవ శతకమున ఒకటవ స్తబకము.

అవ:—ఇరువది తొమ్మిదవ స్తబకమున నవవిధమగు భజనము ప్రస్తావింపఁబడుచున్నది.

మూ॥ ఆయుష్యాభువనానాం చక్షుష్యాస్త్రిపురారేః ।
కుర్వన్తు ప్రమదం నః పార్వత్యాః స్మితలేశాః॥ ౧

లోకులయొక్క జీవనమే ప్రయోజనముగాఁ గలవియు, త్రిపురారియగు శివుని నేత్రమునకు హితములయినవియు, అగు పార్వతీదేవియొక్క స్మితలేశములు- మాకు హర్షమును గూర్చుఁగాత!

ప్ర భ:—"సకలభువనజీవనార్థములును, శివనయనతర్పకములును, అగు పార్వతీమందహాసములును- మాకు ప్రమోదమునిచ్చుఁగాత!"—అని యర్థము.

మూ॥ నాత్యర్ఘాణి నిరర్థం నేతవ్యాని దినాని
అమ్బాయాశ్చరితాని శ్రోతవ్యాన్యనఘాని॥ ౨

మిక్కిలి వెలగలవియగు దివసములు- నిష్ప్రయోజనముగా గడుపఁగూడదు. పావనములగు జగన్మాతయొక్క చరిత్రములు వినవలయును.

ప్ర భ:—ఆయువంతయుఁ గూడ మితమైనది. కావున దినములను వృథా చేయఁదగదు, వానిని కృతకృత్యములుగా చేయఁదగును. దేవియొక్క పావనచరిత్రమును వినుటచేత శ్రోత్రేంద్రియము- కృతకృత్యమగును. ఆయువునకు సంబంధించిన దినములు— కృతార్థములగును. తొమ్మిదివిధములుగల భజనమునందీక్షణము మొదటిదగుచున్నది.

మూ॥ ఉద్యోగం కురుజిహ్వే! సంహర్తుం దురితాని
పూతాన్యద్రి సుతాయాః కీర్తయ్యాన్తాంచరితాని॥ 3

ఓ నాలుకా! పాపములను నశింపఁజేయుట కుద్యమింపుము. పార్వతీ పవిత్రచరిత్రములను కీర్తింపుము.

ప్ర భ:—రసనమా! పార్వతీపవిత్రచరిత్రకీర్తనము చేత నీపాపసంహారోద్యమము ఫలితమగును. పూర్వశ్లోకమున శ్రవణేంద్రియకర్తవ్యమును, ఈశ్లోకమున వాగింద్రియకర్తవ్యమును, చెప్పఁబడినవి. కీర్తనమనునది- రెండవ భజనము.

అవ:—నియమసహితమగు స్మరణమును శ్లోకత్రయముచేత ప్రతిపాదించుచున్నాఁడు.

మూ॥ శ్రీసక్తిర్వినివార్యా చిన్తాకాఽపినకార్యా ।
నిత్యం చేతసిధార్యా దీనానాం గతిరార్యా॥ ౪

సంపదయం దాసక్తినొందఁగూడదు. ఏదియుఁగూడ చింతింపఁగూడదు. దీనులకు గతియగు, ఆర్యను, మనస్సునందు నిత్యమును ధ్యానముచే ధరింపవలయును.

ప్ర భ:—శ్రీశ్రేష్ఠతగను. ఏ హేతువుచేతనైనను మనస్సు వ్యాకులము కాఁగూడదు. బలహీనులకు శరణమగు పార్వతి నెల్లపుడును మనస్సున ధ్యానింపవలయును.

మూ॥ జ్ఞాతుం యాగదితుంయా, శ్రోతుంయాశ్వసితుంయా
ద్రష్టుంయాఽన్తరశక్తిస్త్వాత్రస్మృతిరేషా॥ ౫

ఏది- విషయములను తెలిసికొనుటకును, వాక్కులను పలుకుటకును, శబ్దములను వినుటకును, ఉచ్ఛ్వాసనిశ్వాసముల నొనర్చుటకును, రూపములను చూచుటకును, అంతరశక్తి యగుచుండునో, ఆ యంతరశక్తియుండుంకుము. ఇదియే స్మృతి(జ్ఞప్తి. కేవలమగుసంవిత్తు)

మూ॥ విభ్రాజినశతాభం బిభ్రాణం శిరసీన్దుమ్ ।
స్మర్తవ్యం జగదమ్బారూపంవా ధుతపాపమ్॥ ౬

సూర్యశతదీప్తిగలిగి విరాజిల్లునదియు, శిరస్సున చంద్రుని ధరించునదియు, భక్తులపాపములను తొలఁగించునదియు, అగు జగదంబయొక్క రూపమునైనను స్మరింపఁదగును.

ప్ర భ:—పూర్వశ్లోకమున- అంతరశక్తినిష్ఠ-స్మృతియని చెప్పఁబడినది. ఆనిష్ఠయందు నశక్తులగువారికి ధ్యానరశతాధికము, చింతనీయాపము, ఆవు అమ్మ యొక్క రూపము ధ్యానింపఁదగునని యిందు చెప్పఁబడినది. ఇచట- ఉపాసనము గూడ- స్మృతికి పర్యాయముగాఁ జెప్పఁబడినది.

అవ:-శ్లోకములు మూడింటిచేత-పాదసేవనము ప్రతిపాదింపఁబడుచున్నది.

మూ॥ యేషాంస్యాత్ పరితప్తం ప్రాయశ్చిత్తమఘేన।
రుద్రాణీ పదసేవా ప్రాయశ్చిత్తమమీషామ్. ౭

ఎవరికి- పాపముచేత-ప్రాయః (ఎక్కువగా) మనస్సు పరితపింపఁబడునో, వారికి రుద్రాణియగు దేవియొక్క చరణభజనము- పాపాపనోదకమగు ప్రాయశ్చిత్తకర్మమగును.

ప్ర భ,—"ప్రాయోనామతపః ప్రోక్తం
చిత్తం నిశ్చయ ఉచ్యతే
తపోనిశ్చయ సంయోగాత్
ప్రాయశ్చిత్త మితీర్యతే॥

'ప్రాయస్సనఁగా, తపమని చెప్పఁబడును. చిత్తము నిశ్చయమని చెప్పఁబడును. తపోనిశ్చయసంయోగమువలన ప్రాయశ్చిత్తమని చెప్పఁబడును.' అని హేమాద్రి చెప్పియున్నాఁడు. ఇచట గ్రహింపవలసినది— పాపముచేత చిత్తమునకు పరితాపము గలుగునపుడు ఆపరితాపము— అనుతాపమునందు పర్యవసించును. అట్లు- అను (పశ్చాత్) తాపము గలవారికి భగవత్పాదసేవగాని, తన్నామస్మరణముగాని, ప్రాయశ్చిత్తమగును. అనుతాపము కలుగనపుడు భగవన్నామస్మరణాదికము బుజావుగానుండదు. కావున నది పాపములను తొలగించునదియగు ప్రాయశ్చిత్తము కానేరదు. కావుననే—

కృతేపాపేఽనుతాపోవై యస్యపుంసః ప్రజాయతే
ప్రాయశ్చిత్తంతు తస్యైకం హరిసంస్మరణం పరమ్॥

పాపము చేయఁబడినపుడు, ఏపురుషునకు అను పశ్చాత్) తాపముకలుగునో, వానికి శ్రేష్ఠమగు హరిస్మరణమొక్కటియే- ప్రాయశ్చిత్తము. అని తెలిసిన పెద్దలు చెప్పియున్నారు.

మూ॥ తదదీప్తం పదయుగ్మం సేవేయుస్త్రిభవన్తి
అఙ్ఘ్రిభ్యో దశభానోర్భానూనాం శతకాని॥ ౮

కావున- ఏపాదయుగ్మమునందున్న దశాంగుళులు (పదివ్రేళ్లు) సూర్యకిరణాపుల యొక్క దశశతకములు (వేయి) అగుచుండునో, దీప్తమగు ఆదేవీ పాదయుగళమును సేవించెదను.

ప్ర భ:—దేవీపాదద్వయమునందలి దశాంగుళులు-సూర్యకిరణసహస్రరూపముగాఁ జెప్పఁబడినవి. దీప్తమగు ఆపాదద్వయముయొక్క సేవవలన ప్రాయశ్చిత్తము సిద్ధించుననిభావము.

మూ॥ నో చేత్ కుప్యసి కిఞ్చిద్ యాచే వాచ మతీతే
సేవాంమాతరురీకుర్విష్టం మేకురుమావా॥ ౯

వాక్కుల కగోచరవగు జననీ! కోపగింపకుందువేని నిన్నొకటి యడిగెదను. నాయభీష్టమునిచ్చినను మానినను నాసేవనంగీకరింపుము.

అవ:—శ్లోకములు రెండింటిచేత-అర్చనమును దెలుపుచున్నాఁడు.

మూ॥ శర్వాణీ చరణార్చాపీఠం పీవరకాణామ్।
వధ్యస్థాన మిదంస్యా దుగ్రాణాం దురితానామ్॥ ౧౦

సర్వపాపహింసకుఁడగు శర్వునిపత్నియగు పార్వతికి సంబంధించిన యీపాదపూజాపీఠము- దుష్టములై బలిసియున్న ఘోరములగు పాపములకు వధ్యస్థానము. (వధింపఁదగిన స్థలము)

మూ॥ స్కన్దామ్బా పదపీఠ స్పృష్టం చేద్ బలమాప్తమ్।
ఏకైకం సుమమంహ స్స్వైకైకం కులిశంస్యాత్॥ ౧౧

కుమారజననియగు పార్వతియొక్క పదపీఠముచేత స్పృశింపఁబడిన బలమును పొందినయెడల ఒక్కొక్కపుష్పమును- చంపఁదగిన పాపముల విషయమున- ఒక్కొక్క వజ్రాయుధమగును.

ప్ర భ:—దేవీపాదపీఠస్పర్శలబ్ధమగు బలముగల ప్రతికుసుమమునుగూడ-దురితసంహారమున వజ్రాయుధమగునని భావము.

అవ:—శ్లోకసప్తకముచేత వందనమును జెప్పుచున్నాఁడు.

మూ॥ అమ్భోజోప మమఙ్ఘ్రిం శమ్భోః పట్టమహిష్యాః
అంహస్సంహృతిముగ్రాం సంహర్తుం ప్రణమామః॥ ౧౨

భయంకరమగుపాపసంహతిని సంహరించుటకై శంభునిష్టమహిషి యగు పార్వతియొక్క అంభోజోపమమగు పాదమునకు ప్రణమిల్లుదుము.

ప్ర భ:—దేవీచరణారవిందప్రణామము- మాకు పాప ప్రణాశనప్రయోజన మని యర్థము.

మూ॥ యేకాలీ పదవేషం నాలీకం ప్రణమన్తి
నైషాం కిఞ్చిదశక్యం నాలీకం మమవాక్యమ్॥ ౧౩

కాలీపాదవేషమునకు (అలంకరింపఁబడిన బాహ్యమగు పాదాకృతికి) యథార్థమగు భక్తిచేత ప్రణామము నొసరించువారికి శక్యము కాని దేదియులేదు. నామాట యలీకము (అనృతము) కాదు.

ప్ర భ;—'శిలాది ప్రతిమారూపమున నలంకరింపఁబడియున్న కాళీపదమును ఋజుభక్తులై ప్రణమిల్లువారికి సర్వమును శక్యమగును, అని భావము. 'ఆకల్పకము. వేషము, నైపథ్యము, ప్రతికర్మ- ప్రసాధనము, అను పదములు- అలంకరింపఁబడిన బాహ్యాకారమును దెల్పును.

మూ॥ వాసస్తేఽత్రసమాప్తః పఙ్కేతో వ్రజదూరమ్।
కాలీం శఙ్కరనారీం కాలేఽస్మిన్ ప్రణమామః. ౧౪

ఓ పంకమా! (పాపమా!) నీకు నాయందలి నివాసము సమాప్తమయినది. (కావున) ఇక్కడనుండి దూరముగా పొమ్ము. మేమీసమయమున శివకాంతయగు కాళికి నమస్కరింతుము.

ప్ర భ:—ఓపాపమా! మేము పాపసంహర్త్రియగు కాళికిప్రణామముచేయఁదగినసమయము వచ్చినది. ప్రణామము ముగిసినవెంటనే నీకు వినాశము తప్పదు. కావుననే ముందుగానే తొలఁగిపొమ్ము.

మూ॥ ఆశారేతదవస్థాభూభాగానటతస్తే
కామానాం క్వనుపారః కామారేర్నమనారీమ్॥ ౧౫

ఓ సఖుఁడా! భూగోళమునందున్న దేశములయందు సంచరించుచున్న నీయాశ- (అధికమైనతృష్ణ) సంచారమేయగునవస్థగలది. (ఒకచోట నిలుచునది కాదు.) మనోరథములకు (కామములకు) పారమెక్కడిది? కావున శివనారికి నమస్కరింపుము.

ప్ర భ:— నీవు తిరుగుచున్నంతవఱకును నీయాశయును తిరుగుచునే యుండును. కామమున కంతములేదు. కావున జగన్మాతకు నమస్కరింపుము.

మూ॥ ధన్యాస్తే తుహినాద్రేః కన్యాంయే ప్రణమన్తి
అన్యానున్నతశీర్షాన్ మన్యే వన్యలులాయాన్. ౧౬.

"హిమాచలకన్యకు నమస్కరించువారే. (శిరస్సువంచినవారే) ధన్యులు, ఉన్నతములగు శిరస్సులుగల (ఎత్తయిన శీర్షములుగల) యితరులు— వన్యలులాయములు" (అడవియదున్న దున్నపోతులు) అని తలంచుచున్నాను

ప్ర శ:— దేవికి నమస్కరించుటకై ఎవ్వరి శీర్షములు నతములగునో వారు ధన్యులైరి. ఉన్నతములగునవి. ఉద్ధతుల శిరస్సులో— మన్నుపోతుల శిరస్సులవలె ఉన్నతములైయుండును.

మూ॥ పాదాబ్జముమాయాః ప్రాజ్ఞాస్సమ్ప్రణమన్తః।
గృహ్ణన్తి శ్రియమస్మిన్ రాజన్తీంనిజశక్త్యా॥ ౧౭

ఉమాపదాబ్జమునకు ప్రణమిల్లుచున్న ప్రాజ్ఞులు- ఈపాదాబ్జమున విరాజిల్లుచున్న సంపదను స్వశక్తిచేత గ్రహింతురు.

ప్ర భ:— ప్రణామమువలన పాదారవిందశ్రీయొక్క గ్రహణము— ప్రాజ్ఞులకు స్వశక్తిచేతనే— సిద్ధించునని భావము.

మూ॥ మన్దారాద్రిసుతాఙ్ఘ్రీ దాతారౌసదృశౌ స్తః
ఉత్కణ్ఠైఃఫలమాద్యాదన్యస్మాన్నతకణ్ఠైః॥ ౧౮

ఇష్టార్థప్రదమగు మందార (దేవ) వృక్షమును, పార్వతీచరణమును, సమానులగు దాతలు, ఉత్కంఠులు-మందారఫలమును, నతకంఠులు— దేవీచరణ ఫలమును సంపాదింతురు. [మీదికెత్తఁబడిన కంఠము (శిరస్సు) గలవారిచేత మందారవృక్షమునుండి ఫలముసంపాదింపఁబడును. నమ్రశిరస్కులచేత పార్వతీచరణమునుండి ఫలము గ్రహింపఁబడును.]

ప్ర భ:—ఉన్నమితశిరస్కులకు వృక్షఫలమును, నమితశిరస్కులకు చరణఫలమును లభించునని తాత్పర్యము.

మూ. కాలస్యాపి విజేతుః శర్వాణ్యాశ్చరణస్య
వహోఽహం కవిలోకస్తోమపాలోఽస్మిభుజిష్యః. ౧౯

కాలునిగూడ (అంతకునిగూడ) జయించిన శర్వాణీచరణము నకు కింకరుఁడనగు ఈ నేను- కవిలోకాధీశ్వరుఁడనై యున్నాను.

ప్ర భ:—ఆ యీ పార్వతీపాద భక్తిమాహాత్మ్యమువలననే- నేను కవీశ్వరుడ నైతినని భావము. ఇందు దాస్యమను భజనము చెప్పఁబడినది.

అవ:— క్రిందిశ్లోకమున సఖ్యమును చెప్పుచున్నాడు.

మూ. రక్తేదర్శయరాగం రుద్రాణీ పదపద్మే
చేతః పుష్యతిశోభాం సారస్సారవతోఽగ్రే॥ ౨౦

ఓ మనమా! రక్తమగు (ఎఱ్ఱనిదగు — రాగము గలదగు) రుద్రాణీపదపద్మమునందు రాగమును (ప్రేమమును) ప్రదర్శింపుము. అట్లుచేసినయెడల శ్రేయముకలుగును. అదెట్లనిన:— సారవంతుని(బల వంతుని) యెదుట సారము (బలము) శోభను పోషించును.

ప్ర భ:—అనురక్తినిముందు-అనురాగము వృద్ధినొందును. సారవంతునిముందు సారము వృద్ధినొందును. అనిభావము.

అవ:-'ఆత్మనివేదనమే - ప్రేమరూపమును, ముక్తిప్రదమును, అగు పరాభక్తి' అనునభిప్రాయమున అంబాపదభక్తిరూపమగుఆత్మ రతిని నాలుగుశ్లోకములచేత ప్రదర్శించుచున్నాఁడు.

మూ. సంశోధ్యాగమజాలం సారాంశంప్రవదామః
స్కన్దామ్బాపదభక్తిర్భుక్త్యై చాథముక్త్యై. ౨౧

ఆగమబృందమునుపరీక్షించి,అందుముఖ్యమగుఅంశమును(సారాం శమును)చెప్పుచున్నాము. స్కందాంబయొక్క పదభక్తి,ఐహికాముష్మిక భోగముకొఱకును, మోక్షముకొఱకును, గూడ సమర్థమగుచుండును.

ప్ర భ:—వేదములను. ప్రమాణశాస్త్రములగుతంత్రములను, సంశోధించిన యెడల- జగన్మాత పదభక్తియే. భోగమోక్షప్రదమగునని తెలియును.

మూ॥ వాత్సల్యం గతిహీనేష్వాయుష్యం సుకృతస్య
భూయోభిః సహసఖ్యం శ్రీహేతుష్విహముఖ్యమ్. ౨౨

గతిలేనివారగు దీనులవిషయమునందగు వాత్సల్యము (ప్రీతి) పుణ్యమునకు జీవితమునిచ్చును. బహుసంఖ్యాకులగు జనులతోడి సఖ్యము-ఈలోకమున సంపత్ కారణములయందు ముఖ్యము.

ప్ర భ:— రక్షావిహీనులగు జనులయెడ ప్రీతిగలిగియుండుటవలన పుణ్యము వృద్ధినొందును. బహుజనసౌహార్ద్రము— పరోపకారవర్ధనము. అని భావము.

మూ॥ శ్లాఘ్యం పుష్యతి కామం ప్రేమాస్వప్రమదాయామ్
శర్వాణీ పదభక్తిర్నిత్యాయ ప్రమదాయ॥ ౨౩

స్వస్త్రీయందలి ప్రేమము- శ్రేష్ఠమగు కామమును వృద్ధి నొందించును. ఉమాపాదభక్తి—నిత్యమగునానందము నొసఁగును.

మూ॥ ఏవైకైవం బహుభేదా భిన్నత్వాద్విషయాణామ్।
రత్యాఖ్యాప్రీతిరన్తః సాసూతేఫలభేదాన్ ౨౪

పూర్వశ్లోకమునఁ జెప్పఁబడినవిధమున రతి (ప్రీతి) అనుపేరు గల, అంతర్వృత్తి- (హృదయస్థితమగు ప్రీతిరసవృత్తి) విషయ(ఉపాధి) భేదమువలన వాత్సల్య-ప్రేమ-భక్త్యాది బహుభేదములు గలదై-పుణ్యమును వృద్ధినొందించుట, మొదలగు ఫలభేదములను సమకూర్చును.

ప్ర భ;— రతియనగా, ప్రీతి, అనురాగము, వాత్సల్యము, మున్నగునవి. ఉపాధిభేదమున రతియందుఁగలిగినభేదములు.

మూ॥ హర్షం కఞ్చనమాతుః, మత్తోభక్తి భరేణ
తన్వన్నేషవిధత్తాం హేరమ్బో మదలేఖాః ౨౫

భక్త్యతిశయముచేత- మదించి (మదమునొంది-లేక హర్షించి) మదలేఖలను(మదజలరేఖలను, లేక, మదలేఖావృత్తనిబద్ధములగు స్తుతులను) కావించుచు (హేరంబుఁడు- గణపతి-లేక కవి-గణపతి) తల్లియగు ఉమకు అనిర్వచనీయమగు హర్షమును ఘటించుఁగాత!

వివ;— ఇందుపమ ధ్వనించుచున్నది. గజముఖుఁడగుటవలన దానధారచేత మదించి మదజలరేఖలను వెలార్చుచున్న గణపతివలె, మదించి (హర్షించి) మదలేఖావృత్తనిబద్ధములగు స్తుతులను గావించిన గణపతి-తల్లియగు నుమకుసమ్మదమును గలిగించుగాతమని భావము.

ఇది సవ్యాఖ్యమగు ఏకోనత్రింశస్తబకము, ఇరువదితొమ్మిదవ స్తబకము.

[ ౮ వ శతకమున మొదటి స్తబకము ]

ఓం నమో భగవతే శ్రీరమణాయ, శ్రీభారతీ శ్రేయసే నమః.

# ఉమాసహస్రము



## త్రింశ స్తబకము (ముప్పదవ స్తబకము)

[ శివ శతకమున 2వ స్తబకము ]

అవ:- ఈ ముప్పదవ స్తబకమునందు, ధ్యానావాహనాసనాద్యుపచార రూపమగు అధ్యాత్మపూజ- కీర్తింపఁబడుచున్నది. అందు మొదట- హాసస్తుతి కావింపఁబడుచున్నది.

మూ॥ కృతేన సానిసర్గతో ధృతేన నిత్యమాననే
సితేన శీతశైలజాస్మితేన శంతనోతు మేః ౧

స్వభావమువలన సిద్ధించినదియు, ముఖమునందు నిత్యమును ధరింపఁబడినదియు, తెల్లనిదియు, అగు మందహాసితముచేత సర్వేశ్వరి యగు ఆపార్వతి నాకు సుఖమునొసఁగుఁగాత !

మూ॥ ప్రతిక్షణం వినశ్వరా, నయే! విసృజ్య గోచరాన్
సమర్చయేశ్వరీం మనో వివిచ్య విశ్వశాయినీమ్॥ ౨

ఓ మనస్సా ! ప్రతిక్షణమునందును వినశ్వరములును, ఇంద్రియార్థములును, అగు శబ్దాదివిషయములను పరిత్యజించి, మనస్సును వివేచించి(చిత్తవృత్తులను వేరుగాఁజేసి)వృత్తులకును,విషయములకును, ఆధారముగానున్న విశ్వశాయినియగు నీశ్వరిని పూజింపుము.

ప్ర థ:—దీనిచేత పూజోపచారములందు ప్రథమమగు ధ్యానము చెప్పఁబడినది.

మూ॥ విశుద్ధదర్పణేనవా విధారితే హృదాంబ! మే
అయి ప్రియచ్ఛ సన్నిధిం నిజేవపుష్యగాత్మజే ! 3

అమ్మా! పార్వతీ! నిర్మలమగు దర్పణముచేతనువలె నాహృదయముచేత లెస్సగాధరింపఁబడిన నీశరీరమునకొక- సాన్నిధ్యమునిమ్ము.

ప్ర భ:—విశుద్ధమగు నద్దమువంటువలె ప్రసన్నమగు నాహృదయమున స్థితి గల నీరూపమును ప్రకర్శింపుమని భావము. దీనిచేత_ ఆవాహనము చెప్పఁబడినది.

మూ॥ పురస్యమధ్యమాశ్రితం సితం యదస్తి పఙ్కజమ్।
అజాణ్డమూల్యమస్తు తే సురార్చితే! తదాసనమ్॥ ౪

దేవపూజితవగు జననీ! పురమధ్యము (శరీరమునకు ముఖ్యమును మూలమును అగుహృదయము) నాశ్రయించిన శ్వేతపుండరీకమున్నది. అది బ్రహ్మాండముయొక్క_ వెలగలది. ఆ నా హృదయము- నీకాసనమగుఁగాత!

ప్ర భ:_ 'బ్రహ్మాండమూల్యమగు నాహృదయారవిందము నీకాసనమగు గాత!' అని భావము.

విశే:—హృదయారవిందము- బ్రహ్మాండముయొక్క_ మూల్యము (వెలఁగలదనువంశమును శ్రుతి చెప్పుచున్నది. "యావాన్వా అయమాకాశః తావానేషోన్తర్హృదయఆకాశః. ఉభే అస్మిన్ద్యావా పృథివీ అన్తరే సమాహితే, ఉభా వగ్నిశ్చ వాయుశ్చ సూర్యాచన్ద్రమసావుభౌ,విద్యున్నక్షత్రాణి, యచ్చాస్యే హాస్తి,యచ్చనాస్తి సర్వం తదస్మిన్ సమాహితమ్" అని.

(ఛాందోగ్యోపనిషత్, అష్టమోధ్యాయః, 3

'బ్రహ్మపురమగు శరీరమునందు—దహరమగు (అల్పమగు) గృహమువంటి హృదయపుండరీకమునందు—దహరమగు (అల్పతరమగు) ఆకాశమునందు (అకాశాఖ్యమగు బహ్మమునందు) ఏమున్నది? అందన్వేషింపఁదగినదిగాని. విశేషించి తెలియఁదగినదిగాని, యేమున్నది?" అని అడిగిన శిష్యులకు— ఆచార్యుఁ డిట్లు చెప్పవలయును. "పుండరీకమునందున్న యాకాశము పుండరీకముకంటె నల్పతరమను నభిప్రాయముచేత— పుండరీకమునందు దహరాకాశమున్నదని చెప్పుటలేదు. "హృదయపుండరీకమల్పము. దానియందున్న యంతఃకరణము_ పుండరీకాకాశము చేత పరిచ్ఛిన్నము. ఆయంతఃకరణము— విశుద్ధముగునపుడు, ఇంద్రియాదుల నుపసంహరించిన యోగులకు స్వచ్ఛమగు జలమువంటువలెను, శుద్ధమగు నద్దమునందు వలెను, ప్రతిబింబరూపమును, విజ్ఞానజ్యోతిఃస్వరూపావభాసమును, అగు చుతావనాత్రమగు (అత్యల్పమగు) బ్రహ్మము— గ్రహింపఁబడును" అనునభిప్రాయమున హృదయపుండరీకమునందు అంతఃకరణోపాధినిమిత్తమగు దహరమగు (అల్పతరమగు) ఆకాశమున్నదని చెప్పియున్నాము. కాని స్వయముగా పరిణామముఫలన

భౌతికమగు నీయాకాశము—ఎంతదియో, అంతర్గతమగు నీహృదయాకాశముగూడ— అంతదియే. అని చెప్పఁబడినది. కాని యీ యంతరాకాశము—భౌతికాకాశతుల్యమగు పరిణామముమాత్రమే కలదికూడ కాదు. అనంతమగు ఈ బ్రహ్మాకాశమునకనురూపమగు దృష్టాంతము లేకుండుటవలన భౌతికాకాశతుల్యత్వము చెప్పఁబడినది. "ఆకాశము, దివము, భూలోకము, కూడ— ఈయంతరాకాశముచేతనే— ఆవరింపఁబడియెను" అనియు, "ఆ యీ యాత్మవలననే (బ్రహ్మాకాశమువలననే)—ఆకాశము సంభవించెను" అనియు, ఈమొదలగు నర్థమును బోధించు శ్రుతులవలన— బ్రహ్మస్వరూపమనంతమని తెలియుచున్నది. ద్యావాపృథివులు రెండునుకూడ— బుద్ధ్యుపాధివిశిష్టమగు బ్రహ్మాకాశమునందే సమాహితములు (చక్కగా నుంచఁబడినవి.) అగ్నియు వాయువు అను రెండును, సూర్యుఁడు చంద్రుఁడు అనునిద్దఱును, విద్యున్నక్షత్రములును, దేహవంతుఁడగు నీయాత్మకు— ఆశ్రయమై యున్నవి. ఈలోకమునందున్నదియు, నష్టము కాఁగలదియు, నగు సర్వమునుగూడ హృదయాకాశమగు బ్రహ్మమునందే ఉంచఁబడియున్నది. కావున తదాశ్రయమగు హృదయపుండరీకము—బ్రహ్మాండమూల్యమగుచున్నది. ఉమాసహస్రపశ్చిమభాగమునందలి చతుర్థస్తబకమునందున్న "చిత్తమణీయోవిత్తం య ఇదం మూల్యే ప్రపఞ్చతోఽప్యధికమ్। హృదయగుహాయాం నిహితమ్" అను 22వ శ్లోకమీయర్థమునే తెలుపుచున్నదని గ్రహించునది. [ఈయంశము గురుముఖమున నెఱుఁగవలయును] 'పురస్య' అను నీశ్లోకముచేత— ఆసనము చెప్పఁబడినది.

మూ॥ అఖణ్డధారయార్ద్రవ న్నవేన్దుశేఖరప్రియే!
మదీయభక్తిజీవనం దధాతు తేఽమ్బ! పాద్యతామ్॥ ౫

బాలచంద్రశేఖర ప్రియసివగు జననీ! అవిచ్ఛిన్నమగు (ఎడతెగని) ధారచేత స్రవించుచున్న మదీయమగు భక్తియను జీవనము (ఉదకము) నీకు పాద్యమగుఁగాత!

ప్ర భ:— నిరంతరధారారూపమగు నా యీ భక్తి - నీచరణములకుపాద్యముగాఁ జేయఁబడుఁగాత! పాద్యమను ఉపచారము చెప్పఁబడినది.

మూ॥ వివాసనౌఘ మానస ప్రసాదతోయ మమ్బ మే
సమస్తరాజ్ఞి! హస్తయోరనర్ఘ్యమర్ఘ్యమస్తు తే॥ ౬

సర్వేశ్వరీ! వాసనాసమూహమును పోఁగొట్టుకొనిన మనస్సు యొక్క నైర్మల్యమేయగు తోయము-(నీరు) నీహస్తములకు అమూల్యమగుఅర్ఘ్యము(పూజాద్రవ్యము)అగుఁగాత!(నామనోనైర్మల్యమే-నీపూజ)అని భావము.

ప్ర భ:—అర్ఘ్యోపచారమునకుగాను మనఃప్రసాదము-తోయమువలె నాచరించుఁగాత!

మూ॥ మహేన్ద్రయోని చిన్తనాత్ భవన్ భవస్యవల్లభే!
మహారసోరసస్త్వయానిపీయతాం విశుద్ధయే॥ ౭

భవప్రియా! మహేంద్రయోనిని ధ్యానించుటవలన స్రవించుచున్న మహారసమును- (శ్రేష్ఠమగు ఆస్వాదముగల అమృతరసమును) నాశరీరమునకు శుద్ధిని సంపాదించుటకై నీవు త్రాగుదువుగాక!

ప్ర భ:—"అన్తరేణతాలుకే య ఏషస్తన ఇవావలమ్బతే, సేన్ద్రయోనిః, యత్రాసౌకేశాన్తో నివర్తతే, వ్యపోహ్యశీర్షకపాలే" హృదయమునకు(పుండరీకాకారమగు మాంసపిండమునకు)మీదుగా ప్రవర్తించుచున్న సుషుమ్నా నాడి-యోగశాస్త్రములయందు ప్రసిద్ధమైయున్నది. ఆనాడి-తాలుకలకు మధ్యభాగమునందున్నది. ఆతాలుకల మధ్యభాగమునందే పుండరీకాకారమగు మాంసపిండము స్తనమువలె వ్రేలాడుచుండును. సుషుమ్నా నాడి- దానిమధ్యమునుండి మీఁదికి పోవుచు, కేశముల మొదళ్ళుగల ప్రదేశమున శిరఃకపాలములను భేదించి బయలువెడలి, బ్రహ్మస్వరూపము నొందుటకు మార్గమై యుండుటవలన- 'ఇంద్రయోని' (పరమాత్మను బొందుటకు కారణము) అని చెప్పఁబడుచున్నది. 'సయఏషోఽన్తర్హృదయ ఆకాశః, తస్మిన్నయం పురుషోమనోమయః. అమృతో హిరణ్మయః" పుండరీకాకారముగు మాంసపిండము— హృదయమని చెప్పఁబడుచున్నది. దానియందే ప్రాణములున్నవి. అది ఊర్ధ్వనాలమును,అనేకనాడీ సుషిరమును అధోబిలమును గల మాంసపిండము। ఆహృదయమునందున్న యాకాశమున (అవకాశమున) ఆ యీ పురుషుఁడున్నాఁడు. పురమునందు శయనించుటవలనగాని, పూర్ణుఁడగుటవలనగాని, పురుషుఁడని చెప్పఁబడునతఁడు మనోమయుఁడు. (అంతఃకరణము నభిమానించువాఁడు లేక, అంతఃకరణమయుఁడు, లేక అంతఃకరణలింగుఁడు) అమరణధర్ముఁడు. జ్యోతిర్మయుఁడు, ఇట్టి లక్షణములు గలిగి హృదయాకాశమునందు సాక్షాత్కరింపఁబడిన పరమేశ్వరుని (అపరబ్రహ్మమును) చేరుటకు విద్వాంసుఁడగుయోగికి ఇంద్రయోనియగు సుషుమ్నానాడీరంధ్రమే-మార్గమగుచుండునని తైత్తిరీ

యోపనిషత్తు చెప్పుచున్నది. ఇఁక ప్రస్తుతవిషయమేమనిన;— ఇంద్రయోనియగు సుషుమ్నామార్గమును ధ్యానించుటవలనఁ గలుగు నమృతరసమును నీవే యాస్వాదింపుము. తదాస్వాదమువలన శుద్ధమగు శరీరము- నీకు నివాసస్థలము కాఁగాక అని భావము. ఈశ్లోకముచేత పానీయమను నుపచారము కావింపఁబడినది. [ఈయంశముగూడ- బ్రహ్మవిదులగు యోగులసన్నిధి నభ్యసింపఁ దగును.]

మూ॥ సహస్రపత్రపఙ్కజద్రవత్ సుధాజలేన సా
సహస్రపత్రలోచనా పినాకినోఽభిషిచ్యతే॥ ౮

సహస్రార (సహస్రదళ) కమలమునుండి స్రవించుచున్న అమృతరసముచేత- శివుని సహస్రపత్రలోచన (శివునియొక్క కమలాక్షి) యగు ఆభగవతి-అభిషేకింపఁబడుఁగాత!

ప్ర భ:—సహస్రారమునందలి యమృతరసముచేత- దేవిని స్నానము చేయింతునని భావము. నైష్ఠికశిరోమణియగు గణపతికవియొక్క శరీరములోపల ప్రసన్నయగుదేవి- యోగశక్తిచేత- ఆవిష్కృతమగు సహస్రారామృతముచేత నభిషేకింపఁబడినదనునంశము దీనిచేత స్పష్టపడుచున్నది. ఈశ్లోకముచేత- స్నానమను ఉపచారము చెప్పఁబడినది.

మూ॥ మమార్జితం యదిన్ద్రియైః, సుఖం సుగాత్రి! పఞ్చభిః।
తదమ్బ! తుభ్యమర్పితం సుధాఖ్యపఞ్చకాయతామ్॥ ౯

సుగాత్రీ! జననీ! కన్ను మొదలగు నింద్రియములచేత చూచుట మొదలగు ఏసుఖమును నేను సంపాదించుచున్నానో, ఆ సుఖము- నీకు పంచామృతము లగుఁగాత!

ప్ర భ:—సంప్రదాయము ననుసరించి బాహ్యపూజోపచారములయందు సుప్రసిద్ధమగు పంచామృతస్నానమిందు జెప్పఁబడినది.

మూ॥ వసిష్ఠగోత్రజన్మనా ద్విజేన నిర్మితం శివే!
ఇదం శరీరమేవ మే తవాస్తు దివ్యమంశుకమ్॥ ౧౦

శివా! భగవతీ! వసిష్ఠగోత్రమున జనించిన ద్విజుఁడగు కౌండిన్యుఁడను బ్రాహ్మణునిచేత నిర్మింపఁబడిన (ఉత్పాదింపఁబడిన) యీనాశరీరము నీకు దివ్యమగుదుకూల మగుఁగాత!

ప్ర భః— ప్రశ్న:—స్వీయమగు శరీరము తన చేతనే నిర్మింపఁబడినదని చెప్పబడినది. ఇది యెట్లు కుదురును?

ఉత్తరము:— నైష్ఠికుఁడగు నీయాచార్యుఁడు- దేవీవసనయోగ్యమగు, లోపలి దేహమును తపఃఫలముచేత నిర్మించి- తత్పరిపాకమహిమచేత- భౌతికమగు (భౌమమగు) దేహముగూడ- దేవికి దివ్యదుకూలమగుఁగాత! అని చెప్పుచున్నాఁడు. దీనిచేత- వసనమను [వస్త్రముఅను] ఉపచారము- చెప్పబడినది-

మూ॥ విచిత్రసూక్ష్మతన్తుభృ న్మమేయమాత్మనాడికా।
సుఖప్రబోధవిగ్రహే! మఖోపవీతమస్తు తే॥ ౧౧

చిదానందశరీరవగు (జ్ఞానానంద విగ్రహవగు) జననీ! అద్భుతమును, సూక్ష్మదృగ్గోచరమును, అగు తంతువును (సూత్రమును) భరించునదియగు నాయీ ఆత్మనాడిక(సుషుమ్నానాడి)నీకు యజ్ఞోపవీతమగుఁగాత!

ప్ర భః— అంతఃస్పర్శగమ్యమును, విచిత్రమును, అగుచు- హృదయము నుండి ఆత్మజ్యోతిస్సును వహించుచు, సహస్రారమునకుఁ బోవునదియు, మధ్యనాడి, బ్రహ్మనాడి, అమృతనాడి, అని యాత్మవేత్తలచేత గానముచేయఁబడునదియు,నగు— సుషుమ్నా నాడి- నీకు జన్నిదమగుఁగాత! అని భావము - వస్త్ర సమర్పణముతరువాత- ఉపవీతధారణము చెప్పఁబడినది.

మూ॥ మహద్ విచిన్వతో మమస్వకీయ తత్త్వవిత్తిజమ్
ఇదంతు చిత్తసౌరభం శివేతవాస్తుచన్దనమ్॥ ౧౨

శివా! సర్వోత్కృష్టమగు తత్త్వమును (లేకవస్తువును) వెదకుచున్న నాయొక్క- స్వకీయమైన (ఆత్మీయమైన) యాదార్థ్యము (తత్త్వము) యొక్క- జ్ఞానముచేత జనించిన ఈచిత్తసౌరభమే నీకు చందనము (గంధము) అగుఁగాత!

ప్ర భః—తత్త్వవిచారమువలన సువాసితమగు మనసు- నీకు గంధముగాఁ జేయఁబడుఁగాత! అనిభావము. దీనిచేత- గంధధారణము— కీర్తింపఁబడినది.

మూ॥ మహేశనారి! నిశ్వసం స్తథాఽయముచ్ఛ్వసం స్తదా
తవానిశంసమర్చకోమమాస్తు జీవమారుతః॥

మహేశ్వరనాకీ! ఎల్లప్పుడునుగూడ నిశ్వసించుచు. (వెలుపలికి పోవుచు) ఉచ్ఛ్వసించుచు, (లోపలికివచ్చుచు) సంచరించుచున్న నాయీప్రాణవాయువు— నిన్ను నిరంతరముగా పూజించుగాత!

ప్ర భ:—నాప్రాణవాయువు— నీకు ప్రాణాప్రసన్నమగుఁగాత! అని భావము, దీనిచేత 'ప్రసాప్రచ్ఛనము' అను సపచారము చెప్పఁబడెను

మూ॥ విపాకకాలపావక ప్రదీప్తపుణ్యగుగ్గులుః ।
సువాసనాఖ్యధూపభృద్ భవత్వయం మమామ్బ తే॥ ౧౭

విపాకకాలమునందగు నగ్నిచేత ప్రదీప్తమగు పుణ్యమగు సుగంధధూపద్రవ్యము— నీకు సువాసనాఖ్యమగు ధూపమగుఁగాత!

ప్ర భ:—నాయొక్క పుణ్యపరిపాకవశమువలన కలిగిన సువాసనలే (శోభన సంస్కారవిశేషములే) నీకు ధూపమగుఁగాత! అని భావము. ధూపము— సమర్పింప బడినది.

మూ॥ గుహావతార మానినా మయీశ్వరి! ప్రదీపితా!
ఇయం ప్రబోధదీపికా ప్రమోదదాయికాఽస్తు తే. ౧౮

ఈశ్వరి! గుహావతారుఁడగు (స్కందాంశమువలన జన్మించిన) మానిచేత (రమణ మహర్షిచేత) ప్రజ్వలింపఁజేయఁబడిన— యీప్రబోధ (జ్ఞాన) దీపిక— నీకు, ప్రమోదదాయిక యగుఁగాత!

ప్ర భ:— ఇందు దీపము— దర్శితము,

మూ॥ ఇమామయి! ప్రియాత్ ప్రియాం మహారసా మహాకృతిమ్!
నివేదయామిభుజ్యతామియంత్వయానిరామయే. ౧౯

నిరామయ (నీరోగ) వగు జననీ! ప్రియముకంటెనుగూడ ప్రియమయినదియు, గొప్పరసము (రుచి) గలదియు, అగు ఈయహంకారమును (నీభోజనముకొఱకు) నివేదించుచున్నాను. దీనిని నీవు భుజింపుము.

ప్ర భ:—ప్రాణులకు— అత్యంతప్రియమగు వస్తువు— 'నేను' అనునది. (అహంకారము) దానిరుచి మిక్కిలిగొప్పది. అయినను దానిని నీకు సమర్పించు చున్నాను. నీవు దానిని భుజింపుమని భావము.

విశే:- "అది భక్షింపఁదగినది" అను వచనమును స్ఫురింపఁజేయుటకు గొప్ప రసముగలదని చెప్పఁబడినది. స్త్రీవు రోగము లేనిదానవు. కావున,దోషభూయిష్ఠమయి వనుగూడ నహంకారమును భుజించుటవలన నీకు రోగము కలుగదని స్ఫురింపఁ జేయుటకు 'నిరామయయగు జననీ!' అని సంబోధింపఁబడినది. మహారసముగలదని చెప్పుటవలన- ఈయహంకారము- శుద్ధమని తోఁచుచున్నది. భక్షణీయవస్తువగు నహంకారము శుద్ధము కానియెడల- భగవతికి నివేదింపఁగూడదుగదా! శుద్ధము కానిదైననుగూడ నహంకారమును గ్రహించుటకుఁ దగిన సామర్థ్యము గల నిరామయ యగు దేవికి శుద్ధమగు నహంకృతిని గ్రహించుటకు సామర్థ్యము లేకుండునా? దీని చేత- అహంకారార్పణమను 'నైవేద్యము' చెప్పఁబడినది.

మూ. సరస్వతీ సుధాయతే మనో దధాతి పూగతామ్।
హృ దేవపత్ర మమ్బికే! త్రియంసమేత్య తేఽర్ప్యతే. ౧౭

అమ్మా! నామాట సున్నముగాను. మనసు చెక్కగాను, హృదయము ఆకుగానుచేసి కూర్చి. నీకు తాంబూలము నిచ్చుచున్నాను.

పరి భః- ఇది- తాంబూలార్పణము.

మూ. వినీలతోయదాన్తరే విరాజమాన విగ్రహా ।
నిజావిభూతిరస్తు తే తటిల్లతా ప్రకాశికా॥ ౧౮

వినీలజలదాంతరమునందు విభ్రాజమానమగు శరీరముగలదియు, నీయొక్క స్వీయకలావిశేషమును, అగు తటిల్లత- ఆజ్ఞాచక్రమున స్ఫురించు మెరుపుదీగ] నిన్నుప్రకాశింపఁజేయుఁగాత.

ప్ర భ;—నాశరీరమునందలి ఆజ్ఞాచక్రము (అరవచక్రము) మీఁద స్ఫురించుచున్న మెరుపుతీగ- నీకు నీరాజనమగుఁగాత! తంత్రశాస్త్రములందు— కొందఱు అనాహతచక్రమునకు దిగువనున్న చక్రములయందు, తటిత్స్వరూపము కాన్పించునని చెప్పుదురు. కొందఱు- ఆజ్ఞాచక్రమునకు మీదుగనే యది కాన్పించునని చెప్పుదురు. దీనిచేత 'నీరాజనము' చెప్పఁబడినది.

మూ. స్వరోఽయమన్తరమ్బికే! ద్విరేఫవత్ స్వరంస్తదా
మమాభిమన్త్రధీసుమందదాతి దేవి! తేఽఙ్ఘ్రియే. ౧౯

అంబికా! (అమ్మా) లోపలనున్న యీస్వరము (శుద్ధమగు ప్రాణము) భ్రమరమువలె, నెల్లప్పుడును అవ్యక్తనాదాయమానమై నాయొక్క బుద్ధిపుష్పమును అభిమంత్రించి (జపించి) నీచరణమున కర్పించుచున్నది.

ప్ర భ:—"స్వృశబ్దోపతాపయోః" అనుటవలన- స్వృధాతువునుండి నిష్పన్నమగు స్వరశబ్దము నాదార్థకమని తెలియఁదగియున్నది. "ఈస్వరమే- ప్రాణము నకు మూలమును, ఉద్గీథాపరనామధేయమును అగు స్వరూపము" అని యోపనిషదులు చెప్పుదురు.

మూ॥ తవార్చనం నిరన్తరం యతోఽవిధాతు మస్మ్యహమ్।
నవిశ్వనాథపత్ని! తే విసర్జనం విధీయతే॥ ౨౦

విశ్వనాథపత్నివగు జననీ! నిన్ను విసర్జించుట- విధికాదు. కావున నిన్ను నిరంతరమును పూజించుటకు సిద్ధుఁడనైయున్నాను.

ప్ర భ:—అర్చనము ముగిసినపిమ్మట చేయఁదగిన "విసర్జనము" అనుకర్మ యిచట నిషేధింపఁబడినది.

మూ॥ వియోగ ఇన్దుధారిణా న చేహ విశ్వనాయికే!
మదమ్బ! సోఽత్రరాజతే తటిల్లతాశిఖాన్తరే॥ ౨౧

నాతల్లీ! సహస్రార చంద్రధరుఁడును, హృదయాకాశగతుఁడును, అగు అశివుఁడు- నాభికి మీఁదుగా (హృదయమునందు) ప్రకాశించుచున్న విద్యుల్లతా శిఖామధ్యమున జ్వలించుచుండును. (కావున) విశ్వేశ్వరీ! చంద్రశేఖరుఁడగు నాశివునితోడి వియోగముగూడ హృదయమునందుఁ గలుగదు.

ప్ర భ:—సహస్రారకమలమును ధరించిన ఆత్మ- హృదయమునందే యున్నాఁడు. వానితోడి వియోగము కలుగనేరదని భావము.

వి శే: - "అధోనిష్ట్యా వితస్త్యాన్తే నాభ్యా ముపరితిష్ఠతి" అని యారంభించి "నీవారశూకవత్ తన్వీ పీతా భాస్వత్యణూపమా। తస్యాః శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః" అని (శ్రుతియందు) వినబడుచున్నదిగదా! సుషుమ్నా యను నాడీ

హృదయమునుండి సహస్రారమునకు క్రొత్తిపున్నను దీనికొనిపోవుచుండునని యింతకు ముందుపన్యసింపఁబడినది. ఆనాడియందున్న పురుషునకు హృదయములోఁడ వియోగ మెట్లుకలుగును? పూర్వశ్లోకమున "విసర్జనము విధింపఁబడదు" అని నిరంతరపూజా హేతువు-చెప్పఁబడినది. ఈశ్లోకమునందు-చంద్రశేఖరునితోఁడి (సహస్రారకమల ధరుఁడగు అర్మలోడి) వియోగమునలనే-పూజకు విచ్ఛేదము సంభవించును. కాని, అది యిచట సంభవింపదని చెప్పఁబడినది. కావున నిరంతరమగు పూజాసామగ్రి-నాకు సిద్ధించినదనునర్థము సూచింపఁజేయఁబడినది.

మూ॥ ఇదం శరీరమేకకం విభావ్యనవ్యమన్దిరమ్।
విహారమత్రసేశ్వరా భవాని! కర్తుమర్హసి॥ ౨౨

భవానీ! ఈశరీరమును-ఏకాకియగు (సజాతీయ సహాయశూన్యమగు) నూతన భవనమునుగా విభావించి, (అభిమానించి) ఈశ్వరునితోఁగూడి, యిందు విహారము నొనర్పింపుము.

ప్ర భా:—ఈశ్వరికి ముఖ్యమగుస్థానము—సహస్రారము. ఈశ్వరునికి స్థానము హృదయము. కావుననే "యీశ్వరునితోఁగూడి" అని చెప్పఁబడినది.

మూ॥ జడేష్వివాలసేష్వివప్రయోజనం ననిద్రయా।
విహర్తుమేవయాచ్యసే హృదీశపద్మరాజ్ఞి! మే. ౨౩

ఈశ్వరభవనాధిరాజ్ఞీ! అమ్మా! అజ్ఞులయందును, మందులయందునువలె, నిద్రించుటచేత-ప్రయోజనములేదు. నాహృదయమున విహరించుటకే (సంచరించుటకే) నిన్ను యాచించుచున్నాను.

ప్ర భా:—జ్ఞానశక్తిలేని జడులయందును, క్రియాశక్తిలేని అలసులయందును గూడ దేవి-నిద్రించుచుండును. కావున వారియందువలె నాయందు నిద్రింపకుము. నాయందు నిరంతరముగా సంచరింపుమని భావము.

మూ॥ అయంతవాగ్రిమః సుతః, శ్రితో మనుష్యవిగ్రహమ్।
తనూజవేశ్మసౌష్ఠవం మృడానిపశ్యకీదృశమ్. ౨౪

ఈ నీపెద్దకొడుకు (గణపతి) మనుష్యవిగ్రహమును (మానవదేహమును) ఆశ్రయించియున్నాఁడు మృడానీ! నీపుత్త్రుని గృహముయొక్క (శరీరముయొక్క) సౌష్ఠవము—ఎట్టిదో చూడుము.

పరి శే.—మానవశరీరుఁడైన గణపతియొక్క శరీరసుస్థితి— యెట్టిదో విలోకింపుమని భావము.

మూ॥ గణేశితుర్మహాకవేః కృతా ప్రమాణికావలీ
మనోమ్బుజే మహేశ్వరీ ప్రపూజనేషు శబ్ద్యతామ్. ౨౫

మహాకవియగు గణేశ్వరకవి రచించిన యీ ప్రమాణికావళి (ప్రమాణికావృత్త నిబద్ధములగు శ్లోకముల సంహతి) మహేశ్వరీ పూజలయందు పూజకుని మనఃకమలమున నుచ్చరింపఁబడుఁగాక!

ఇది-సవ్యాఖ్యమగు త్రింశత్స్తబకము—
8 వ శతకమున—2 వ స్తబకము.



ఓం గణాధిపతయే నమః. శ్రీ భారతీదేవ్యై నమః.

# ఉమాసహస్రము

## (ఏకత్రింశ స్తబకము)

[ 8వ శతకమున, 3వ స్తబకము ]

అవ:— ఈ ముప్పది యొకటవ స్తబకమున భగవతీ నాసా మహిమ కీర్తింపఁబడుచున్నది.

మూ॥ దరస్మిత శ్రీకపటా సుపర్వ
స్రోతస్వినీ పర్వతజాస్యజాతా ।
పఙ్కం మమక్షాలయతాదశేషం
సంసారమగ్నే హృదయే విలగ్నమ్॥ ౧

పర్వతమునుండి యుదయించిన పార్వతియొక్క ముఖమునుండి జనించిన దరహాసిత ప్రభయను కపటము (మిష)గల దేవనది-(గంగ) జనన మరణాత్మకమగు సంసారమున మునిఁగిన నాహృదయమున విలగ్నమగు పంకమును (పాపమును, లేక బురదను) కడిగివేయునుగాత!

విశే:—గంగానదియే కపటముచేత పార్వతీముఖమునందలి మందహాస ప్రభగా తోఁచుచున్నదని చెప్పఁబడినది. "దేవనదియగు గంగ-పాపములను ప్రక్షాళితములనొనర్చును ఆగంగయే-పార్వతీముఖమునందలి 'చిరునవ్వు తళుకు' అనుమిషతో నున్నది" అని చెప్పఁబడినదిగదా! ఇచట- కపటశబ్దప్రయోగముచేత ఉపమేయమగు మందహాసప్రభ-అసత్యముగాఁ జేయఁబడి, ఉపమానమగు 1గంగానది సత్యముగా ప్రదర్శింపఁబడినది. కనుక, "ప్రకృతం యన్నిషిధ్యాన్యత్; సాధ్యతే సాత్వపహ్నుతిః" "ప్రస్తుతవిషయమును నిషేధించి అప్రస్తుతవిషయమును సాధించుచున్నదైనది యపహ్నుతియగును." అను కావ్యప్రకాశోక్తలక్షణమువలన నిది- అపహ్నుతియనునలంకారమగుచున్నది.

మూ॥ హారాట్టహాసేన సమం మిలిత్వా
పిత్రేవ పుత్రో గురుణేవ శిష్యః

విభ్రాజమానో మమ శంకరోతు
హాసాఙ్కురః కేసరివాహనాయాః ॥ ౨ ॥

తండ్రితోఁగూడిన తనయుఁడువలెను, గురువుతోఁ గూడిన శిష్యుఁడువలెను, హరుని యట్టహాసముతోఁగూడి, విభ్రాజమానమగు సింహవాహన (పార్వతి) యొక్క - హాసాంకురము - నాకు సుఖమును గలిగించుఁగాత!

ప్ర భా:—పితాపుత్రులువలెను, గురుశిష్యులవలెను కలిసియున్న హరాట్టహాస—దేవీమందహాసములు— నాకు సుఖము నిచ్చుఁగాతమని ప్రార్థనము. హరుని యట్టహాసము-భయంకరము. దేవీమందహాసము-సుందరము. వానిసంబంధము-హర రౌద్రతకు, శాంతిని కలిగించును. దీనిచేత— దేవియొక్క సింహవాహనయొక్క మందహాసములకు రామణీయకమును, లోకోత్తరప్రభావమును, వ్యంజింపఁజేయఁబడినవి.

మూ॥ నమశ్శివాయై భణత ద్విపాదో
యుష్మాకమగ్ర్యం ధిషణాం దధత్యై
ఆధారచక్రే శిశురమ్బికాయై
బ్రహ్మాణ్డచక్రస్య విధాయికాయై. ॥ 3 ॥

ఓద్విపాదులారా! (ద్విపాదపశువులారా!) బ్రహ్మాండచక్ర విధాయికయు, మూలాధారచక్రాధిశాయియగు గణపతికి అంబికయు, మీకు శ్రేష్ఠమగు ప్రజ్ఞ నిచ్చునదియు, అగు శివకు (పరమేశ్వరికి) నమోవాకమును పలుకుఁడు.

ప్ర భా:—"అధ్యండస్వరూపమున విశ్వవిధాత్రియు, అధిపిండస్వరూపమున, సర్వాధార మూలాధిష్ఠాతయగు గణపతికి తల్లియునగు దేవికి నమస్కరింపుఁడు. అట్లు నమస్కరింపనియెడల, చతుష్పాదజంతువులగు వ్యాఘ్రాదులకును. ద్విపాద జంతువులగు మీకును, భేదమేమియుఁ గలుగదు" అని భావము.

మూ॥ నదన్తిగావోఽపి విశిష్టకాలే
ష్వమ్మేతి యోనామ్నాయితే సకంనా
లక్ష్యంపునః ప్రాణవదస్తు సర్వం
సర్వస్యచాన్తర్హి పరాఽస్తి శక్తిః, ॥ ౪ ॥

గోవత్సములుకూడ- పాలుపితుకునపుడు 'అంబా!' అని శబ్దము నొనర్చుచుండును. విశిష్టకాలమున (అనుగ్రహప్రాప్తి సమయము నందు) అంబా! అని పిలువనివాఁడు మనుష్యుఁడా? సర్వమునందును కూడ- పరాశక్తి [పరయగుశక్తి] యున్నది. కావున ప్రాణముగల వస్తువంతయునుకూడ-('అమ్మా' అని సంబోధింపఁ దగిన) లక్ష్యమే- (లక్షింపఁదగిన దృశ్యమే) అగును.

ప్ర భ:—పరాశక్తి—సర్వాంతర్వర్తిని. కావున నాయమ్మను పిలుచుటకు సర్వమును లక్ష్యమే యగును. మనుష్యులాయమ్మను సంబోధింపనియెడల వారు గోవత్సములకంటెనుగూడ నధములేయగుదురని భావము.

మూ॥ ఆత్మన్యథాన్యత్ర విధాయలక్ష్యం
తాం శక్తిమాద్యామఖిలేషు సుప్తామ్।
యావత్ప్రబోధం ముహురాహ్వయస్వ
ప్రబుధ్యతే సాయదికిన్న్వసాధ్యమ్ ॥౫॥

స్వాత్మయందును, తదితరమునందును లక్ష్యమునుంచి (బుద్ధిగోచరమగునట్లు హృదయమున గుర్తించి) సర్వమునందును నిద్రించునది యగు నాదిశక్తిని మేల్కొనునంతవఱకును ఆహ్వానింపుము. నీయాహ్వానబలమువలన నది మేలుకొనినయెడల అసాధ్యమేముండును?

ప్ర భ:—శక్తినాహ్వానించినవానియందు శక్తిప్రబోధము కలుగును. వానికి సర్వమును శక్యమగును.

మూ॥ యేనామశాన్తిం పరమాం వహన్తో
నామాని శీతాచలపుత్రికాయాః
సఙ్కీర్తయన్తో విజనేవసన్తి
జయన్తతాతాదపితే జయన్తి ॥౬॥

శ్రేష్ఠమగుశాంతిని వహించుచు, శీతాచలపుత్రికయగు పార్వతియొక్క నామములను సంకీర్తనమొనర్చుచు, వివిక్తస్థలమునందు వసించువారగు జనులు- జయంతజనకుఁడగు నింద్రునికంటెను గూడ జయము నొందియుందురు (ఉత్కృష్టులై యుందురు.)

ప్ర భ:—విజనప్రదేశమున నివసించుచు, శాంతిసంపన్నులై పార్వతీనామ సంకీర్తనపరులగు మనుష్యులు– జితేంద్రియత్వమునుగూడ నభ్యసించుచుందురని భావము.

మూ॥ నామాని సంకీర్తయతాం జనానాం
కారుణ్యవత్యాః కరివక్త్రమాతుః
పునర్జనన్యా జఠరే నివాసో
దాయాసవత్తా భవతీతిమిథ్యా॥ ౩

కారుణ్యవతియు, గజాననమాతయు. అగుపార్వతి నామములను గానముచేయు జనులకు– తిరుగ జననీజఠరనివాసమువలని దుఃఖము (గర్భవాసక్లేశము) కలుగుననుట మిథ్య. (అసత్యము)

ప్ర భ:—"దేవీనామసంకీర్తనపరులకు పునర్జన్మము కలుగదు. ఇది–సత్యము" అని భావము.

మూ॥ పాపైస్సమన్తాత్ సమభిద్రుతోఽపి
విశ్వస్య తే విక్రమమస్మిధీరః
నచేద్రసజ్ఞే! భవతీ బ్రవీతి
నామాని శీతాంశుభృతో హతోఽహమ్. ౪

ఓ రసజ్ఞా! (రసము నెఱుఁగుచున్న నాలుకా!) పాపములచేత నంతటనుగూడ నాక్రమింపఁబడి యున్నను నీవిక్రమమును విశ్వసించి– ధీరుఁడనై (భయరహితుఁడనై) యున్నాను. చంద్రధారిణి వగు పార్వతియొక్క– నామములను నీవు పలుకనియెడల నేనుహతుఁడ నగుదును.

ప్ర భ:—జిహ్వాబలమున బద్ధశ్రద్ధుఁడనగు నేను– దేవీనామగానము నొనర్చి నాపాపములనెల్ల ధ్వంసముచేయఁగలను. కాని యీజిహ్వ–నామోచ్చారణము నొనర్పని యెడల గతియేది?

మూ॥ దేహీతి సమ్పల్లవదర్పితానాం
ద్వారేషు ఘోషం కురుషే పరేషామ్।

భవాని! భద్రే! భువనాంబ! దుర్గే!
పాహీతి నాయాతి కిమంబ! జిహ్వే!

అమ్మా! నాలుకా! సంసారక్లేశముచేత గర్వించిన యితరులగృహ ద్వారములయందు 'దేహి' (ఇమ్ము) అని దానమునకై యాచ్ఞా ఘోషము నొనర్చుచుందువు. భవానీ! సర్వమంగళా! లోకమాతా! దుర్గా! పాహి (రక్షింపుము) అనుఘోష (పలుకు) నీకేలరాకున్నది?

తా. భ:— అల్పబుద్ధి సంసారమోహమున దర్పించిన మనుష్యుల నాశ్రయించి "దేహి" అను నీచమగు యాచనను నిందించి, భవానీత్యాదినామములను కీర్తించు టయే-సర్వాభీష్టప్రదమని చెప్పఁబడినది.

మూ॥ వాక్యాని వక్తుం యది తే రసజ్ఞే!
రసోజ్జ్వలాని వ్యసనం గరీయః
కిం నానమోన్తాని సుధాం కిరన్తి
నామాని నో సన్తి కుమారమాతు. ॥౧౦॥

ఓ రసజ్ఞా! (నామరసాస్వాదననిపుణమగు రసనమా!) శృంగారాదిరసములచేత దేదీప్యమానములగు వాక్యములను (కావ్యములను) పలుకుటయందు నీకు గురుతరమగు వ్యసనమున్నయెడల, (గొప్పకోరిక యందుయున్నచో) అమృతమును విశేషించునవియు- 'నమః' అను పదముచివరను గలవియు. అగు కుమారమాతయగు దేవియొక్క నామములు లేవా?

ప్రి భ;—అమృతవర్షులగు దేవినామములు- రసోజ్జ్వలవాగమృతవైభవాతిశాయులు, కావున వాని నుచ్చరింపుమని భావము.

మూ॥ యద్గీయతే శైలసుతాభిధానం
తదేవబోధ్యం సుకృతం ప్రధానమ్
అజ్ఞానిలోకస్య కృతే భణన్తి
యజ్ఞాది పుణ్యాని పరాణి విజ్ఞాః॥

పార్వతీనామగానమే ప్రధానమగు ప్రయత్నమని తెలియవలెనది. అజ్ఞాని లోకముకొఱకు విజ్ఞులు అగ్నిష్టోమాది యజ్ఞములను ప్రధానములగు ప్రయత్నములనుగాఁ జెప్పుచున్నారు.

ప్ర. భ:—యజ్ఞము— పరమపావనమగుట యోగ్యమగుచున్నది, కావున సామ వలన నేరని నామసంకీర్తనమే ఉత్తమ ప్రయత్నమని భావము

మూ. సామ్నా ప్రయుక్తేన జగద్వశేస్యా
న్నామ్నాం సహోక్తేన జగద్వశేక్త్రీ ।
వేదో భయం సమ్యగిదం కృతీయో
భవే భయం తస్య కుతోఽపి నస్యాత్ ౧౨

సామ (ప్రియవచన) ప్రయోగముచేత– జగత్తు వశమగును. సంతతమగు నామసంకీర్తనముచేత జగన్నాయికయగు నీశ్వరి వశమగును. ఈ రెంటినిగూడ చక్కఁగా నెఱిఁగినవానికి జన్మమునందు దేనివలననుగూడ భయము కలుగదు.

ప్ర భ:—జగత్తు వశపడినయెడల జన్మమున సుఖమే కలుగును. కావున దానివలనభయము కలుగదు. జగన్మాతయగుదేవి– భక్తిపాశబద్ధయై వశంవదయగు నెడల జన్మభయమే కలుగదు. సర్వవిధములచేతనుగూడ– సామ– నామ ప్రయోక్తలకు జన్మవలని భయములేదని భావము.

మూ॥ సఙ్కీర్తనాత్ తుష్యతి శర్వయోషా
తుష్టా త్వభీష్టం న దదాతి నైషా
ఇమంత్వవిజ్ఞాయ జగత్యుపాయం
వ్రజన్త్యపాయం బహుధామనుష్యాః॥ ౧౩

శివసుందరియగు పార్వతి– నామభజనమువలన సంతుష్టురాలగును. సంతుష్టయగు నాయమ్మ అభీష్టమునీయకమానదు. లోకమునందలి మనుష్యులు– ఈయుపాయమును తెలియక బహుప్రకారముల చేత అపాయము నొందుచుందురు.

ప్ర భ:— శివసుందరీసంకీర్తనము– కార్యసాధనమని తెలియనివారనిష్టము నొందుదురని భావము.

మూ॥ భాషే భుజఙ్గాభరణ ప్రియాయా
నామాని కామానితరాన్ విహాయ
అపిప్రపఞ్చాతిగ ఘోరకృత్యం
కరోతుకిం మాఽతరణేరపత్యమ్॥ ౧౪

ఇతరములగు కోరికలను పరిత్యజించి తదేక కాముఁడనై భుజంగాభరణుఁడగు శివుని ప్రియురాలగు పార్వతియొక్క నామము లను భాషింతును. ప్రపంచము నతిక్రమించినదియు, (చింతింపశక్యము కానిదియు) ఘోరమగునదియు, నగుకర్మగలవాఁడనైననుగూడ- వివస్వంతుని యపత్యమగు (సూర్యపుత్రుఁడగు) యముఁడు-నన్నేమి చేయును?

ప్ర భ:—దేవి నామైకపరుఁడనగునన్ను ఆవిధ భయంకరకర్మనైనను యముఁడు బాధింపఁజాలఁడని భావము.

మూ॥ యజ్ఞేన దానైః కఠినవ్రతైర్వా
సిద్ధింయ ఇచ్ఛేత్ స గృహీతుమిచ్ఛేత్।
మాతుః శయానోఽఙ్కతలే శశాఙ్కం
మహేశ్వరీం కీర్తయతస్తు సిద్ధిః॥ ౧౫

సోమయాగాది రూపమగు యజ్ఞముచేతను, భూగోహిరణ్యా న్నాదులగు దానములచేతను, కృచ్ఛ్రచాంద్రాయణాదులగు కఠిన వ్రతములచేతను, సిద్ధిని (శక్తిశాంతిసమృద్ధమగుస్థితిని) గోరినవాఁడు- తల్లియొడియందు శయనించి చంద్రుని గ్రహింపఁగోరినవాఁడు, మహే శ్వరిని కీర్తించువానికే సిద్ధికలుగును.

ప్ర భ:—తల్లియంకమున శయనించినబాలునికి చంద్రలబ్ధియెట్టిదో, యజ్ఞాదు లచేనగు సిద్ధి యట్టిదేయగును. సత్యమైనసిద్ధి-దేవీకీర్తనపరునికిమాత్రమే లభించును- అని భావము.

వి శే:- ఇచ్చట- యజ్ఞాదులచేత సిద్ధి నభిలషించుట—మాతృంకశయితుఁ డగు శిశువు—చంద్రుని గోరుట-అని ఉపాత్తవిషయద్వయమునందగు అర్థాభేదము- 'సాదృశ్యమున పర్యవసించును. కావున నిది నిదర్శనాలంకారమగుచున్నది. 'ఉపాత్తయో రర్థయో రర్థాభేద ఔపమ్యపర్యవసాయీ నిదర్శనా'' ఉపాత్తము

[illegible]
[illegible]

మూ॥ రహస్యతంత్రాణి వివిచ్య సారం
వ్యాజం విముచ్య ప్రవదామి వారమ్।
నామైవ కామారి పురన్ధ్రికాయాః
సిద్ధేస్తు దానం న ముఖోపదానమ్ ॥౧౬॥

రహస్యములగు తంత్రములను (శాస్త్రములను) దీక్షముగా విచారించి- కపటమును త్యజించి, సారాంశమును ప్రవచించెదను. అదేమనిన; కామారిపురంధ్రియగు పార్వతియొక్క- నామమే- సర్వ పురుషార్థసిద్ధికిని మూలకారణముగాని- మఖముగాని, దానముగాని, మూలహేతువులు కావు.

మూ॥ పీయూషమీషన్మధురం భణన్తి
యే నామరామాధరపానలోలాః
కామారి రామాహ్వయగానలోలాః
కవీశ్వరాః కాఞ్జికమాలపన్తి ॥౧౭॥

కాంతల కెమ్మోవి నాస్వాదించుటయందాసక్తులగువారు- పీయూషము (అమృతము) అల్పమేయగు మాధుర్యము గలదని చెప్పుదురు. కామారియగుశివుని రామయగు పార్వతినామమును సంకీర్తించుటయందాసక్తులగు కవీశ్వరులు- ఆపీయూషమును కాంజికమని [అరనాలకమని] చెప్పుదురు.

ప్ర భ:— లోకులు పీయూషమునందించుక మాధుర్యమున్నదని యంగీకరింతురు కాని యది కాంతాధరమాధుర్యమునకు సదృశము గాదని యనుభవపూర్వకముగాఁ జెప్పుదురు. భక్తులగు కవీశ్వరులు పరమేశ్వరీ నామగానామృతమాధుర్యము- సర్వోత్తరరసాతిశాయియని యెఱుఁగుదురు.

మూ॥ సుధాఘటః కోఽప్యధరో వధూనాం
కవి స్సుధాశో ముధరోభిధేయః
అయం సుధావీచివితానమాలీ
నామప్రసాదో నగకన్యకాయాః ॥౧౮॥

స్త్రీల యధరము- 'అనిర్వాచ్యమగు అమృతముచేనిండిన ఘట-విశేష'మనియు, కవి-'పీయూషవర్షి యగు మేఘుఁ'డనియు, పర్వత కుమారియొక్క యీనామసంకీర్తనధ్వని-'అమృతోర్మివితాన(విస్తార) మాల,యనియు (అమృతసాగర మనియు) చెప్పఁదగినవి.

ప్ర. భ:—కాంతాధరము- అమృతకలశము— కావ్యనిర్మాత- అమృతమేఘము— దేవినామము— అమృతసాగరము, అని యొకదానికంటె నింకొకదానికి గొప్పతనము కీర్తింపఁబడినదని తెలియునది.

మూ॥ సురాలయే భాతితరాం సుధైకా
సుధాపరా వాచి మహాకవీనామ్।
బిమ్బాధరే కఞ్జదృశాంసుధాన్యా
సుధేతరానామని లోకమాతుః ॥౧౯॥

సురాలయమునందు(స్వర్గమునందు)ఒకయమృతమును మహాకవుల వాక్కునందింకొక యమృతమును, పద్మాక్షులయధరమునందు వేరొక యమృతమును, లోకమాతనామమున మఱియొక యమృతమును, మిక్కిలి ప్రభాసించుచున్నవి.

ప్ర భ—సురాలయాదులయందుఁ గల యమృతము లొకదానికంటె నింకొకటి మేన్మయని గ్రహించునది. ఇచట—అప్రస్తుతములగు సురాలయామృతాదులకును ప్రస్తుతమగు లోకమాతృనామామృతమునకును— 'మిక్కిలి ప్రభాసించుట' అను నొకేధర్మముతోడి సంబంధమువలన దీపక మలంకారమగుచున్నది.

"వదన్తి వర్ణ్యావర్ణ్యానాం ధర్మైక్యం దీపకం బుధాః"

ప్రస్తుతాప్రస్తుతములకు ధర్మైక్యము దీపకమని పండితులు చెప్పుదురు, అనునది దీపకలక్షణము.

మూ॥ మాధుర్యమాభాత్యధరే వధూనాం
చకోరబన్ధోః శకలే ప్రసాదః
త్రిస్రోతసో వారిణి పావనత్వం
త్రయంచనామ్ని త్రిపురామ్బికాయాః. ॥౨౦॥

కాంతల యధరమునందు మాధుర్యమును, చకోరబంధువగు చంద్రునియొక్క ఖండమునందు ప్రసాదమును, (ప్రసన్నతయు)

గంగాజలమున (తీర్థమున) పావనత్వమును, ప్రకాశించుచు. త్రిపుర సుందరీదేవి నామమున ఈమూఁడునుగూడ ప్రకాశించుచుండును

ప్ర భ;— కాంతాధరమాధుర్యములకంటెనుగూడ- త్రిపురాంబికా నామమునకు గల విశిష్టతవలన నిది వ్యతిరేకాలంకారమగుచున్నది.

మూ॥ యామాధురీ ప్రేమభరేణ దష్టే
జాగర్తి కాన్తా వదనస్థ చేతే
సాదృశ్యతే భక్తిభరేణగీతే
ధరాధరాధీశ సుతాభిధానే. ॥ ౨౧॥

ప్రేమాతిశయమున చుంబింపబడిన ప్రేయసి కెమ్మోవియందు విలసిల్లుచున్నమాధురి- భక్తిభరముచేత గానముచేయఁబడిన పర్వత కుమారియగు నుమాదేవియొక్క- నామమునందును గాన్పించును.

మూ॥ యత్ తేజగల్లమ్పట! కేఽపివర్ణా
స్స్వన్మేఽమృతంనామ నగాత్మజాయాః
లాలామయో మోమమతం బ్రవీషి
సుధామయం త్వద్దశనచ్ఛదంత్వమ్ ॥ ౨౨॥

ఓ జగల్లంపటా! (లోకమునం దాసక్తమగు చిత్తముగలవాఁడా!) నగరాజకుమారియగు ఉమాదేవి నామము నీకు కేవలముచు కొన్ని యక్షరములుగాఁ దోచుచున్నది. నాకానామము - అమృతమగు చున్నది. నీకు — అమృతమయమగుచున్న కాంతాధరము నాకు- లాలామయము(ముఖమునుండి స్రవించు ద్రవము).

[ఈపద్యము-నిరంతరమును పఠనీయము]

ప్ర భ;— కాంతాధరమును నీవు సుధామయమని చెప్పుచున్నావు. అది నోటినుండి స్రవించు చొంగకంటె వేఱు కానేరదు. ఉమ యను నామము నీకక్షర ములుగాఁ దోఁచుచున్నది. ఆనామము వర్ణ సమూహము కాదు, సుధామయము.

మూ॥ ఉచ్చారయోచ్చాటితపాతకాని
నామానిజిహ్వే! భువనస్యమాతుః।
తదావదామో మధుచూతరమ్భా
ద్రాక్షాధరాస్తే రుచయేయదిస్యుః॥ ౨౩

జిహ్వే! (ఓరసనమా!) పాపములను తొలఁగించునవియగు జగజ్జననియొక్క నామములనుచ్చరింపుము. అప్పుడు మకరందము, చూతఫలము, కదళీఫలము, కాంతాధరము అనునవి నీకు రుచించునేమో చూడుము.

ప్ర. భ.—శివ దేవీనామములను కీర్తించునెడల నీకు మకరందాదులు రుచింపవని మేము దృఢముగాఁ జెప్పఁగలమని భావము. 'భువనస్యమాతుః' అనుటకు బదులు "నగకన్యకాయాః" అను పాదము-మూలమునకుఁ గలదని తెలియునది.

మూ॥ ఆక్షేపమిక్షో రధికం విధత్తే
పీయూషదోషా నభితోఽభిధత్తే।
కాన్తాధరారబ్ధమురస్తవాదః
కపర్దికాన్తావర నామనాదః। ౨౮

కపర్దియగు (జటాజూటముగల) శివునికాంతయొక్క ప్రశస్తమగు నామధ్వని-రసవంతమగు నిక్షువు(చెఱకు) నాక్షేపించుచున్నది. అమృతమునందలి దోషములను సర్వతః తెలుపుచున్నది, కాంతాధరముతోడి యౌపమ్యమును సహింపక వాదించుచున్నది.

ప్ర. భ:—దేవీనామామృతమునకు సాటికానేరక కాంతాధరము- పరాభవింపఁబడునని భావము.

మూ॥ విశ్వాసహీనైస్స్మృతరామబోధ్యం
నామానుభావం నగకన్యకాయాః।
జయన్తు సిద్ధైరపి గీయమానం
గాయన్త్య ఏతా ఉపజాతయోऽనః॥ ౨౯

విశ్వాసము లేనివారిచేత నించుకయు తెలియఁదగనిదియు, సిద్ధులచేతనుగూడ గానము చేయఁబడునదియు అగు పార్వతీనామప్రభావమును కీర్తించునవియగు నాయీ ఉపజాతులు (ఉపజాతివృత్తనిబద్ధములగు స్తుతులు) జయించుఁగాక!

ఇది- సవ్యాఖ్యమగు- ఏకత్రింశస్తబకము.
8 వ శతకమున 3 వ స్తబకము.

ఓం నమో భగవతే శ్రీరమణాయ. శ్రీభారతీకృష్ణాయ నమః

# ఉమా సహస్రము

( ద్వాత్రింశ స్తబకము )

[ ౪వ శతకము లోపలి ౨వ స్తబకము ]

అవ:-ముప్పది రెండవదియగు నీ స్తబకమున యోగిని-భక్తురాలను గలభేదము నుపన్యసించి- అధ్యాత్మముగు హాసనదేశనములను నిరూపించుచున్నాడు.

మూ॥ విదధాతు సమ్పదం మే
సకల జగన్నాథ నయనహారిజ్యోత్స్నః।
శీతో౽న్ధకారహారీ
హాసశశీకశ్చిదఙ్కరహితో మాతుః॥ ౧

సర్వలోకేశ్వరుడగు శివుని నయనముల నపహరించు వెన్నెల గలదియు, అంధకారమును పోగొట్టునదియు (అవిద్యను తొలగించునదియు) చల్లనిదియు, (తాపమును హరించునదియు) కలంకము (మచ్చ) లేనిదియు, నగు మాతయగు నుమాదేవియొక్క హాసశశి (చంద్రునివంటినవ్వు) నాకు సంపదనిచ్చుగాక!

ప్ర భ:— 'హాసశశి' అనుచోట సంపదనిచ్చునది హాసమగుటవలన పూర్వపదముయొక్క అర్థము ప్రధానము. కావున నిది యుపమితసమాసమగుచున్నది. కళంకములేని శశియనుటవలన వ్యతిరేకమలంకారమగును. మఱియు నిచట విషయియగు శశి-విషయభూతమగు హాసస్వరూపమున బరిణమించుటవలననే సంపదనిచ్చుట యను ప్రకృతార్థమునకుపయోగించును. కావున నిది- పరిణామాలంకారము గూడ నగునని గ్రహించునది.

మూ॥ కరుణారసార్ద్రహృదయా
హృదయాన్తరనిర్యదచ్ఛవీచిస్మేరా
ప్రమథేశ్వరప్రియతమా
పాదప్రేష్యస్య భవతుకల్యాణాయ. ॥ ౨॥

కరుణారసార్ద్రహృదయము హృదయములోనుండి వెలికివచ్చుచున్న స్వచ్ఛములగు తరంగములుగల చిరునవ్వుగలదియు, ప్రమథేశ్వరుఁడగు శివునకు ప్రియతమయు అగు పార్వతి-చరణాకింకరునకు మంగళము నొసఁగుఁగాత!

ప్ర భ:—ఉత్తరంగితము = దయారసము—హృదయాంతరమునుండి బయలువెడలి, ముఖమునందు చిరునవ్వుగా విజృంభించుచున్నదని భావము.

మూ॥ కారణకార్యవిభేదాత్
రూపద్వితయం తవామ్బయదృషిప్రోక్తమ్।
తత్రైకం భర్తుమిదం
విహర్తు మన్యత్తు భూతభర్తుర్లలనే! ॥ 3 ॥

అమ్మా! కారణ-కార్యవిభేదమువలన ద్రష్టలగు ఋషులచేఁ దెలుపఁబడిన రూపద్వితయము (అవయవద్వయముగల రూపము)నీకుఁ గలదు. భూతేశ్వరసుందరీ! వానియందు(ఆరూపములు రెంటియందు) ఒకటి- జగత్తును భరించును. ఇంకొకటిమాత్రము విహరించును.

ప్ర భ:—"నీవు కారణరూపమున జగత్తును భరింతువు, కార్యరూపమున విహరింతువు" అని భావము.

మూ॥ శ్రోతుం స్తోత్రవిశేషం
భక్తవిశేషంచ బోద్ధుమయ మీదృగితి,
దాతుంచ వాఞ్ఛితార్థం
తవమాతశ్చన్ద్రలోకరూపం భవతి. ॥ ౪ ॥

మాతా! అనేకములగు స్తోత్రములను వినుటకును, 'వీఁడు-ఇట్టివాఁడు' అని యనేకభక్తులను యథాతథముగాఁ దెలిసికొనుటకును, అభీప్సితమగు వస్తువు నిచ్చుటకును, నీకు చంద్రలోకరూపము-కార్యరూపమగుచున్నది.

ప్ర భ:—అధ్యాత్మముగా చంద్రలోకమనువది సహస్రారమనియే నిశ్చయింపఁదగును. కావున నిచట చంద్రలోకరూపమవఁగా; సహస్రారమే యగును. "చారుయువతి రూపంభవతి" అను పాఠాంతరముగలదు. అపుడు "నీకు సుందరమగు స్త్రీరూపముగలదు" అని యర్థము నెఱుంగునది.

మూ॥ కీశకిశోరన్యాయాత్ । కారణరూపం తవాస్బ్రయోగీధత్తే,
ఓతు కిశోరన్యాయాత్ । భక్తంపరిపాసికార్యరూపేణత్వమ్॥౫॥

మర్కటకిశోరన్యాయమువలన నీకారణరూపమును (మూల స్వరూపమును) యోగి ధరించుచుండును. మార్జాలకిశోరన్యాయము వలన, నీవు స్వీయమగు కార్యరూపముచేతఁగాని,(చంద్రలోకరూపము చేతఁగాని సుందరస్త్రీరూపముచేతఁగాని) భక్తుని రక్షించుచుందువు.

ప్ర భ;—మర్కటకిశోరమనఁగా; కోతిపిల్ల, అది స్వప్రయత్నమున తల్లిని గట్టిగాఁ బట్టుకొనియుండును. మార్జాలకిశోరమన- పిల్లిపిల్ల, అది తల్లిని పట్టుకొనదు. దానితల్లియే తనపిల్లను బట్టుకొని త్రిప్పుచుండును. యోగి— స్వాత్మబలమువ ఉమాస్వరూపమును గ్రహించును. భక్తునిభారము నాయమ్మయే వహించును. కావున యోగి— కోతిపిల్ల. భక్తుఁడు- పిల్లిపిల్ల.

విశే: —భక్తునికిని, యోగికిని, గలభేదమును నిరూపించుటకు ఇంద్రాణీసప్తశతియందు గీతమగు మదలేఖావృత్తద్వయము నిచట నుదాహరింతును.

"గన్తవ్యం స్వరధీశే! నిశ్శేషార్పణపూరమ్
బిభ్రాణా నయసిత్వం మార్జారీవకిశోరమ్.
గృహ్ణాన్నమ్బరనాథా మమ్బామశ్లథబన్ధః
కీశస్యేవకిశోరో యోగీగచ్ఛతి గమ్యమ్.

మూ॥ దృఢధారణానచేత్ త్వచ్చ్యవతేయోగీమహేశనయనజ్యోత్స్నే
నాయంమమేతిభావస్తనయదిసద్యః సవిత్రి! భక్తంత్యజసి ॥౬॥

మహేశనయనజ్యోత్స్నవగు జననీ! దృఢమగు (ప్రమాద రహితమగు) ధారణలేనియెడల, యోగి- నీనుండి (శక్తిస్వరూపము నుండి). భ్రష్టుఁడగును. 'వీఁడు నావాఁడుకాఁడు' అనుభావము నీకుఁ గలిగినయెడల నీవు వెంటనే భక్తుని త్యజించెదవు.

ప్ర భ:—స్వబలావలంబియగు యోగికి స్వల్పమగు ప్రమాదముచేతఁగూడ (స్వరూప) భ్రంశము కలుగును, జననియగు ఉమాదేవికి సంపూర్ణముగా తన్నర్పించుకొననిభక్తుని-'వీఁడు నావాఁడుకాఁ'డని యామె త్యజించును. ఆత్మార్పణపూరుఁడగు భక్తునియెడల- వీఁడు నావాఁడుకాఁడనుభావ మాయమ్మకుఁ గలుగదు. అని తాత్పర్యము. యోగికి- ప్రమాదరహితమగు స్వశక్తి నవలంబించుటయు, భక్తునకు- సంపూర్ణమగు నాత్మార్పణమును, ముఖ్యమని భావము.

మూ॥ శిథిలధృతిర్యోగీస్యాద్ ।
బాహ్యై ర్విషయై ర్నితాన్తమాకృష్టోయః ।
స్వీయమతిస్లష్యతి తే।
భక్తేఽహన్త్వాప్రసారకలుషే మాతః! ॥౭॥

మాతా! శిథిలమగు ధారణగలయోగి- శబ్దాదులగు బాహ్య విషయములచేత మిగుల నాకర్షింపఁబడినవాఁడగుచుండును. అహంకృతిప్రసారముచేత (అహంభావవ్యాపనముచేత) అశుచియగుభక్తుని యెడల నీకు- స్వీయుఁడను (నావాఁడను) బుద్ధిలోపించును.

ప్ర భ:— వెలుపలనున్న భోగ్యవిషయములయం దాసక్తుఁడగు యోగికి ధృఢమగు ధారణ కలుగదు. పూర్ణమగు ఆత్మసమర్పణమే- భక్తికిలక్షణము. అహంత (నేననుతలంపు)కలుగునంతవరకును పూర్ణమగు నాత్మార్పణము జరుగదు, కావున అహంత (నేను, అనునది) భక్తిని లోపింపజేయును. అహంతను విడువని భక్తుని యందు, వీఁడు స్వీయుఁడను బుద్ధి నీకుఁ గలుగదు. కావున సంపూర్ణాత్మార్పణ రహితుఁడగు భక్తునకుఁగూడ భ్రంశము తప్పదని భావము.

మూ॥ సాహఙ్కృతిర్నభక్తిః సబాహ్యవిషయాధృతిర్న సర్వేశ్వరి! తే।
అవిజానన్తావేతద్ భక్తోయోగీచనైవసిద్ధాస్యాతామ్. ॥౮॥

సర్వేశ్వరీ! అహంకృతితోఁగూడినది-నీయందలిభక్తికానేరదు. బాహ్యవిషయములతోఁగూడినది- నీయందగు ధారణకానేరదు. ఈ తత్త్వమును (సత్యమును) తెలియని భక్తుఁడును, యోగియు, సిద్ధులు కానేరరు.

ప్ర భ:—అహంకారముతోఁగూడని భక్తియు, బాహ్యవిషయములతోఁగూడనిధృతియు, భక్తుడును, యోగియు, గ్రహింపవలయును. అట్లు గ్రహింపని యెడల సిద్ధినొందరని భావము.

మూ॥ వ్యక్తిత్వా దపి యస్య
ప్రియం త్వదీయం సవిత్రి! పాదామ్భోజమ్।
సోఽద్భుతశక్తిర్భక్తో
భగవతి! కిం కిం కరోతి నాస్మిన్ జగతి॥

ఓ సవిత్రీ! ఏభక్తునకు వ్యక్తిత్వము (విశ్వమునకు అతీతత్వము) కంటె నీయొక్క పాదారవిందము ప్రియముగునో, ఆభక్తుఁడు-అద్భుతశక్తిగలదై (ఆశ్చర్యకరములగు శక్తులుగలవాఁడై) యీలోకము నంచేది చేయుటకైనను శక్తుఁడగును.

ప్ర ద:- 'నేను' అను తలంపు మొదలగు "విశ్వైకకారణసంయోగములు" అని నీపాదము నాశ్రయించిన భక్తుఁడు. సర్వమును చేయఁగలుగును, చేయకుండఁగలుగును, వేఱొకవిధముగాఁ జేయఁగలుగును. సామర్థ్యము గలవాఁడగునని భావము.

మూ॥ వ్యక్తిత్వలోభవివశే
సిద్ధః కామోఽపి భవతి సమవచ్ఛిన్నః ।
ప్రాప్తోఽపి సలిలరాశిం
సలిలాని ఘటః కియన్తి సఙ్గృహ్ణీయాత్. ౧౦

వ్యక్తిత్వలోభవివశుఁడగు (తాను లోకములందఱికంటెనుగూడ భిన్నుఁడగుటయందగు అభిలాషమున పరాధీనుఁడగు) మనుజునకు మనోరథము సిద్ధించినను గూడ- అది సర్వవిషయములచేతను పరిమితమే యగును. అల్పమగు ఘటము- జలరాశియగు సముద్రమునందు ప్రవేశించినను గూడ నెన్ని నీళ్ళు గ్రహించును?

ప్ర భ:- సర్వమనోరథసిద్ధులకును నిధియగు దేవీప్రసాదమును బొందియుఁ గూడ. అహంకారలోభియగు మనుష్యునకు ఒకానొక మనోరథము (కామవిశేషము) సిద్ధించినను, అది యవచ్ఛిన్నమగుటవలన స్వల్పమేయగును. అహంకారలోభి కానిజనుఁడే- పరిచ్ఛేదరహితమగు (అఖణ్డమగు) దేవీప్రసాదమాహాత్మ్యవైభవమును, గ్రహించును.

తాభ్యాం తౌ యది చ స్యాతామవజ్ఞాలజ్జ్యోతిస్తు సా ।
అను చంద్రార్కలక్షణాసులన నిది యవజ్ఞాకారకుగును.

మూ॥ జీవన్నేవ నరోఽయం
సాయుజ్యం తే ప్రయాతి శమోఘ్యః ప్రియదే!

సర్వేకామా స్తస్య
ప్రియాన్తి వశమాశు నీతవివిధభ్రాన్తేః ౧౧

శంభుప్రమదవగు జననీ! జీవించుచున్నప్పుడే నీసాయుజ్యము నొంది (జీవన్ముక్తుఁడై) నానాప్రకారమగు భ్రాంతిని (మిథ్యాధ్యవసితిని) విడిచిన తత్త్వవేత్తకు- కోరికలన్నియుఁగూడ- శీఘ్రముగా వశపడును.

ప్ర :- భవత్సాయుజ్యసంపన్నుఁడను జీవన్ముక్తుఁనకు, సర్వకామవశిత్వము సిద్ధించునని భావము.

ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం
సముద్రమాపః ప్రవిశన్తి యద్వత్
తద్వత్ కామా యం ప్రవిశన్తి సర్వే
స శాన్తి మాప్నోతి న కామ కామీ॥

అని యీయంశము గీతయందు స్మరింపఁబడుచున్నది గదా!

మూ॥ వ్యక్తిత్వం తుభ్యమిదం
మనీషయా మే ప్రదత్త మధికారిణ్యా
బహుకాల భోగబలతో
వివదతి దేహోమదమ్బ! కింకరవాణి! ॥౧౨॥

నాతల్లీ! అధికారిణియగు (యోగ్యతగలదియగు) నాబుద్ధిచేత మదీయమగు నీవ్యక్తిత్వము (పృథగాత్మత్వము) నీకు సమర్పింపఁబడినది. పాంచభౌతికపిండమగు ఈదేహముమాత్రము- బహుకాలభోగాభ్యాసబలమువలన వివదించుచున్నది. (వ్యక్తిత్వము నర్పింపఁజేయుటకంగీకరింపకున్నది) నేనేమి చేయుదును?

ప్ర భి:—నాబుద్ధి- ఒకానొక (జ్ఞాన) సంస్కారమువలన ఒకానొకబలము నార్జించి- వ్యక్తిత్వార్పణమునందధికారము గలదైయున్నది. ఇట్టియోగ్యత (అధికారము) గల యీ నా బుద్ధి-తన వ్యక్తిత్వమును (భిన్నభావమును) నీకు సమర్పించుచున్నది. స్థూలమగు నాశరీరము- దానిననువర్తింపకున్నది. దీనికి నేనేమి చేయఁగలను నీవే శరణమనని భావము.

మూ॥ స్థూలేన వర్ష్మణా సహ
సూక్ష్మా కలహం మతిర్నకర్తుం శక్తా।
సుతరాం బలవతి! మాత
ర్బలాద్ గృహాణ స్వయం త్వ మస్మాత్ స్వీయమ్॥ ౧౩॥

స్థూలమగు శరీరముతోఁ గలహించుటకు సూక్ష్మమగు బుద్ధి సమర్థము కాకున్నది. తల్లీ! మిక్కిలి బలాఢ్యవగు నీవు—త్వదీయమును, శరీరగతమును, అగు వ్యక్తిత్వమును దీనినుండి (నాయందుండి) బలాత్కారముగా గ్రహింపుము.

ప్ర భా:— నేను వ్యక్తిత్వమును నీకర్పించితిని. కావున నా బుద్ధి నీయధీనము చేయఁబడినది. ఈ శరీరముమాత్రము వ్యక్తిత్వార్పణమును సహింపకున్నది. కావున శరీరగతమగు మదీయవ్యక్తిత్వమును బలాత్కరించి, గ్రహించి, కృపఁజూపుమని భావము.

మూ॥ సర్వేషాం హృదయస్థాత్
త్వమసి ప్రాణాత్మనాఽప్య హేతోస్తస్మాత్
అఖిల ప్రాణ్యారాధన
మారాధన నిర్విశేష మగపుత్రి! తవ. ౧౪॥

అమ్మా! పార్వతీ! సర్వప్రాణి హృదయములందునుగూడ నీవు ప్రాణాత్మికవై (ప్రాణస్వరూపిణివై) యున్నావు, కావున ప్రాణుల నందఱిని సమారాధించుట— నిన్నారాధించుటకంటె వేఱుకాదు.

ప్ర భా:— అఖిలభూతములందును నీవు ప్రాణస్వరూపముతో నున్నావు, కావున సర్వప్రాణిప్రీణనము— త్వదారాధనమే యగును. ఇందు సంశయములేదు.

మూ॥ జుహ్వతి కేఽపి కృశానౌ
తస్మాత్ ప్రీతిస్తవేతి సమ్పశ్యన్తః
అపరే ప్రాణేషు జుహ్వతి
సాక్షాత్ ప్రాణాత్మికాఽసి తేష్వన్తరితి. ౧౫

హోమద్రవ్యము నిన్నుబొందునను తలంపున మనుష్యులు కొందఱు- అగ్నియందు హవనము చేయుదురు. మఱికొందఱు- ప్రాణులలోపల నీవు ప్రాణస్వరూపిణివై యుందువను తలంపున ప్రాణులయందు(ప్రాణముగలవారియందు)హవనము(హోమము)చేయుదురు.

ప్ర భః— ఇందు రెండవది. ప్రాణములే అగ్నియనుతలంపునఁ జేయబడిన హోమము. కావున నిదియొక ప్రాణాగ్నిహోత్రమగుచున్నది.

మూ॥ ప్రాణివ్యాపియః ప్రాణం
భూతాదిమనాది మాత్మనిస్థిత మనఘమ్।
సతతముపాస్తే యోగీ
తస్మిన్ హోమేన తేఽమ్బ తృప్తిస్సులభా॥ ౧౬

అమ్మా! భూతములకు కారణమును, అనాదియు (కారణములేనిదియు) ఆత్మయందున్నదియు, పవిత్రమును, (నిర్లేపమును) ప్రాణులందున్నదియు, నగుప్రాణమును- నిరంతరముగా నుపాసించుచున్న యోగియందుగూడ, ప్రాణోపాస్తిరూపమగు హోమముచేత- నీకు తృప్తి-సులభమగును.

మూ॥ ఆత్మనియోఽమ్బ! శ్రీప్తే
ప్రాణే ప్రాణాన్ జుహోతి దహరాభిముఖః
త్వ ద్రూపే హతపాపే
తేన జితం సకలమీశచిత్తారామే! ॥౧౭॥

ఈశ్వరహృదయోపవనమునందు విహరించుచున్న తల్లీ! ఎవఁడు దహరాభిముఖుఁడై (హృదయాకాశాభిముఖుఁడై) నీకు స్వరూపమును, అపహతపాపమును, స్వాత్మయు, అగు ముఖ్యప్రాణమునందు ప్రాణములను హోమము చేయుచుండునో, (పుణ్యాత్ముఁడగు) వాఁడు సకలమును జయించును.

మూ॥ ఉపసంహృత మక్షిభ్యో
విషయేభ్యో నిర్నిమేషమన్తః కృష్టమ్
హృదిదృష్టదేశచక్షు
స్త్వద్రూపే హూయతే మదమ్బ! ప్రాణే. ౧౮

నా తల్లీ! బాహ్యములగు విషయములనుండియు (అన్ని రూపములనుండియు) ఉపసంహరింపఁబడినదియు, రెప్పపాటును, లేనిదియు, అంతర్ముఖమయినదియు, (లోనికి త్రిప్పఁబడినదియు) అగు నేత్రము- హృదయమునందు దృష్టమగు (స్థిరమగు) స్థానముగల యోగిచేత నీస్వరూపమగు ప్రాణమునందు హోమము చేయఁబడును.

ప్ర భా:- హృదయమున స్థితినొందిన (హృదయనిష్ఠుఁడగు) యోగి- చక్షుస్సును (నిర్విషయమును) నిమేషరహితమును, అగు అంతర్ముఖనేత్రమును- ప్రాణమునందు హోమము చేయుచున్నాఁడు. ఇది నయన (హృదయనిష్ఠ) ప్రాణాగ్ని హోత్రము.

మూ॥ అన్తస్స్వరం నిగూఢం
శ్రేష్ఠప్రాణస్య దేవి! తవభాగస్య!
శృణ్వదివ ప్రణవాఖ్యం
శ్రవణం తవైవ భవతి జగదమ్బ! హుతమ్॥ ౧౯

జగదంబా! శ్రోత్రేంద్రియము- నీయంశమగు (భాగమగు) శ్రేష్ఠప్రాణముయొక్క- నిగూఢమును, ప్రణవాఖ్యమును, అగు అంతర నాదమును (అనాహతనాదమును) వినుచున్నదివలె నున్నది. ఆ ముఖ్యప్రాణముయొక్క- అంతరనాదమునందే (యీ) జగత్తు- హోమము చేయఁబడిన దగుచున్నది.

ప్ర భా:- జగద్విషయకమగు వృత్తియంతయుఁగూడ- శబ్దరూపమున (ప్రాణము) లోపలనుండుటవలనను, సర్వశబ్దములకును మూలప్రకృతియు, ప్రణవాఖ్యమును అగుచు. ప్రాణములోనున్న ఓంకారనాదమునందు జగత్తు హోమము చేయఁబడునని భావము.

మూ॥ సర్వేషాం మన్త్రాణాం
స్తోత్రాణాంచేశి చిత్తనాథే ప్రకృతౌ
గూఢం సదా స్వరన్త్యాం
ప్రాణన్త్యాం త్వయి జుహోతి మానివాచమ్. ౨౦

శివహృదయేశ్వరీ! సర్వమంత్రములకును, సర్వస్తోత్రములకును, గూడ ప్రకృతివియు (మూలస్వరూపభూతవును) గుప్తముగా ధ్వనించు దానవును, (నాదమునొనర్చుదానవును) ప్రాణనము (శ్వాసము) నొనర్చుదానవును, అగు నీయందు- శాంతిసంపన్నుడగు మౌని- వాక్కును హోమము చేయును.

ప్రత్యర్థః- వాక్కులకన్నిటికిని మూలస్వరూపమగు పరాశక్తియందే వాక్కులన్నియు నుపసంహరింపఁబడునని భావము. దీనిని మంత్రోక్తిధ్యోపాసన మని చెప్పుదురు.

మూ॥ దేహే స్ఖలతి మనశ్చేత్
విషయేషు హుతం దధాతి విషయాత్మత్వమ్।
అవ్యావృత్తం యది దేహాత్
సూక్ష్మేయాం త్వయి హుతంత్వదాకృతిభవతి. ౨౧

మనస్సులోపలినుండి చ్యుతమై మనస్సు శరీరగతమగునెడల శబ్దరూపాది విషయములయందు హుతమై విషయరూపతను ధరించును. దేహమునుండి మరలి అంతర్ముఖమైనయెడల, అదియే-సూక్ష్మస్వరూపిణివగు నీయందు హుతమై- త్వద్రూపమగును.

ప్రత్యర్థః- మనస్సు- శబ్దాదులయందు హోమము చేయఁబడుటయనఁగా లోనున్న మనస్సు వెలికివచ్చి శబ్దాదులను స్వీకరించుటయే యగును. ఏది దేనియందు హుతమగునో అది దానిరూపము నొందును. కావున మనస్సు వెలికివచ్చినపుడు శబ్దాదివిషయరూపమును ధరించును. ఆమనస్సును బహిర్వ్యాపారముల నుండి మరలించినయెడల అది లోచూపుగలదగును. అంతర్దృష్టియగు మనస్సును నీయందు లయింపఁజేయుటయే హుతము చేయుటయగును. అట్లుహుతమైన (లయించిన) మనస్సు- నీరూపమువంటి రూపముగలదగును. బహిర్ విషయములయందు

పరిసరించినమనస్సు-విషయరూపము కాను. అంతర్గతమైన (నిరుపాధిక ప్రవేశించిన) మనస్సు-భవద్రూపమగును. అని భావము.

మూ॥ త్వగ్రసనఘ్రాణానా
మనుభూతీః ప్రాణశక్తిసాత్ కుర్వాణః
కం నార్పయతే భోగం
భగవతి! తే సర్వలోకపార్థివ వనితే. ౨౨

సర్వలోకేశ్వరకాంతవగు భగవతీ! స్పర్శేంద్రియ- జిహ్వేంద్రియ- గంధేంద్రియముల యనుభూతులను, ప్రాణశక్త్యధీనము నొనర్చుయోగి- ఏభోగమును నీకర్పింపకుండును!

ప్ర భ.—అనుభవము లన్నిఁటికినిగూడ-ఆధారభూతమగు ప్రకృతి- ప్రాణశక్తియే యగును. కావున ననుభూతు లన్నియును ప్రాణాధీనములుగాఁ జేయఁబడుచున్నవి. ప్రాణశక్తి-నీస్వరూపమే యగుచున్నది. కావున యోగి-నీయందే సర్వభోగసమర్పణము నొనర్చునని భావము.

మూ॥ గచ్ఛన్ కుర్వన్ విసృజన్
రమమాణశ్చాప్యంబ! సకలలోకాధీశే!
యః కేవలాం క్రియామపి!
చిన్తయతే తేననిత్యయజ్ఞః క్రియతే. ౨౩

సర్వలోకేశ్వరీ! నడుచుచు, పనిచేయుచు, విడుచుచు, రమించుచు, కేవలము క్రియనే ధ్యానించు పురుషుఁడు- నిత్యయజ్ఞము నొనర్చుచున్నాఁడు.

ప్ర భః—పాదములతో నడుచుచు, చేతితో కర్మలనొనర్చుచు, పాయువుచేత అశుచిపదార్థములను విడుచుచు, సురతమునందు ప్రవర్తించుచు- ఈయింద్రియ వ్యాపారములన్నిఁటియందును క్రియాసామాన్యమునుమాత్రమే ధ్యానించు పురుషుఁడు- నిత్యయజ్ఞము నొనర్చుచున్నాఁడు. వానిజీవనమే యజనమగుచున్నది. కావున వాఁడు నిత్యయాజి-యగుచున్నాఁడు,

మూ॥ సర్వేషా మగ్నినాం
ప్రాణాగ్నిస్తవ విభూతిరుత్కృష్టః

తస్మిన్ హుతంతు సుహుతం
ద్రవ్యాణి, ధియః, క్రియాశ్చ, మన్త్రాః, ప్రణవః॥ ౨౪

అగ్నులన్నింటిలోపలను శ్రౌతములు స్మార్తములుఅగు అగ్నుల లోపలగాని, భౌతిక–వైద్యుత–సౌరాగ్నులలోపలంగాని)నీవిభూతి(కళ) యగు ప్రాణాగ్ని–శ్రేష్ఠముగాఁ జెప్పఁబడినది. ఆ ప్రాణాగ్నియందు (ముఖ్యప్రాణమునందు) హోమముచేయఁబడినదిమాత్రమే చక్కఁగా హోమముచేయఁబడిన దగుచున్నది. ఈయజ్ఞమునందు– బుద్ధులును, క్రియలును–హోమద్రవ్యములు. లోపలధ్వనించుచు,ఉద్గీథమనునామ మునఁజెప్పఁబడుచున్న ప్రణవము–మంత్రము.

మూ॥ ఆర్యాగీతీనామయ
మధరీకృత మధుసుధాధిమాధుర్యరసః।
వక్త్రోద్గణపతివదనా
న్నిష్క్రాన్తో భవతు శర్వసుదృశః ప్రీత్యై॥ ౨౫॥

గణపతికవి ముఖమునుండి బయలు వెడలినదియు, మధు – సుధా–ద్రాక్షాదుల మాధుర్యరసమును క్రిందుపరచునదియు, అగు, ఈ యార్యాగీతిగణము–శర్వాణికి ప్రీతినిడుఁగాత!

ఇతి— శ్రీమహర్షి రమణభగవత్ పాదాన్తేవాసినో
వాసిష్ఠస్య నరసింహసూనోః గణపతిమునేః కృతా
వుమాసహస్రే ద్వాత్రింశః స్తబకః సమాప్తః।
సమాప్తంచ– అష్టమశతకమ్.

ఇది– శ్రీమహర్షి – రమణభగవత్ పాదశిష్యుఁడు, శతమర్షణసగోత్రుఁడు
శ్రీమత్పంతుల పేరయశాస్త్రి పౌత్త్రుఁడు, వేంకటరామ
బుధేంద్రపుత్త్రుఁడు. శ్రీ లక్ష్మీనారాయణశాస్త్రిచే
నాంధ్రీకరింపఁబడిన ఉమాసహస్రమను స్తోత్ర
కావ్యమున ముప్పదిరెండవ స్తబకము.

[8 వ శతకము.]



ఓం నమో భగవతే శ్రీరామణాయ, శ్రీమాత్రే నమః

# ఉమాసహస్రము

[illegible]

## (త్రయస్త్రింశ స్తబకము)

[శివ శతకము సంకలితమైన స్తబకము]

మూ॥ సుధాంకిరస్తేఽఖిలతాపహారిణః
తమోహరస్తేజస ఏకరోచిషామ్
శ్రియం దిశంతో దిశి దిక్షు సజ్జనాం
జయంతి శీతాద్రిసుతాస్మితాంకురాః॥ ౧॥

అఖిలతాపహారిణః (తాపత్రయమును శమింపఁజేయునది, లేక వేడిని పోగొట్టునది) యగు సుధను ప్రసరించునవియు. తేజస్సమూహముచేత తమమును (వెలుపలనున్న చీకటిని, లేక అంతరమగు అజ్ఞానమును, నివారించునవియు, సర్వదిక్కులయందును నశింపని శ్రీని (శోభను, లేక సంపదను) ప్రదర్శించునవియు, అగు శీతాచలకుమారి యొక్క స్మితాంకురములు— జయించుచున్నవి.

ప్రథ:— ఇందు సుధా-తమః- శ్రీపదములయందు శ్లేషగలదు. దానిచేత స్మితాంకురముల ద్వారసామర్థ్యమువలన పార్వతీవదనము-చంద్రునిఁగను వర్ణ్యమాక్షేపింపఁబడుచున్నది. కావున నిది శ్లిష్టమగు రూపకాలంకారమగుచున్నది.

మూ॥ కృపాకటాక్షస్తవ కేనవాఽప్యతే
మహేశశుద్ధాంతపురంధ్రి! కర్మణా॥
నిరంతరం మంత్రజపేన వా మతే
ర్విశోధనే నోత మనోర్పణేన వా॥ ౨॥

మహేశ్వరాంతఃపురమహిషీ! నీకృపాకటాక్షము— ఏకర్మ నాచరించుటచేత లభించును? నిరంతరమగు మంత్రజపము (మంత్రపురశ్చరణము) చేతనా? చిత్తశోధనముచేతనా? మనోర్పణముచేతనా?

ప్ర భ:— 1 మంత్రపురశ్చరణము 2 చిత్తవిశోధనము 3 సంపూర్ణమగు చిత్త సమర్పణము- అనుకర్మములలో, దేనిచేత నీకనుగ్రహము ఎంతవరకు లభించును? అని ప్రశ్నింపఁబడుచున్నది, ఇట్లు-మూఁడుపాయములను దెలిపి, వానివానికిఁ గల ప్రత్యేకమగు ఫలమును దెలుపుచున్నాఁడు.

మూ॥ విశోధనాద్ దేవి! మతేః ప్రగృహ్యసే
మనోర్పణేనేశ వధు ప్రసీదసి।
జపేన మన్త్రస్య శుభస్య వర్ధసే
జగత్ త్రయీధాత్రి! కలేబరాన్తరే॥ 3

త్రిలోకభర్త్రీ! దేవీ! బుద్ధిని విశోధించుటవలన చక్కఁగా గ్రహింపఁబడుచుందువు. ఈశ్వరకాంతా! మనస్సును నీకు సంపూర్ణముగా సమర్పించుటచేత ప్రసన్నురాలవగుదువు. శుభమగు మంత్రమును జపించుటచేత- జపించువానియొక్క- శరీరములోపల వృద్ధి నొందుదువు

ప్ర భః— విచారముచేత, బుద్ధి— పరీక్షింపఁబడునపుడు దుష్టములగు మనోవృత్తులు పలాయితములగును. బోధస్వరూపిణియగు సద్వృత్తియొక్కటియే మిగులును. ఆబోధమునందే దేవి-గ్రహింపఁబడును. మనోర్పణముచేత దేవియందే భక్తునిభావమంతయుఁగూడ నుంచఁబడును. దానివలన ప్రీతయగుమాత— ప్రసన్నయై భక్తుఁడొనర్పఁదగిన కార్యభారమును తానే వహించును. శ్రీ విద్యామంత్రముగాని, పంచాక్షరాష్టాక్షరమంత్రమునుగాని, ప్రణవాదిమంత్రమునుగాని, దేనినైనను క్షుద్రము కానిమంత్రమును జపించుటచేత,జప్తయొక్క- శరీరాంతరమున- తత్పురశ్చరణబలమునకు తగినవిధమున భగవతి స్వయముగా నభివ్యక్తయగును.

మూ॥ మనః ప్రతాపస్య భవత్యసంశయమ్
ప్రవర్ధనం వైదికమన్త్రచిన్తనమ్।
ప్రశస్యతే! ప్రాణమహః ప్రదీపనే
దయాన్వితే తాన్త్రికమన్త్రసేవితా॥ ౪॥

దయాన్వితవగు జననీ! ఋషులచేత కనుఁగొనఁబడిన "తత్ సవితుః" ఇత్యాది వైదికమంత్రధ్యానము- చిత్తప్రభావమును వృద్ధి

నొందించును. ఇందు సందేహము లేదు. శ్రీవిద్యాదితాంత్రికమంత్రోపాసనము— ప్రాణతేజః ప్రదీపనము నొనర్చునని ప్రశంసింపఁబడు చున్నది.

ప్ర భ:— వేదమంత్రములు— వాక్యబంధాత్మకములు. కాఁబట్టి తాంత్రిక మంత్రములకంటె, వానికి విశిష్టమగు అర్థప్రాధాన్యము కలుఁగవలయును. మంత్రార్థవిచారమువలన బోధము కలుఁగును. కావుననే వైదికమంత్రధ్యానమువలన మనఃపరితాపము వృద్ధినొందునని చెప్పఁబడినది. హ్రీంకారాదిబీజాక్షరరూపము లగు తాంత్రికమంత్రములను జపించుటవలన ప్రాణశక్తివిశుద్ధిద్వారమున శారీరక వ్యక్తి కలుగును, అప్పుడు ప్రాణప్రకాశము విజృంభించును.

ఈ యంశము "వైదికమన్త్రైర్భావవతీ
తాన్త్రికమన్త్రైః ప్రాణవతీ"    స్త 20. శ్లో. 17
అని వెనుక చెప్పఁబడినది.

మూ॥ తవామ్బికే! తాన్త్రికమన్త్రముత్తమం
స్వతాతిగం యః కనకాఙ్గి! సేవతే,
విచిత్రయన్త్రాదివ వైద్యుతం మహః
స్ఫురేద్ వినిర్యద్ భువనం విగాహతే.    ౫

కనకాంగివగు జననీ! స్తోత్రాతీతమును శ్రేష్ఠమును అగు నీ తాంత్రికమంత్రము నుపాసించు వానినుండి—అద్భుతమగు (లౌకిక) యంత్రమునుండి వలె బయలు వెడలిన వైద్యుతమగు జ్యోతి - ప్రపంచమున ప్రసరించును.

ప్ర భ:— పూర్వశ్లోకమున తాంత్రికమంత్రము— ప్రాణముల జ్వలింపఁ జేయునని చెప్పఁబడినది. ఆప్రాణోద్దీపనప్రశస్తి—యిచట నుపమచేత వ్యాఖ్యానింపఁ బడుచున్నది. లోకమునందు లౌకికసామగ్రిచేత జలమునుండి విద్యుచ్ఛక్తిని గలిగించుటకొఱ కొకానొక యంత్రము నిర్మింపఁబడుచున్నది. ఆయంత్రవిశేషమునుండి విద్యుచ్ఛక్తి యావిష్కృతమై బహిర్లోకమునఁ బ్రసరించుచున్నది. అట్లే తాంత్రిక మంత్రసాధనముచేత సాధకునినుండి వైద్యుతమగు జ్యోతి యావిష్కృతమై, వెలుపల నంతటను ప్రసరించును.

మూ॥ నతస్యచేతో విక్రుతేర్వశేభవే
న్నతస్య దృష్టి ర్విషయై ర్విక్రుష్యతే
నతస్యరోగై రవకృష్యతేవపుః
సవిత్రి! యస్త్వే భజతే మహామనుమ్॥ ౬

సవిత్రీ! ఎవఁడు నీమహామంత్రమును సేవించునో, వాని మనస్సు వికృతికి (మార్పునకు) వశపడదు. (ధీరమగును) వానిదృష్టి విషయములచేత నాకర్షింపఁబడదు. వాని శరీరము రోగములచేత అప కర్షము నొందదు.

ప్రి ఫః— నీమహామంత్రోపాసకుని మనస్సు— వికారమునొందదు. వాని బుద్ధిని విషయము లాకర్షింపఁజాలవు. (బుద్ధి బలవంతమగును) వానిమేను— వ్యాధుల చేత బాధితము కాదు. వాని శరీరము— యోగాగ్నిమయమగును.

'నతస్యయోగో నజరానమృత్యుః
ప్రాప్తస్య యోగాగ్నిమయం శరీరమ్॥'

"యోగాగ్నిమయమగు శరీరము నొందినవానికి యోగములేదు. జరలేదు. మృత్యువులేదు" అని శ్రుతి చెప్పుచున్నది.

అవ:—ఏ మహామంత్రముచేత— మనోవికార- విషయాకృష్టి- రోగ—తిరస్కారము కలుగునో, ఆమహామంత్రము నుత్తరశ్లోకము చేతఁ జెప్పుచున్నాఁడు.

మూ॥ స్మరన్తి మాయాంగగనాగ్ని శాన్తిభిః
సహోచ్ఛభాసా సహితాభిరమ్బికే!
తథారసజ్ఞాం ద్రుహిణాగ్ని శాన్తి భి
ర్ఘణన్తి దోర్గ్ధ్రింతు ఖమష్టబిన్దుభిః. ౭

అంబికా! శుభ్రకిరణుఁడగు చంద్రునితోఁగూడిన (నిండు సున్నతోఁగూడిన) ఆకాశ—అగ్ని—శాంతులచేత (హకార—రేఫ—ఈకార ములచేత) మాయను స్మరింతురు. ("హ్రీం" అనునక్షరముచేత మాయను చెప్పుదురు) అట్లే చంద్రునితోఁగూడిన (నిండుసున్నతోఁ గూడిన) బ్రహ్మ—అగ్ని—శాంతులచేత (కకార—రేఫ—ఈకారముల

చేత-అనఁగా; 'క్రీ' ంఅను నక్షరముచేత) రసజ్ఞను చెప్పుదురు. ధేను బీజమునుమాత్రము-ఆకాశ-షష్ఠస్వర-బిందువులచేత(హకార-ఊకార అనుస్వారములచేత-అనఁగా; 'హూం' అనునక్షరముచేత) చెప్పుదురు.

ప్ర భ:-హ్రీంకారమును మాయాబీజముగాను. క్రీంకారమును రసజ్ఞాబీజముగాను, హూంకారమును ధేనుబీజముగాను చెప్పుదురని భావము.

అ వ:- మహామంత్రత్రయమును దెలిపి-తద్దేవతల నుత్తర శ్లోకము చేఁ దెలుపుచున్నాఁడు.

మూ॥ అభణ్యతాద్యా భువనేశ్వరీబుధై
రసజ్ఞరా మాతరగాదికాలికా!
ప్రచణ్డచణ్డీ పరికీర్తితా పరా
త్రయోఽప్యమీతే మనవో మహాఫలాః॥　　౮

మాతా! ఆద్యయు, హ్రీంకారవాచ్యయు, అగుమాయ-పండితులచేత భువనేశ్వరియని చెప్పఁబడుచున్నది. హ్రీంకారవాచ్యయగు రసజ్ఞ-కాళికయని చెప్పఁబడుచున్నది. హూంకారవాచ్యయగు ధేనుబీజము-ప్రచండచండియని కీర్తింపఁబడుచున్నది ఈ మీ మంత్రములు మూడునుగూడ -మహాఫలముగలవి. ఇందు ప్రచండచండినే భిన్నమస్తయనియు, వజ్రవైరోచని యనియుఁ జెప్పుదురు.

మూ॥ ఉపాధిభూతం శుచినాభసం రజో
దధాతి నామ్నా భువనేశ్వరీ పదమ్
తదాశ్రయా వ్యాపకశక్తి రద్భుతా!
మనస్వినీ కాచన కాలికేరితా॥

అన్యసంపర్క-రహితమును, స్వతఃసిద్ధమును, సర్వలోకమునకును ఉపాదానకారణమగుటచేత ఆశ్రయభూతమును,అగుచు, ఆకాశ సంబంధియగు రేణువు- (అణుస్వరూపమగు రజస్సు) భువనేశ్వరియను నామమును ధరించుచున్నది. ఆ యాకాశరేణుసమాశ్రయయు.

ప్రాజ్ఞయు, అనిర్వాచ్యయు, అస్ఫుతయునగు వ్యాపకశక్తి 'కాలిక' అని చెప్పఁబడుచున్నది.

ప్ర. భ:— సర్వజగదుపాదానమూలప్రకృతిభూతమగు ఆకాశాణువు "ఆకాశోగోతేభ్యోయదవితరతి నిజరజస్తు యీదన్నమోః ఇత్యాదిశ్లోకములయందు ప్రథమస్తబకమున వ్యాఖ్యానింపఁబడినది. ఆయణువే "భువనేశ్వరి" అని చెప్పఁబడుచున్నది. సర్వవ్యాపినియగు చిచ్ఛక్తి-'కాలిక' అని చెప్పఁబడుచున్నది.

అ వ:—తృతీయయగు మూర్తిని దెలుపుచున్నాఁడు.

మూ॥ అమర్త్యసామ్రాజ్యభృతః ప్రవర్తికా।
విశాలలోకత్రయరఙ్గనర్తికా।
పరాక్రమాణామధినాయికోచ్యతే
ప్రచణ్డచణ్డీతి కలా సవిత్రి। తే॥ ౧౦

జననీ। దేవరాజ్యభర్తయగు నింద్రుని (ప్రపంచమున) ప్రవర్తింపఁజేయునదియు, విశాలమగు భూలోక-భువర్లోక, స్వర్లోకత్రయమను రంగస్థలమున వర్తించునదియు, పరాక్రమములకు(వివిధములగు విక్రమములకు) అధినాయికయు, (అధిదేవతయు)అగు నీకళ-ప్రచండచండీయని చెప్ప బడుచున్నది.

ప్ర భ:- ఇట్లు చెప్పుటచేత నీమెకు, ఇంద్రాణి (శచి,) అను నామాంతరము చెప్పఁబడినది. ప్రచండచండికి ప్రధానమగునది- క్రియాశక్తి. కాళికిప్రధానమగునది- వ్యాపినియగుజ్ఞానశక్తి-భువనేశ్వరి ఈ యుభయమునకు మూలము. ఈముగ్వురను మహామంత్రత్రయదేవతావిభూతులుగా ప్రతిపాదింపబడిరని తెలియుచున్నది.

మూ॥ స్మరన్మనుం రోదితి భక్తిమాంస్తవ
ప్రగృహ్యపాదం మునిరమ్బ! లమ్బతే।
ఫలంచిరాయ ప్రథమః సమాప్నుయాత్
పరోమరన్దం పదవీవవిన్దతి॥ ౧౧

అమ్మా! భక్తిమంతుఁడు—నీమంత్రమును ధ్యానించుచు ఏడ్చుచుండును. నైష్ఠికుఁడగు ముని (తపస్వి) నీపదమును గ్రహించి,

వేగిరాను. అందు ప్రథముఁడగు మంత్రజ్ఞుఁడు— చిరకాలమునకు ఫలమునొందును. ద్వితీయుఁడగు ముని—వెంటనే రసముప్రసాదించిన మును ఆస్వాదించును.

ప్ర శః— మంత్రమునుజ్ఞాపించువాఁడు కాలనే ఫలమునొందును. పరావలంబియగు మునిమాత్రము— వెంటనే ఫలాంతరస్వాదము నొందును. ఇదియే మునికిఁ గల విశిష్టతయని తెలియునది.

ఉపా॥ పదం తవాన్విష్ట మనేకధా ముదా
హృదన్తరే స్పృష్ట మిదేవ మయ్యకే!
పలాయతేఽధోఽహ మన స్త్వరం శుచా
పరాత్పరే రోదిమి మన్త్రశబ్దతః॥ ౧౨

పరాత్పరవగు జననీ! పలుమాఱు ప్రీతితో హృదయములోపల వెదుకఁబడిన యీ నీపదము స్పృశింపఁబడినట్లున్నది. అప్పుడు నీ పదస్పర్శమాత్రమున, ఈయహంబుద్ధి (నేను) స్వయముగా పరుగెత్తుచున్నది. (లయించుచున్నది) తరువాత(పదస్పర్శ కలుగకుండునప్పుడు) శోకముచేత మంత్రశబ్దముతో నేడ్చుచుందును.

ప్ర శః—అనేకపర్యాయము లాకస్మికముగా హృదయాంతరమునందు నీచరణము స్పృశింపఁబడుచున్నది. కాని చక్కఁగా గ్రహింపఁబడి ధరింపఁబడుటలేదు. నీపదము స్పృశింపఁబడినపుడు లయించిన నేను (అహంబుద్ధి)తరుపరి మరల నుదయించుచున్నది. అప్పుడు శోకాకులుఁడనగు నేను మంత్రశబ్దముతో రోదనముచేయుచుందునని భావము. దీనివలన— ఆచార్యుఁడగు నీకవి— ఆత్మనిష్ఠను, మంత్రయోగమును, క్రమముగా ననుష్ఠించెనని తెలియుచున్నది.

శ్లో॥ భణన్తి సన్తో మరుతాం సవిత్రి! తే
మహోమనుం త్వత్పదభాస్కరాతపమ్।
తతోహి మూలాత్ స్వర ఏష నిర్గత
స్తపత్యఘౌఘం జరయన్మహోమయః॥ ౧౩॥

మరుత్తులకు సవిత్రివగు నింద్రాణీ! విద్వాంసులు— నీమహామంత్రమును నీచరణమేయగు సూర్యాతపము (సూర్యప్రకాశము)గాఁ

జెప్పుదురుగదా! ఆమూలస్థానమునుండి బయలువెడలినదియు, మహోమయమును, (జ్యోతిర్మయమును) అగు ఈ మంత్రనాదము- పాపసమూహమును క్షయింపఁజేయుచు జ్వలించుచున్నది.

ప్రతి భ:—నీ మహామంత్రనాదము- భవత్పదజ్యోతిర్మయ మగుచున్నది. కావుననే పాపములను తొలఁగించుచు జ్వలించుచున్నది.

మూ॥ సవిత్రి! సాక్షాచ్చరణస్య తే ప్రభాం
విధారయం స్త్వజ్జనిమూలమార్గణే
ముహుర్మహుస్సోఽహమజే! ధృతోద్యమః
యథా మహర్షి రమణోఽబభాణయమ్. ॥౧౪॥

అజవగు జననీ! ప్రత్యక్షముగా నీపదదీప్తిని (మంత్రనాదమును) ధరించుచున్నవాఁడనగు నేను- రమణమహర్షి చూపినమార్గముచేత- జపింపఁబడుచున్న మంత్రముయొక్క- ధ్వనికి మూలమగు స్వరూపమును వెదకుటయందు మాటిమాటికిని ప్రయత్నము నూనియున్నాను.

ప్రతి భ:—బహుకాలమునుండియు మంత్రసాధనము నొనర్చుచున్నను, కృతార్థుఁడనుగాని నేను భగవంతుఁడగు రమణమహర్షి నాశ్రయించి- తపఃస్వరూపమును దెలియఁగోరితిని. "జపింపఁబడుచున్న మంత్రముయొక్క ధ్వని- ఎక్కడనుండి వచ్చినదని యన్వేషించునెడల ఆయన్వేషణము- తత్ ధ్వనిమూలమగు స్వరూపము నొందించును. అదియే తపస్సు" అని యాభగవానుఁడుపదేశించెను, తదుపదిష్టమార్గమున మంత్రనాద మూలాన్వేషణమున నిత్యమును ప్రవర్తించుచున్నానని తాత్పర్యము. మహోమయమే మంత్రనాదమని పూర్వశ్లోకమునఁ జెప్పఁబడినది. కావున పదప్రభయనఁగా మూలస్వరూపమునుండి యుదయించిన మంత్రనాదమే యర్థమగుచున్నది.

మూ॥ అహమ్పదార్థో యదిచిల్లతా తతా
కిమేషదోర్గ్రి మనుభావతోఽపరః।
అహం యది ప్రాణనినాద వైఖరీ
నకూర్చ ఆఖ్యాతు మసేతిశక్యతే॥

అహమను పదముయొక్క అర్థము (శక్యసంబంధియగు లక్ష్యార్థము) చిల్లత (ప్రజ్ఞావల్లి) యగునెడల, నీయర్థము- భేదబీజమగు హూంకారముయొక్క అర్థముకంటె వేఱుకాదు అహమను పదము ప్రాణనాదముయొక్క స్థూలాకృతియగు వైఖరీనామమగునెడల నది (అహమనుపదము) ప్రాణనాదవైఖరి కాదనుటకు శక్యముకాదు.

ప్ర భ:—అహం పదార్థము, స్ఫూర్తిమంత్రార్థము, చిత్తేజమగును. ఇట్టి అహంశబ్దమును, హూంకారమునుగూడ ప్రాణనాదమేయగును, కావున శబ్దమువలనను, అర్థమువలననుగూడ అహమ్మునకు స్ఫూర్తిమంత్రములకు భేదము లేదని భావము.

మూ॥ పరేతు యాం చేతనశక్తి మాహుర
స్త్వభాషి నాకుణ్డలినీతి తాన్త్రికైః ।
విలక్షణానామ చమత్కృతిర్జడాన్
ప్రతారయత్యాగమసార దూరగాన్ ॥ ౧౬

వేఱొకపక్షమున-ఇతరులు-దేనిని చేతనశక్తియని కీర్తింతురో, దానిని కుండలినియని తాంత్రికులు చెప్పుదురు. అయ్యా! విలక్షణ (అసాధారణి) యగు చమత్కృతి- తంత్రశాస్త్రముల సారము నెఱుంగని జడులను వ్యామోహపఱచుచున్నది.

ప్ర భ: —తాంత్రికులు (శాక్తాగమికులు) చితిశక్తికి కుండలిని యను పేరిడిరి. ఆ నామకరణము- విలక్షణమగు చమత్కృతి యగుచున్నది. 'కుండలిని' అనుపదము వినినతోడనే సర్పముపస్థితమగును కాని, చేతనశక్తియుపస్థితము కాదు. కావుననే యిది-విలక్షణమగు చమత్కారమగుచున్నది.

మూ॥ భవత్యఖణ్డానుభవః ప్రబోధినా
మతీవ సూక్ష్మానుభవశ్చ యోగినామ్।
కరంగతా స్సర్వవిధాశ్చ శేరతే
మహేశ్వరీమన్త్రపరస్య సిద్ధయః॥

ప్రకృష్టమగు జ్ఞానముగలవారికి దేశకాలపరిచ్ఛిన్నముకాని అఖండమగు అనుభవము కలుగును. షట్‌చక్రభేదనమార్గము ననుసరించుయోగులకు అత్యంతమును, సూక్ష్మమగు ననుభవము కలుగును. మహేశ్వరీమంత్రసాధకునకు సర్వవిధములగు అద్భుతసిద్ధులును హస్తగతములగును.

ప్ర భ:— ప్రబోధముగల జ్ఞానికి సర్వమును బ్రహ్మస్వరూపమగుటవలన బాహ్యాంతరభేదము కలుగదు. స్థూలసూక్ష్మశరీరములయందున్న యోగికి పరమార్థతత్త్వము-అంతర్దృష్టి గమ్యమగును. ఆయనుభవము- సూక్ష్మమని చెప్పఁబడుటవలన అల్పమని భావింపఁగూడదు. దేవీమంత్రసాధకునకు సిద్ధులన్నియుఁగూడ వశపడును.

మూ॥ సహస్రసంఖ్యాని జనూంషి నా మమ
ప్రియాణి భక్తిస్తవచేద్ భవేభవే
తవ స్మృతించేద్ గలయేన్న సమ్మదం
కరోతి మోక్షోఽపి మహేశవల్లభే! ॥౧౮॥

ఈశ్వరప్రియవగు జననీ! ప్రతిజన్మమునందును నాకు నీయందు భక్తి కలుగు నెడల వేయిజన్మములయినను నాకు ప్రియములే యగును. నాకు నీయందలి ధ్యానమును తొలఁగించు నెడల, మోక్షమయినను గూడ నాకానందమును గూర్పదు.

ప్ర భ:—ముక్తికంటెనుగూడ నీయందలి భక్తియే- నాకు మిక్కిలి ప్రియమని భావము.

మూ॥ వినైవదృష్టిం యది సత్ప్రశిష్యతే
నసత్తయాఽర్థః ఫలహీనయాత్వయా।
ఇదం తు సత్ కి న్న్వసతో విశిష్యతే
న తాత ముక్తోఫలయోస్తదాభిదా॥ ౧౯

దృష్టిలేకయే (ప్రజ్ఞలేకయే) సత్తు (ఉనికి) మాత్రమే మిగిలిన యెడల ఫలహీనమగు ఆసత్తచేనగు ప్రయోజనము లేదు. ప్రజ్ఞ లేకు

న్ననుగూడ సత్త్వ-అసత్త్వకంటె విశేషించునా? యేమి? ఓయీ! అట్లి యినయెడల అప్పుడు ముక్తపురుషునకును, బండరాతికిని భేదము, కలుగదు.

ప్ర భః—ప్రజ్ఞావిరహితమగు సత్తునకును— (భావమునకును, అసత్తునకును, (శూన్యమగు అభావమునకును) విశేషమేమియు నుండదు. కావున సర్వప్రవృత్తివిరహితమగు ముక్తావస్థ మిగిలియుండునప్పుడుగూడ ప్రజ్ఞ యుండవలయును. లేనియెడల— ఆముక్తావస్థ—నిరర్థకమే యగునని భావము.

మూ॥ శుచాం నివృత్తిర్యది ముక్తిరిష్యతే
సుఖప్రవృత్తిర్యది నాత్రవిద్యతే
సదేవచేత్ తత్ర మతిర్నభాసతే
జడం విముక్తాద్వచసైవ భిద్యతే॥ ౨౦

“శోకనివృత్తియే ముక్తి” యగునెడలను, ఆముక్తియందు సుఖప్రవృత్తి లేనియెడలను, అందు- కేవల సత్తుమాత్రమే మిగిలి, బుద్ధి-భాసింపకుండినయెడల, ఆముక్తపురుషునికంటె—జడమగువస్తువు వాఙ్మాత్రముననే (నోటిచేతమాత్రమే) భేదించును.

ప్ర భః— దుఃఖనివృత్తియే - ముక్తియగునెడల, జడపదార్థమునకును, ముక్తునకును, భేదమే యుండదని భావము. ముక్తియందు వ్యతిరేకముచేత దుఃఖనివృత్తిమాత్రమే కాక, ఆనందప్రవృత్తిగూడ కలుగునని యూ, కేవలసత్తయే కాక, చిత్తు [ప్రజ్ఞ] గూడ నుండుననియు. భావము.

మూ॥ మతిః పరాచీ వ్యవహారకారణం
భవేత్ ప్రతీచీ పరమార్థ సమ్పది
ఉభేదిశౌ యస్య మతేర్నగాహతే
సదా చ మూర్ఖాన్నచ స సిద్ధ ఇష్యతే. ॥౨౧॥

బహిర్ముఖియగుబుద్ధి (ఈలోకమున) వ్యవహరించుటకు కారణమగుచుండును. అంతర్ముఖియగు బుద్ధి- పరమపురుషార్థసంపదకు కారణమగును. ఎవ్వనియొక్క- బుద్ధి (ప్రజ్ఞ) పరాగ్దృష్టిని, (బాహ్య

దృష్టిని) ప్రత్యగ్దృష్టిని, (అంతర్దృష్టిని) గూడ ప్రవేశించునో, (పొందునో) ఆయోగి- పాదముచేతను, (హృదయాకాశముచేతను) శిరస్సుచేతను, (సహస్రారముచేతను) గూడ సిద్ధుఁడగుచున్నాఁడు.

ప్ర భ:—వెలుపలిచూపుచేత లోకవ్యవహారమును, లోపలిచూపుచేత- ఆత్మసాక్షాత్కారమును, కలుగును. ఇందు మొదటిచూపు— జ్ఞానకును, రెండవచూపు- ప్రాజ్ఞానకును, గలుగును, జీవన్ముక్తుఁడగు యోగికిమాత్రము, పరాక్—ప్రత్యగ్ దృష్టులు రెండును (వెలిచూపు—లోచూపు లభించును, కావున నతఁడు—సహస్రారముచేత-పరాగ్దృష్టి సిద్ధుఁడును,హృదయాకాశముచేత-ప్రత్యగ్దృష్టి సిద్ధుఁడును గూడ నగును.

విశే:—మూలమునందున్న పాదశబ్దమునకు హృదయాకాశమర్థమనియు, మూర్ధ-శబ్దమునకు సహస్రార మర్థమనియు గ్రహించునది. పరాగ్దృష్టి ప్రజలందఱకును అవశముగానే గలుగును. గాని ప్రత్యగ్దృష్టి యట్లు సిద్ధించునది కానేరదు. ప్రత్యగ్దృష్టిగలవానికి పరాగ్దృష్టియందుఁగూడ స్వవశమైన సిద్ధికలుగును, జీవన్ముక్తుఁడయిన పురుషునికే ప్రత్యగ్దృష్టియందగు స్వస్థితిని విడువక వెలుపలి వ్యవహారము నొనర్చుటకుఁ దగినప్రజ్ఞ కలుగును— ఈయాశయమునే వేఱొకవిధమున వాజసనేయులశ్రుతి (ఈశావాస్యోపనిషత్తు) చెప్పుచున్నది,

"విద్యాం చా విద్యాంచ యస్తద్ వేదోభయంసహ।
అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయా అమృత మశ్నుతే॥

మూ॥ రూఢం పదం యస్యమతేః సదాన్తరే
సనాధియోఽగ్రేణ బహిశ్చరన్నపి
సవిత్రి! మగ్నస్త్వయి సమ్ప్రకీర్త్యతే
నతస్యభీః సఞ్చరతోఽపి సంసృతేః. ॥ ౨౨॥

సవిత్రీ! ఎవనిబుద్ధికిలక్ష్యమగుపదము(గమ్యస్థానమగుసాక్షాత్కారము) హృదయాంతరమునందెల్లప్పుడును ధృఢమగునో, ఆమనుష్యుఁడు- ఆబుద్ధియొక్క- మూలనుచేతనుగాక, అత్యంతబాహ్యంశేమగు అగ్రముచేత- బహిర్విషయములయందు సంచరించుచున్నను, చిత్స్వరూపిణివగు నీయందు మగ్నుఁడని (గాఢమగు స్థితినిబొందినవాఁడని) మిగుల కీర్తింపఁబడుచుండును. కావుననే, యిట్లు వెలుపలఁ

దిరుగుచున్నను గూడ, ఆపురుషునకు- జననమరణరూపసంసారమువలని భీతికలుగదు.

ప్ర భ:— హృదయనిష్ఠుఁడగు పురుషునిబుద్ధి- వెలుపలఁ దిరుగుచున్నను, విషయములచేత బాధింపఁబడునది కానేరదు. హృదయస్థానమున (చిదాకాశమున) దృఢమగుస్థితినొందిన సిద్ధపురుషునకు పరమాత్మ సాక్షాత్కారమువలన అమృతస్వరూపము కలుగుటను వంశము- నిగమాగమ పురాణేతిహాసప్రసిద్ధము. జీవించియే ముక్తుఁడగు తనని కి- దేనివలనను గూడ సంసారము కలుగదు. కావున సంసారభీతికూడ నొకప్పుడును గలుగదని భావము.

మూ॥ విచిన్తనే చిన్తనశక్తి మద్భుతాం
　　విలోకనే లోకనశక్తి ముజ్జ్వలామ్
　　పరిభాషణే భాషణశక్తి ముత్తమాం
　　విభాలయం స్త్వాం విషయై ర్న జీయతే॥　　॥౨౯॥

ధ్యానకర్మయందు అద్భుతమగు ధ్యానశక్తిగాను, దర్శనకర్మ యందు ఉజ్జ్వలమమగు దర్శనశక్తిగాను, పరిభాషణ (ప్రవచన) కర్మ యందు-ఉత్తమమగు భాషణశక్తిగాను,నిన్ను గుర్తించిన నైష్ఠికుఁడగు పురుషుఁడు- ఇంద్రియాకర్షకములగు విషయములచేత- పరాభవింపఁబఁడఁడు.

ప్ర భ:— ఆశ్చర్యకరియగు చింతనశక్తియు, ప్రదీప్తయగుదర్శనశక్తియు, ఉత్తమయగు వాక్ఛక్తియు- ఒక్కతె యగు నమ్మయే యగుచున్నది. కావున "ధ్యానించుదానవు, వీక్షించుదానవు, భాషించుదానవుగూడ-నీవే" యని యుపాసించువానికి జితేంద్రియత్వము కలుగునని భావము.

మూ॥ విలోకమానస్య విలోకనం కవే
　　ర్విలోక్యమానేషు విహాయసక్తతామ్।
　　విలోచనే సన్నిహితా నిరన్తరం
　　విధూతభీతిర్విబుధస్తుతా శివా.　　॥౩౦॥

మృత్యుశిరస్కమును, (మరణాదిరూపమును, బహువిధమును అగుచు, ఆశ్రితజనములకుఁ గలుగుభీతి నపనయించునదియు, విబుధుల

చేత (విద్వాంసులచేతఁగాని, దేవతలచేతఁగాని) స్తుతింపఁబడునదియు, శివయు, నగు భగవతి—దృశ్యములను విషయములయందు సంగమును విడిచి, విలోకనమును (దర్శనకర్మను) విలోకించుచున్న కాంతదర్శి యగు కావ్యనిర్మాతయొక్క విలోచనమునందు (దృష్టియందు) సన్ని హితయగుచుండును. (సాన్నిధ్యము నొసఁగుచుండును.)

ప్ర భ:- విషయములతోడి సంబంధమును విడిచి విషయములందు ప్రవర్తించు చున్న దృష్టికి ద్రష్టయగువాఁడు, కావ్యస్రష్టయగుచున్నాఁడు. కాంతదర్శియగు వతనిదృష్టియందు- భగవతి— నిత్యసన్నిహితయు, సర్వభయాపహయు,నయివెలయు చుండునని భావము. కవులకీయుపాసనమావశ్యకమని తెలియునది.

మా॥ అయం భయానాం పరిమార్జకస్సతాం
సమస్తపాపౌఘ నివారణక్షమః ।
మనోజ్ఞ వంశస్థగణో గణేశితు
ర్మనో మహేశాబ్జదృశోధినోత్వలమ్॥ ॥౨౫॥

సజ్జనుల భయముల నన్నిఁటిని నివారించునదియు, సమస్త పాపసమూహమును ధ్వంసముచేయుటకు శక్తిగలదియు, గణపతికవి చేత రచియింపఁబడినదియు, అగు వంశస్థవృత్తగణము- మహేశ్వరుని యబ్జాక్షియగు పార్వతియొక్క మనస్సును మిక్కిలి సంతోషింపఁ జేయునుగాత!

ఇది- సవ్యాఖ్యమగు త్రయస్త్రింశస్తబకము.

[ఇది-33వ స్తబకము]

శ్రీ మహాభగవతే శ్రీమహాదేవ శ్రీభారతీదేవ్యైనమః

# ఉమా సహస్రము



## ( షట్త్రింశ స్తబకము )

### తొమ్మిదవ శతకమున—రెండవ స్తబకము.

ఇక—ఈ ముప్పదినాలుగవ స్తబకమునందు మానవమాంగ ల్యమునకొరకు దేవకటాక్షము సంపాదనేచ్ఛచేత— భగవతిని బహు విధముల ప్రార్థించుచున్నారు.

మూ॥ విదితమహిమా విశ్వాధానా దనేకవిధాద్భుతాత్
ప్రథితచరితః శర్వాలోకప్రతాప వివర్ధనాత్
ప్రకటితగుణః పాపధ్వాన్త ప్రసార నిరోధనాత్
ప్రదిశతు శివాహాసో భాసాంనిధిః కుశలానిమే. ॥౧॥

అనేకప్రకారములగు నాశ్చర్యములుగల జగత్తును సృజించుట వలన తెలియఁబడిన మహిమగలదియు, రుద్రునియొక్క ఆలోకప్ర తాపమును వృద్ధినొందించుటవలన— ప్రఖ్యాతమయిన చరిత్రము (నడవడి) గలదియు, పాపములను చీకటులయొక్క వ్యాప్తిని నిరో ధించుటవలన ప్రకాశింపఁజేయఁబడిన తేజో, బల, వీర్యాదిగుణము గలదియు, కాంతులకు నిధియు అగు పార్వతీహాసము నాకు కుశలముల నొసఁగుఁగాత !

ప్రశ్న:— దేవీహాసము— నానావిధాద్భుత జగత్సృష్టివలన నిజమహిమను తెలియఁజేయుచున్నది. పరమేశ్వరదృష్టికి వీర్యమును గలిగించుటవలన విఖ్యాత మగు చేష్టితము గలిగియున్నది. పాపతిమిరప్రసారమును తొలగించుటవలన గుణము లను ప్రకటించుచున్నది. కాంతుల కాకరమైయున్నది. అహాసము—నాకు క్షేమముల నిచ్చుఁగాతయని ప్రార్థింపఁబడినది.

విశే:— ఇచట— వివిధమును, అద్భుతమును, అగు ప్రపంచమును పుట్టించుట యను సాధనమువలన సాధ్యమగు మహిమయొక్క జ్ఞానమును. శివదృష్టి వీర్యవర్ధ

మను సాధనమువలన సాధ్యమగు చరిత్రముయొక్క జ్ఞానమును, పాపపరిహారవిరోధమను సాధనమువలన సాధ్యమగు తేజోబలాదిగుణమును ప్రతిపాదింపఁబడినది. కావున నిది యనుమానాలంకారమగుచున్నది; "విచ్ఛిత్తిచేత (వైచిత్రిచేత) సాధ్యముయొక్క జ్ఞానమును సాధించుట. అనుమానము" అను సాహిత్యదర్పణోక్తమగు లక్షణము నిచట నెఱుఁగునది.

మూ॥ హృదికరుణయా పూర్ణా బాహ్వోర్బలేన మహీయసా
పదకమలయోర్లక్ష్మ్యా భక్తైర్జనైరుపజీవ్యయా
ముఖసితకరే లావణ్యేన త్రికోణదృశాంబలం
బహువిదధతా కాలీమాతాఽవతాత్ పదసేవినమ్. ॥౨॥

హృదయమునందు దయచేత పూర్ణయు (నిండినదియు) బాహువులయందు మహత్తరమగు బలముచేత పూర్ణయు, (నిండినదియు) పదకమలములయందు, భక్తులగు జనులచేత ఆశ్రయింపఁదగిన లక్ష్మిచేత (శోభచేత, లేక సంపదచేత) పూర్ణయు, ముఖచంద్రుని యందు త్రినేత్రునియొక్క దృష్టులకు, మిక్కిలి బలమునిచ్చు లావణ్యముచేత పూర్ణయు, అగుచున్న మాతయగు కాళి పాదసేవకుని రక్షించుఁగాత!

ప్ర భ:— ఇందు దయాదులు— హృదయాదుల నాశ్రయించినట్లు తెలిపి వానిభేదమువలన ఒక్కతెయేయగు కాలీమాతను బహువిధముల నుల్లేఖించుటవలన నుల్లేఖ మలంకారమగుచున్నది.

మూ॥ జగదధిపయా సిద్ధం దోర్గ్ధ్యాఽథవోత రసజ్ఞయా
మునిజననుతం దేవీమన్త్రం జపేద్యదిమానవః
అమృతజలధీభూతః పూతః వియోగవిశేషవిత్
స ఇహ వసుధాలోకే ధారాగిరావభివర్షతి. ॥3॥

(కడచిన స్తబకమున వ్యాఖ్యానింపఁబడిన) భువనేశ్వరిచేతను గాని, ప్రచండచండిచేతనుగాని, కాలిచేఁగాని, సిద్ధమగు (సంపన్నమగు) నదియు, తపశ్శాలులచేత స్తుతింపఁబడునదియు, అగు దేవీమంత్రమును, మానవుఁడు జపించునెడల వాఁడు— అమృతజలధీ

భూతుండై, (అమృతవర్షియై) పవిత్రుండై, ప్రయోగవిశేషవిదుండై, యీ భూలోకమునందు వాగ్ధారలను చక్కఁగా వర్షించును.

ప్రశ్న:— భువనేశ్వరి, ప్రచండచండి, కాళి, నవమూర్తిత్రయమును. కవ్ బీజత్రయమును, కడచిన స్తబకమున వ్యాఖ్యానింపఁబడినవి. పూర్వోక్తమగు దేవీమంత్రమును జపించువాఁడు— సర్వసుఖావహములును, అమృతప్రాయములును, అగు వాణులను వర్షించునని భావము.

మూ॥ ఇమమభిముఖీ భూతాశ్వాశ్వోదరీ కమలాలయా
హయగజఘటాపూర్ణాభ్యర్ణం సమేత్య నిషేవతే
సవిబుధమిదం విశ్వం తస్య ప్రయాతి పురవ్వశమ్
ప్రథితయశసాం సిద్ధీనాంచాష్టముంభజతేఽష్టకమ్. ॥౪॥

ఈ దేవీమంత్రజాపిని-కృశోదరియగు కమలాలయ (లక్ష్మి) అశ్వములచేతను, గజఘటచేతను, పూర్ణయై—సమీపించును. మఱియు, దేవతలతోఁగూడిన యీజగత్తు—వానికి వశపడును. ఈ యుపాసకుని- విశ్రుతమగుకీర్తిగల అణిమాద్యష్టసిద్ధులునుగూడ— సేవించును.

మూ॥ సువిమలధియస్తస్య క్రోధాద్దృగమ్బుధుతద్యుతీ
రిపుజనవధూగణ్డాభోగే భవేదుతపాణ్డురః।
సపది భువనవ్యాప్తం చాప్తైః ప్రమాణపురస్సరం
భణితమజరం భద్రం జ్యోతిః పరంహృది భాసతే. ॥౫॥

అత్యంతమును విశుద్ధమగు బుద్ధిగల దేవీమంత్రజపకర్త యొక్క— రోషమువలన— శత్రుకాంతలకపోలస్థలవిస్తారము— వారి కన్నీటిచేత తొలఁగింపఁబడిన కాంతిగలదై (విచ్ఛాయమై) పాండుర (తెల్లని) వర్ణము గలదగును. విశ్వమునందంతటను వ్యాపించియున్న దియు, వయోవిద్యావృద్ధులగు ఆప్తులచేత ప్రమాణపురస్సరముగా, (అనుభవజన్యవాక్యపూర్వకముగా) ప్రతిపాదింపబడినదియు, అజరమును

(జరాదిషడ్వికారములులేనిదియు) భద్రమును, (శోభనమును)అగు పరజ్యోతి- వానిహృదయమునందు శీఘ్రముగానే స్ఫురించుచుండును.

ప్ర భ:- దేవీమంత్రమును జపించు మనుష్యునికి కోపము కలిగిన యెడల- వానిశత్రువులు ప్రధ్వంసము నొందుదురు. కావున వారి స్త్రీలకు వైధవ్య ప్రాప్తివలన కలుగు వశ్రుధారచేత- వారి ముఖకాంతి వశించి తెల్లపడును. అప్పుడతనికి తన హృదయమున- జ్యోతిస్స్వరూపమగు నాత్మ-వెంటనే ప్రకాశించునని భావము.

విశే:- దేవీమంత్రసిద్ధునకు కోపము కలుగనేరదు- ఒకప్పుడు కలిగినయెడల నతనిహృదయమున సర్వవ్యాపియగు పారమేశ్వరజ్యోతి- జ్వలించును. కావుననే తత్క్రోధము- శత్రుస్త్రీ వైధవ్యాధాయి విక్రమమగును. ఇందు సమర్థనీయమును, పూర్వవాక్యార్థగతమును, అగు శత్రుస్త్రీ కపోలదేశపాండిమ- హృదయగతపారమేశ్వరజ్యోతిర్దీప్తిరూపమగు ఉత్తరవాక్యార్థముచేత సమర్థింపఁబడినది. కావున నిందలి యలంకారము- వాక్యార్థహేతుకమగు కావ్యలింగ మగుచున్నది.

మా॥ అదయమరిభిః క్రాన్తే రాష్ట్రే;త్వమీశ్వరి! రక్షికా।
సుమశరముఖైర్ధూతే చిత్తే,త్వమీశ్వరి! రక్షికా
ప్రబలదురితైర్గ్రస్తే వంశే,త్వమీశ్వరి! రక్షికా
ప్యసృజతిజలం మేఘే మోఘే, త్వమీశ్వరి! రక్షికా ॥౭

ఈశ్వరీ! శత్రువులు—నిర్దయులై రాష్ట్రము నాక్రమించునపుడు నీవే రక్షికవు. [దిక్క—] కామక్రోధాదులు—మనస్సును చలింపఁజేయునపుడు నీవే రక్షికవు. బలిష్ఠములగు పాపములు- మానవకులమును ఆవేశించినపుడు నీవే రక్షికవు, మేఘము- మోఘమగునపుడుకూడ (వర్షింపనపుడును) నీవే రక్షికవు.

ప్ర భ:- సర్వకాలములందును నీవే రక్షింతువని భావము.

మా॥ భగవతి! నిజౌ సాక్షాత్పుత్రౌ బృహస్పతి పావకౌ।
గణపతి గుహావేతౌ వేషాన్తర వ్యవహారతః।
భరతధరణీఖణ్డే హేతోః కృతసమ్భవౌ
కలకలయుతేకాలే దేవి! వ్యథాంకిధయుద్ధతమ్

భగవతీ! జననీ! నీ నిజపుత్రులగు బృహస్పతి-పావకులు (బ్రహ్మణస్పతి-అగ్నులు) ఇంకొక వేషముచే నగు వ్యవహారముచేత-గణపతి గుహులై, భారతభూఖండమున కోలాహలయుతమగు నీకాలమున నే-యేకారణమువలన జన్మించునట్లొనరించితివో, దయయుంచి చెప్పుము.

(ప్ర భ:—గణపతియే గణపతిమునియనియు - గుహుండే (గుహాస్వామియే) రమణమహర్షి యనియు నిచట గుర్తించునది.

మూ॥ సమయమయితే ధృత్వా పాదామ్బుజం రమణస్సుతో
గిరివరగుహాస్వన్తః శాన్తోऽవసద్యదినాద్భుతమ్।
స్థలవిరహతః స్వీయస్థానే కిమత్ర సమాగతో
న వదసి కుతః కార్యం తస్మై కులాచలకన్యకే! ౮

అమ్మా! పుత్రుడగు రమణుడు (గుహుడు) నీపాదపద్మమును గ్రహించుటవలన, అంతఃశాంతుడై (ఆత్మనిష్ఠచేత శాంతి సంపన్నుడై) గిరిశ్రేష్ఠమగు నరుణాచలముయొక్క గుహాలయమున కాలమును గడుపుచుండినయెడల, నది యాశ్చర్యజనకముకాదు. స్వీయస్థానమున (జన్మభూమియందు) స్థలములేకుండుటవలన నిచటకు వచ్చినాడేమి! ఓ పార్వతీ! ఏకారణమువలన నతనికి కర్తవ్యమును చెప్పకైతివి.

ప్రభ:— నివాసభూమిని విడిచి, కార్యవిశేషముకొఱకే యిచటకు వచ్చియుండవలెను. కాని వాసస్థలము లేకుండుటవలన గాదు. ఆతనికి నీవు కర్తవ్యమును జెప్పవయితివి. కావున నీపాదమును ధరించి శాంతిసమృద్ధుడై మెలయుచున్నాడను. నీవాదేశమిచ్చుచుండినయెడల నిస్సంకల్పుడును, మహాత్ముడును, అగు రమణుడు దానిని తప్పక చేయగలడు,

మూ॥ ప్రతిభణతి చేచ్ఛిష్యవ్యూహే మహాత్మ్యతసజ్జతి
ర్జనని! రమణో యోగీశానస్తతో బహు నో ఫలమ్।
అమితతమమాయాదృష్టేః శక్త్యాకదాసరణిం నయే
దపథపతితం ధాత్రీలోకం తదేవ వదామ్బికే!

జననీ! యోగీశ్వరుఁడగు రమణుఁడు- ఉపదేశయోగ్యమగు శిష్యబృందమున మహాశ్చర్యకరములగు సంగతులను చెప్పునెడల దానివలన మాకు బహుళమగు ఫలము కలుగును. అంబికా! మార్గ భ్రిష్టమగు భూలోకమును మిక్కిలి బహులమగు దృష్టిబలముచేత నెప్పుడు మార్గమును పొందించునో దానినే చెప్పుము.

మూ॥ అహమిహకుతో హేతోర్జాతో విషణ్ణతమేస్థలే
చరణకమలచ్ఛాయాం మాయాధిరాజ్ఞి! విహాయ, తే।
పరమకరుణో ఘోరఃశాపః కిమేష సవిత్రి! తే
కి మపి భువివా కార్యం కర్తుం నియోజితవత్యసి. ॥౧౦॥

మాయేశ్వరివగు జననీ! నీపాదకమలచ్ఛాయను విడిచి- ఈ భూలోకమున శోకభూయిష్ఠమగు స్థలమునందేకారణమువలన జన్మము నొందితిని? సవిత్రీ! ఇది ఘోరమగు నధికశోకమును గలిగించు నీశాపమా? లేక, భూమియం దేదయిన కార్యము నొనర్చుటకు నియోగించుచున్నావా?

ప్రి భ:— నేను నీశాపవిశేషమువలన నిచట పతితుఁడనైతినా? లేక కార్య విశేషము నొనర్చుటకు నీచేత ప్రేరితుఁడనా?

మూ॥ వ్రజతివిలయం స్నేహో దూరప్రవాసవశాదితి
ప్రవదతిబుధః కశ్చిత్ సత్యం ప్రిభాతి తదమ్బికే!
భగవతి! నిజేకుక్షౌ జాతం దివో ధరణీగతం
స్మృతిసరణితో మాం శే;హాహా! కరోషిరుషా యథా ।౧౧।

భగవతి! అంబికా! "వియోగజనకమగు దూరదేశాంతర నివాసమువలన స్నేహము (ప్రేమ)నశించును" అని లోకమునందొక పండితుఁడు ప్రవచించినమాట- నాకుసత్యముగాఁదోచుచున్నది. నీ యుదరమున జన్మించినవాఁడను, ద్యులోకమునుండి భూలోకమునకు వచ్చినవాఁడను, అగు నన్ను-రోషముచేతనువలె, నీస్మృతిమార్గమునుండి దూరమొనర్చితివి? ఆహా! ఇది మిక్కిలి కష్టము!

ప్ర భా:- "కోపముచేతనువలె నన్ను స్మరింపక మానివైతివి." అని భావము.

మూ॥ మమతు విమలాహ్లాద్యావిద్యా మహేశ్వరి! యాఽభవ
న్మనసిచ పరాచిత్రాశక్తి శ్చికర్తని! యాఽభవత్
వచసిచ మహద్భాగ్యం శ్లాఘ్యం యదీడ్యతమేఽభవత్
తదయిగలితం మత్తో విత్తత్రయం భవతోఽధునా ౧౨

మహేశ్వరీ! నేనీ లోకమున జన్మించుటకు ముందు-నాకు-శుద్ధమును, హ్లాద్యమును, అగు విద్య, నిశ్చయముగానుండెను. చికర్తని! మనస్సునందు శ్రేష్ఠమును, చిత్రమును, అగు శక్తియుండెను. ఈడ్యతమా! వాక్కునందు ప్రశంసింపఁదగినదియు, గొప్పదియునగు వైభవముండెను. అమ్మా! ఆ యీ విత్తత్రయము-ఇప్పుడు ఈలోకమునందు జన్మించిన నాయొద్దనుండి జారిపోయినది.

ప్ర భా:- హ్లాద్యమగు శుద్ధవిద్యయు, మాననీయగు చిత్రశక్తియు, ప్రశస్యమగు వాగ్విభూతియు, నే నీభూమియందు ఉదయించుటకుముందు నాయందుండెడివి. నాకు సహజమగు ఈ సంపత్త్రయి- భూసంపర్కమువలన గలితమయినది. ఇప్పుడు వాని వాసనమాత్రమే- మిగిలినదని గమ్యమగుచున్నది, "శుద్ధవిద్య, విచిత్రమననశక్తి, వాగ్వైభవము, అను మూటికినిగూడ- తనజీవితకాలమునందు ఈ మహాకవి యాకరమువలె నుండెను" అనునంశము- నిర్మత్సరులగు సజ్జనులకందఱకును గూడ తెలిసియేయున్నది. కావున మూలమునందలి గలితశబ్దముచేత- ఈ మూఁడునుగూడ వాసనామాత్రముచే మిగిలియున్నవనునది యుపపన్నమే యగును.

మూ॥ కృతమయి మయా పాపం ఘోరం సుకర్మసు సజ్జినామ్
యదహమదయోవిఘ్నం న్నౄణాంముహుర్ముహురాచరమ్,
అతికటుఫలం తస్యాశ్నామి శ్రితో నరవిగ్రహమ్
ప్రమథనృపతేర్జాయే! మాయే! జనన్యవమామిమమ్. ౧౩

అమ్మా! నేను ఘోరమగు పాపము నొనర్చితిని. సత్కర్మానుష్ఠానపరులగు మనుష్యులకు నేను నిర్దయుఁడనై, మాటిమాటికిని విఘ్నము నొనరించితిని ఇదియే- నేనొనర్చినపాపము. 'ఆ'విఘ్నకర్మ

మునకు తగినదియు, మిక్కిలికఠోరమును, అగు ఫలము నిష్ఫలము మనుష్యరూపము నాశ్రయించి యనుభవించుచున్నాను. ప్రమథగణ ములకధిపతియగు శివునకు జాయవును, (ప్రియసివియు) మహామాయ వును, అగుజననీ! ఇట్టి దురవస్థగల నన్ను రక్షింపుము.

ప్ర భ:— విఘ్నేశ్వరుఁడు- విఘ్నముల నొనర్చుననుప్రసిద్ధి గలదు. కాని, పూజింపఁబడినయెడల నతఁడు యథార్థముగా విఘ్నములను తొలగించును. పూర్వము, తాను విఘ్నేశ్వరుఁడై సత్కర్మములకు విఘ్నము నొనర్చుటవలన నిప్పుడు గణపతి యనునామమున జన్మించి, దుఃఖము ననుభవింపవలసివచ్చినదని భావము.

మూ॥ నభవసి దృశో ర్మార్గే లోకాధిరాజ్ఞి! కుతో గిరో
న చ బహుకృపే స్వప్నే వాత్వం ప్రయచ్ఛసి దర్శనమ్॥
అపనయసినో సన్దేహం వా పరోక్షకృపావశా
దపి సురనుతే! లగ్నా కార్యాన్తరేక్ ముతాదయా. ।౧౮।

బహుకృప్పవగు లోకేశ్వరీ! ఏల నాదృష్టిమార్గమునొందవు? స్వప్నమునందైనను మాటాడవు. దర్శనమీయవు, పరోక్షమగు (అప్రత్యక్షమగు) కృపావశమువలననైనను ఏదోయొక నిమిత్తముచేత నాసందేహమును నివారింపవు. ఓసురవందితా! కార్యాంతరమున (వేరొకకార్యమున) లగ్నమై యున్నావా? లేక నీకు నాయందు దయ లేదా?

ప్ర భ:— "నీకు కరుణలేకయుండుటవలననే యీ యుపేక్ష కలిగినదా?" అని భావము.

మూ॥ నిరవధిశివే! మహాత్మ్యంతే భణన్తి మహర్షయో,
మనసి కరుణానన్యూనా తే, యథా ప్రథితాః కథాః।
తదిదమఖిలం మిథ్యాస్యాదిత్యసాధ్యముదీరితుం,
యదసి విముఖీపుత్రే కింవా భవేదిహకారణమ్. ।౧౯।

అపరిమితకల్యాణివగు జననీ! "నీకథలు ప్రశిద్ధములు; నీకరుణ యధికము. మహరులు నీమాహాత్మ్యమును కీర్తించుచున్నారు.

కావున-ఇది యంతయు మిథ్యయని చెప్పుటకు శక్యముకాదు. పుత్రుఁడనగు నాయందు పరాఙ్ముఖవగుటకు కారణమేమో సచింపుము.

మూ॥ భువనభరణం నాల్పం కార్యం న దేవి! తవకశ్చనో
గురుచబహులం కృత్యం కర్తాస్తి నతస్త్ర్యపి।
న తివకరతనం సూనాం విద్యాంతపాదాఽపి న వార్యతి
స్మర సకృదిమం దీనం పుత్రం త దేవమమాదికమ్॥ ౧౬

దేవీ! నీభువనపోషణము అల్పమైన కార్యము కాదు. నీకు నిర్వ్యాపార స్థితి లేదు. నీనిత్యకృత్యము-బహులమును, దుర్భరమును, నైయున్నది. అది మృష కాదు. కఠినమగు నీమానము- (మాటాడ కుండుట) యోగ్యము కాదు. అయినను- దుర్బలుఁడగు నీపుత్రునొక సారి స్మరింపుము. అదియే నాకుఁజాలును.

ప్ర భ:— నీ కార్యభారము- సత్యమే యగును. అయినను, నన్నొకసారి చింతింపుమని భావము.

మూ॥ నభవతి సుధాధారా వర్షాదయం ముదితః స్తనా
మధుమదముషాం వాచాం సర్గాన్న చాప్యయముద్ధతః।
తవపదయుగే నిష్ఠాలాభాన్న తృప్యతి చాప్యయం
భగవతి! చిరాత్ సన్దేశం తే సుతః ప్రతిపీక్షతే॥ ౧౭

ఈ నీభక్తుఁడు- (తనా)శరీరమునందగుపమా(స్రారామృతవర్షము వలన సంతోషించుట లేదు. ఈకవి- మధుమదమును దొంగిలించుచున్న వాక్కులను సృజించుటవలననుగూడ-ఔద్ధత్యము నొందుట (గర్వించుట) లేదు, వీఁడు-నీపదయుగమునందలి నిష్ఠ-లభించుటవలనఁగూడ-తృప్తినొందుటలేదు. భగవతీ! ఈ నీపుత్రుఁడు— చిరకాలమునుండియు నీసందేశమును వినుటకు ప్రతీక్షించుచున్నాఁడు.

విశే:- మూలమునందలి పాదత్రయమున- అమృతవర్షాదులగు కారణము లున్నను, సంతోషించుట మున్నగు కార్యములు కాన్పింపకుండుటవలన- ఇది- విశేషోక్త్యలంకారమగుచున్నది- 'పుష్కలమగు కారణమున్నను, కార్యముజనింప

కుండుట- విశేషోక్తి యగు'ననునది- దీనిలక్షణము. ఇందలి నాలుగవపాదమున జెప్పఁబడిన "దేవీసన్నిధినుండి సందేశమును ప్రతీక్షించుట" అను కారణముచేత- మొదటి పాదములయందుఁ జెప్పఁబడినయర్థములను సమర్థించుటవలన- కావ్యలింగ మలంకారమగుచున్నది. అ కావ్యలింగమునకు- విశేషోక్తి- యంగమగుచున్నది. ఈ రెండును- నీరక్షీరన్యాయమున నిచట మిళితములగుటవలన, ఇది— అంగాంగిభావముచే నగు సంకరాలంకార మగుచున్నది.

మూ॥ కిమిహ భువనే కర్తవ్యం మే కిమర్థమిహాగతో౽
స్మ్యవనిజగతాం కం వోపాయం శ్రయే నిజశక్తయే
కిమపి కిమపి స్వాన్తే ధ్వాన్తే యథాపరిదృశ్యతే
స్ఫుటమభయదే! వక్తుం కిఞ్చిచ్ఛ్రమంత్వమురీకురు॥ ౧౮

సర్వభయములనుండియు రక్షించుదానవగు జననీ! నేనీభూలోకమున చేయఁదగిన దేమున్నది? నేనిచ్చటికేల వచ్చితిని? (నేనేల జన్మించితిని?) భువనావనీ! స్వీయమగుశక్తి నొందుటకు నేనేయుపాయము (సాధనము) నాశ్రయింతును? నేను చింతింపఁజాలనిదియు, నీవు చూపఁజాలినదియు, నగుతత్త్వము-ఏప్రకారముచేతనైనను, నా స్వాంతమునందును, ఈధ్వాంతము (అజ్ఞానము) నందును, గోచరించు నట్లు స్పష్టముగా (నిస్సందేహముగా) చెప్పుటకు కొంచెము ప్రయాసము నంగీకరింపుము.

మూః నమమపరమే ముక్తావాశా న వా విభవాష్టకే।
న చ గజఘటాపూర్ణాయాం వా మహేశ్వరి! సమ్పది।
న చ మధుముచాం వాచాం సర్గే నిరర్గళవైభవే
మునిభువికుతో జాతః సో౽హం తదేవ సమీర్యతామ్. ౧౯

ఓ పరమజననీ! నాకు మోక్షమునందు దీర్ఘమగుతృష్ణ లేదు. అణిమాదులగు అష్టైశ్వర్యములయందుఁగూడ-ఆశ లేదు. మహేశ్వరీ! గజఘటాదిపూర్ణమగు సంపదయందుఁగూడ- ఆశ లేదు. మకరంద నిష్యందినులగు వాక్కులయొక్క- నిరర్గళమగు వైభవముగల సృష్టియందుఁగూడ నాశ లేదు. ఋషినిలయమగు ఈభారతభూమియందు

నీపుత్త్రుఁడనగు నేనేల జన్మించితినో (నాజనన కారణమేమో) దానినే తెలుపుము [మోక్షము, అష్టైశ్వర్యములు, సంపద, కవితా సృష్టి, అను నీనాల్గునుగూడ నేను గోరకున్నను, నేనేలయిచటఁ బుట్ట వలసివచ్చెనో తెలుపవమ్మా! అని ప్రశ్నింపఁబడినది.]

మూ॥ ప్రథమ మనఘం వాఞ్ఛామ్యన్నం సదాకసుతాత్రిష్ణే
భగవతి! తతః పాదద్వన్ద్వే తవావిచలాం స్థితిమ్;
అథ సురజగద్వార్తాజ్ఞానం సవిత్రి! తతః పరమ్;
మునిభువిభవే హేతుంజ్ఞాతుం మృగాక్షి! పురద్విషః॥ ౨౦

భగవతి! మొదట భార్యాపుత్త్రాదులకై దోషములేని యన్న మును వాంఛించుచున్నాను. తరువాత నీపాదద్వంద్వమున నిశ్చల మగు నిష్ఠను వాంఛించుచున్నాను. పురారి సుందరివగుపార్వతీ! పిమ్మట దేవలోకవృత్తాంతజ్ఞానమును గోరుచున్నాను. పిదప ముని భూమియగు భారతదేశమున జన్మించుటయందగు హేతువును దెలియ నెంచుచున్నాను.

ప్ర భ:- ఇట్లు, నాకు వాంఛితములు పెక్కు గలవని భావము.

మూ! యదితవకృపాపుత్త్రే భక్తేపదామ్బుజవన్దిని!
వ్రతశతకృశేశీర్షామ్భోజామృతం త్వయిజుహ్వతి
భరతధరణీ సేవాలోలే భవప్రియభామిని!
స్వయముపదిశామ్యుష్మైయోగ్యం విధానమనావిలమ్. ౨౧

శివప్రియజాయవగు జననీ! భవత్పాదారవిందములను స్తుతించు వాఁడను, అనేకవ్రతములచేత (ఆహారాది కఠిన నియమములచేత) కృశించిన శరీరమున సహస్రారనిష్యందియగుఅమృతమును నీయందు హోమము నొనర్చువాఁడను, భారతభూమికి కైంకర్యము నొనర్చుట యందు నిరతుఁడను, భక్తుఁడను, అగు నీపుత్రునియందు కృపయున్న యెడల- నీవీపుత్త్రునికొఱకు స్వచ్ఛమును, యోగ్యమును అగుపద్ధతి నుపదేశింపుము.

మూ॥ జననీ! జగతాం స్వల్పే కామేఽప్యయం త్వయిలమ్బతే
పురభిదబలేమధ్యే కామేఽప్యయం త్వయిలమ్బతే।
బహులకరుణే శ్రేష్ఠే కామేఽప్యయం త్వయిలమ్బతే
భగవతి! పరేపి తే కామేఽప్యయం త్వయిలమ్బతే. ౨౨

జగజ్జననీ! ఈనీభక్తుఁడు (నేను) కామము (కోరిక) స్వల్పమయినప్పుడును— నిన్నే యాశ్రయించుచున్నాఁడు కామము-మధ్యమయినప్పుడు గూడ-నిన్నే యాశ్రయించుచున్నాఁడు. బహులకృపవగు జననీ! కామము- శ్రేష్ఠమగునప్పుడుగూడ- నిన్నే యాశ్రయించుచున్నాఁడు. భగవతివగు జననీ! కామము- విగతమయినను గూడ—నిన్నే యాశ్రయించుచున్నాఁడు.

ప్రభ:— సకాముఁడనైనను, నిష్కాముఁడనైనను, నిన్నే యాశ్రయించుచున్నాను. భారమునంతను నీపాదపద్మములయందే యుంచితినని భావము.

మూ॥ తనుభువిమయి ప్రీత్యావామ్బ! త్రిలోకవిధాయికే।
పదయుగరతే వాత్సల్యాద్వాపురారి పురన్ధ్రికే!
స్వవిమలయశోగానాసక్తే కృపావశతోఽథవా
పరుషమజరే! మానం త్యక్త్వా స్ఫుటీకురుమేగతిమ్ ॥౨౩॥

త్రిలోకధాత్రీ! శివప్రేయసీ! జరావిరహితవగు దేవీ! తనూజుఁడనగు నాయందలి ప్రీతిచేతఁగాని, చరణభక్తునియందలి వాత్సల్యముచేతఁగాని, నీపవిత్రకీర్తిని గానముచేయుటయందాసక్తిగలయీ కవియందలి కారుణ్యముచేతఁగాని, కఠినమగు మానమును విడిచి, గతిని (గంతవ్యోపాయమును) ప్రదర్శింపుము.

మూ॥ జయతు భరతక్షోణీఖణ్డం విషాద వివర్జితం
జయతు గణపస్తస్య క్షేమం విధాతు మనామునిః
జయతు రమణస్తస్యాచార్యో మహర్షికులాచలో
జయతు చ, తయోర్మాతా పూతా మహేశవిలాసినీ ॥౨౪॥

భారతఖండము దుఃఖశూన్యమై వెలయుఁగాత! ఆ భారతఖండమునకు క్షేమమునొసఁగఁగోరిన మునియగు గణపతి వెలయుఁ

గాత [జయించుగాక!] ఆగణపతిమునికి- ఆచార్యుఁడును, మహర్షి కులశ్రేష్ఠుఁడును, అగు రమణుఁడు వెలయుఁగాత! ఆగణపతి-రమణులకు మాతయు, పూతయు, అగు మహేశ్వరకుటుంబిని వెలయుఁగాత!

ప్ర భ:—"గృహీతముక్తరీత్యర్థశ్రేణిః రేకావళిర్మతా" అనులక్షణము వలన- భరతఖండ-తత్క్షేమవిధాయిగణపతి-తదాచార్యరమణ-తన్మాతృపరమేశ్వరులు క్రమముగాఁ గ్రహింపఁబడి, విడువఁబడుటవలన, ఇది- ఏకావళి అను నలంకృతి యగుచున్నది.

మూ॥ గణపతిమునేరేషాభాషా హృదయఙ్గమా
సుకవిసుహృదః శబ్దైరత్యుజ్జ్వలాహరిణీతతిః
లలితచతురైర్భావైర్యాన్తీ సురూపవనాన్తరం
మదయతు మనః కామారాతేర్నగాత్మభృశం। ౨౨

సత్క-విప్రియుఁడగు గణపతిమునికి సంబంధించిన యీవాణి- విద్వాంసులకు హృదయంగమమై ప్రయోగింపఁబడిన శబ్దములచేత బహుశోభమానమై యున్నది. ఈహరిణీతతి- (మృగీసమితి, లేక హరిణీవృత్తనిబద్ధస్తుతి) లలితచతురములగు భావములచేత (కోమలములును, కుశలములును, అగు రీతులచేత లేక అభిప్రాయములచేత) సురూపవనాంతరమున (మనోజ్ఞమగు వనములోపల, లేక వనములవంటి పండితులహృదయమున) ప్రవేశించి, కామారాతియగు శివుని గృహ సుందరియగు పార్వతీదేవియొక్క- మనస్సును హర్షింపఁజేయుఁగాత.

ప్ర భ:- హరిణీతతి అనఁగా లేడులగుంపు, ఆహరిణీపంక్తి- కోమల చతురభావములచేత సుందరమగు వనమునఁ బ్రవేశించి మృగవిలోచనయగు నపర్ణ- మనస్సును రంజింపజేయువిధమున, హరిణీతతిరూపమగు గణపతిభాష- బుధహృదయాకర్షకమై పార్వతిమనస్సు నానందింపఁ జేయుఁగాతయని భావము.
ఇచట శ్లేషోత్థాపితమగు ఉపమాలంకారము- ధ్వనించుచున్నదని తెలియునది.

ఇది- సవ్యాఖ్యమగు చతుస్త్రింశ స్తబకము.

[ఇది-౩౪వ స్తబకము]

ఓం నమో భగవతే శ్రీరమణాయ, భారతీ దేవ్యైనమః

# ఉమాసహస్రము

———— ◇ ————

## పంచత్రింశ స్తబకము

(తొమ్మిదవ శతకమున మూడవ స్తబకము)

అవ:— ఈ ముప్పదియైదవస్తబకమున- ఏతత్కవి- భగవతీ కటాక్షమును ప్రార్థించుచు, తత్ప్రభావసంకీర్తనముచేత నాయమ్మ యందుగలభక్తిని పోషించుచున్నాడు.

ఈస్తబకము శక్వరీపరిస్తారగతమగు ఇందువదనావృత్తము చేత నిబంధింపబడినది.

మూ॥ అన్ధతమసం శశివిభామభిదధానా
కాన్తిమలమాస్యకమలస్య విదధానా
అన్ధకవిరోధిదయితాస్మితలవశ్రీ
ర్భాతుభువనస్య సకలస్య కుశలాయ. ॥౧॥

చంద్రప్రభను గాఢాంధకారమని చెప్పునదియు, ముఖ పద్మము నలంకరించునదియు, అగు అంధకరిపునిదయితయగు పార్వతియొక్క- హాసలేశశోభ- సకలప్రపంచముయొక్కయు క్షేమమునకై, వెలయుఁగాత!

ప్ర భ:—"ఆయమ్మ మందహాసశ్రీ యెదుట, చంద్రుఁడు-కారుచీఁకటిగాఁ జేయఁబడుచున్నాఁడు, ఆహాసలవశోభ-ముఖపద్మకాంతికి భూషణముగాఁ జేయఁ బడుచున్నది" అని చెప్పుటవలన—"చంద్రునకును, ముఖకాంతికినిగూడ- మూలమగు తేజము—"దేవీస్మితలవశ్రీ'యే యగును" అనునంశము—ధ్వనింపఁజేయఁబడుచున్నది.

మూ॥ బాహివివిధాకృతిమతీ ద్విజసమూహే
పాహిగతిహీనమఖిలేశ్వరి! కులంనః
దేహి బహుకాలభజకాయవరమేతం
యాహి నగనన్దిని! యశఃశశివలక్షమ్. ॥౨॥

అఖిలేశ్వరివగు నగనందినీ! [పర్వతపుత్రీ!] జననముచేతను, ఉపనయనాదిసంస్కారముచేతను, జన్మద్వయముగల ద్విజులయొక్క-సమాజమునందు- -నానాప్రకారమగు ప్రయత్నముగలదానవై భాసింపుము. ఉపాయహీనమగు మా (మానవ)కులమును రక్షింపుము. బహుకాలమునుండియు భక్తుఁడనగు నాకీవరమునిమ్ము. శశివలక్షమగు (చంద్రునివలె ధవలమగు) యశమును బొందుము.

(ప్రభ:— బ్రాహ్మణకోటియందు నీవు భాసించుటవలన భారతకులమున కంతకును శ్రేయమగును. గతిహీనమగు మా మానవకులమునకు రక్షాదానమును ప్రార్థించుచున్నాను. 'అవరదానముచేత-నీయశము శుభ్రమగును' అనిభావము.

మా॥ వారయతి ఘోరతరపాతకసమూహం
వర్ధయతి ధర్మమపి శర్మకరమన్తే
కిఙ్కరజనస్య న కిమావహతిభవ్యం
శఙ్కరపురన్ధ్రి! తవ పాదపరిచర్యా!. ॥3॥

శివమహిషీ! భవత్ పదశుశ్రూష- ఘోరతరమగు పాపసమూహమును నివారించును. పరిణామకాలమున శర్మకరమగు (సుఖకరమగు) కర్మమునుగూడ పోషించును. కింకరజనులకది సంపటింపని కుశలములుండవు.

ప్రభ:—ఇచట ధర్మమనఁగా: సత్పురుషుల యాచారమే యగును.

మా॥ యస్య మనుజస్య హృదయేఽస్తి సదయే! తే
నాకచరసేవ్యమయి పాదసరసీజమ్।
తం భజతి పద్మముఖి! పద్మవనవాసా
లాభభవనే భవతు నామరపురోధాః. ॥4॥

కారుణ్యవతివగు జననీ! స్వర్లోకసంచారులగు దేవతలచేత పూజింపఁదనీపాదపద్మము-ఏ మనుష్యునిహృదయమునందుండునో, వానికిలాభస్థానమునందు(లక్ష్మీస్థాన ప్రస్థలమునందు) దేవపురోహితుఁడగు బృహస్పతి లేకుండిననుగూడ-పద్మాలయయగుశ్రీదేవి వానినాశ్రయించును.

ప్ర భ:- జ్యోతిశ్శాస్త్రమునందులగ్నమునుండి పదునొకండవదగు స్థానము- లాభస్థానమని చెప్పఁబడును. దేవీభక్తుని లాభస్థానమునందు, గురుఁడు- లేకున్నను, వానికి లాభప్రాప్తి కలుగునని భావము.

[గణపతిమునీంద్రుని జ్యోతిషవిద్యావేదనము సుప్రసిద్ధము!]

మూ॥ యద్యఖిల మానినిగణ గీతగుణజాలం
కాలభయహారి కరుణారసమరన్దమ్।
అద్రితనయాఙ్ఘ్రిజలజస్మ్ హృదయేస్యా
దష్టమగతోఽపి విదధాతురవిజః కిమ్॥ ౫

మానులందఱిచేతను కొనియాడఁబడిన గుణసమూహము గలదియు, మృత్యుభయమును తొలగించు కరుణారస మకరందము గలదియు; అగు పార్వతీ పాదపంకజము-హృదయము నందున్నయెడల, శని-జన్మరాశినుండి యష్టమస్థానము నొందినను గూడ శోకమును గూర్పఁజాలఁడు.

ప్ర భ:- "చారవశమువలన చంద్రరాశినుండి యష్టమమగుస్థానము నొందిన శని- అనేకములగు నశుభములనిచ్చును" అనునది జ్యోతిషప్రసిద్ధము. "హృదయస్థ మగు దేవీచరణము- గ్రహగతి వీర్యమునుగూడ- (గ్రహచారమునుగూడ) జయించుటకు సమర్థమగును" అని భావము.

మూ॥ లేఖలలనాకచసుమైః కృతబలిం తే
యో భజతి పాదఘృణిమాలినమనస్తే
నిస్తరతి నూనమయమస్తమితమోహః
శోకతిమిరం సకలలోకగణమాతః॥ ౬

సర్వలోకగణజననీ! దేవాంగనల శిరోజాలంకార పుష్పముల చేత పూజింపబడిన నీపాద సూర్యుని భజించు భక్తుఁడు-అస్తమిత మోహుఁడై, శోకమును తిమిరమును తొలఁగించుకొనును. సత్యము!

ప్రభ:- పాదము- సూర్యుడుగాను, శోకము- చీకటిగాను, ఆరోపింపఁబడుటవలన ఇది రూపకమగుచున్నది.

మూ॥ వైరిగణ నిర్దలన ఖడ్గవరపాణే!
వాససి పదోర్ద శనవాససి చ శోణే!
నేత్రమిషపావక విశేషిత లలాటే!
పాపమఖిలం జహిమృగాధిపతిఘోటే.!. ౯

శత్రుసమూహచ్ఛేదన ఖడ్గహస్తవును, వసనమునందును, చరణములందును, దశనవాససునందును (అధరమునందును) రక్తవర్ణము గలదానవును, నేత్రమనుమిషగల యగ్నిచేత విభూషితమగు లలాటము గలదానవును, సింహవాహనవును, అగుజననీ! నాపాపము నంతను ఛేదింపుము.

ప్రి భ;—మాతా! శ్రేష్ఠమగు హస్తముచేత = నీవు శత్రువులను ఛేదింతువు రక్తాంబరవు, అరుణచరణవు, బింబాధరవు, నయియుందువు, అగ్నినేత్రుండగు శివునికి పత్నివగుటవలన నీకుఁగూడ నాయగ్నియే నేత్రమగుచుండును. నీగుఱ్ఱము-సింహము. 'ఇట్టినీవు సకలపాపములను సంహరించి నన్ను రక్షింపుము'.అనిభావము.

మూ॥ వేదచయ వేదిజనవాదవిషయస్య
ప్రీతియుత లోకతతి శోకశమనస్య
చేతనవివర్జితభటోఽయమహమఙ్ఘ్రేః
శీతకరపోతధర పుణ్యావని తే! తే॥ ౧౦

బాలచంద్రుని ధరించిన శివుని పుణ్యాంగనవగు జననీ! సకల వేదములను తెలిసిన పండితుల వాక్యములకు విషయభూతమును, (ఉద్దేశముగా జేయఁబడినదియు,) భక్తియుక్తమగు లోకబృందమునందున్నశోకమును తొలగించునదియు, అగు నీచరణమునకు-నేను జీతములేని సేవకుఁడనై యున్నాను.

మూ॥ కార్యమయి మే కిమపి కార్యపటుబుద్ధేః
పాదసరసీజయుగలీ పరిజనస్య
అమ్బ! వద జమ్భరిపుగీతగుణజాలే!
శుమ్భకులనాశకరి! శమ్భుకులయోషే! ॥౧౧

జంభరిపుఁడగు నింద్రునిచేత కీర్తింపఁబడిన గుణజాలము గల దానవును, శుంభాసురుని విధ్వంసము నొనర్చినదానవును, శివకులాంగనవును, అగు జననీ! చేయఁదగినకార్యమున నిపుణమగుబుద్ధిగలవాఁడను, పాదకమలయుగళీపరిచారకుఁడను, అగు నే నొనర్పఁదగిన కార్యమును వచింపుము.

మూ॥ త్వం యది శిలావదయి నోవదసి కృత్యం
నాస్తి తవరాజ్ఞి పటుబుద్ధిరితి సత్యమ్।
ఆదిశ యథార్హ్యకరణీయకృతినిత్యం
రాజ్ఞి! భువనస్య చరణాంబురుహభృత్యమ్॥ ౧౨

ప్రపంచరాజ్ఞివగు జననీ! నీవు శిలవలె, నేనొనర్పఁదగినపనిని తెలుపకుండినయెడల, నీకు రాజ్యమునందు సమర్థమగుబుద్ధి లేదనుట-సత్యమగును. యోగ్యములగు కరణీయములయందు స్థిరుఁడనగు నీ చరణాంబుజభృత్యు నాజ్ఞాపింపుము.

ప్ర భ:- నీవు నాకు కర్తవ్యమును బోధింపనియెడల, నీవు భువనరాజ్ఞివని ప్రసిద్ధవైనను, నీకు రాజ్యకౌశలము లేదని చెప్పవలయును. కావున నీవు నాకుచిత మగు కర్తవ్యమును బోధింపుమని భావము.

మూ॥ పఞ్చసు విహాయ మనసః కిమపి సఙ్గం
పుత్త్రజన మిత్త్రజన బాన్ధవ వధూషు।
ఏష భజతే జనని! పాదజలజం తే
పాలయసు ముఞ్చసు తవోపరి స భారః॥

జననీ! పుత్రుఁడు-ధనము-మిత్రుఁడు-బంధువు-భార్య- అను నైదింటియందును, ఉచితమగు సంగమును విడిచి, యీమనుష్యుఁడు-నీపదపద్మమును సేవించుచున్నాఁడు. పాలింపుము, లేక త్యజింపుము. నీయందు భారముంచితిని.

ప్ర భ:—పుత్రాదులయందు సంగమును విడిచి, నీయందే భారముంచి యున్నాను. ఇఁకమీఁద నీవే ప్రమాణము.

మూ॥ వజ్రిధరముఖ్య సురసఞ్చయ కిరీట
స్థాపితమహార్ఘమణి రఞ్జితనఖాయ
జీవితమదాయి జగదీశ్వరి! మదీయం
పాదజలజాయ తవ పాలయనుమూవా॥ ౧౪

జగదీశ్వరీ! వజ్రిధరుఁడగు నింద్రుఁడు మున్నగు దేవతల సమూహముయొక్క కిరీటములయందు స్థాపింపఁబడిన మహార్ఘములగు (అధిక మూల్యములగు) మణులచేత - రంజితములగునఖములుగల నీపదారవిందమునకు నాజీవితమును సమర్పించుచున్నాను. రక్షించెదవో, విడిచెదవో.

మూ॥ దేహి జగదీశ్వరి! నవా మదభిలాషం
పాహి కరుణావతి! నవాకుల మిదం నః
శూలధరకామిని! సురాసుర నిషేవ్యం
పాదకమలం తవపరే నవిజహామి. ౧౫

జగదీశ్వరీ! నాయభిలాషము నిచ్చెదవో, లేదో, కరుణావతీ! మా భారతీయకులమును రక్షింతువో, రక్షింపవో, శూలధర కామినీ! జగదంబా! దేవాసురసేవ్యమగు నీపాదకమలమును మాత్రము విడువను.

మూ॥ పాసికిల పాదయుగకిఙ్కర సమూహం
హంసికిలపాపతతి మాపదినుతా త్వామ్
దన్తివదనప్రసు! వదన్తి మతిమన్తో
నానృతమిదం భవతు నాకిజనవన్ద్యే॥ ౧౬

పాదయుగభక్తులగు లోకులను రక్షింతువట! ఆపద సంభవించునపుడు నుతింపఁబడిన నీవు పాపసమూహమును ధ్వంసమొనర్చెదవట! గజముఖజననీ! బుద్ధిమంతు లిట్లు చెప్పుచున్నారు. స్వర్గవాసులచేత స్తుతింపఁదగిన జననీ! ఇది యసత్యము గాకుండుఁగాత!

మూ॥ శక్రముఖదేవతతివన్దిత విసృష్టే!
వక్రఘనకేశి! చరణే తవ లుఠన్తమ్

ఆపది నిమగ్న మిమ మాశ్రితమనాథమ్,
నన్దిహాయసున్దరి! న పాలయసి కేన. ॥౧౭॥

కుటిలమును, మేఘశ్యామలమును, అగు కేశపాశముగల నందివాహనసుందరీ! ఇంద్రాది దేవబృందముచేత వందితమును, విసృష్టమును, (ముక్తమును) అగు నీచరణమునందు సంశ్లేషము నొందినవాడను, దురవస్థయందు నిమగ్నుడను, నిన్నాశ్రయించినవాడను, అనాథుడను, అగు ఈ నన్ను- నీవే హేతువువలన రక్షింపకున్నావు?

మూ॥ ఘోషమయమమ్బ విదధాతి పదలగ్నో
నావసి పురాణి కిము నారి బధిరాసి।
వన్ది సురబృన్ద నుతి భాషితహృతం వా
కర్ణయుగలం తవ కపాలికులయోషే!. ॥౧౮॥

అమ్మా! భవత్పదలగ్నుడనగు నేను ఘోషపెట్టుచున్నాను. (ఆక్రందించుచున్నాను) పురాతననారీ! ననురక్షింపకున్నావు. చెవిటిదానవా? ఏమి! కపాలికులగృహిణీ! లేక, స్తుతిపాఠకులగు దేవబృందములయొక్క- స్తోత్రవచనములచేత నీకర్ణయుగలము- అపహరింపబడినదా?

ప్ర భా:— నా యాక్రందిన ఘోష నాలకింపక యుండుట కారణమేమి? బాధిర్యమా? లేక సురబృందస్తోత్రములన నీచిత్తమే కాగ్రమయ్యెనా?

మూ॥ అమ్బ! భవ బిమ్బ ఫలకల్ప రదచేలే!
శమ్బరసపత్న బలకారి బహులీలే!
ప్రాగమృతభాను ముకుటస్య ముదయిత్రి
త్వం కురు తతః పరమురీకృత మదర్థమ్॥ ౧౯

బింబఫలకల్పమగు నధరము గలదానవును, శంబరరిపుడగు మన్మథునకు బలకారులగు బహులీలలుగల దానవును అగు జననీ! మొదట చంద్రచూడుడగు శివునికి హర్షమును గలిగింపుము. తరువాత నా పరమేశ్వరుడు నావిషయమును సంగీకరించునట్లు చేయుము.

ప్ర భా:— శివుని హర్షింపజేయుటకు నీవే సమర్థురాలవు. కావున మొదట నతనిని మదింపజేసి— తదుపరి నా ప్రస్తావము నొనరింపుము.

మూ॥ నిర్మల సుధాకర కలాకలితమస్తే!
ధర్మరతపాలిని! దయావతి! నమస్తే
ఏతమవ దేవి! చరణామ్బురుహబన్ధుం
శీతధరణీధరసుతే! గమయమాన్ధుమ్॥ ౨౦

నిర్మలమగు చంద్రకళచేత నలంకరింపఁబడిన శిరస్సుగలదానవును, ధర్మాసక్తులను రక్షించుదానవును, అగు దయావతీ! నీకు నమస్కారము. దేవీ! చరణాంబురుహబంధుఁడగు, నీభక్తుని రక్షింపుము. హైమవతీ! నన్ను సంసారకూపమున బడద్రోయకుము.

ప్ర భ:— నాకధోగతి నీయకుమని భావము.

మూ॥ అద్రికులపాలకకుల ధ్వజపతాకే!
భద్రగజగామిని! దరిద్రమయి మత్యా
క్షుద్రమివశోచ్యమిమ ముజ్ఝి జలజాప్తం
రుద్రదయితే! జనని! పాహినజహీహి॥ ౨౧

అద్రికులేశ్వర ధ్వజపతాకవును, భద్రగజగమనవును, అగు జననీ! బుద్ధిదారిద్ర్యము గలవాఁడను, జాలిఁనొందఁదగిన వాఁడను, అగు నీ నన్ను పాలింపుము. ఓ రుద్రదయితా! నీచుని విడుచునట్లు నన్ను విడువకుము.

మూ॥ అస్తు తవ పాదకమలే స్థితిరజస్రం
నాఽస్తి పరదుఃఖ వివశే హృదితుశాన్తిః।
అస్తుకరుణోయమయమస్తు మతిలోపః
కష్టమిదమమ్బ! మమభూరి పరిశిష్టమ్॥ ౨౨

అమ్మా! నే నెల్లప్పుడును నీపాదకమలమున స్థితిగలవాఁడనగుదును గాక! అస్మాదృశులగు నితరులదుఃఖములయందగు సహానుభూతిచేత-పరవశమగు నాహృదయమునందు మాత్రము నాకు శాంతి లేకున్నది. పరదుఃఖపారవశ్యజననియగు, ఇది - కరుణయగుఁగాక. (లేక) బుద్ధిలోపమగుఁగాక. నాకీయమితమగుకష్టము- పరిశిష్టము. (మిగిలియున్నది).

ప్రి భ:—"కరుణ మతిలోపము, అంతమునందవశిష్టమగు కష్టము, అనునవి యుండుఁగాక! నాహృదయమున శాంతిలేకుండుటవలన- దానిని నీపదపద్మమున నిలుపఁగోరుచున్నాను". ఈమహాశయుని — పరదుఃఖదుఃఖితత్వము— దీనియందు స్ఫుటమగుచున్నది. "ఇచట- కరుణగాని, బుద్ధిలోపముగాని, ఏదయినను, లోకుల దుఃఖములు శాంతినొందునవఱకును నాహృదయమునకు శాంతిలేదు. అశాంతమైన నాహృదయము-నీపదమునందెట్లు నిలుచును? దానిని నీవే-పదములందు నిలుపుకో" అని ప్రార్థింపఁబడినది. లోకోపకారపరాయణుల ప్రార్థనమిట్లే యుండునుగదా!

మూ॥ దుఃఖసుఖభేదరహితా నమతిరాసీత్
సాధుఖలభేదరహితా నమతిరాసీత్
భాగ్యమతిమాన్యమథవా మమ తదేత
న్మాంతరిహసఙ్ఘభజనేయదవకాశః. ॥ ౨౩ ॥

మాతా! నాకు సుఖ- దుఃఖభేదవర్జితమగుబుద్ధి - లేకున్నది. అట్లే,సజ్జన దుర్జన భేదరహితమగు బుద్ధికూడ లేకున్నది. (శాస్త్రములు సమబుద్ధి నుపదేశించుచున్నవి. నాకు తదుపదిష్టమగు సమబుద్ధి లేకున్నది) ఇది దోషమేయయినను,సంఘసేవనమునందు నాకవకాశము కలుగుచున్నది. కావున, నాకిది-(ఈభేదబుద్ధి) మిక్కిలి పూజ్యమగు భాగ్యమై యున్నది.

ప్రి భ:—అనుకూలమగు ననుభవమునందును, ప్రతికూలమగు ననుభవమునందును, గూడ జ్ఞానులకు భేదబుద్ధియుండదు. అదియే శ్రేష్ఠమగు సమబుద్ధి యని శాస్త్రములుద్ఘోషించుచున్నవి. కాని, సుఖ- దుఃఖ, సాధు-ఖలభేదబుద్ధిలేనివానికి సంఘసేవకవకాశముండదు. ఇట్టిసమత్వబుద్ధి నాకులేకుండుటవలననే సంఘసేవకవకాశ ర్పఁగలుగుచున్నాను. 'కావున నిది నాకు భాగ్యమే యగుచున్నది' అని భావము.

విశే:—భేదబుద్ధిని భాగ్యమని సమర్థించుట దుష్కరము. సంఘభజనావకాశ లాభరూపమగు వాక్యార్థముచే నది సమర్థింపఁబడినది. కావున నిది- కావ్యలింగాలంకారమగుచున్నది.

మూ॥ అస్తు మమభేదమతి రస్తు మమ పక్షో
యత్నపరతాఽస్తు మమ మాఽస్తు చ విమోక్షః

మోక్షం మాం వేద్మి కులకష్టతతిమోక్షం
ప్రేషయ సకృత్ తవ మహేశ్వరి! కటాక్షమ్. ॥౩౪॥

నాకు భేదబుద్ధి—(సజ్జన-దుర్జనాదులయందగు భిన్నభావము) ఉండ నిమ్ము. సాధనయోగ్యాస్థ్రియాపమగు) సాధ్యరూపమగు పక్షము—ఉండ నిమ్ము. యత్నపరత (ఉద్యోగము) ఉండనిమ్ము. మోక్షము (జన్మబంధము నుండి విడుదల) లేకపోనిమ్ము. జననీ! మహేశ్వరీ! భారతీయ కులకష్ట సంతతియొక్క మోక్షముచే-నేను మోక్షమని తెలిసికొనుచున్నాను. కావున నీకటాక్షము నొకసారి పంపుము.

ప్ర భ:— ఈ శుభోదయుడను— లోకకష్టమును నివర్తింపుటయందత్యా సక్తుడనై యిట్లనుచున్నాడు. నీకటాక్షప్రసారమువలన— భారతీయకులకష్టనివృత్తి రూపమగు మోక్షము నొందగలనని భావము.

మూ॥ శాక్వరగణేనముఖరే త్రిగణనాథే
విష్ణుయశసీశపథు! జిష్ణుముఖవన్ద్యే!
అమ్బ! కరుణాంకురు శివఙ్కరి! నిరఙ్క
స్వచ్ఛకిరణార్భక విభూషిత లలాటే! ॥౩౫॥

విష్ణుప్రముఖదేవవంద్యవగు ఈశ్వరపురంధ్రీ! మచ్చలేని బాల చంద్రునిచేత నలంకరింపఁబడిన లలాటముగలదానవును, క్షేమము నొసఁగుదానవును, అగు జననీ! చతుర్దశాక్షరయుక్తమగు శక్వరీ ఛందమునుండి జనించిన శాక్వరగణముచేత శబ్దించుచున్నవాఁడును, విష్ణునియశస్సువంటి యశస్సుగలవాఁడును, అగు, ఈగణపతియందు కరుణనుంచుము.

ప్ర భ:—'శుక్లాంబరధరం విష్ణుమ్' అను ప్రసిద్ధశ్లోకమునందలి విష్ణుపదము, విభుత్వరూపమగు నర్థమును దెలుపుచు, విఘ్నేశ్వరునికి వాచకమగుచున్నది. కావున విఘ్నేశ్వరుని యశస్సువంటి యశస్సుగల గణపతినగునన్ను కరుణింపుమనునర్థము నిచట గ్రహింపవలయును.

ఇది సవ్యాఖ్యమగు పంచత్రింశ స్తబకము.
[౩౫వ స్తబకము]

ఓం నమో భగవతే శ్రీరమణాయ శ్రీభారతీదేవ్యైనమః

# ఉమాసహస్రము

(షట్త్రింశస్తబకము)

తొమ్మిదవ శతకమున—నాలుగవ స్తబకము.

అవ:—ముప్పదియారవదగు నీస్తబకమునందతిశక్వరీప్రస్తారగతమగు తూణకవృత్తముచేత నిబంధింపఁబడినదియు, రమణీయ శబ్దార్థయు, అగు భగవతీస్తోత్రగీతి— వెలయుచున్నది.

మూ॥ ఉన్నతస్తనస్థలీ విలోలహారమౌక్తిక
వ్రాతదీధితి ప్రతానబద్ధసౌహృదాసదా।
అన్ధకారికామినీ దరస్మితద్యుతిర్ధునో
త్వన్ధకారమన్తరజ్గ వాసినం ఘనం మమ. ॥౧॥

ఉన్నతమగు స్తనస్థలియందు (వక్షమునందు) చలించుచున్న కంఠమాలాముక్తామణిసమూహముయొక్క— కాంతివిస్తారముతో స్నేహమొనర్చుచున్న అంధకారిలలనాదరస్మితద్యుతి— అంతఃకరణమునందున్న నాతిమిరమును (అజ్ఞానమును) తొలఁగించుఁగాత!

మూ॥ అమ్బరస్థలే పురాపురన్దరో దదర్శయాం
యాం వదన్తి పర్వతప్రసూతిమైతిహాసికాః।
సా పురా పురామరేః పురన్ధ్రికాఖిలామ్బికా
పుత్రికాయమజ్జతే దదాతు దక్షిణం కరమ్. ॥౨॥

పూర్వకాలమునం దాకాశమున పురందరుఁ డేదేవిని పందర్శించెనో, ఐతిహాసికు లేదేవిని పర్వతకుమారియని(పార్వతియని) చెప్పుదురో, ఆ పురారి పురంధ్రికయు, అఖిలాంబికయు అగు, 'ఆ' పరాశక్తి— విపజ్జలనిధియందు మునిఁగినపుత్రుఁడనగు నాకు — అభయదానదక్షమగు హస్తమును ప్రసాదించుఁగాత!

ప్ర భ—మునిగిన వానిని పైకిఁదీయుటకు— అభయహస్తము నిచ్చుఁగాతమని భావము.

మూ. పాదపఙ్కజే ధృతా నరైరబాహ్య భక్తిభిః
పాణిపఙ్కజేధృతా నవేన్దు ఖణ్డధారిణా।
చారుహేమహంసకా మనోజ్ఞరత్నకఙ్కణా
లోకజాలపాలినీ పునాతుమాం విలాసినీ॥ 3

అంతరంగ భక్తులగు మానవులచేత- పాదపంకజమునందు ధరింపఁబడినదియు, బాలచంద్రశేఖరునిచేత పాణి పంకజమున గ్రహింపఁబడినదియు, (పాణిగృహీతియు) రమణీయములగు స్వర్ణ నూపురములు గలదియు, మనోజ్ఞములగు కంకణములుగలదియు, లోకజాలపాలినియు, విలాసినియు, నగు జగదంబ - నన్ను పవిత్రు నొనర్చుఁగాత!

మూ॥ ఉక్షరాజవాహనస్య జీవితాద్ గరీయసీ
పక్షిరాజవాహనాది వర్ణ్యమాన వైభవా
కేకిలోక చక్రవర్తి వాహనేన పుత్త్రిణీ
వారణారి సార్వభౌమ వాహనాగతిర్మమ॥ ౪

వృషభవాహనుఁడగు శివునికి ప్రాణములకంటెనుగూడ అధిక తరప్రియయు, విష్ణ్వాదులచేతఁ గొనియాడఁబడిన వైశ్వర్యముగల దియు, మయూరసార్వభౌమవాహనుఁడగు సుబ్రహ్మణ్యునిచేత- పుత్త్రవతియు, (గుహునితల్లియు) సింహరాజవాహనయు, అగు దుర్గా దేవి- నాకు శరణమైయున్నది.

మూ॥ బాలకున్దకుట్మలాలికాన్త దన్తపఙ్క్తికా।
కుణ్డలానుబిమ్బశోభిశుద్ధగణ్డమణ్డలా।
బిభ్రతీర తీశవేత్రవిభ్రమం భ్రునోర్యుగం
శుభ్రభానుశేఖరస్య సున్దరీ ప్రణమ్యతే. ॥౫॥

లేతమల్లెమొగ్గలపంక్తివలె కాంతమగు దంతపంక్తిగలదియు, కుండలములయొక్క ప్రతిబింబములచేత-శోభించుచున్న కపోలమండలల

ములు గలదియు, రతీశ్వరుఁడగు మన్మథుని దండముయొక్క విభ్రమమువంటి విభ్రమముగల భ్రూయుగ్మమును ధరించునదియు, చంద్రచూడుని సుందరియు, నగు దేవికి నమస్కారము.

మూ॥ ఆజిదక్షవాహ్వవైరి యాతుధాన బాధితం।
యా రరక్ష దేవబృన్దమిన్దిరాదివన్దితా।
సా కటాక్షపాతధూతభక్తలోకపాతకా
పావకాక్ష సున్దరీ పరాత్పరా గతిర్మమ. ॥౬॥

ఇందిరాదులచేత వందితమైన యేదేవి - యుద్ధనిపుణుఁడగు మహిషాసురునిచేత బాధింపఁబడిన దేవబృందమును రక్షించినదో, కటాక్షపాతముచేత భక్తలోకముయొక్క పాతకములను తొలఁగించునదియు, వహ్నినేత్రుఁడగు రుద్రునిసుందరియు నగు నాపరాత్పర-(అంబిక) నాకుగతియగుచున్నది.

మూ॥ తారకాధినాథచూడచిత్తరఙ్గనర్తకీ,
మన్దహాససున్దరాస్యపఙ్కజా నగాత్మజా।
దీనపోషకృత్య నిత్యబద్ధబుద్ధిరవ్యయా,
గృహ్యతే గణాధిపేన సర్వతోన్నృణాపదే ॥౭॥

తారకాపతియగు చంద్రుఁడు శిరోఽలంకారముగాఁగల శివునియొక్క చిత్తమను రంగస్థలమునందు నృత్యమొనర్చునదియు, మందహాససుందరమగు వదనకమలముగలదియు, దీనజనపోషణమను కార్యమునందు నిత్యమును నిలుపఁబడిన బుద్ధిగలదియు, నాశములేనిదియు అగు నగకుమారియొక్క పాదము-మనుష్యుఁడగు గణపతి-సర్వాత్మభావమున గ్రహించుచున్నాఁడు.

మూ॥ అష్టమీశశాఙ్కఖణ్డదర్పభఞ్జనాలికా।
విష్టపత్రయాధినాథమానసస్యడోలికా।
పాపపుఞ్జనాశకారి పాదకఞ్జ ధూలికా!
శ్రేయసే మమాస్తు శైలలోకపాలబాలికా. ॥౮

అష్టమీతిథియందు- అర్ధవృత్తాకారమగు చంద్రఖండము యొక్క- దర్పమునడఁచు లలాటముగలదియు, విష్టపత్రమున కధిపతి యగు శివునియొక్క- చిత్తమునూగించునదియు, పాపపుంజమును నశింపఁజేయు పాదకంజధూళిగలదియు, అగు శైలలోకపాలబాలిక-(పర్వత రాజపుత్రిక) నాకు శ్రేయమునిచ్చుఁగాత!

మూ॥ సానుమత్కులాధినాథ బాలికాలికున్తలా
జఙ్గమేవకాఽపితప్తహేమసాలభఞ్జికా
భక్తియుక్తలోకశోకవారణాయదీక్షితా।
శీతశీతవీక్షితా లఘుస్యఘాదఘం మమ. ॥౯॥

పర్వతకులాధినాథబాలిక, కదలుచున్నదివలె నున్నదియు, చెప్పవీలుకానిదియు, నగు తప్తహేమసాలభంజిక-భక్తజనశోకధ్వంసమునకు దీక్షితశీతశీతవీక్షిత- (అతిశీతలదృక్పాత) మాత- నాదురితమును శీఘ్రముగా ఖండించుఁగాత!

మూ॥ పుణ్యనామసంహతిః పురారిచిత్తమోహినీ
పుష్పబాణచాపచారుభిల్లికాఽమ్బికా।
పుణ్యవైరి దుష్టదుష్టదైత్యవంశనాశినీ
పుత్రకస్య రక్షణం పురాతనీ కరోతు మే. ॥౧౦॥

నీనామసహస్రము- పుణ్యము. నీవు- పురారిచిత్తమోహినివి. నీకనుబొమలు- పుష్పబాణుని వింటివలె సుందరములయినవి. నీవు పుణ్యకర్మవైరులగు దుష్టదుష్టదైత్యులవంశమును నశింపఁజేసితివి. పురాతనివి. (పురాణపురుషివి) పుత్రకుఁడనగు నన్నురక్షింపుము.

మూ॥ క్షామమధ్యమస్థలీ సుధాఘటోపమస్తనీ
కృష్ణసారలోచనా కుముద్వతీప్రియాననా।
భ్రూవిలాసధూతధైర్యకామిచ్ఛనాద్రికాముకా
కాచిదిక్షుకార్ముకస్యజీవికా జయత్యుమా.

కృశించినట్లున్న నెన్నడుముగలదియు, అమృతకలశములవంటి పాలిండ్లుగలదియు, లేడిచూపులవంటి చూపులుగలదియు, చంద్రుని వంటి నెమ్మోముగలదియు, భ్రూవిలాసముచేత, కాంచనాద్రికార్ముకుఁడగు శివుని ధైర్యమునుగూడ విదళించినదియు, కాముకవిలాసవికి జీవికయు (జీవనోపాయభూతయు)అగు ఉమా దేవి-సర్వోత్కృష్టయై యున్నది.

**మూ॥** లోహితాచలేశ్వరస్య లోచనత్రయీవిలాసినీ
లోహితప్రభా నిమజ్జదబ్జగర్భసోదరా।
హాసకాన్తివర్ధ్యమానసారసారిమణ్డలా
వాసమత్రమేకరోతు మానసే మహేశ్వరీ　　॥౧౨॥

అరుణాచలేశ్వరుండగు శివునిలోచనత్రయికి హాసవు (ప్రియయు) రాలును, అరుణకాంతియందు మునిఁగిన బ్రహ్మాండగుహాగలదియు, నిజహాసకాంతిచేత-చంద్రమండలమును వృద్ధినొందించునదియు, అగు మహేశ్వరి-నామానసమున నివసించుఁగాత!

**మూ॥** దక్షిణేక్షణప్రభావిజృమ్భితామ్బుసమ్భవా
కామమిత్రవామనేత్రధామతృప్తకైరవా।
ఏకతఃపరః పుమాన్ పరావరాఙ్గనాఽన్యతః
శుభ్రకీర్తిరేకమూర్తిరాదధాతు నశ్శివమ్.　　॥౧౩॥

దక్షిణనేత్ర (సూర్య) ప్రభచేత- అంబుజమును వికసింపఁ జేయునదియు, కామమిత్రమగు వామనేత్ర (చంద్ర) కాంతిచేత- కలువను తృప్తినొందించునదియు, ఒకవంక, పరమపురుషుఁడును, ఇం కొకవంక, వరస్త్రీయును అగుచు శుభ్రకీర్తియగు,ఏకమూర్తి-మాకు కల్యాణము నొసఁగుఁగాత!

**మూ॥** శుమ్భదైత్యమారిణీ సుపర్వహర్షకారిణీ
శమ్భుచిత్తహారిణీ మునీన్ద్రచిత్తచారిణీ।
కామితార్థదాయినీ కరిప్రశాణ్డగామినీ
నీతకల్మషాదధాతు విఘ్నరాజమమ్బికా.　　॥౧౪॥

శుంభాసురుని వధించినదియు, సుపర్వులకు హర్షమును ఘటించునదియు. శంభునిచిత్తమును హరించునదియు, మునీంద్రుల మనస్సులయందు చరించునదియు, కామితార్థదాయినియు, కరిరాజగామినియు నగు, అంబిక— గణపతినగు నన్ను విగతకల్మషునిగాఁ జేయునుగాత!

మూ॥ దేవతాసపత్నవంశకాననానలచ్ఛటా
వారణారి సార్వభౌమవాహనాఘనాలకా
నన్దివాహనస్యకాఽపి నేత్రినన్దినీసుధా
నేత్రిలాఞ్ఛితాలికాసుతం పునాతు కాలికా. ॥౧౪॥

దేవశత్రువులగు రాక్షసులవంశ—కాననమునకు (కులమను అరణ్యమునకు, లేక వేణువనమునకు) అగ్నిజ్వాలయు, (అసురులకు సంహర్త్రియు) సింహేంద్రవాహనయు, శ్యామలాలకయు, (సాంద్రకచభారయు) నందివాహననేత్రనందినియగు నొకానొక చంద్రికయు, నేత్రలాంఛితాలికయు, (లలాటనేత్రయుక్తయు) అగు, కాలిక—పుత్రుడగు గణపతిని— పరిశుద్ధు నొనర్చుఁగాత!

మూ॥ రాజసున్దరాననా మరాలరాజగామినీ
రాజమౌలివల్లభా మృగాధిరాజమధ్యమా।
రాజమాన విగ్రహా విరాజమానసద్గుణా
రాజతే మహీధరే మదమ్బికా విరాజతే. ॥౧౬॥

రాజ (చంద్ర) సుందరాననయు, రాజహంసగమనయు, రాజమౌళివల్లభయు, (చంద్రశేఖరప్రియయు) రాజమానవిగ్రహయు, (దేదీప్యమానశరీరయు)విరాజమానసద్గుణయు, అగు మాయమ్మ—రాజతమహీధరమునందు (వెండికొండయందు) విరాజిల్లుచున్నది.

మూ॥ పర్వచన్ద్రమణ్డలప్రభావిడమ్బనాననా
పర్వతాధినాథవంశపావనీ సనాతనీ।
గర్వగన్ధనాశినీ విభావరీ విచారిణాం
శర్వచిత్తనాయికా కరోతు మఙ్గలం మమ. ॥౧౭

పర్వ (పూర్ణ) చంద్రమండలప్రభను పరిహసించు ముఖము గలదియు, పర్వతాధినాథవంశమును స్వీయజన్మచేత పవిత్రముగాఁ జేయునదియు, సనాతనియు, రాత్రించరులగు రాక్షసుల గర్వగంధమును (దర్పలేశమును) నశింపఁజేయునదియు, శర్వచిత్తమునకునాయికయు, (శివహృదయేశ్వరియు) అగు పార్వతి- నాకు భద్రము నిచ్చుఁ గాత !

మూ॥ ఓజసశ్చ తేజసశ్చ జన్మభూమిరచ్యుతా
నీలకణ్ఠబన్ధుబద్ధమౌళి విరాగమస్తుతా।
వీతరాగపాశజాలనాశబద్ధకఙ్కణా
విశ్వపాలినీ మయామహేశ్వరీ విచిన్త్యతే. ॥౧౮॥

ఓజస్సునకును, (దీప్తికిని) తేజస్సునకును, (ప్రతాపమునకును) చ్యుతిరహితమగు (స్థిరమైన)జన్మభూమియు, నల్లకలువకు చుట్టమగు చంద్రునిచేత నలంకరింపఁబడిన మౌళిగలదియు, వేదములచే స్తుతింపబడునదియు, రాగమునుడిగిన భక్తులయొక్క పాశజాలమును నశింపఁజేయుటకు కంకణముకట్టుకొన్నదియు, (ధృతవ్రతయు)విశ్వపాలినియు, నగు మహేశ్వరిని ధ్యానించెదను.

మూ॥ అణ్డమణ్డలం యయానిరన్తరంచపచ్యతే
సంస్ఫురత్య్శేషభూతహార్దపీఠికాసు యా
శ్వాసదృష్టిసంవిదూష్మనాదవారివర్త్మభి
ర్యాముపాసతే విదోనమామితాం పరాత్పరామ్. ॥౧౯॥

ఏజగన్మాత- బ్రహ్మాండమండలము నఖిలమునుగూడ - పరిణామము నొందఁ జేయుచున్నదో, ఏజగన్మాత-సకలప్రాణిహృదయపీఠముల యందును ('నేనున్నాను' అను సంవిద్రూపమున)స్ఫురించుచున్నదో, శ్వాస, దృష్టి-సంవిత్ - ఊష్మ- నాద-జల-సంబంధులగు మార్గముల చేత- విద్వాంసులే దేవతనుపాసించుచున్నారో, ఆపరాత్పరను నమస్కరించుచున్నాను.

ప్ర భః— శ్వాసోచ్ఛ్వాసనమనునది ప్రాణోపాసనము. ఇది సంవర్గవిద్యయని చెప్పఁబడును. దృష్టియనునది - అక్షిపురుషవిద్య; సంవిత్తనఁగా, చిత్తు. ఇది వైశ్వానరవిద్య. ఊష్మయనునది జీవాగ్ని. ఇదియే యుక్త—ప్రాణవిద్య, నాదమార్గమనఁగా, ఉద్గీథవిద్య, జలమార్గము - రసవిద్య సహస్రారామృతాస్వాదనరూపమగు దీనినే తాంత్రికులు చంద్రకలావిద్య, యని చెప్పుదురు— మీఁదఁజెప్పఁబడిన ఉపాసనలాగును— విద్యలని చెప్పఁబడుచున్నవి.

మూ॥ పఞ్చయుగ్మవేషభృత్ పరాత్పరాసురార్చితా
పఞ్చవక్త్ర వక్త్రపద్మచఞ్చరీకలోచనా।
పఞ్చకాన్తరఙ్గశత్రుసఞ్చయప్రణాశినీ
ప్రేతమఞ్చశాయినీ కులంచిరాయపాతుమే. ॥౨౦॥

దశవేషధారిణియు(దశమహావిద్యాత్మిక, లేక దశావతారశక్తిరూపయు) సురార్చితయు, పరాత్పరయు, పంచముఖేశ్వరుని ముఖపద్మమునందు చంచరీకములు (తుమ్మెదలు)గాఁ జేయఁబడినదృష్టులు గలదియు, వంచకులగు నంతరంగశత్రులయొక్క (కామక్రోధలోభమోహమదమాత్సర్యములయొక్క) సంచయమును నశింపఁజేయునదియు, ప్రేతమంచమునందు (మంచమువంటి ప్రేతమునందు) శయనించునదియు, అగు దేవి నావంశమును చిరకాలము రక్షించుఁగాత!

ప్ర భః— 'పఞ్చప్రేతాసనాసీనా' అని కీర్తింపఁబడిన దేవి–రుద్రప్రేతముకంటె మీఁదుగ నగ్నయైయుండు కాళికయగుచున్నది. సర్వసంహారమున, త్రేతమున శయనించునదియుఁజెప్పవచ్చును.

మూ॥ కర్మణా యథావిధి ద్విజాతయో యజన్తియాం
బ్రహ్మణా యథాశ్రుతం స్తువన్తియా మధీతినః
చేతసా యథాగురూక్తిచిన్తయన్తియాం విదః
'సా' పరాజగత్త్రయీ జనన్యజా జయత్యుమా. ॥౨౧॥

త్రైవర్ణికులగు ద్విజులు (బ్రాహ్మణక్షత్రియవైశ్యులు) శాస్త్రోక్తరీతి ననుసరించి కర్మచేత— ఏయుమాదేవిని పూజింతురో,

స్వాధ్యాయులు, యథాశ్రుతముగా నే యుమాదేవిని కీర్తింతురో, విజ్ఞులు- గురూపదేశము ననుసరించి యేయుమాదేవిని మనస్సుచేత ధ్యానింతురో, జగత్త్రయీమాతయగు నాయుమాదేవి- జయించుచున్నది. (వెలయుచున్నది)

మూ॥ వాసుదేవ జాయయాపి నమ్రయా నిషేవితా।
వామదేవ చాటుచిత్ర వాక్యబన్ధలాలితా।
వాసవాది దేవతా జయప్రణాదహర్షితా।
వారయత్వఘాని మే వసున్ధరాభృతస్సుతా. ౨౨

వినమ్రయగు లక్ష్మీదేవిచేత సేవింపఁబడునదియు, శివునిచాటుచిత్రవాక్య బంధముచేత లాలింపఁబడునదియు, ఇంద్రాదిసురజన విజయఘోషముచేత హర్షమునొందునదియు, అగుపార్వతి- నాపాపములను తొలఁగించుఁగాత!

మూ॥ పూర్ణిమాసుధామరీచి సున్దరాస్యమణ్డలా।
ఫుల్లపద్మపత్రదీర్ఘ సుప్రసన్న లోచనా।
పుణ్యభూనిషేవణాయ పుత్రమేతదుద్యతమ్।
పూర్ణకామమాదధాతు పాదలగ్నమమ్బికా॥ ౨౩

పూర్ణిమేందు సుందరముఖియు, స్వచ్ఛవికసిత కమలదలాయతాక్షియు, అగు నంబిక-భారతభూమిని సేవించుటకుద్యమించుచున్న యీచరణాశ్రితుని ప్రాప్తమనోరథు నొనర్చుఁగాత!

మూ॥ లాలయన్తి బాలకం వతంసశీతదీధితిం
శీలయన్తి సూక్ష్మతాం మనాంసి యోగినామివ
కాలయన్తు పాపినాం కులానిసంహతీస్సతాం
పాలయన్తు చస్మితాని యోషితః పురద్విషః॥ ౨౪

శివశిరోభూషణుఁడగు బాలచంద్రుని లాలించునవియు, యోగులచిత్తములవలె, అభ్యాసబలమువలనసూక్ష్మత (కృశత్వము

నొందుచున్నవియు, అగు శివాంగనయొక్క- స్మితములు- పాపాత్ముల కులముల నంత మొందించుఁగాత! సజ్జనసమూహములను పాలించుగాత!

మూ॥ పాదసేవినః కవేర్మనోహరాతి శక్వరీ
వర్గ ఏష నాట్యకారి నిర్జరీగణోయధా।
లోకజాలచక్రవర్తి పుణ్యయోషితో మన
స్సమ్మదాయ సాధుకష్టవారణాయ కల్పతామ్॥ ౨౫

చరణ భజకుఁడును, కవియునగు గణపతిచేత- విరచితమును, అతిశక్వరీఛందోనిబద్ధమును, రమణీయమును, అగు నీస్తుతివర్గము- నాట్యకారిణులగు నిర్జరసుందరులగణము (అప్సరోగణము) వలె త్రిలోకసార్వభౌముఁడగు పరమేశ్వరుని పుణ్యకాంతయగు పార్వతి యొక్క- చిత్తము నాహ్లాదింపఁజేసి, సజ్జనుల కష్టములను నివారించుటకు సమర్థమగుఁగాత!

ఇతి శ్రీమహర్షి రమణభగవత్పాదాన్తేవాసినోవాసిష్ఠస్య
నరసింహసూనోః గణపతిమునేః కృతావుమాసహస్రే
షట్ త్రింశః స్తబకః సమాప్తః॥
సమాప్తంచ నవమం, శతకమ్.

ఇది-శ్రీమహర్షి రమణభగవత్పాదశిష్యుడు, శఠమర్షణ సగోత్రుఁడు,
శ్రీమత్పంతుల పేరయశాస్త్రిపౌత్రుఁడు, వేంకటరామబుధేంద్ర
(ద్వితీయ) పుత్రుఁడు, లక్ష్మీనారాయణశాస్త్రిచే నాంధ్రీక
రింపఁబడిన ఉమాసహస్రమను స్తోత్రకావ్యమున
ముప్పది యారవ స్తబకము. (తొమ్మిదవ శతకము)



ఓం నమో భగవతే శ్రీరమణాయ, శ్రీభారతీదేవ్యైనమః.

# ఉమా సహస్రము.

## సప్తత్రింశ స్తబకము. [ముప్పది యేడవ స్తబకము]

## దశమ శతకము.

### పదియవ శతకమున, మొదటి స్తబకము.

అవ:—ముప్పది యేడవదగు, నీ స్తబకమున, తత్త్వదర్శియగు నీ యాచార్యుఁడు- అతిసూక్ష్మములును, గభీరములును, నగు ఆశయములుగల కారికలచేత- తత్త్వసిద్ధాంతమును సంక్షేపముగాఁ బ్రతిపాదించుచున్నాఁడు. [జ్ఞానదృష్టిగల భక్తులు- దీనిని నిత్యము పఠింపఁదగును.] ఈ స్తబక ప్రారంభమునఁగూడ దేవీమందహాసమును సంకీర్తించుచు, దాని స్వరూపము-సాక్షాత్తుగా, 'పరతత్త్వమే' అని ప్రస్తుతించుచున్నాఁడు.

మూ॥ ఉద్దీపయతు నశ్శక్తి మాదిశక్తేర్దరస్మితమ్।
తత్త్వంయస్య మహత్సూక్ష్మమానన్దో వేతి సంశయః॥ ౧

ఏమందహసితముయొక్క- తత్త్వము (స్వరూపము) సూక్ష్మమగు (అలౌకికమును, అంతర్దృష్టిగోచరమును, అగు) జ్యోతియో, లేక ఆనందమో? అను సంశయమును గలిగించుచున్నదో, ఆయాదిశక్తియొక్క- దరస్మితము- మాయందతర్గతమును, (హృదయమునందున్నదియు) అనభివ్యక్తమును, (బయటికి తెలియనిదియు) నిద్రితమును, అగు శక్తిని—ఉద్దీపింపఁజేయుఁగాత!

ప్ర భ:—ఇచ్ఛా-జ్ఞాన, క్రియారూపములును, సృష్టి-స్థితి-లయ, తిరోధాన, నానుగ్రహ, కారిణులును. అగు సర్వశక్తులకును మూలమగు ఆదిశక్తియొక్క- వదనమునందు వికసించిన మందస్మితముయొక్క- స్వరూపము-సూక్ష్మమును, అలౌకికమును, అంతర్దృష్టిగోచరమును, అగుచున్నది. చీకటిని తొలఁగించుటవలన, నది జ్యోతిస్స్వరూపమో? దుఃఖములను తొలగించుటవలన, నది- యానందస్వరూపమో?

అనుసంశయమును గలుగఁజేయుచున్నది. పరమార్థమున, దానిస్వరూపము-జ్యోతియు ఆనందమును, గూడ-అగుచున్నది. మున్ముందీయంశము స్పష్టము కాఁగలదు.' అట్టి మందస్మితము-అస్మత్సత్తయందంతర్గతమై, నిద్రించుచున్నశక్తిని విజృంభింపఁజేయుఁగావుతమని తాత్పర్యము.

అవ:- మొట్టమొదట, పరతత్త్వమును ప్రతిపాదించుచున్నాఁడు.

మూ॥ పూర్ణం ప్రజ్ఞాతృ,సద్బ్రహ్మ, తస్యజ్ఞానం మహేశ్వరీ।
మహిమాతేజ ఆహోస్వి, చ్ఛక్తిర్వా ప్రాణఏవవా॥ ౨

పూర్ణమును, ప్రజ్ఞాతయు,నగుసత్తు- బ్రహ్మము. ఆబ్రహ్మము యొక్క- జ్ఞానము- మహేశ్వరి. మహిమ, తేజము, శక్తి, ప్రాణము, అను నామాంతరములచేత, ఆమెయే-చెప్పఁబడుచున్నది.

ప్ర భ:—అసమాభ్యధికమును, ఏకమును, అగుటచేత-పూర్ణత్వావచ్ఛిన్నమును (పూర్ణతతోఁ గూడినదియు)విషయిచైతన్యాభివ్యంజకమగు ప్రజ్ఞానధర్మముగలదగుటచేత-(ప్రజ్ఞాతయు, (ప్రజ్ఞానధర్మియు)సత్తాప్రత్యయ గోచరమగుటచేత-సత్తును, అగు వస్తువు-బ్రహ్మమని చెప్పఁబడినది. "ఏకస్వరూపుఁడగు నెవనికి (ఏబ్రహ్మమునకు) 1. పూర్ణత్వము, 2. ప్రజ్ఞానము, 3. సత్త, అనునవి స్వరూపధర్మము లగుచుండునో, వానియొక్క-జ్ఞానము-మహేశ్వరి" అని చెప్పఁబడుచున్నది. జ్ఞానమనునది సంవిత్తు. 'జ్ఞాయతే అనేన'='దీనిచేత తెలియఁబడును.' అనుకరణ వ్యుత్పత్తిచేత, వృత్తికూడ-జ్ఞానమగుచున్నది. అయినను, ఇచ్చట భావవ్యుత్పత్తిచేత-'జ్ఞప్తిరే' జ్ఞానమగుచున్నది. "పూర్ణము—జ్ఞానము—సత్యము"అనునది బ్రహ్మమునకు స్వరూపలక్షణమగుచున్నది. జ్ఞానధర్మియగు బ్రహ్మమునకు జ్ఞానమను ధర్మమేదిగలదో, అదియిచట 'మహేశ్వరి' అనిచెప్పఁబడినది. ఆధర్మమునకు మహిమాదులు-నామాంతరములుగాఁ జెప్పఁబడినవి. మహిమయనఁగా; మహత్త్వధర్మము. తేజమనఁగా; జ్యోతిస్సు. జ్ఞానముచేత-ప్రకాశకత్వము, మహిమచేత-వ్యాపకత్వము. తేజస్సుచేత-పాచకత్వము, శక్తిచేత-విశ్వధారణసామర్థ్యము, ప్రాణముచేత-జీవితరూపత్వము, సిద్ధించును. కావున, ప్రకాశకత్వ-విభుత్వ- పాచకత్వ-విశ్వధారణసామర్థ్య-జీవితత్వ లక్షణలక్షితయగు మహేశ్వరి-ప్రజ్ఞాతయగు బ్రహ్మముయొక్క- జ్ఞానమగుట సిద్ధించుచున్నది. ఈయర్థమున, ఆచార్యప్రోక్తములగు రెండు శ్లోకములున్నవి.

శ్లో॥ జ్ఞానం ప్రకాశకత్వేన, మహిమావ్యాపకత్వతః
సన్తతాత్ పచనాత్ తేజః, శక్తిర్విశ్వస్యధారణాత్,

ప్రాణో జీవితరూపత్వాత్। సేయమీశానపాణినీ
మూలం సర్వవికారాణాం- ప్రకృతిః పరికీర్త్యతే॥
(ప్రజ్ఞానము-బ్రహ్మమనియు, అతని జ్ఞానము-మహేశ్వరియనియు, చెప్పఁబడినది.)

అవ:— జ్ఞాతృ- జ్ఞానములకుఁగల అద్వైత (అభేద) సంబంధమునుదృష్టాంతముచేత నుపపాదించుచున్నాఁడు.

మూ॥ ప్రచక్షతే చిదాత్మత్వం జ్ఞాతుర్జ్ఞానస్య చోభయోః।
ప్రదీపస్యప్రభాయాశ్చజ్యోతిరాకృతితాం యథా. 3

'ప్రదీపము, ప్రభ,' అను నీరెండునుగూడ- జ్యోతిస్స్వరూపమే యగునట్లు 'జ్ఞాత-జ్ఞానము' అను నీరెండునుగూడ- చిదాత్మయే- (ఒక్కటియగు చిత్స్వరూపమే-) అని చెప్పుదురు.

ప్ర భ:—ధర్మియగు ప్రదీపమునకును, ధర్మమగు ప్రభకును, గూడ ఏకమగు జ్యోతిరాకృతిత్వమును జెప్పునట్లు, ధర్మియగు జ్ఞాతకును ధర్మమగు జ్ఞానమునకును గూడ-అద్వైతమగు సంవిద్రూపత్వము నే చెప్పుదురని భావము దీపము- దానివెలుతురు, ఒకటియగు జ్యోతియొక్క రూపమే కాని, రెండుగానట్లు, తెలిసికొనువాఁడును, వాని తెలివియును గూడ ఒక్కటియే యగు జ్ఞానరూపమే, కాని రెండు కావు. ద్వైతమన, భేదము అద్వైతమన, అభేదము.

అవ;—ప్రదీప-ప్రభలకువలెను,అగ్ని-ఉష్ణతలకువలెను,జ్ఞాతృజ్ఞానములకు సంబంధముండినయెడల, వానికి గుణ-గుణిసంబంధము, విశేష్య-విశేషకభావము, చెప్పవలయుననినయెడల, అట్లుగాదనుచున్నాఁడు.

మూ॥ చిదేకపదార్థత్వాత్, చిచ్చితానవిశిష్యతే!
తస్మాద్గుణత్వం జ్ఞానస్య శఙ్కరేణ నిరాకృతమ్॥ ౪

చిత్తు- ఏకపదార్థము. కావున, ఆచిత్తు—చిత్తుచేతనే విశేషింప (భేదింపఁ) జేయఁబడదు. కావుననే, శంకరభగవత్పాదులచేత— 'జ్ఞానము—గుణముకా'దని నిరాకరింపఁబడినది.

ప్ర భ:—చిత్పదనిష్ఠమగు జ్ఞానవిషయము—ఏకస్వరూపము కావున, చిత్తుంతన చేతనే- తాను విశేషింపఁ జేయఁబడునది కానేరదు. విశిష్టజ్ఞానము—సంబంధాంతర సాపేక్షము. కావున, తనకుతనతోడి విశిష్టత్వము సంగతము కాదు. జ్ఞానము—జ్ఞాతయొక్క స్వరూపమేయగుచున్నది. కావుననే, అద్వైతాచార్యుఁడగు శంకరుఁడు—తన భాష్య గ్రంథములయందును. ప్రకరణగ్రంథములయందును, గూడ-ఉపపత్తిపూర్వకముగా, "జ్ఞానస్వరూపమగు బ్రహ్మమునకు- జ్ఞానము, విశేషణము కాదు" అని నిరసించి యున్నాఁడు.

అవ:—ప్రదీప-ప్రభలవలె, జ్ఞాతృ- జ్ఞానములు-ఏకస్వరూపమేయగును. అట్లవి- యేకస్వరూపమని యంగీకరింపనియెడల; కలుగుదోషమును దెలుపుచున్నాఁడు.

మూ॥ జ్ఞాతుర్జ్ఞానం స్వరూపం స్యాన్నగుణో నాపిచ క్రియా।
యదిస్వస్య స్వరూపేణ వైశిష్ట్యమనవస్థితిః॥ ౫౭

జ్ఞాతకు జ్ఞానము-(చైతన్యము) స్వరూపమే యగును. జ్ఞాతృగతమగు నాజ్ఞానము—గుణముగాని, (జ్ఞాతృకర్తృకయగు) క్రియగాని, కానేరదు, స్వరూపమగు జ్ఞాతకు- స్వరూపమేయగు జ్ఞానము-విశేషణమగునెడల; అనవస్థాదోష మేర్పడును.

ప్ర భ:—విషయిచైతన్యాభివ్యంజకుఁడగు జ్ఞాతకు- చైతన్యమగుజ్ఞానము స్వరూపమేయగును. కాని, గుణము కానేరదు. "అయ్యా! జ్ఞానము—జ్ఞాతృగుణము కాకుండినను, జ్ఞాతృక్రియ—కాగూడదా" అనియాశంకించి, 'అది క్రియగూడ కాదు' అని నిషేధింపఁబడినది. జ్ఞాతయగుస్వరూపమునకు స్వరూపమగుజ్ఞానముచేత వైశిష్ట్యము (విశేషణసంయుక్తత్వము) కలిగినయెడల స్వరూపమగు నాజ్ఞానమునకు మరల, తత్ స్వరూపమగు జ్ఞానముచేతను, దానికి మగల తత్ స్వరూపము చేతను అనవధిక కార్య కారణప్రవాహాపత్తి[ కార్యము, కారణము, కార్యము—కారణము అను ప్రవాహమునకు తెంపులేమి ]కలుగవలసివచ్చును. ఇదిఅనవస్థాదోషమగును.[ముగింపు కలుగకుండుట అనుదోషము.] కావున "జ్ఞాతకు స్వరూపమగుజ్ఞానముచేత నగు వైశిష్ట్యము నంగీకరింపఁదగదు" అని తెలియునది. "తెలియునాఁడు, తెలివియు నొకటే కాని వేరు కాదు." అని 'తెలియఁదగును.' అని భావము

అవ:—"అయ్యా! జ్ఞాత, జ్ఞానము, కూడ—ఒకేపదార్థమగు నెడల, జ్ఞానము—జ్ఞాతయందుండుననియు, జ్ఞాత-జ్ఞానవంతుడనియు, నిట్లు, ద్వివిధమగు వ్యవహార మెట్లుకలిగినది" అనియాశంకించి, ప్రత్యుత్తరము నిచ్చుచున్నాడు.

మూ॥ వాచైవశక్యతే కర్తుం విభాగ, స్స్వస్వరూపయోః।
నానుభూత్యా, తతో ద్వైతంసచ్ఛక్త్యోర్వ్యావహారికమ్॥ ౬

తనకును, స్వరూపమునకును. (రెండింటికిని) గూడ- విభాగము- వాక్కు-చేతమాత్రమే- (మనస్సుచేతమాత్రమే) కావించుటకు శక్యమగును. కాని, అనుభవముచేత విభాగము నొనర్చుటకు శక్యముకాదు. కావున, సత్తునకును, శక్తికిని, గల ద్వైతము [పృథగ్భావము=భేదము] వ్యవహారసిద్ధమేగాని, వాస్తవముకాదు. (వస్తుగతము కాదు)

ప్ర భ:— ద్రవ్యము నాశ్రయించిన గుణ— క్రియలు— భిన్నపదార్థములుగా నంగీకరింపబడవు. శారీరక (బ్రహ్మసూత్ర) భాష్యమున, ద్వితీయాధ్యాయమునందలి ద్వితీయపాదమున 'అపరిగ్రహాచ్చాత్యన్తమనపేక్షా' [అ2 పా 2 అధి 8 సూ 17 బ్రహ్మసూత్రభాష్యమునఁ జూచునది] అనుసూత్రమును వ్యాఖ్యానించునపుడు భగవత్పాదశంకరులచేత మిక్కిలి నిపుణముగా నీయంశము— నిరూపింపఁబడినది.

ప్రత్యేకవివృతి:— శ్రీ శంకరులు— ఈ సూత్రమును వ్యాఖ్యానించుచు, "పరమాణువు జగత్కారణమనువాదము—[అయుక్తమగుటవలననే కాక] శిష్టులెవ్వరిచేతనుగూడ, ఏయంశముచేతనుగూడ- పరిగ్రహింపఁబడకుండుటవలనగూడ— ఈవాదము— వేదవాదులచేత మిగుల, అనాదరింపఁబడఁదగినది." అని సూత్రార్థమును జెప్పిరి. తరువాత, "గుణాదులు-ద్రవ్యాధీనములు" అనుపక్షమున, ద్రవ్యముండినప్పుడే-అవి యుండుటవలనను, ద్రవ్యము లేనపుడు లేకుండుటవలనను, ద్రవ్యమొక్కటియే- ఆకారభేదమువలన, "దేవదత్తుఁడొక్కఁడేయగుచు, అవస్థాభేద సంబంధమువలన, అనేక శబ్దప్రత్యయములనుబొందునట్లు, అనేక శబ్దప్రత్యయములను బొందునదియగును. అట్లయినయెడల, సాంఖ్యసిద్ధాంతప్రసంగమును, స్వసిద్ధాంతవిరోధమును, కలుగవలపివచ్చునే" అని యారంభించి, "అగ్నిధూమములు వేరని నిశ్చయింపఁబడుచున్నది" ఇచ్చటను, [ద్రవ్యగుణవిషయమున] 'తెల్లని కంబళము,' 'నల్లనికలువ' అని, ఆ యా ద్రవ్యమే- ఆయావిశేషముతో

(తాదాత్మ్యమున) ప్రకాశింపఁజేయఁబడుటవలన- ద్రవ్యగుణములకు, అగ్నిధూమములకువలె భేదప్రతీతిలేదు. కావున, గుణము-ద్రవ్యాత్మకమే-[అనఁగా; ద్రవ్యరూపమే కాని వేఱు కాదు. అని యర్థము.] "ఇట్లనుటచేత [గుణము-ద్రవ్యరూపమే యనుటచేత] "కర్మ, సామాన్య, విశేష, సమవాయములుకూడ-ద్రవ్యాత్మకములు" అని వ్యాఖ్యానింపఁబడినది....ఇత్యాదికముచేత- "ద్రవ్యముకంటె- గుణాదులు- భిన్నములు కావు' అని నిరూపించిరి.

ప్రశ్న:—"అయ్యా! బ్రహ్మము—గుణవిశిష్టము" అనునంశము—శ్రుతిస్మృతిపురాణములయందుఁ గొన్నిచోట్లఁ జెప్పఁబడినదే! దానికేమందురు?"

ఉత్త—"గుణములు-ధర్మమునందుపచరితములు.ఆగుణములు- [బ్రహ్మభిన్న] ధర్మపరములుగా గ్రహింపఁదగినవి." అనునది యాచార్యాశయము, ఈయంశము నీగణపతిమునీంద్రుఁ డిట్లుపలికెను. "ప్రజ్ఞాస్య—గుణత్వంయత్, ప్రజ్ఞాతుః ద్రవ్యతాచయత్। ధర్మత్వాదపిదర్మిత్వాత్, తద్ద్వయంచౌపచారికమ్" అని. ఈయంశమును- నీవేదికయందుఁ జూచునది,

మూ॥ బ్రహ్మజ్ఞానస్య పూర్ణస్య విషయోద్యా రుదీర్యతే।
సా బ్రహ్మణో వ్యాపకత్వాద్వస్తుతో నాతిరిచ్యతే. ౭

పూర్ణమగు (అభిన్నమగు) బ్రహ్మజ్ఞానమునకు (సత్తును, జ్ఞాతయు, నగు బ్రహ్మముయొక్క- జ్ఞానమునకు) విషయము- అంతరిక్షమని చెప్పఁబడుచున్నది. బ్రహ్మమునకుఁగల వ్యాపకత్వమువలన ఆయాకాశముగూడ- పరమార్థమున సత్తగు బ్రహ్మముకంటె- వ్యతిరిక్తము (భిన్నము) కాదు.

ప్ర భ:—ద్వితీయకారికయందు 'మహిమా' అనియు, దానివ్యాఖ్యయందు 'మహిమావ్యాపకత్వతః"అనియు, బ్రహ్మముయొక్క- వ్యాపకత్వము తెలుపఁబడినది. బ్రహ్మముయొక్క- బృహత్త్వమే-మహత్త్వమగుచున్నది. ఆ మహత్త్వము-వ్యాపకత్వముచేత- ఆకాశరూపముగా గ్రహింపఁబడుచున్నది, కావున, వ్యాపకమగు (వ్యాపించిన) బ్రహ్మమే— ఆకాశము. స్వీయమగు వ్యాపకత్వము= బ్రహ్మజ్ఞానమునకు విషయమగునని యర్థము. కావున; 'ఆకాశము-వస్తుతః బ్రహ్మముకంటె భిన్నము కా"దని భావము. ఆకాశమున కుత్పత్తినాశములు వినఁబడుచున్నవి. కావున నాయాకాశము- అనాదియు, అనంతమును, నిత్యమును, అగు బ్రహ్మమెట్లగును? అని ప్రశ్నింపఁగూడదు. సమాధానము నిచ్చుచున్నాఁడు,

మూ॥ వికాసాదపి సఙ్కోచాత్, సర్గప్రలయయోర్ద్వయోః।
ప్రజ్ఞానస్య బుధైరుక్తౌ జన్మనాశావుభౌ దివః ౮

(జగత్) సృష్టియొక్క వికాసమువలన ఆకాశరూపియగు ప్రజ్ఞానమునకు- (ఆకాశరూపియగు బ్రహ్మమునకు) ఉత్పత్తియు, (జన్మమును) ప్రళయరూపమగు, తత్సృష్టి సంకోచమువలన-ఆయాకాశరూపియగు, బ్రహ్మమునకు- నాశమును, పండితులు- చెప్పియున్నారు.

ప్ర భ:—వికాసమువలన సృష్టియు సంకోచమువలన ప్రలయమును, అగుచున్నవి. జగత్తునకు సృష్టిప్రలయములుండుటవలన, తన్మూలమగు ఆకాశమునకుఁ గూడ— ఉత్పత్తిలయములు (శ్రుతిచేత) వినఁబడుచున్నవి. కాని, (వస్తుతః) యథార్థమునందు, ఆయాకాశము- బ్రహ్మవైభవమే, యగుచున్నది. కావున; అది— జనించుట లేదు. "తైత్తిరీయశ్రుతియందుఁ జెప్పఁబడిన, ఆకాశోత్పత్తి జగత్సృష్టి నపేక్షించినది. కనుక నది-వాస్తవము- కాదు" అని భావము.

అవ:—బ్రహ్మముకంటె భిన్నము కాకుండుటవలన, ఆకాశమున కుత్పత్తి లేదనుచున్నాఁడు.

మూ॥ ధర్మభూతం పరస్యేదం నకార్యం పరమం నభః।
అఖణ్డత్వాన్నవికృతి ర్విశ్వస్మిన్ ప్రకృతిత్వతః. ౯

పరబ్రహ్మమునకు ధర్మభూతమగు (ధర్మస్వరూపమగు) పరమవ్యోమమను నీయంతరిక్షము-కార్యముకాదు. (బ్రహ్మముయొక్క- కార్యముకాదు) (పూర్ణమగు బ్రహ్మమును, తన్మహత్త్వమును, గూడ అఖండమైయున్నది) అఖండత్వమువలనను, విశ్వము వికారము నొందుచుండగా, అవశేషించి (మిగిలి) విభువై (వ్యాపకమై) ప్రకృతియగుటవలనను, ఈపరమ వ్యోమము-వికృతి కానేరదు.

ప్ర భ:—పరమ వ్యోమమునకు (బహ్మత్వమును, విశ్వకారణత్వమును, గలుగుటవలన— అదియుత్పన్నము కాదు. బ్రహ్మముయొక్క- మహత్త్వము-ఖండము కాదు. కావున నాకాశము—వికృతి కాదు. అది వికృతియగునెడలఁ కార్యమౌ

కావలసివచ్చును. ఆకాశము కార్యముగాక పోవుటయేగాక, ప్రపంచమునకు ప్రకృతియు నగుచున్నది. ప్రకృతియన; ఉపాదాన కారణము. ఇట్లు— ధర్మి యగు పరబ్రహ్మమునకు— ఆకాశము— ధర్మమే యగుచున్నది. ధర్మము-భావము (ఉనికి) కంటె, ఇతరము కాదు. "యస్మింస్తత్త్వం నవిహాన్యతే, స భావోధర్మః" "దేనియందు, తత్త్వము- కొట్టఁబడునది కాదో, అభావము- ధర్మము" అని, మహా భాష్యకారుడు చెప్పుచున్నాఁడు. "ఆకాశశరీరంబ్రహ్మ" 'బ్రహ్మము—ఆకాశశరీరముగలది.' అని శ్రుతిచెప్పుచున్నది. ప్రజ్ఞాతయు, సత్తును, అగు పరమాత్మ యొక్క- ప్రజ్ఞానమునకు విషయత్వముచేత- వ్యాపకమగు ఆకాశము- స్వశరీరమని చెప్పఁబడినది. దీనిచేత ధర్మియగు పరమాత్మయొక్క- వైభవము- ప్రతిపాదింపఁబడినది.

అవ:—ఇప్పుడు - ధర్మముయొక్క-వైభవమును దెలుపుచున్నాఁడు.

శ్లో. ఆకాశేపరమేదీప్యత్ ప్రజ్ఞానం పరమాత్మనః
ఏకాగ్రత్వాత్ ప్రవృద్ధోష్మగభీరమభవన్మహః॥ ౧౦

స్వశరీరభూతమును, విషయమును, అగు ఆకాశమునందు పరమాత్మనుండి జ్వలించుచు, 'ఉన్నాను' అని నిత్యమును స్ఫురించుచున్న అహంపదార్థమగు ఆత్మయొక్క- ప్రజ్ఞానము- ఏకాగ్రత్వమువలన మిక్కిలి వృద్ధినొందిన వేడిచేత- (తపస్సుచేత) గంభీరమగు తేజమయ్యెను.

ప్ర భ:—ప్రజ్ఞానము— వ్యాపించి—యేకాగ్రతతో నుండుటవలన కలిగిన తపోవిజృంభణముచేత—దానికి పాచకత్వలక్షణమగు, తేజస్త్వము—కలిగెనని భావము.

అవ:—ఇంతవఱకును జెప్పబడిన యర్థమును సంగ్రహించి, ప్రజ్ఞానముయొక్క- త్రివిధమగుస్థితిని స్పష్టీకరించుచున్నాఁడు.

శ్లో॥ త్రిధైవం ధర్మభూతస్య జ్ఞానస్య వికృతిం వినా
శుద్ధత్వవిషయత్వాభ్యాం మహస్త్వాచ్చదశాత్రయమ్ ॥ ౧౧

ధర్మభూతమగు ప్రజ్ఞానము-వికృతిని విడుచునపుడు, ప్రకృతిభూతమగుచుండును. ప్రకృతిభూతమగునది- శుద్ధమగుచుండును. విషయమగునపుడు- వ్యాపకమగుచుండును. వికృతి నిమిత్తమగు తపోవైభవమగు తేజస్సు- పాచకమగుచుండును. కావున ప్రజ్ఞానమునకు పూర్వోక్తప్రకారమున మూఁడుదశలున్నవి.

ప్ర భ:—ధర్మమగు ప్రజ్ఞానమునకు ప్రజ్ఞాతయందు స్వరూపముతోనుండుట-శుద్ధత్వదశయు, విషయమగు నాకాశమున వ్యాపించుట-విషయత్వదశయు, తపోవైభవముచేతఁ గలిగిన పాచకత్వము- తేజస్త్వదశ (మహస్త్వదశ)యు, నగునని చెప్పఁబడినది. ఇట్లు దశాత్రయవంతమగు ప్రజ్ఞానము- సత్తును, ప్రజ్ఞాతయు, నగు బ్రహ్మముయొక్క- ధర్మమగుచున్నది. ఆప్రజ్ఞానమే- 'మహేశ్వరి' అనియు 'పరాశక్తి' అనియు చెప్పఁబడుచున్నదని తెలియునది. ప్రథమస్తబకమునందును, దాని వ్యాఖ్యయందును, సకలజగత్ కారణమునుగూర్చిన ప్రసంగమునందు ఆకాశముపాదానకారణమనియు, తపస్సు- నిమిత్తకారణమనియు, నీకారణములు రెండునుగూడ- సర్వశక్తుఁడగు పరమాత్మ యొక్క-నియందే కలవనియుఁ జెప్పఁబడిన యంశము నిచట గ్రహించునది. ప్రజ్ఞానమునకు దశాత్రయమున్నదను చోటఁగల 'దశాశబ్దము'-వర్తి (దీపపువత్తి) పర్యాయమగుటవలన, ఆ దశాపదార్థసామర్థ్యమువలన- ఒకేదీపమునకు మూడువర్తులు (వత్తులు)న్నట్లు- ఒకేప్రజ్ఞానమునకు ఒకేకాలమున- అవస్థాత్రయ ముండుననునంశము-స్ఫురింపఁజేయఁబడుచున్నది. కావున "ప్రజ్ఞానము- త్రిముఖమై, శుద్ధమగు స్వస్థితిని (ప్రకృతిని) విడువకయే, ఆకాశమున వ్యాపించి, తపస్సుచేత-విశ్వమును పరిపక్వమొనర్చుచుండును" అను ఫలితార్థ మేర్పడుచున్నది. "ఆనన్దో బ్రహ్మ" "ఆకాశశరీరం బ్రహ్మ," "యదేష ఆకాశ ఆనన్దో న స్యాత్" ఇత్యాది శ్రుతులు-ఆకాశరూపమగు బ్రహ్మమునకు-విశ్వోపాదానకారణత్వమును దెలుపుచున్నవి. "తదైక్షత, స తపోఽతప్యత, సోఽకామయత" ఇత్యాది శ్రుతివాక్యములు- తపించుచున్న ద్రష్టయగు బ్రహ్మమునకు- జగన్నిమిత్తకారణత్వము నుద్ఘోషించుచున్నవి. "సోఽహమస్మీతి వ్యాహరత్" 'తతోఽహం నామాభవత్' 'నిమిత్తకారణమగు బ్రహ్మము-నేనుస్మాను' అని వ్యవహరించెను. కావున 'నేను' అనునామము (బ్రహ్మమునకు) కలిగెను.' ఇత్యాదిశ్రుతులుమాత్రము-బ్రహ్మము-జగద్రూపకార్యముగాను, తత్కారణముగాను,కనఁబడుచున్నను, కార్యకారణవివర్జితమును, సత్యమును, అగు నాబ్రహ్మము- నిత్యశుద్ధమే

యగుచున్నది. అని బోధించుచున్నవి. అయినను, పూర్వోక్తమగు అవస్థాత్రియ ముపపన్నమే యగుచున్నది.

అవ:—తపఃప్రభావమువలన నాకాశమునుండి విశ్వము-వికసించి, దానియందు, అస్మదాదులశరీరములు జన్మించుచున్నను, ఈ జగత్తు—స్వతంత్రమువలెను, స్వతస్సిద్ధమువలెను, స్థూలబుద్ధులకు గోచరించుచున్నది. కావున నాయంశమును—క్రిందిశ్లోకముచేత విచారించుచున్నాఁడు.

మూ॥ విజ్ఞానేభాతియేభాన్తి భావా ద్రవ్యగుణాదయః।
నకిఞ్చిదనుభూయన్తే విజ్ఞానోపరమేతు తే॥ ౧౨

విజ్ఞానము (వృత్తివిశిష్టజ్ఞానము) భాసించుచుండఁగా, ద్రవ్య గుణకర్మ సామాన్య విశేష సమవాయరూపములగు నేభావములు-బుద్ధిగోచరము లగుచుండునో, ఆభావములు విజ్ఞానముపరమించి నపుడు, (విజ్ఞానభానములేని నిద్రాదులయందు) కొంచెమయినను గూడ—అనుభవింపఁ బడుటలేదు.

ప్రభ:- విజ్ఞానము (బుద్ధి) ప్రకాశించునపుడే, ద్రవ్యాదులు భాసించును. కావున, అవి-విజ్ఞానాధీనములు అని భావము.

అవ:—ఇచట-విజ్ఞానమనఁగా, విషయియందున్న వృత్తివిశిష్టజ్ఞానమని యర్థము నెఱుంగునది. దానిచేత-విషయియగుజ్ఞానముప్రకాశకమును, (ప్రకాశింపఁజేయునదియు) విషయమగు జ్ఞేయము-ప్రకాశ్యమును, (ప్రకాశింపఁజేయఁబడునదియు) అని చెప్పఁబడినట్లయినది. కావున "విషయము-స్వతఃప్రకాశము- (స్వయముగాప్రకాశించునది) కాదు" అని చెప్పుచున్నాఁడు.

మూ॥ ఏవంస్వతః ప్రకాశత్వం విషయాణాం నదృశ్యతే
సిద్ధిశ్చపరతోనస్యాత్, సమ్బన్ధం కఞ్చిదన్తరా॥ ౧౩

కాఁగా, విషయములు-స్వయముముగాఁ బ్రకాశించునవి, కానేరవు. తమకంటె భిన్నుఁడగు నింకొకనితోడిసంబంధము లేనియెడల, ఆయితరునివలనఁగూడ-ఈవిషయములకు విషయత్వసిద్ధి కలుగ నేరదు.

[ప్ర భ:—"జ్ఞాతతోడి (తెలిసికొనువానితోడి) సంబంధమును వదలినచో విషయములు- జ్ఞేయములు (తెలియఁదగినవి) కానేరవు అవి- తెలియఁబడకుండుటయే కాక, విషయియగు నితరముతోడి సంబంధమువినా, అవి- విషయములే కాఁజాలవు" అని యర్థము. కావున ఫలితమగుభావము నిట్లైయుఁగునది. "విషయములకు స్వతః ప్రకాశము లేదు. విజ్ఞానము భాసించునప్పుడే, అవి-ప్రకాశించును. కావున, నవి- విజ్ఞానభానాధీనములు, ఇంతే కాక, వానికి- (విషయములకు) స్వతః, విషయత్వము గూడ సిద్ధించునది కానేరదు. విషయియగు జ్ఞాతతోడి సంబంధము వలనమాత్రమే- వానికి విషయత్వముకూడ సిద్ధించును." [దృశ్యాదులు- స్వతః జ్ఞేయములును, విషయములును, గూడ- కాఁజాలవు. జ్ఞాతృవిషయిసంబంధమువలనమాత్రమే యవి- జ్ఞేయములును, విషయములును గూడ నగును." అని భావము.]

అవ:—"అయ్యా! విషయములు-స్వతః, ప్రకాశింపకున్నను, స్వతః, సిద్ధింపకున్నను, లోపములేదు. విషయియగు జ్ఞాతకంటె భిన్నములగు భావములు-లేకపోలేదుగదా." అని ప్రశ్నించుకొని, చెప్పుచున్నాఁడు.

మూ॥ దృశ్యతేవిషయాకారా గ్రహణే స్మరణేచధీః ।
ప్రజ్ఞావిషయతాదాత్మ్య మేవం సాక్షాత్ప్రదృశ్యతే॥ ౧౮

పదార్థములను గ్రహించుటయందును, (తెలిసికొనుటయందును) స్మరించుటయందును, వృత్తిరూపమగుబుద్ధి- (వృత్త్యాత్మకమగు జ్ఞానము) విషయాకారమై, (విషయరూపమున నున్నదై) కాన్పించుచున్నది. కావున, ప్రజ్ఞా-విషయములకుఁగల (బుద్ధివృత్తికిని,విషయములకునుగల) తాదాత్మ్యము-('తదాకారతాసంబంధము'- అనఁగా బుద్ధివృత్తియు, విషయములును గూడ,-ఒకేయాకారమును గలిగియుండుట) సర్వప్రాణులకునుగూడ—సాక్షాత్తుగా ననుభవసిద్ధమగుచున్నది.

ప్రభ:- 'ప్రజ్ఞ' యనుపేరుగల 'బుద్ధి వృత్తి' విషయముకంటె వేరయినను, విషయముకంటె-వేరుగాకయుండుటవలన, తంతు—పటములకువలె, ఆవృత్తి-విషయములకు- తాదాత్మ్యసంబంధము నెఱుఁగవలయును. "సాలెవాని యిచ్ఛాసామర్థ్యమువలన- తంతువులు పటరూపములగునట్లు, తపోవైభవమువలన- ఏకమును, సత్తును, ఆకాశరూపమును, అగు బ్రహ్మమునకు- నానాభావత్వముచేత-విషయాకారత- కాన్పించుచున్నది. కావున, ఇట్లే, బుద్ధి వృత్తి వైభవమువలన- సత్తయినభావమునకు, విషయాకారత కాన్పించును" అని భావము.

అవ:—ఈయంశమునే-ఉత్తరకారికచేఁ దెలుపుచున్నాఁడు.

మూ॥ నచేత్ సమష్టివిజ్ఞాన విభూతిరఖిలం జగత్।
విషయవ్యష్టివిజ్ఞాన తాదాత్మ్యం నోపపద్యతే. ౧౫

విషయాకారముననున్న యీజగత్తంతయు-సమష్టివిజ్ఞానముయొక్క- విభూతియే యగుచున్నది. ఈలోకము—సముదాయభావము నొందినదియు, పూర్ణమయినదియు, సత్యమును, తపోమహిమచేత వ్యాపించియున్నదియు, నగు విశిష్టజ్ఞానముయొక్క- విభూతి కానియెడల గ్రహణ, స్మరణ, (ధ్యాన) గోచరమగు విషయమునకును, (పదార్థమునకును) దానికంటె వేరుగాభాసించుచున్న వ్యష్టివిజ్ఞానమునకును, గల తాదాత్మ్యము- ['భేదమున్నను, భేదములేకుండుట' అను భేదాభేదసంబంధము) కుదురనేరదు.

ప్రభ:—మనయొక్క- ప్రజ్ఞలకును, విషయములకును, తాదాత్మ్యరూపమగు సంబంధము—పూర్వము చెప్పఁబడినది. ఈశ్లోకమున-"సమష్టి విజ్ఞానమునకును, జగత్తునకును, గల తాదాత్మ్యమువలననే- సమష్టిలోపల- వేరుగాభాసించుచున్న వ్యష్టివిజ్ఞానమునకును, దానివిషయమునకును, గూడ- తాదాత్మ్యము సంభవించును" అని పూర్వోక్తమగుదానికి హేతువు చెప్పఁబడినది. ఈ రెంటికిని, తాదాత్మ్యసంబంధము ప్రతిపాదింపఁబడునపుడు- భేదాభేదసంబంధము-సిద్ధించును. అట్టి తాదాత్మ్యము ప్రతిపాదింపఁబడనియెడల, సంబంధమే-లేకపోవలసివచ్చును.

అవ;—"వికృతిచేత- భేదమును, ప్రకృతిచేత-అభేదమును, కల్గును" అని, యీభేదాభేద సంబంధమును దెలుపుచున్నాఁడు.

మూ॥ యథాఽస్మదాదివిజ్ఞానే ధ్యేయం బుద్ధిరితి ద్వయమ్।
పూర్ణే సమష్టివిజ్ఞానే, వికృతిః ప్రకృతి స్తథా. ౧౬

అస్మదాదుల ధీవృత్తిరూపమగు వ్యష్టివిజ్ఞానమున-ధ్యేయము, (ధ్యానించి తెలియదగిన విషయమగువస్తువు) బుద్ధి, (జ్ఞానము) అను రెండును గలుగునట్లు, పూర్ణమగు సమిష్టివిజ్ఞానమున-1, వికృతియు, (విషయాకారమును, జ్ఞేయమును, అగు విశ్వమును) 2. ప్రకృతియు, (మూలజ్ఞానమును) అను రెండున్నవి.

ప్ర భ:—వ్యష్టివిజ్ఞాన- విషయములవలె, సమష్టివిజ్ఞాన- విషయములు-రెండును, గలవనిభావము.

అవ:— జ్ఞానమే-జ్ఞేయాకారమున, పరిణామము నొందుననుచున్నాఁడు.

మూ॥ పరిణామోయథాస్వప్నః సూక్ష్మస్య స్థూలరూపతః।
జాగ్రత్ ప్రపఞ్చ ఏవ స్యాత్తథేశ్వర మహాచితః. ౧౭

సూక్ష్మమగుజ్ఞానము-స్థూలరూపమున పరిణమించి, (వికారము నొంది) స్వప్నమగునట్లు, (సూక్ష్మతమమును, కారణభూతమును, అగు) ఈశ్వరమహాచిత్తు (ప్రజ్ఞారూపమగు సమష్టివిజ్ఞానము-) పరిణామము నొందియే, జాగ్రత్ ప్రపంచమగుచున్నది.

ప్ర భ:—"అస్మదాదుల ధీపరిణామము- స్వప్నమగునట్లు, జాగ్రదవస్థయందు స్థూలరూపమున మనకుఁ గనఁబడుచున్న విశ్వవిస్తారము- మిక్కిలి సూక్ష్మమగు సమష్టివిజ్ఞానముయొక్క- పరిణామవిశేషమేయగును" అని యర్థము.

వి శే:—కావుననే- "జీవన్ముక్తుని చిత్తము నశించినను, సమష్టివిజ్ఞానవికారమగు ప్రపంచము నశింపదు" అను రహస్యము తెలియఁగునది.

అవ:—ప్రకృతికిని, వికృతికిని, గలభేదమును దెలుపుచున్నాఁడు.

మూ॥ వికృతిస్సర్వభూతాని, ప్రకృతిః పరదేవతా।
సతిః పాదస్త్రయోరాద్యా, త్రిపాదీ గీయతే పరా. ౧౮

పరదేవత-('సతి' యగుశక్తి-) ప్రకృతియగుచున్నది. పుట్టిన లోకములును, ప్రాణులును, వికృతియగుచున్నది. ఆ రెండింటిలోను,

మొదటిదగువికృతి— సత్తగుబ్రహ్మముయొక్క— పాదమగుచున్నది. (అల్పాంశమైయున్నది.) తదితరయగుప్రకృతి— (పరదేవత) త్రిపాది యగుచున్నది. ('అధికాంశ' యగుచున్నది)

ప్ర భ'— భూతములన్నియు— 'వికృతి' అని చెప్పఁబడును. వికృతియనఁగా; ప్రకృతిపరిణామమని యర్థము. 'మహేశ్వరి' అని, చెప్పఁబడుచున్న, పరదేవత— బ్రహ్మముయొక్క— ధర్మమగు ప్రకృతియగుచున్నది. ప్రజ్ఞానముయొక్క— దశాత్రయము— వెనుక చెప్పఁబడినది. ఆయవస్థలయందు, ప్రథమదశయగు వ్యాపకత— 'ఆకాశరూపిణి'' అని చెప్పఁబడుటవలన— పరదేవతయఁగల సర్వభూతప్రకృత్వము— స్పష్టీకరింపఁబడినది. సత్తయిన బ్రహ్మమువలన వ్యాకరింపఁబడిన, భూతములన్నియు— వికృతియని చెప్పఁబడినను, అఖండమును, పూర్ణమును, సత్తును, అగు బ్రహ్మము— అవ్యయమును, అవికార్యమును, అగునను నంశమును స్ఫురింపఁజేయుటకు— "ఈవికృతియంతయుఁగూడ— (బ్రహ్మమునందత్యల్పమగు) అంశమే'' అనియు, అమృతమగు నధికాంశము—స్వస్వరూపమునందే యున్నది'' అనియుఁ దెలుపు శ్రుత్యర్థముకూడ స్మరింపఁబడినది.

"పాదోఽస్య సర్వభూతాని
త్రిపాదస్యామృతం దివి''

అని పురుషసూక్తమంత్రము— ప్రవచించుచున్నదిగదా!

అవః— "ప్రకృతియొక్క— పాదమువలన— ప్రపంచరూపమగు వికృతి—ప్రాదుర్భవించినయెడల, నది—అవికార్యమును, (వికారములేనిదియు) వికారహేతువును, గూడనగుచు నొకేకాలము నందుండుట— యెట్లుపపన్నమగును?'' అని యాశంకించి, చెప్పుచున్నాఁడు.

మూ॥ కబలీకృత్యసఙ్కల్పానేకాఽపిస్యాద్యథామతిః।
భూతాని కబలీకృత్య, దేవతాపితథా, పరా. ౧౮

అస్మదాదులబుద్ధి— ఒక్కటియేయయినను, తనయందు పరిణమించుచున్న వివిధములగు సంకల్పముల నన్నిఁటినిగూడ—కబళించి, (వశీకరించుకొని) (తానే) యుండునట్లు, పరదేవతకూడ— తననుండి ప్రభవించుచున్న భూతముల నన్నిఁటినిగూడ, కబళించి, (తనకుహాని లేకుండ) నిలుచుచుండును.

పరి భ:-సంకల్పములు- అనేకములును, భిన్నములును, , గూడ-నగుచున్నను, అవియన్నియు-వేర్వేరుగాను, సంపూర్ణముగాను, గూడ- బుద్ధియొక్క- పరిణామములేయగుచున్నవి, బుద్ధికిఁగూడ- సంకల్పాత్మకమగు నాపరిణామముచేత- హాని కలుగుటలేదు. అట్లే, పరదేవతనుండి పుట్టినభూతములుకూడ- అనేకములును, భిన్నములును, అగుచున్నను, అవియన్నియుఁగూడ- వేరుగాను, సంపూర్ణముగాను, గూడ- 'పరదేవతాపరిణామములే' యగుచున్నవి. (అమెయందే- తదాకారములే యగుచున్నవి) కావున, పరదేవత- వికారహేతువైనను, అవికార్యయగుట-సిద్ధించునని భావము.

అవ:-భేదరూపమగు ప్రపంచముయొక్క- సృష్టియు, సంహారమునుగూడ-ఒక్క-చోటనే-[అనగా పరదేవతయందే] కలుగుటవలన ఏకత్వమునకును, అనేకత్వమునకును, విరోధము- కలుగదని చెప్పుచున్నాఁడు.

మూ॥ భూతానామాత్మనస్సర్గే సంహృతౌ, చ తథాత్మని।
ప్రభవేద్దేవతాశ్రేష్ఠా సఙ్కల్పానాం యథామతిః. ౨౦

స్వాత్మనుండి సంకల్పము లుదయించునప్పుడును, స్వాత్మయందే లయించునపుడునుగూడ, మతి-సమర్థమైయుండునట్లు,సత్తును పూర్ణమును, అగుపరమాత్మనుండి (కలుగు) భూతములసృష్టివిషయమునందును, పరమాత్మయందే యగుసంహారవిషయమునందును, గూడ-పరదేవత-సమర్థయే-అగుచుండును.(స్థిరస్వరూపముననుండును)

పరి భ:—బుద్ధియొక్క- పరిభావమువలన, స్వాత్మనుండి సంకల్పములుదయించి, స్వాత్మయందు లయించునట్లు, పరదేవతాపరిభావమువలన-పరమాత్మనుండి సర్వభూతములును జన్మించి, పరమాత్మయందే లయించును' అని భావము. సమష్టి-వ్యష్టి విజ్ఞానముల వికాసమే- సృష్టియనియు, వానిసంకోచమే- ప్రలయమనియు, గ్రహింపఁదగును. "సంకోచము కలుగునపుడు, ప్రజ్ఞ-శూన్యమువలె నుండును" అనుహేతువలన 'త్రి' ప్రిజ్ఞ-వస్తుతః, పూర్ణయై యున్నను. గూడ-కొందఱు. దానిని శూన్యమని చెప్పుదురు.

"సఙ్కోచే శూన్యవత్ప్రజ్ఞా విశ్రాన్తా స్వాశ్రయేథవేత్।
తస్మాచ్ఛూన్యాఖ్యయా సేయ ముచ్యతే కైశ్చిదీశ్వరీ"

"సంకోచము కలుగునపుడు ప్రజ్ఞ-- స్వాశ్రయమగు బ్రహ్మమునందు విశ్రమించినప్పుడే, శూన్యమువలెనుండును. కావున, ప్రజ్ఞారూపిణియగు నాయీ యీశ్వరి 'శూన్యమను' పేరుగలదని కొందఱు విద్వాంసులు చెప్పుదురు." అని యీయాచార్యునిచే నీయర్థమున, మీఁది శ్లోకము చెప్పఁబడినది.

అవ:-"అయ్యా! అట్లయినయెడల, ఈపరదేవతా స్వరూపమెట్లు తెలియఁబడును." అని ప్రశ్నించుకొని, ప్రత్యుత్తరము నిచ్చుచున్నాఁడు.

మూ. అనుభూత్యాత్మికా సేయమీశశక్తిః-పరాత్పరా।
ఆధారచక్రే, పిణ్డేషు, విరాజతి విభిన్నవత్. ౨౧

విశ్వవికృతిహేతువును, ప్రకృతియు, ఈశ్వరశక్తియు, నగు నాయీపరాత్పర- అనుభూతి స్వరూపిణియైయున్నది. ఈమహేశ్వరి- తానొకతెయే యయినను, పిండములయందు-(పాంచభౌతికములగు శరీరములయందు) భిన్నురాలివలె, (వేరుచేయఁబడినదానివలె) దేహధారణమున కాధారభూతమగు మూలాధారచక్రమున విరాజిల్లుచున్నది.

ప్ర భ:—అవిభక్తయు, కుండలినీశబ్దవాచ్యయు, నగు పరదేవత- సర్వప్రాణి శరీరములందునుగూడ- ప్రత్యేకముగా విభజింపఁబడినదానివలె, విభాసించునని భావము. 'అనుభూత్యాత్మిక' అనఁగా; "అనుభూతియే- స్వరూపముగాఁగలది" అని యర్థము. అనుభూతి యనఁగా; సాక్షాత్తుగాఁ దెలియుట. అది- విగళిత వేద్యాంతరమును, ఘనమును, నగుచుండును. వృత్తివిషయగ్రహణ, స్మరణాదుల వలనఁగూడ- ఈయనుభవము- నిష్పన్నముగాని, అభివ్యంజితముగాని, యగుచున్నను; నిష్పన్నమగు ననుభవమాత్రము- వృత్తివిషయనిరపేక్షమై; భాసించును. కావుననే 'అయనుభవము—విగళితవేద్యాంతర'మని (తెలియఁదగినయితరము లేనిదని) కీర్తింపఁబడుచున్నది.

అవ:—ఇట్లు-"విశ్వకారణ భూతయగు పరాశక్తి-మూలాధారమున కుండలినీరూపమున- అధిపిండమగు స్థితినొందుచుండును. అని చెప్పి, "కారణభూతయగు నాపరదేవతకు- సూక్ష్మ, స్థూల, భేద

మున-పిండమునందగు శాఖాద్వయివలె, శక్తిద్వయము గలదు" అని నిరూపించుచున్నాఁడు.

మూ॥ సూక్ష్మస్థూలేతతః శాఖేవిద్యుచ్ఛక్తి సమీరవత్।
తత్రాద్యాజ్ఞానశక్తిస్స్యాత్ క్రియాశక్తిరనన్తరా. ౨౨

ఆధారచక్రమునందుండు పరాశక్తికి-సూక్ష్మమును, స్థూలమును, అగు శాఖలు_రెండున్నవి. అందు, మొదటిది-ఆకాశమునందంతటను వ్యాపించు విద్యుచ్ఛక్తివలెను, రెండవది-జగత్ప్రాణుఁడగు వాయువు వలెను, వెలయుచున్నవి. అందు మొదటిది-సూక్ష్మమగు విద్యుచ్ఛక్తిని బోలిన జ్ఞానశక్తియు, రెండవది-స్థూలమగు వాయువును బోలిన క్రియాశక్తియు, నగుచున్నవి.

ప్ర భ:—వాయువు- స్పర్శ గమ్యమగుటవలన-విద్యుచ్ఛక్తికంటె స్థూలమగుచున్నది. మనశరీరమునందున్న జ్ఞానశక్తియను శాఖ- చిత్తమనియు, క్రియాశక్తియను శాఖ-ప్రాణమనియు, గ్రహించునది. ఈయర్థమును 'శ్రీరమణమహర్షి' ప్రవచించిన ఉపదేశసారమునందలి క్రిందిశ్లోకముకూడ- ఇట్లు, తెలుపుచున్నది.

"చిత్త-వాయవశ్చిత్ క్రియాయుతాః।
శాఖ యోర్ద్వయీ శక్తి మూలకా"

"చిత్తుతోఁగూడిన చిత్తములును, క్రియతోఁగూడినవాయువులును,(ప్రాణములును) ఈశ్వరశక్తియే-మూలముగాఁగలరెండుశాఖలైయున్నవి. ఆదిశక్తియొక్క-జ్ఞానశక్తిశాఖయే-చిత్తములు. క్రియాశక్తిశాఖయే_ప్రాణములు. ప్రాణులనేకులగుటవలన, బహువచనము-చెప్పఁబడినది. చిత్త, ప్రాణము, లీశ్వరశక్తియొక్క-శాఖాద్వయమగుటవలన_ ఆశక్తినెఱుఁగుటకు చిత్తప్రాణములే- మార్గములగును" (ఉపదేశసారము 12వ శ్లోకమునుజూచునది)

ప్ర భ:— శక్తిద్వయిని-వివరించుచున్నాఁడు.

మూ॥ జ్ఞానేన్ద్రియాణిప్రథమావిభూతిర్మనసాసహ।
కర్మేన్ద్రియాణిత్వపరావిభూతిస్సహాసాసహా. ౨౩

మనస్సుతోఁగూడిన, (మనో-బుద్ధి-చిత్తాహంకారములతోఁగూడిన) చక్షురాదులగు జ్ఞానేంద్రియములు-ప్రథమయగువిభూతి

(సూక్ష్మమగు జ్ఞానశక్తి) యగుచున్నది. బలముతోఁగూడిన వాగాదులగు కర్మేంద్రియములు-ద్వితీయయగు విభూతి (స్థూలమగు క్రియాశక్తి) యగుచున్నది.

ఇట్లు పరదేవతా తత్త్వము నుపదేశించి- తత్ సాక్షాత్కారము నకుఁదగిన యుపాయమును దెలుపుచున్నాఁడు.

మూ॥ క్రియామూల ముత, జ్ఞానమూలంకిమితిచిన్తయన్
ఆత్మశక్తిమితోవిద్వానమృతత్వాయ కల్పతే. ౨౪

"క్రియాశక్తియొక్క మూలమును, జ్ఞానశక్తియొక్క మూలమును, అగువస్తువేది?" అనిధ్యానించి—ఆత్మశక్తి నెఱిఁగిన విద్వాంసుఁడు—'అమృతుఁడు' (మరణరహితుఁడు) అగుచున్నాఁడు.

[ప్ర భ:— ఏ కాగ్రధ్యానముచేత--ప్రాణమూలమును, మనోమూలమును అగు ఆత్మశక్తినొందినపురుషుఁడు_ముక్తుఁడగునని భావము.

అవ:— స్తబకమును ముగించుచున్నాఁడు.

మూ॥ గభీరాస్సుతరామేతాః కాలికాతత్త్వకారికాః।
ధియోభాసోగణపతేర్భవన్తు విదుషాం ముదే॥ ౨౫

ప్ర భ:— గణపతినగు నాయొక్క శుద్ధబుద్ధిదీప్తులును, మిక్కిలి యగాధములును, కాలికాతత్త్వకారికలును, (పరదేవతాస్వరూపప్రతిపాదకములును), అగు నీశ్లోకములు_ విద్వాంసులకు ప్రీతినొసఁగుగాక!

[ఈస్తబకము_ ఆధ్యాత్మవిద్యారూపము. దీనిని గురుముఖమునఁ దెలియవలయును. అత్యావశ్యకమయినది. కనుక, విడువఁదగదు. పం. ల. నా]

ఇది_సవ్యాఖ్యమగు సప్తత్రింశస్తబకము ( 37 వ స్తబకము)



ఓం నమో భగవతే శ్రీరమణాయ, శ్రీభారతీదేవ్యైనమః

# ఉమాసహస్రము.

అష్టాత్రింశ స్తబకము [ముప్పది యెనిమిదవ స్తబకము]

పదియవ శతకమున, రెండవ స్తబకము.

అవ:—ఇంతకుముందు దశమహావిద్య లుల్లేఖింపఁ బడినవి. ముప్పది యెనిమిదవదగు నీ స్తబకమున—ఆవిద్యలస్వరూపమును నిరూపించి తదుపాస్తి ఫలములను దెలుపుచున్నాఁడు.

ఋా॥ దూరీకురుతాద్దుఃఖం నిఖిలం
దుర్గాయా స్తద్దరహాసితం నః ।
రచితస్యాఽమ్భోభిమృద్భ్యాం యదభూ
ల్లేపన మమలం బ్రహ్మాణ్డస్య॥ ౧

నీటిచేతను, మట్టిచేతను, నిర్మింపఁబడిన బ్రహ్మాండమునకు—స్వచ్ఛమగు వర్ణవిలేపన (తేజ)మగు దుర్గాదరహాసితము—మాదుఃఖము నంతను తొలఁగించుఁగాత!

ప్ర భ:—'నీటిచేతను మట్టిచేతను' అని చెప్పఁబడుటవలన, బ్రహ్మాండమునకు, భాండత్వము— (పెద్దదగుకుండగానునికి) ఆక్షేపింపఁబడుచున్నది. (బ్రహ్మాండమనునది- భాండమని, చెప్పినట్లగుచున్నది. "తేజోజలాన్నములను త్రిధాతువులచేత నీబ్రహ్మాండము సృజింపఁబడినది" అని (ఛాందోగ్య) ఛందోగులశ్రుతివలనఁ దెలియుచున్నది. జలముచేతను, మట్టియేయగు నన్నముచేతను, సృజింపఁబడిన బ్రహ్మాండమునకు, అణిష్ఠమగు తేజోధాతువే- సృష్టిపూరకమును, వ్యాపకమును, అగు మూలమగుచున్నది. ఆతేజస్సే— దరహాసితముగాఁ జెప్పఁబడినది. తేజస్సు లేనియెడల—జలాన్నమయమగు బ్రహ్మాండమునకు శోభయే కలుగనేరదు. శోభావిశేషరహితమగు బ్రహ్మాండము—నిస్తేజమేయగును. కావున, దృశ్యమే కాకపోవలసి వచ్చును. కావున. బ్రహ్మాండమునకు-దృశ్యత్వము సిద్ధింపజేయుటకు, వ్యాపకమగును "మాదరహాసితము_ శోభావహమగుచుండును. మట్టిచేతను, నీటిచేతను నిర్మింపబడినకుండకు—వర్ణలేపము (రంగుపూత)శోభావహమగునట్లు, అబన్న సృష్టమగు

బ్రహ్మాండమునకు, ఉమాదరహాసితము — వ్యాపకమగు తేజమగుచుండును’’ అను నుపమ—ఇందు ధ్వనించుచున్నదని తెలియునది.

మూ॥ జన్తౌ జన్తౌ భువిఖేలన్తీ
భూతే భూతే నభసి లసన్తీ
దేవే దేవే దివి దీవ్యన్తీ
పృథగివ పూర్ణాసంవిజ్జయతి॥ ౨,

భూలోకమునందు-జంతుజంతువునందును— (ప్రతిజంతువునందును—ప్రత్యేకముగా) క్రీడించుచు, అంతరిక్షమున (భువర్లోకమున) భూతభూతమునందును (ప్రతి దేవయోని విశేషమునందును) విలసిల్లుచు, ద్యులోకమున (స్వర్లోకమున) ప్రతి దేవతయందును, దీపించుచు, పూర్ణయగు సంవిత్తు—(చితి) ఒక్కటియేయైనను, భిన్నమైనది వలె. నొప్పుచున్నది.

మూ॥ దహరసరోజాద్ ద్విదలసరోజం
ద్విదలసరోజాద్ దశశతపత్రమ్ ।
దశశతపత్రాద్ దేహం దేహాత్
సకల విషయం సంవిద్ వ్రజతి॥ 3

సంవిద్రూపమగుచితి— దహరసరోజమగు హృదయకమలము నుండి భ్రూమధ్యస్థితమును, ద్విదలమును, అగు ఆజ్ఞాకమలమునకును, ఆద్విదళకమలమునుండి- (ఆజ్ఞాచక్రమునుండి) (సహస్రదళములు గల) సహస్రారకమలమునకును ఆసహస్రారచక్రమునుండి శరీరమునకును, ఆశరీరమునుండి—వెలుపలనున్న సకలవిషయములకును, ప్రసరించుచుండును.

ప్ర భ:—ఆజ్ఞాకమలము— ‘రెండుదళములు’ గలదనియు, సహస్రారము— ‘వేయిరేకులు’గలదనియు, తంత్రశాస్త్రమునం బ్రసిద్ధమగుచున్నది. దహరమునుండి ప్రారంభించుటవలన, చితికి మూలమగుస్థానము—హృదయమని స్పష్టమగుచున్నది. స్వగురువగు మహర్షిచేత నుపదేశింపబడిన యీయంశము నీయాచార్యుడు స్వవిరచితమగు ‘శ్రీరమణగీత యందు’ సవిస్తరముగా నిట్లు, నిబంధించియున్నాడు.

"తస్మాత్ ప్రవహతిజ్యోతిః సహస్రారం సుషుమ్నయా
సర్వం దేహం సహస్రారాత్, తదాలోకానుభూతయః"అని,

"హృదయమునుండి- సుషుమ్నామార్గమున. జ్యోతిస్సు- సహస్రారము నకును, సహస్రారమునుండి- సర్వదేహమునకును, ప్రవహించుచుండును. అప్పుడు లోకానుభవములు కలుగును." రమణగీతయందున్న యైదవ యధ్యాయమునందలి, 5,6,7 శ్లోకములను పరిశీలించిన విషయము స్పష్టమగును.

మూ॥ వహ్నిజ్వాలా సమిధమివైషా
సకలం దేహం సంవిత్ప్రాప్తా
పృథగివభూతా వ్యపగతవీర్యా
భవతిసధూమా సంసారాయ॥　　　౮

అగ్నిజ్వాల—ఇంధనమునందువలె, హృదయనిలయమగు సంవిత్తు-దేహమునందంతటను వ్యాపించి, పరమార్థమున తానఖండమై యున్నను, భిన్నమైనది (వేరయినది వలె, నగుచున్నది. కావుననే క్షీణబలమై, సధూమమై; (జడసంపర్కమువలన స్వచ్ఛతలేనిదై) సంసారబంధమును గూర్చుచున్నది.

ప్ర భ:—స్వస్థానమగు హృదయమునుండి— యీసంవిత్తు దేహమునందు స్ఖాలిత్యమునొంది. సంసారహేతువగుచుండునని భావము. హృదయమునుండి-వెలువడకుండినయెడల, సంసారము కలుగదు—)

అవ:—ప్రజ్ఞాస్ఖలనమువలనఁ గలిగిన సంసారముయొక్క స్వరూపమును దెలుపుచున్నాఁడు.

మూ॥ అత్రానుభవ స్సుఖదుఃఖానామత్రాహఙ్కృతిరనృతాభవతి।
అత్రైవేదం సకలంభిన్నం ప్రతిభాసేత ప్రజ్ఞాస్ఖలనే　　　౯

ప్రజ్ఞా-స్ఖలనమువలన, సుఖదుఃఖానుభవము కలుగును. ప్రజ్ఞాస్ఖలనమువలన, అనృతమగు నహంకారము కలుగును. అది స్ఖాలిత్యము నొందునప్పుడే-యీజగత్తంతయు; భేదముకలిగి ప్రతిభాసించును.

ప్ర భ:—'ఇది' యని చెప్పఁదగిన, దేహాదికమునందు-'నే'నను ప్రతీతియే-అనృతమగు నహంకారమని తెలియునది. సత్యమగు అహంకారము మాత్రమే

పూర్ణమగు— అహంభావస్థితియైయున్నది— అదియే-అహ మున కాశ్రియమగుస్వరూపస్ఫూర్తి కావున నది- అహంకారమని చెప్పఁదగినది కాదు. స్వస్థానమగు హృదయమునుండి— ప్రజ్ఞ దిగజారునపుడీసంసారము కలుగును— ప్రజ్ఞ- స్ఖలనమునొందని యెడల దుఃఖావృతభేదబహులమగు నీసంసారము కలుగదని యభిప్రాయము.

అవ:—కావున—ఈసంసారము నివర్తించుట కుపాయము- 'నిత్య-నిష్ఠయే' యగునని; తత్ప్రకారమును దెలుపుచున్నాఁడు.

మూ॥ దళశతపత్త్రాద్ద్విదలసరోజం
ద్విదలసరోజాద్ దహరసరోజమ్।
అవతరతీశా యేషామేషా
తేషా మస్తిర్నిత్యా నిష్ఠా॥ ౬

ఈశ్వరియగు సంవిత్తు—ఏయోగుల సహస్రారమునుండి—ఆజ్ఞాచక్రమునకును; ఆయాజ్ఞాచక్రమునుండి- హృదయకమలమునకును దిగుచుండునో; ఆయోగులకు-నిత్యమగు (అచంచలమును; సిద్ధమును అగు) నిష్ఠ కలుగును.

ప్ర భ:—మనఃస్థానము- సహస్రారము. తనయునిజస్థానమగు హృదయమును విడిచి, శిరస్సునందున్నవారికి- విక్షేపమును, దానివలన, సంసారమును, కలుగును. కావున, సహస్రారచక్రమునుండి-యాజ్ఞాచక్రముద్వారా,తనమూలస్థానమగు హృదయమును బొందుటయే- దానికి ప్రతిక్రియయగును అచ్చట నగునిష్ఠ-నిత్యమని చెప్పఁబడినది. సాధకులకిది- ముఖ్యము

అవ:— మఱికొన్ని "ఉపాసనాప్రకారములను" దెలుపుచున్నాఁడు.

మూ॥ అథవా దేహాదావృత్తస్స
న్నన్యతమస్యా మాసుస్థల్యామ్
ఆధారస్థే కులకుణ్డే వా
స్థితధీర్నిత్యాం నిష్ఠాం లభతే॥ ౭

వేఱొకపక్షమున—శరీరమునుండి మరలి యంతర్ముఖుఁడై; ముందు చెప్పఁబడఁగల యనేకములగు స్థలములలో; నేదోయొక స్థాన

మునందుఁగాని; మూలాధారమువందున్న కులకుండమునందుగాని; (కుండలినీశక్తి నివసించు అగ్నికుండమునందుఁగాని)నిలిచిన ప్రజ్ఞగలవాఁడు (ప్రజ్ఞను నిలిపినవాఁడు-) నిత్యమగు నిష్ఠనొందును

ప్ర భ:— ముందుఁ చెప్పఁబడు స్థలములందైనను, కులకుండమునందైనను, ప్రజ్ఞనునిచిన యోగికిఁగూడ - నిత్యమగు నిష్ఠకలుగునని భావము.

అవ:— 'లలితా త్రిపురసుందరి' మొదలగు మహావిద్యల స్వరూపములను- ఉపాసనలనుగూడ దెలుపుచున్నాఁడు.

మూ॥ దశశతపత్రే శక్తిర్లలితా
　　వజ్రవతీ సా ద్విదల సరోజే।
　　దహరామ్బురుహే భద్రాకాలీ
　　మూలాధారే భైరవ్యాఖ్యా॥　　౮

వేయిరేకులుగల సహస్రారమునందు- లలితాత్రిపురసుందరి- విలసిల్లుచున్నది. రెండురేకులుగల యాజ్ఞాచక్రమునందు వజ్రవైరోచనియనియు; ఛిన్నమస్తయనియు ప్రచండచండియనియు, ఐంద్రియనియు; చెప్పబడు 'వజ్రవతి' విరాజిల్లుచున్నది. దహరాకాశమను పేరుగల హృదయపద్మమున, 'భద్రకాళి' వెలయుచున్నది. మూలాధారమున (కులకుండలమునందు) 'భైరవీశక్తి' (త్రిపురభైరవి) వెలుఁగుచున్నది.

మూ॥ ఖేలతి లలితా ద్రవతి స్థానే
　　ఛిన్నగ్రన్థిని రాజత్యైన్ద్రీ।
　　భద్రకవాటే భద్రాకాలీ
　　తపసా జ్వలితే భైరవ్యాఖ్యా॥　　౯

అమృతమును వర్షించు స్థలమగు సహస్రారమున, త్రిపురసుందరి విలసిల్లుచుండును. ఛిన్నగ్రంథియగు స్థలమగు, ఆజ్ఞాచక్రమున ఐంద్రీశక్తియగు వజ్రవిరోచని విరాజిల్లుచుండును. బద్ధకవాటమగు

హృదయమునందు-భద్రియగు కాళియుండును. తపస్సుచేత జ్వలించు చున్న మూలాగ్నికుండమున, త్రిపురభైరవి దీపించుచుండును.

ప్రథ:- లలితాత్రిపురసుందరీవిలాసమువలన, సహస్రారమున సోమరసము స్రవించును. ఆజ్ఞాచక్రమందు పరాశక్తి ప్రకాశించుచున్నదియు, గుదత్రికోణమధ్యస్థితయగు ఫాలమునందలి రుద్రగ్రంధి భేదింపబడునపుడు, వజ్రవైరోచనీయను ఇంద్రశక్తి ప్రకాశించును. కవాటముచేత- మూయబడిన హృదయస్థలమునువిడిచి దేహము యందు వ్యాపించి, వీర్యమునువిడువక, భద్రకాళీశక్తి సంవిద్రూపగు స్వస్థానమున గుప్తరూపమున స్ఫురించును. భైరవీశక్తి మూలాగ్నికుండమున జ్వలించును.

అవ:—కాళీశక్తికిని, ఛిన్నమస్తయగు వజ్రవైరోచనికిని; అధిపిండమగు (దేహసంబంధియగు) భేదమున్నను, అధ్యండమగు భేదము లేదనుచున్నాడు.

మూ॥ యద్యపి కాళీ వజ్రేశ్వర్యౌ
స్యాతాం భిన్నే ఇవ పిండేషు
ఓజస్తత్త్వస్యైక్యా దండే
నచాన్యాశక్తేర్భిదా భవతః॥ ౧౮

భద్రకాళియు, వజ్రేశ్వరియు, పిండములయందు (వ్యష్టిశరీరములయందు) వేరుగానున్నవారివలె నున్నారు. అయినను, వీర్యరూపమగు ఓజస్తత్త్వమొక్కటియే. కావున, పరాశక్తి బ్రహ్మాండమునందు మాత్రము—కాళీ—వజ్రేశ్వరీ భేదములేదు.

మూ॥ ఏవమభేదో యద్యపికర్మ
ద్వైధాద్ద్వైధం తత్రాపిస్యాత్।
సైవపచత్యస్త్రీ భువనంకాళీ
సైవదహత్యస్త్రీ శత్రూనైన్ద్రీ॥ ౧

ఓజస్సుయొక్క ఏకత్వమువలన, వారికి భేదములేకున్నను కర్మద్వైధమువలన- (ద్విప్రకారమగు కర్మవలన) బ్రహ్మాండమునందు గూడ-వారికి ద్వైధము (ద్విప్రకారత్వము)కలుగుచున్నది. ఈప్రప

చమును పరిపక్వమునొనర్చునపుడాశక్తి-కాళి యగుచున్నది. అసురా దులగు శత్రువులను దహించునపుడు-ప్రచండచండి యగుచున్నది.

ప్ర భ:— ఈయంశము- వెనుక నుపన్యసింపఁబడినది. చూ.

మూ॥ పిణ్డే చాణ్డే జఙ్గమసారః
శుద్ధా ప్రజ్ఞా సున్దర్యుక్తా
విషయ దశాయాం దేశీభూతా
సేయం భువనేశ్వర్యాఖ్యాతా॥ ౧౨

పిండమునందును, (శరీరమునందును) అండమునందును, (బ్రహ్మాండమునందును)జంగమప్రాణులయొక్క-సారమును, (సారాంశ మగు రసమును) శుద్ధమును, అగుప్రజ్ఞ-(సంవిత్తు) త్రిపురసుందరిగా చెప్పఁబడుచున్నది, విషయాకారతచేత నిలుచునపుడు-ఆకాశాకా రయై సర్వమును వ్యాపించిన, ఆయీచితియే-(ప్రజ్ఞయే) భువనేశ్వ రిగా వ్యాఖ్యానింపఁబడుచున్నది.

ప్ర భ:- లోపలను, వెలుపలను. అంతటను, గూఢ- మూలాంశముననున్న చితియే- సుందరి, శుద్ధసంవిత్తగు అసుందరయే విష యాకారమునందా కాశదేశగతయై భువనేశ్వరి యగుచున్నదని భావము.

మూ॥ శూన్యప్రఖ్యాయా విలీనా
ప్రలయే బ్రహ్మాణి జన్మిషు సుప్తౌ
కబలిత సకల బ్రహ్మాణ్డా తాం
కవయః శ్రేష్ఠాం జ్యేష్ఠా మాహుః॥ ౧౩

పరమార్థమున శూన్యరూపిణి కాకున్నను, శూన్యప్రఖ్యయైన. (శూన్యమువలె తోచునదైన) యేచిత్తు-విశ్వప్రలయ దశయందును, జంతువుల నిద్రాదశయందును. లయించుచుండునో, సకలబ్రహ్మాండ మునుగూడ కబళించునదియగు ఆచిత్తును-క్రాంతదర్శులగు కవులు శ్రేష్ఠయగు జ్యేష్ఠనుగాఁ జెప్పుదురు.

మూ॥ నిద్రావిస్మృతి మోహాలస్య
ప్రవిభేదైస్సా భవమగ్నేషు

ఏషైవస్యా ద్వ్యుత్థానేషు
ధ్వస్తవికల్పః కోఽపి సమాధిః॥ ౧౪

ఆ జ్యేష్ఠాదేవి—జననమరణ ప్రవాహరూపమగు సంసారమున నిమగ్నులగు జంతువులయందు—నిద్ర, విస్మృతి; (మరపు) మోహము (మూఢత; అజ్ఞానము) ఆలస్యము; (మందత) అనుత మోహవికారవిశేష ములతో వర్తించుచున్నది. ఈ జ్యేష్ఠయే—యుంజానులను యోగుల యందు నిర్వికల్పమగు నొకానొక సమాధి యగుచుండును.

ప్రభ:—జగత్సృష్టికంటె ముందు— శూన్యమువలెనున్న చిత్తును—జ్యేష్ఠ యనుట యుక్తమేయగును, వేదమునందుఁగూడ— "అప్రకేతం సలిలమ్" "నాసదాసీత్;" "తనోసదాసీత్" తమఆసీత్ "తమసాగూఢమగ్రే ఇత్యా మంత్రవర్ణములు— వినఁబడుచున్నవిగదా!

మూ॥ ఐన్ద్రీశక్తిర్వ్యక్తబలాచేద్
భిన్నే స్యాతాం శీర్షకపాలే
తస్మాదేతాం చతురవచస్కాః
పరిభాషన్తే ఛిన్నశిరస్కామ్. ౧౫

ప్రచండచండియను. "ఇంద్రశక్తి" యోగియందు వ్యక్తమగు బలముగలదగునెడల (విక్రమమును ప్రదర్శించినయెడల) శిరఃకపాల ములు— భిన్నములగును. కావుననే యీశక్తిని—చతురవచస్కులగు పండితులు 'ఛిన్నమస్త' అను పరిభాషతోఁ జెప్పుదురు.

ప్రభ:-యోగులయందు కపాలభేదము_ప్రసిద్ధము. ఈయర్థము_ వెనుక వ్యాఖ్యా నింపఁబడినది. "వ్యపోహ్య శీర్షకపాలే భూరిత్యగ్నౌ ప్రతితిష్ఠతి" అనుశ్రుతియొక్క యర్థము— యోగిజనానుభవైకవేద్యము ఆచార్యపాదులు (గణపతిమునీంద్రులు) జీవించియుండునపుడు, తత్కపాలభేదము కలిగెనను వంశమింతకుముందే- చెప్పఁ బడినది.

మూ॥ భవతీ పరావాక్ వైరవ్యాఖ్యా
పశ్యన్తి సాకథితాతారా
రసనిధిమాప్తా జిహ్వోరజ్జం
మాతఙ్గీతి ప్రథితానేయమ్॥ ౧౬

మూలాధారచక్రమున నివసించునదియు, తురీయమును, (నాలుగవదియు) అగు పరావాక్కు— త్రిపురభైరవి యను పేరుగలదై యున్నది. మణిపూరకచక్రనిలయయు, కారణావస్థగలదియు, నగు పశ్యంతీ వాక్కు— తంత్రశాస్త్రములయందు ప్రసిద్ధయగు తారాదేవి యై యున్నది. రసములకు నిధానమగు జిహ్వారంగమును పొందిన వైఖరీ వాక్కు— మాతంగియని (దశమహావిద్యలయందు) ప్రసిద్ధి నొంది యున్నది.

మూ॥ పిణ్డే చాణ్డే స్తమ్భనశక్తి
ర్బగలామాత స్తవ మహిమైకః ।
సర్వేవ్యక్తాః కిరణాః కమలా
బాహ్యో మహిమా భువనామ్బ! తవ॥ ౧౭

మాతా! పిండమునందును, బ్రహ్మాండమునందును, ఏకమగు మహిమయగు స్తంభనశక్తి— బగలాదేవియగుచున్నది? భువనజననీ! వ్యక్తములగు (స్పష్టములగు) కిరణములన్నియు— లక్ష్మియగుచున్నది. ఆయమ్మ— నీకు బాహ్యమగు, (వెలుపలనున్న) మహిమ.

ప్ర భ:— లోపలను, వెలుపలను, అంతటనుగల, స్తంభనశక్తియే— బగలాముఖి. జగత్తునందు స్పష్టములగు సర్వశోభలును—లక్ష్మీదేవియై యున్నది.

అవ:—ఇట్లు, దశమహావిద్యల తత్త్వములును, స్థానములును' సంగ్రహముగాఁదెలిపి— వాని ప్రసాదలాభమున కుపాయములును' ఉపాసనావిధములును, ఉపదేశించుచు, 'లలిత' మొదలు 'కమల' వఱకునుగల యీవిద్యలను వర్ణించుచున్నాఁడు.

మూ॥ బోధే బోధే బోద్ధుశ్శక్తిం
సఙ్కల్పానాం పశ్చాద్భాన్తీమ్ ।
అవిముఞ్చన్యో మను తేధీరో.
యత్కిఞ్చిద్వా లలితా వతితమ్॥ ౧౮

ప్రత్యేకముగా, ఉదయించుచున్న చిత్తవృత్తులకు వెనుక తదాధారమైనసాక్షిగా స్ఫురించునదియు, ప్రతిబోధమునందును, జ్ఞాత

యొక్క- గ్రహణసామర్థ్యరూపమగు శక్తిని విడువక,(దృఢముగా ధరించుచు) దేనినైనను చింతించుచుండుధీరుని- లలితాదేవి (త్రిపురసుందరీదేవి) రక్షించును.

ప్ర భః- ప్రతిసంకల్పమునకును, వెనుకనున్న బోధశక్తిని- దృఢముగా ధరించి, సంకల్పముల నొనర్చుధీరునికి- లలితాప్రసాదలాభము కలుగును. ఇందు లలితాత్రిపురసుందర్యుపాస్తి- చెప్పఁబడినది.

మూ॥ దృష్టౌ దృష్టౌ దృష్టిశక్తిం
లోచనమణ్డలమధ్యే భాసన్తిమ్।
అవిముఞ్చన్యః పశ్యతి ధీరో
యత్ కిఞ్చిద్రాత్రమవత్యేనం॥ ౧౯

లోచనమండలమధ్యమున, (అక్షిపురుషబింబమధ్యమున)భాసించుచు, ప్రతిదృష్టియందునుగల దర్శనశక్తిని విడువక, దృఢముగా గ్రహించి, దేనినైనను చూచుచుండుధీరుని- ప్రచండచండియను ఐంద్రి రక్షించును.

ప్ర భః- దర్శనశక్తిని దృఢముగాధరించి, దర్శనవ్యాపారము నొనర్చు వానికి- ఛిన్నమస్తానుగ్రహలాభము కలుగునని భావము.

మూ॥ ప్రాణసమీరం విదధానమిమం
నిత్యాం యాత్రామత్రశరీరే।
చరణే చరణే పరిశీలయతి
స్థిరదృష్టిర్యస్తమవతి కాలీ॥ ౨౦

ఈ శరీరమునందు తెరపిలేకుండునట్లు జీవితయాత్రను నిర్వహించుచున్న ప్రాణవాయువును- ప్రతిసంచారమునందును స్థిరదృష్టియై (అచంచలజాగరూకుఁడై)పరిశీలించువానిని- కాళీదేవిరక్షించును.

ప్ర భః- ఉచ్ఛ్వాస- నిశ్వాసగతిననుసరించి, తన్మూలమును (ప్రాణమును) బొందుచు-ప్రాణము నుపాసించువానికి- కాళీప్రసాదములభించునని భావము. ఉపాసకులకిది- ఉపయుక్తమును సుకరమును నగును. కనుక, కాళీపరమేశ్వరి నుపాసన చేయువారికిది మొదట- ఈ యుపాసన- ముఖ్యావశ్యకమని తోచుచున్నది.

మూ॥ స్థూలవికారాన్ పరిముఞ్చన్త్యా
నిర్మలనభసిస్థితయాదృష్ట్యా
మజ్జన్త్యా వా దహరాకాశే
లోకేశ్వర్యాః కరుణాం లభతే॥ ౨౧

వెలుపల నంతటను గాన్పించుచున్న స్థూలవికారములను వర్జించినదియు, రూపరహితమగు ఆకాశమునందున్నదియు, నగుదృష్టిచేతఁగాని, దహరాకాశమగు హృదయమునఁ బ్రవేశించిన దృష్టిచేతఁగాని, భువనేశ్వరి నుపాసించువాఁడు- భువనేశ్వరీకృపాలాభము నొందును.

ప్ర భ:—వెలినున్న భూమస్వరూపమునుగాని, లోనున్న దహరమునుగాని యుపాసించు మనుష్యుఁడు—భువనేశ్వరీప్రసాదభాక్కగునని భావము.

మూ॥ సర్వవికల్పాన్ పరిభూయా న్త
ర్విమలం మౌనం మహదవలమ్బ్య
కేవలమేక స్తిష్ఠతి యోఽన్త
స్తం సా జ్యేష్ఠా కురుతేముక్తమ్॥ ౨౨

చిత్తవృత్తులనన్నిఁటినిగూడ తిరస్కరించి, అంతర్ముఖుఁడై, విమలమును, మహత్తరమును, అగు మౌనమును (నిశ్శబ్దభావమును) సమాశ్రయించి— అంతర్ముఖుఁడై కేవలమును ఏకస్వరూపుఁడై, నిరాలంబత్వముచేత, నిలుచుచున్న మనుష్యుని— జ్యేష్ఠాదేవి ముక్తునిగా నొనరించును.

ప్ర భ:—నిర్వికల్ప నిష్ఠచేత-జ్యేష్ఠానుగ్రహము కలుగునని భావము.

మూ॥ మూలేస్థిత్వా భైరవ్యాఖ్యాం
తారాం దేవీ ముద్గీథేన।
సేవేతార్యో విదితరహస్యో
మాతఙ్గీం తాం గుణగానేన॥ ౨౩

ఉపాసనారహస్యజ్ఞానవంతుఁడగుఆర్యుఁడు-మూలాధారనిష్ఠచేత- త్రిపురభైరవిని సేవింపవలయును. సర్వానాదము ముసను ప్రకృతిమాత

మును. 'ఓమ్' అని యుపాసింపఁదగినదియు; నగు ఉద్గీథము చేత- తారాదేవిని సేవింపవలయును. స్తోత్రరూపమగు గుణసంకీర్తనము చేత- మాతంగీదేవిని సేవింపవలయును.

ప్ర. భః- పరానామకమగు మూలవాక్కుచేత— భైరవీదేవియు, కారణవాక్కగు నుద్గీథము చేత— తారాదేవియు, వైఖరీవాక్కుచేత— మాతంగిదేవియు, ప్రసన్న లగుదురని భావము.

మూ॥ ఆసనబన్ధాదచలో భూత్వా
రుద్ధప్రాణో బగళాం భజతే।
అభితో వ్యాప్తం వ్యక్తం తేజః
కలయన్ కమలాకరుణాం లభతే॥ ౨౮

యోగశాస్త్ర ప్రసిద్ధములగు పద్మాసనాదులయందు స్థిరసుఖమగు నేదో యాసనమును బంధించుటవలన నిశ్చలుఁడై, ప్రాణమును నిరోధించి, కుంభకసిద్ధి నొందిన మనుష్యుఁడు- బగళాముఖీదేవి నుపాసించుచున్నాఁడు. అంతటను వ్యాపించిన స్పష్టమగు తేజస్సును గ్రహించు సాధకుఁడు- లక్ష్మీకృపాలాభము నొందుచున్నాఁడు.

ప్ర. భః— ఆసనబంధము చేత స్థిరుఁడై, ప్రాణాయామము నొనర్చు సాధకుఁడు- బగళాముఖీప్రసాదలాభము గలుగును. సర్వవ్యాపినియగు శోభను ధ్యానించు వానికి- లక్ష్మీకటాక్షప్రాప్తి కలుగును.

అవ:— స్తబకమును ముగించుచున్నాఁడు.

మూ॥ ఏకవిధాదౌ బహుభేదాఽథో
శక్తిరనన్తా పరమేశస్య।
సభజనమార్గం గణపతిమునినా
పాదాకులకైరేవం వివృతా॥ ౨౯

మొదట- ఏకప్రకారయు, తరువాత బహుప్రకారయు, అగుచున్న పరమేశ్వరుని యనంతశక్తి- గణపతికృత ఉపాసనోపాయ బోధసహితములగు పాదాకులకవృత్తముల చేత- వ్యాఖ్యాతయై యున్నది.

ఇతి- సవ్యాఖ్యమగు అష్టత్రింశ స్తబకము. (38 వ స్తబకము)

☆

ఓంనమో భగవతే శ్రీరమణాయ, శ్రీభారతీదేవ్యైనమః

# ఉమాసహస్రము



## ఏకోనచత్వారింశ స్తబకము. [ముప్పది తొమ్మిదవ స్తబకము]

### పదియవశతకమున, మూఁడవ స్తబకము.

అవ:—ముప్పదితొమ్మిదవదియగు నీస్తబకమున దేవీమహా భాగ్యమును ప్రస్తుతించి, మంత్ర- జప- ధ్యానములచేఁ గలుగు యోగసిద్ధులను ప్రతిపాదించుచున్నాఁడు. మఱియు, శ్రీవిద్యోద్ధారము గూడ నిందుగ్రహింపఁదగినదగుచున్నది.

మూ॥ వ్యాప్యేదమిన్ద్రోర్భువనం య ఏవ
ప్రాయేణ తస్యామలచన్ద్రికాఽభూత్।
మన్దస్తవార్తిం సధునోతుహాసో
నిశ్శేషలోకేశ్వరవల్లభాయాః॥ ౧

సమస్తలోకేశ్వరుని ప్రియసియగు పార్వతీదేవియొక్క మందహాసమే- ఎదుటఁ గాన్పించుచున్న యీ చంద్రలోకమున వ్యాపించి ఆచంద్రునియొక్క ప్రసన్నజ్యోత్స్నయైయున్నది. అది-నీయార్తిని దొలఁగించుఁగాత!

ప్ర భ:—ఆర్తియనఁగా వ్యథ. ఆవ్యథకు- భేషజమమృతమైయున్నది[ఆర్తికి మందు-అమృతము.] వెన్నెల అమృతమయమగుటవలనను, దేవీమందహాసమే- ఆ వెన్నెలయై యుండుటవలనను, ఆమందహాసము- ఆర్తిహరమగుటసంగతమేయగును. "దేవీమందహాసమే- అమృతమయమగు జ్యోత్స్నయగుటవలన. అది-యీవ్యథానివృత్తికౌషధమగును" అని భావము.

విశే:—ఇచట- దేవీమందస్మితము- చంద్రికగా సంభావింపఁబడినదని, గమ్యోత్ప్రేక్షనాశంకింపఁదగదు. మందహాసమే- జ్యోత్స్నయై యున్నదని, చంద్రికానిషేధమాక్షేపింపఁబడుటవలన "ఇది-చంద్రిక కాదు, దేవీమందహాసమే" అనువర్థము గమ్యమగుచున్నది. "ప్రకృతం ప్రతిషిధ్యాన్యస్థాపనం స్యాదపహ్నుతిః" "ప్రస్తుతమును నిషేధించి, ఇతరమును స్థాపించుట అపహ్నవమగును" అను సాహిత్యదర్పణోక్తలక్షణమువలన, ఇది-అపహ్నవాలంకారమగుచున్నది.

మూ॥ పూర్ణే వియత్యేకతటిజ్జ్వలన్తీ
లోకాన శేషాననిశంపచన్తీ।
మేఘే కదాచిన్మహసా స్ఫురన్తీ
చణ్డీ ప్రచణ్డా హరతాదఘం నః॥ ౨

అఖండమగు నాకాశమునందు-అద్వితీయసూక్ష్మతటిత్తై, విరాజిల్లునదియు, లోకముల నన్నిఁటినిగూడ- ఎల్లప్పుడును పరిపాకమొందఁ జేయునదియు, ఒకానొకప్పుడు, మేఘమునందు మెఱుపై, స్ఫురించు నదియు, నగు ప్రచండచండీదేవి- మాదురితముల నపహరించుఁగాత!

ప్ర ధి:— ఐ.ది) యను పేరుగల ప్రచండచండీశక్తి- భూమాకాశమున-మిక్కిలి సూక్ష్మరూపమున వ్యాపించి, అంతర్దృష్టి గమ్యమగు విద్యుద్రూపమున వెలయుచున్నది. ఆమెయే ప్రపంచమును పరిపక్వమొనర్చుచున్నది. ఆమెయే-తన,యునికి-నొకయంశమువలనఁ బ్రకటించుచు, స్థూలదృగ్గోచరమగు విద్యుద్రూపమున నప్పుడప్పుడు, మేఘములయందు మెరయుచున్నది.

అవ:—ఓజో ధర్మసామ్యమువలన- ప్రచండచండీ- కాళీ- స్వరూపమొక్కటియేయయినను, కర్మభేదమువలన- నామభేదము నెఱుఁగునది. ఇప్పుడు పాచకశక్తియగు కాళిని- సంబోధించు చున్నాఁడు.

మూ॥ గోలాని కాన్యప్యధునోద్భవన్తి
జీర్యన్తి కాన్యప్యఖిలేశకాన్తే!
యాన్త్యమ్బికే కాన్యపి వృద్ధిమత్ర
పాకే భవత్యాః పరితః ప్రవృత్తే॥ 3

సర్వేశ్వరసుందరివగు జననీ! నీపాకము (పరిణామవిధానము) సర్వతః. ప్రచలితమగునపుడు, గోళములు-కొన్ని (గోళాకారములగు భువనములు- లేక, బ్రహ్మాండములు కొన్ని) వెంటనే యుద్భవించు చుండును. కొన్ని గోళములు— క్షయించుచుండును. మఱికొన్ని గోళములు వృద్ధినొందుచుండును.

ప్ర భ:—'నీపాకము- సకలభువనజన్మ — వృద్ధిక్షయకారి' అనిభావము "కొన్ని లోకములుదయించుచుండ, నింక కొన్నిలోకములు క్షీణించుచుండ మఱి కొన్నిలోకములు వృద్ధినొందుచుండుటకు నీపాకమహిమయే- కారణము. ఒకేకాలమున, భిన్నభిన్నదేశములయందు నీపాకమహిమచేతనే- ఉత్పత్తి, వృద్ధి,క్షయము లనుకర్మలు మూడును కలుగుచున్నవి''అని భావము.

మూ॥ భాసాంవినేత్రా మహతా గ్రహైశ్చ
భూరిప్రమాణైర్యుత మీశకాన్తే।
ఏకైకమణ్డం తవ లోమవచ్చేత్
కస్తే మహద్భాగ్యమిహాబ్రవీతు॥ ౪

ఈశ్వరప్రియవగు మాతా! బృహద్రూపుడును, కాంతిసంధాతయు, నగు సూర్యునితోడను- అధికప్రమాణములుగల కుజాది గ్రహములతోడను-గూడిన ఒక్కొక్క బ్రహ్మాండము- నీకు- ఒక్కొక్క తనూరుహమువంటిదగుచున్నది, ఇట్లుండ— అపారమగు. నీమహాభాగ్యము నీలోకమున మాలో నెవ్వడు వచించును?

ప్ర భ:— వనస్పతులు (వృక్షములు) పృథివికిరోమములవలె జనించుచున్నవి. ప్రాణుల శరీరములనుండి తనూరుహములు పుట్టుచున్నవి. ఇట్లే, దేవీశరీరమగు పరమాకాశమునుండి- అక్కడక్కడ, అసంఖ్యేయములగుబ్రహ్మాండములు- మొలుచుచుండును. "ఏతావానస్యమహిమా" "పరిజ్ఞాయుక్తుడగు బ్రహ్మముయొక్క మహిమ యింతటిది'' అని, వినబడుచున్నదిగదా!

మూ॥ నాథస్య తేరూపమణోరణీయో
మాత స్త్వదీయం మహతో మహీయః।
జానాతియో దేవిరహస్యమేతద్
వ్యాఖ్యాతుమేష ప్రభవత్యశేషమ్॥ ౫

మాతా! నీకు నాథుడగు నీశ్వరునిరూపము—అణువుకంటెను, గూడ— సూక్ష్మతరమైయున్నది. నీరూపము—మహత్తుకంటెనుగూడ— (పెద్దదగురూపముకంటెనుగూడ) మహత్తరమై, (మిక్కిలిపెద్దదై)

యున్నది దేవీ! ఈ రహస్యము నెఱింగిన బుద్ధిమంతుఁడు- సమస్తమునుగూడ విశేషించి తెలుపుటకు శక్తుఁడగును.

ప్ర భ:- "అణోరణీయాన్ మహతో మహీయా నాత్మాస్య జన్తో ర్నిహితం గుహాయామ్" "ఈప్రాణుల బుద్ధిగుహయందున్న ఆత్మ- అణోరణీయుఁడు (సూక్ష్మమగు నణువుకంటెనుగూడ సూక్ష్మతరమగు రూపముగలవాఁడు; అతఁడే- మహతోమహీయుఁడు. (స్థూలవస్తువుకంటెనుగూడ స్థూలమైన వాఁడు) అని శ్రుతియందు వినఁబడుచున్నది గదా! మిక్కిలి సూక్ష్మమును, అంతర్నిహితమును, అగుటవలన, ఆత్మ- అణోరణీయమగుచున్నది. వికసించునదియు, బృహద్రూపము గలదియు, సర్వాత్మకమును, అగుటవలన నదియే మహతోమహీయమగుచున్నది ద్రష్టయు, (దేహేంద్రియప్రాణమనోబుద్ధులకు సాక్షియు) పురుషుఁడును, (పురమగు శరీరమున శయనించువాఁడును) అగు ఆత్మ అణోరణీయమును, తద్వైభవము నావిష్కరించుటవలన ఆత్మశక్తి- మహతోమహీయమును, అగుచున్నద గ్రహించునది.

మూ॥ యద్గర్జితం వారిదఘర్షణేషు
శబ్దస్త్వయం సుగభీరఘోషః॥
యల్లోకరాజ్ఞి! స్ఫురితం తదేత
దుజ్జృమ్భితం కిఞ్చన కాన్తివీచేః॥ ౬

అమ్మా! జలము లొకదానితో నింకొకటి సంఘర్షము నొందునపు డుద్భవించుచున్న గర్జితము- గంభీరనిర్ఘోషమగు నీశబ్దమై యున్నది. జగదీశ్వరీ! ఆమేఘములయం దుదయించుచున్న మెరుపు- నీకాంతితరంగముయొక్క- ఉజ్జృంభితమై (ఉల్లసితమై)యున్నది

ప్ర భ.— ఉరుము-నీశబ్దము. మెఱుపు-నీ కాంతివిశేషము.

మూ॥ ఇన్ద్రస్య వజ్రం జ్వలితం కృశానో
ర్జ్యోతిస్సహస్రచ్ఛదబాన్ధవస్య
పీయూషభానోర్హసితం విసారి
జీవస్య చక్షుర్నమతాత! దైవమ్॥

తాతా! ఇంద్రునకు వజ్రమును, (విద్యుద్రూపమగు తేజమును) అగ్నికి-జ్వాలనమును, (జ్వాలయు) కమలబంధుఁడగు సూర్యునికి-జ్యోతిస్సును, అమృతకిరణుఁడగు చంద్రునికి-ప్రసరించు వెన్నెలయు, జీవునకు-కన్నును, (ద్రష్టయగు చైతన్యమును) అగుచున్న వస్తువు-జ్యోతిర్మయమగు నాదైవస్వరూపమై యున్నది.

ప్ర భ:—"ఒక్కటియేయగుజ్యోతిస్సు- ఇంద్రునకు-వజ్రమై, అగ్నికి-జ్వాలమై, సూర్యునికి— తేజమై, చంద్రునికి మహస్సై, కంటికి తేజమై, యున్నది. కావున ఉపాధిభేదమువలననే- నామభేదమును, వ్యాపారభేదమును, కలుగుచుండును. కావున శ్రేష్ఠమగు పరమజ్యోతి యొక్కటియే—నేనుపాసింపఁదగిన దైవమగుచున్నది" అని భావము.

మూ॥ యస్యైవ తేజః ప్రవిభక్తమర్క-
విద్యుచ్ఛశాఙ్కానల లోచనేషు
గూఢం తదాకాశగృహే సమన్తా
దనన్తానభిజ్ఞం ప్రణమామి దైవమ్॥ ౮

దైవమునకు సంబంధించినదియేయగు నే తేజస్సు-సూర్యునియందును, విద్యుత్తునందును, చంద్రునియందును, అగ్నియందును, నేత్రమునందును, వేరువేరుగా నున్నట్లు భిన్నమై యున్నదో, ఆకాశరూపమగు గృహమునందంతటను గూఢమై, అంతము తెలియని (అనవధికమగు) ఆదైవమునకు ప్రణమిల్లుచున్నాను.

మూ॥ జాగ్రత్సుబుద్ధి ర్నిమిషత్సు నిద్రా
శుష్కేషు పక్తి స్తరుణేషు వృద్ధిః।
ధీరేషునిష్ఠా చపలేషు చేష్టా
దేవీమమాపత్తి మపాకరోతు॥ ౯

జాగ్రదవస్థగలవారియందు- బుద్ధియు, నిమీలిత నయనులయందు-నిద్రయు, శుష్కములగు (రసవిహీనులగు) వస్తువులయందు పాకరూపిణియు, యౌవనసంపన్నులయందు-వృద్ధియు, (పుష్టియు)

ధీరులయందు-(ఇంద్రియనిగ్రహము గలవారియందు) నిష్ఠయు; (దృఢ స్థితియు) చపలులయందు-చేష్టయు, అగుచున్న దేవి- నాయాపదను తొలఁగించుఁగాత!

ప్ర భ:—ఒక్క తెయేయగు దేవి-బుద్ధి ప్రాప్తి గుణములనుబహువిధముల చే నుల్లేఖించుటవలన నిది - ఉల్లేఖాలంకారముగానున్నది.

మూ॥ విద్యావతో వాద విధానశక్తి
ర్వీరస్య సఙ్గ్రామవిధానశక్తిః ।
నారీమణే ర్మోహవిధానశక్తి
స్లేశత్రయం కిఞ్చిదపారశక్తేః॥ ౧౦

విద్వాంసునకుఁగల వాదవిధానశక్తియు; (వాదనిర్వాహసమర్థతయు) విక్రమవంతునకుఁగల సంగ్రామకరణశక్తియు; స్త్రీరత్నమునకుఁగల సమ్మోహన విలాసశక్తియు; అనుశక్తిత్రయము-అపారశక్తియగు మహాశక్తియొక్క అత్యల్పమగుశక్తిలేశత్రయమైయున్నది.

మూ॥ ఉత్సాహయన్తీ తపతాం మనాంసి
సన్ధుక్షయన్తీ చ మహాక్రియాసు ।
సఙ్క్షోభయన్తీ హృదయం ఖలానాం
సమ్మోహయన్తీచ పరావతాన్నః॥ ౧౧

తపోనిష్ఠులగువారి మనస్సుల నుత్సాహము నొందఁజేయునదియు, వారిమనస్సులను మహాక్రియలయందు ప్రేరణమొనర్చునదియు, ఖలులహృదయమును సంక్షోభింపఁజేయునదియు, నగు పరాంబిక-మమ్ము రక్షించుఁగాత!

ప్ర భ:— "తపోనిష్ఠులయందనుగ్రహమును, దుష్టులయందు నిగ్రహమును, ప్రదర్శించునదియగు పరాశక్తి- మాకు రక్షయగుఁగాత" అని భావము.

మూ॥ సన్ధుక్షయన్తీ సకలస్య దేహం
వ్యానస్య శక్త్యా పరితో లసన్త్యా ।
జేతుః ప్రతాపేఽస్తి పలాయనేఽస్తి
భీతస్య చేయం నిఖిలేశశక్తిః॥

శరీరమునందంతటను విలసిల్లుచు, వ్యాపనశీలమగు వ్యానమను ప్రాణవాయువుయొక్క శక్తి చేత సకలజనులయొక్కయు దేహములను చలింపఁజేయునది యగు నీసర్వేశ్వరశక్తి- యుద్ధవిజయియగువీరుని ప్రతాపమునందున్నది. యుద్ధపరాజితుఁడగు భీతుని పలాయనము నందున్నది.

ప్ర భ:— చాలకశక్తియగు నీపరమేశ్వరియే- జయశాలియొక్క ప్రతాపము నందును, పరాజితుని పలాయనమునందునుగూడ- వర్తించుచుండునని భావము.

మూ॥ ఏకం స్వరూపం బహుచిత్రయోగాత్
సన్దర్శయన్తీ వివిధం జనేభ్యః।
సమ్యగ్దృశే స్వం విభు మర్పయన్తీ
సర్వాదిమాయైవ మహేశజాయా॥ ౧౩

"ఏకమగు నిజరూపమును- అనేకమును, అద్భుతమును, అగు కల్పనముచేత- మూలస్వరూపము నెఱుఁగని జనులకొఱకు- నానా రూపముగాఁ ప్రదర్శించునదియు, సమ్యగ్జ్ఞానము గల (యథార్థదర్శనముగల) జ్ఞానికి- తనప్రభువగు నీశ్వరుని సమర్పించునదియు, అగు విశ్వమూలమాయయే- మహేశ్వర జాయ యగుచున్నది."

ప్ర భ:— "మాయాశక్తి- అద్భుతములగు శక్తులచేత నొక్కటియేయగు స్వరూపమును- బహురూపములుగా నొనరించి, ప్రదర్శించుచున్నది. లేక, చిత్రకలావిశేషములచేత- ఒకేవస్తువు-బహువిధములుగాఁ బ్రదర్శింపఁబడునట్లు పరాశక్తి- ఒకేస్వరూపమును- బహురూపములుగాఁ జూపుచుండును. ఆమూల మాయాశక్తియే పరమేశ్వరప్రేయసి" అని భావము.

మూ॥ యస్సంశ్రయేతాఖిలసద్గతిస్త్వాం
ధ్యానేన మన్త్రేణ గుణస్తవైర్వా
త్రైలోక్యసామ్రాజ్యధురన్ధరస్య
శుద్ధాన్తకాన్తే! స కృతీ మనుష్యః॥ ౧౪

త్రైలోక్యసామ్రాజ్యధురంధరుఁడగు సర్వేశ్వరుని సుందరి వగు జననీ! సకలవిశ్వసంగతి (హృదయముంగఱుత) గలవాఁడై, మంత్రముచేతగాని, జపముచేతగాని, గుణసంకీర్తనములచేతగాని నిన్ను సేవించుచున్న మనుష్యుఁడే- ధన్యుఁడు.

మూ॥ మూలాగ్ని ముద్దీప్యశిరశ్శశాఙ్కం
సన్ద్రావ్య యస్తర్పయతే కృతీత్వామ్।
తస్మిన్నగాధీశ్వరకన్యకే! త్వం
ప్రాదుర్భవన్తీన కిమాదధాసి॥ ౧౫

నగరాజకుమారీ! మూలాధారమునందలి కులకుండాగ్ని నుద్దీపింపఁజేసి,సహస్రారమునందలిసోముని స్రవింపజేసి, నిన్ను తృప్తి నొందంచు ధన్యునియందు నీవు ప్రాదుర్భవించి, యుత్పాదింపని దేమున్నది?

ప్ర భ:- సర్వమునుగూఁడ వానియందు పుట్టింతువని భావము.

మూ॥ యస్త్వాం సహస్రార సరోజమధ్యే
సోమస్య రూపాం భజతేఽమ్బ! యోగీ
తస్యాన్తరః శాన్తిముపైతితాపో
బాహ్యస్య కానామకథాల్పకస్య॥ ౧౬

అమ్మా! ఏ యోగి- సహస్రారకమలమధ్యమున సోమస్వరూపిణివగు నిన్ను సేవించుచుండునో: ఆయోగికి- అంతరమగు (ఆధ్యాత్మికమగు) తాపము-శాంతించుచుండును. అత్యల్పమగు బాహ్యతాపము-(వేడి) శాంతించునని వేరుగా చెప్పవలయునా?

వివృతి- ఆరోగములవలనఁ గలుగునదియు,మానసికవ్యథలవలనఁగలుగునదియు నగుతాపము— సహస్రారమునందు చంద్రికశాస్వరూపిణి యగుజగన్మాతను సేవించు (ధ్యానించు) వారికి, తొలఁగును.

అవ:— దీనికి తరువాతిది యగు ప్రయోజనమును దెలుపుచున్నాడు.

మూ॥ దణ్డేనయో౽న్తర్గహారే౽వతీర్ణః
ప్రాణేనవాచా మహసాధియావా
ప్రాప్నోతిసో౽యం పురమద్వితీయం
యత్రత్వమీశా సహచిత్రలీలా॥ 12

వీణారూపమగు అస్థిదండమున, పశ్చాన్మార్గద్వారమున, ప్రాణవాయువుచేతఁగాని, వాగ్రూపమగు మంత్రముచేతఁగాని. తేజస్సుచేతఁగాని, బుద్ధిచేతగాని, హృదయాకాశమునకు అవతరించు (దిగు) చుండుయోగి- అద్వితీయమును, ఏకమును, అగు బ్రహ్మపుర మను గమ్యస్థానమును బొందును. అచ్చట నీవీశ్వరునితోఁ గూడ చిత్రలీలవై యుందువు.

మూ॥ తన్త్రోదితం విశ్వవినేత్రిమన్త్రం
యస్తేనరః సంయమవానుపాస్తే।
రుద్రాణి సాన్ద్రామ్బుదకేశపాశే
పాశైర్విముక్తః సజయత్యశేషమ్॥ 13

నీలమేఘమువలె దట్టమగు కేశపాశము గలదానవును, రుద్రాంగనవును, జగన్నాయికవును, అగుజననీ! తంత్రశాస్త్రప్రతిపాదిత మును, అక్షరాత్మకమును, వీర్యవంతమును, అగు నీమంత్రమును- ధారణాధ్యానసమాధిరూపమగు సంయమము గలిగి యుపాసించు మనుష్యుడు- అవిద్యా- వాసనా- ప్రేరిత పుత్రదారాదిసంబంధము వలనపుట్టిన పాశముల (బంధముల)చేత- విముక్తుఁడై (విడుదలనొంది) సమస్తమును జయించును.

అవ:-తంత్రశాస్త్రములయందుఁ దెలుపఁబడిన 'శ్రీవిద్య' అను పేరుగల మంత్రరాజమును రెండుశ్లోకములచేతనుద్ధరించుచున్నాఁడు. శ్రీవిద్యయందు ఖండత్రయాత్మకమై పంచదశాక్షరమై యుండుటవలన ఆమంత్రము 'పంచదశి' అని చెప్పఁబడుచున్నది.

మూ॥ పద్మాసనో ద్వాదశవర్ణశాన్తి
దవజ్రపాణి ర్భువనాదినాథా।
గీర్వాణమార్గో భృగురబ్జయోని
రన్తే తథాఽగ్రే చహలాం విరాజీ॥ ౧౯॥
జమ్భస్యహన్తాఽనలశాన్తిచన్ద్రైః
సంయుక్త ఊష్మాగలదేశజన్మా।
దన్తస్థలీ సమ్భవః ఊష్మవర్ణో
వాణీపతిర్వజ్రధరశ్చ లజ్జా॥ ౨౦

పద్మాసనుఁడని (బ్రహ్మయని) చెప్పఁబడిన 'కకారము' ద్వాదశవర్ణమని చెప్పఁబడిన, 'ఏకారము' శాంతియని చెప్పఁబడిన, 'ఈకారము' వజ్రహస్తుఁడని (ఇంద్రుఁడని) చెప్పఁబడిన 'లకారము' 'భువనేశ్వరియని చెప్పఁబడిన, హ్రీంకారము' అను వర్ణపంచకమగు క, ఏ, ఈ, ల, హ్రీం, అను ప్రథమ ఖండమును, గీర్వాణ మార్గమని (ఆకాశమని) చెప్పఁబడిన, 'హకారము', భృగువనిచెప్పబడిన, 'సకారము', అబ్జయోనియని (బ్రహ్మయని) చెప్పఁబడిన. 'కకారము', కకారముమీఁదనున్న, హల్లులలోనున్న, యక్షరమగు 'హకారము జంభహంతయని (ఇంద్రుఁడని) చెప్పఁబడిన, లకారముపిదుపరి—అనలమని (అగ్నియని) చెప్పఁబడిన, రేఫముతోడను, శాంతియని చెప్పబడిన ఈకారముతో చంద్రుఁడని చెప్పఁబడిన, 'అనుస్వారముతోడను, గూడినదై కంఠస్థానమునందుదయించిన యూష్మవర్ణమగు 'హకారమును' (హ్రీం అనునదియు) అను వర్ణషట్కముగల 'హ, స, క, హ, ల, హ్రీం' అను ద్వితీయఖండమును, దంతస్థలియందుదయించిన (దంత్యమగు ఊష్మవర్ణమగు 'సకారము', వాణీపతియగు (బ్రహ్మయగు) 'కకారము', వజ్రధరుఁడగు (ఇంద్రుఁడగు) 'లకారము' లజ్జయగు 'హ్రీంకారము' అనువర్ణచతుష్కము గల 'స, క, ల, హ్రీం' అను తృతీయఖండమును, గలిగి "పంచదశాక్షరమగు నీమంత్రము—పంచదశి' అని చెప్పఁబడును.

("పంచదశీ మంత్రోపాసకులు" అని లోకప్రసిద్ధులగు నుపాసకులు దీనినే సేవింతురు.)

మూ॥ విద్యాత్రయీయం పఞ్చదశాక్షరాఢ్యా
నాథేన సాక్షాన్మహామానగురూపదిష్టా
గోప్యాసుగోప్యా సుకృతైరవాప్యా
శ్రేష్ఠావిద్యాస్తుత్యా పరమేష్ఠినాఽపి ॥౨౧॥

ఇక్కడ 'క; ఏ; ఈ; ల; హ్రీం'—'హ; స; క; హ; ల; హ్రీం' 'స; క; ల; హ్రీం' అను ఖండత్రయరూపముగలదియు, పంచదశాక్షరయుక్తయు, అగు శ్రీవిద్య—సాక్షాత్తుగా మహామానగురువగు దక్షిణామూర్తిచేత ([illegible] ఉపదేశింపబడినది.)

ఈ విద్య—గోప్యములగు [illegible] విద్యలయందు మిక్కిలి గోప్యమై (రహస్యతమమై)యున్నది. మఱియు, ఇది సుకృతములచే లభింపఁదగినదియు, బ్రహ్మదేవునిచేఁగూడ స్తుతింపఁదగినదియు, సర్వవిద్యలలోపలను; శ్రేష్ఠమైనదియునై యున్నది.

మూ॥ దేహేష్వియం కుణ్డలినీస్వగాది
భూతేషు విద్యుద్భువనేషు చాభ్రమ్
దేవాఙ్గనామస్తక లాలితాఙ్ఘ్రి—
ర్దేవీ భవానీ ఖలు దేవతాసు ॥౨౨॥

ఈవిద్య—శరీరములయందు కుండలినిగా చెప్పఁబడుచున్నది. భూతములయందు విద్యుత్తుగా చెప్పఁబడుచున్నది.

భువనములయందు — ఆకాశముగాఁ జెప్పఁబడుచున్నది. దేవతలయందు — దేవాంగనామస్తకములయందు లాలితములగు చరణములు గల యీ దేవి-భవానియైయున్నది గదా!

మూ॥ చక్షుర్ద్విధాయాచలమన్తరేణ
ప్రాణం ప్రపశ్యన్ మనువర్ణరూపమ్।

సంసేవతేచేత్ సకలస్య ధాత్రీం
సర్వేష్టలాభో విదుషః కరస్థః॥ ౨౩

నేత్రియును స్థిరముగానుంచి- మంత్రాక్షరరూపమగు ప్రాణమును- సమీక్షించుచు, ప్రపంచభర్త్రియగు పరమేశ్వరి నుపాసించుచు, శ్రీవిద్యను సేవించుచున్న విద్వాంసునకు-సర్వేష్టలాభము- హస్తగతమగుచున్నది.

ప్ర భ;- ఇందు మంత్రయోగముపదేశింపఁబడినది. అదియు గుర్వనుగ్రహము వలన అనుభవము చేతనే తెలియఁదగినదైయున్నది. ఇందలి యభిప్రాయము నిట్లు ఉంగునది. మనస్సుచేత- జపకర్మయందు ప్రవర్తించు, ప్రాణవాయువుయొక్క రాకపోకలయందు జాగరూకుఁడగు నుపాసకునకు, ప్రాణమే- మంత్రవర్ణరూపమగుచున్నది. ప్రాణమే మంత్రరూపమున నదించు (ధ్వనించు) చున్నదను జ్ఞానము దానికి కలుగుచున్నది. శ్రీరమణగీతయందలి మనోనిగ్రహోపాయమను నంశమునందీమంత్ర యోగ మిట్లు వర్ణింపఁబడినది.

శ్లో॥ "జపేన వాఽథ మన్త్రాణాం మనసో నిగ్రహో భవేత్
మానసేన తదా మన్త్రప్రాణయోరేకతా భవేత్॥
మన్త్రాక్షరాణాం ప్రాణేన సాయుజ్యం ధ్యానముచ్యతే
సహజస్థితయే ధ్యానం దృఢభూమిః ప్రకల్పతే.

"మంత్రములను జపించుటచేఁగూడ మనస్సుయొక్క నిగ్రహము కలుగును. అప్పుడు మనస్సును-మంత్ర ప్రాణములుగు ఏకీభవించును. మంత్రాక్షరములు- ప్రాణము- ఏకీభవించుట ధ్యానమని చెప్పఁబడును. సహజస్థితియగు ఆత్మనిష్ఠకు- ఈధ్యానమే దృఢభూమియై యున్నది." "ఇట్లు-ఉపాసింపఁబడుచున్న మంత్రముల కన్నిఁటికిని, ప్రాణములతోడి సాయుజ్యము (ఏకత్వము) కలుగుననునది తత్త్వరహస్యమై యున్నది. అందును విశేషించి, పంచదశాక్షరీ మంత్రమువలన సిద్ధికలుగుననుట-ప్రసిద్ధము. ఈపంచదశియందు మంత్రాక్షరములే-దేవికి అవయవరూపము లగుచున్నవి" అని యోగశాస్త్రమం దుద్ఘాటింపఁబడినది. ఈమంత్రముల నుద్దేశించి శంకరభగవత్పాదకృతమగు ఆనందలహరియందు "శివః శక్తిః, కామః" అను మంత్రోద్ధారశ్లోకమున "భజన్తే వర్ణాస్తే శివజనని నామావయవతామ్" జననీ అవర్ణములు- నీనామావయవత్వము నొందుచున్నవి" అని చెప్పఁబడినది. (లలితా) సహస్రనామములందుఁగూడ "మూలమన్త్రాత్మికా మూలకూటత్రయ కళేబరా"

ఇత్యాదికము నందీయంశముకీర్తింపబడినది.. ఈమంత్రమును- గురుముఖమునఁ దెలిసికొని ఉపాసింపవలయును. (నియమయుక్తమగునపుడు_శీఘ్రముగా సిద్ధించును.)

మూ॥ ఏకాక్షరీః పంచదశాక్షరీం వా
విద్యాః ప్రకృష్టాః సకలేశశక్తేః।
యోభక్తియుక్తః ప్రజపేదముష్య
ప్రాణోవశే నిస్తులసిద్ధియోనిః. ౨౮

బీజాక్షర రూపిణులగు హ్రీం, క్రీం; హ్రూం, శ్రీం, ఇత్యాదులగు ఏకాక్షరులనుగాని, పంచదశాక్షరినిగాని, సర్వేశ్వరశక్తికి సంబంధించిన ప్రకృష్టలగు దశమహావిద్యలనుగాని, భక్తియుక్తుఁడై జపించువానికి సాటిలేనిసిద్ధులకు జన్మభూమియగు ప్రాణమువశపడును.

ప్ర భః—భువనేశ్వరీ బీజాక్షరరూపిణియగు 'హ్రీం'అనునదియు, కాళీబీజాక్షరరూపిణియగు 'క్రీం' అనునదియు, ప్రచండచండీ బీజాక్షరరూపిణియగు 'హ్రూం' అనునదియు, లలితా బీజాక్షరరూపిణీయగు 'శ్రీం' అనునదియు, మొదలగునవి- ఏకాక్షరులై యున్నవి.వీనినిగాని,వెనుకచెప్పఁబడిన పంచదశాక్షరినిగాని దశమహావిద్యలనుగాని, జపించు సాధకునకు-ప్రాణవశీకారము సిద్ధించును. ప్రాణశక్తి—వశపడినయెడల సిద్ధులన్నియు హస్తగతములగునని భావము.

మూ॥ ఏతాః కవీనాం పదకింకరస్య
పూతాః ప్రమోదం పరమావహన్తు
గీతాస్సభక్తి ద్రవ మిన్ద్రవజ్రాః
శ్వేతాచలాధీశ్వర వల్లభాయాః. ౨౯

భక్తిరసముతోఁగూడి గానము చేయఁబడినవియు, పవిత్రములయినవియు, కవిచరణ భజకుఁడగు గణపతిచే రచింపఁబడినవియు, నగు ఇంద్రవజ్రావృత్తనిబద్ధములగు స్తుతులు- కైలాసపతి ప్రేయసియగు జగదంబకు పరమప్రమోదము నొసఁగుఁగాత!

ఇది సవ్యాఖ్యమగు ఏకోనచత్వారింశ స్తబకము.

(39వ స్తబకము)

ఓం నమోభగవతే శ్రీరమణాయ, శ్రీసరస్వత్యైనమః.

# ఉమాసహస్రము



## చత్వారింశస్తబకము

(పదియవ శతకమున, నాలుగవ స్తబకము.)

అవ:—నలువది యగు నీయుపసంహార స్తబకమున- పరదేవతకు— విశ్వములోపలను; వెలుపలను, గలవియు, శ్రీమంతములును, ఊర్జితములును, నగుస్థానముల యందును, విభూతులయందును, స్పష్టమగు సముపాస్యత్వమును దెలుపునవియు. వేద, వేదాంత, తాంత్రిక, యోగ, సారభూతములగు తత్త్వములను దెలుపునవియు నగు రమణీయ గానముగల దైవగీతములు-గానము చేయఁబడుచున్నవి. ఇవి-పండితులకును పామరులకునుగూడ సులభముగాఁ దెలియునవై యున్నవి. (కనుక ఈ స్తబకము ముఖ్యమైనది.)

మూ॥ శమయతుపాపం, దమయతు దుఃఖం,
హరతు విమోహం, స్ఫుటయతు బోధమ్।
ప్రథయతుశక్తిం మన్దంహాసితం
మనసిజ శాసనకుల సుదృశోనః॥. ౧

మనసిజ శాసనుఁడగు పరమేశ్వరుని కులాంగనయగు పరమేశ్వరియొక్క- దరస్మితము- మాపాపమును తొలఁగించుఁగాత! దుఃఖమును ధ్వంసమొనర్చుఁగాత! వ్యామోహమును (భ్రాంతిని) పోఁగొట్టుఁగాత!జ్ఞానమును వికసింపఁజేయుఁగాత!శక్తినావిష్కరించుఁగాత!

మూ॥ ఆర్ద్రాదయయా పూర్ణాశక్త్యా
దృష్టివశంవద విష్టపరాజా।
అఖిలపురన్ధ్రీపూజ్యా నారీ
మమనిశ్శేషాం విపదం హరతు.

దయచేనార్ద్రియు- శక్తిచేత పూర్ణయు, దృష్టిచేత వశీకరింపఁబడిన లోకేశ్వరులు గలదియు, అఖిలపురంధ్రీ జనపూజ్యయు, అగు నారి-(దేవి) నాయాపదను నిశ్శేషముగాఁ దొలఁగించుఁగాత!

అవ:—ఇక్కడనుండి 'శుద్ధబ్రహ్మణి' అని యారంభించి, సృష్టియందంతటనుగూడ-ఆయా; ఉపాధిభేదములయందు ఉపాసింపఁదగి యున్న దైవస్వరూపమును గానముచేయుచున్నాఁడు

మూ॥ శుద్ధబ్రహ్మణి మోదో దైవం
తత్రిసిసృక్షతి కామో దైవమ్ ।
సృజతి పదార్థాన్ దృష్టిర్దైవం
తాన్ బిభ్రాణో మహిమా దైవమ్. 3

సకలమనిగాని, నిష్కలమనిగాని, విభజించుటకు విషయము గానిదియు; ద్వంద్వరహితమైనదియు; స్వతఃసిద్ధమైనదియు నగు వస్తువు-శుద్ధమని చెప్పఁబడును. అట్టిశుద్ధబ్రహ్మమునందుఁగల, ఆనందము దైవము. (శుద్ధబ్రహ్మమునందగు దైవస్వరూప మానందమైయున్నది) ఆబ్రహ్మము—సృజింపఁగోరునపుడు కలుగునదియగు కామము-(ఇచ్ఛ) దైవము. ఆబ్రహ్మము పదార్థములను (వస్తువులను) సృజించునపుడు దృష్టి—దైవము. సృజింపఁబడిన వస్తువులనదిధరించునపుడు మహిమ దైవము.

విశ:— ఆనందమునుండియే సృష్టి-జనించినది. కావున సృష్టికిముందు శుద్ధబ్రహ్మమానందరూపమై యుండెను.

"సో కామయత బహుస్యాం ప్రజాయేయ" "ఆబ్రహ్మము—బహురూపములుగా నయ్యెదను" అని కోరెను.

అనిశ్రుతిప్రతిపాదితమగు సర్జనేచ్ఛకలిగినపుడు దైవస్వరూపము- కామమగుచున్నది. 'ఈక్షించుట' మొదలుకొని 'ప్రవేశించుట' వఱకును గల సృష్టి- 'తదైక్షత' 'తదనుప్రావిశ్య' ఇత్యాదిశ్రుతులచేత ప్రసిద్ధమైయున్నది. ఈక్షణమువలన సృష్టినిర్వహింపఁబడుటవలన, సృష్టి—ప్రచలితమగునపుడు దృష్టియే- దైవస్వరూప

మని చెప్పఁబడినది. సృజింపఁబడినపదార్థములను ధరింపునపుడంతటను వ్యాపించి వానిని ధరించుటవలన–మహత్త్వము-దైవస్వరూపమని చెప్పఁబడినది.

ఇట్లు:— సృష్టికిముందున్న నిర్గుణ బ్రహ్మమునందు ఆనందమును, తగుపరి కామమును, తరువాత దృష్టియు, పిమ్మట మహామయు–దైవస్వరూపమని యుపాసింపవలయునని భావము.

మూ॥ వికృతౌ వికృతౌ ప్రకృతిర్దైవం
విషయే విషయే సత్తాదైవమ్।
దృష్టౌ దృష్టౌ ప్రమితిర్దైవం
ధ్యానే ధ్యానే నిష్ఠా దైవమ్॥ ౪

ప్రతివికృతియందును , వికృతినొందని ప్రకృతి–దైవమగుచున్నది. ప్రతివిషయమునందును– దాని యునికికి హేతువగుసత్త–దైవమగుచున్నది. ప్రతిదృష్టియందును ప్రమితి— (ప్రమ లేక బుద్ధియే) దైవమగుచున్నది. ప్రతిధ్యానమునందును- నిష్ఠ– (దృఢమగుస్థితియే) దైవమగుచున్నది.

ప్ర భ:— నామరూపములచేత వస్తువులు వికృతినొందుచుండునపుడు, వికృతినొందని ప్రకృతి దైవమనియు, ఉనికిగలిగి భాసించుచున్న విషయము లన్నింటియందును గల సత్త-దైవమనియు, దర్శనకర్మమునందలి బుద్ధి-దైవమనియు, ధ్యానమునందలి నిష్ఠ-దైవమనియు నుపాసింపవలయునని భావము.

మూ॥ స్ఫూర్తౌ స్ఫూర్తౌ మాయా దైవం
చలనే చలనే శక్తిర్దైవం।
తేజసి తేజసి చక్షుర్దైవం
శబ్దే శబ్దే వాణీదైవమ్॥ ౫

ప్రతిస్ఫురణమునందును (ప్రతిస్పందనము, లేక కంపనమునందును,) దానికి హేతువగుమాయ– (మహాశక్తి)దైవమగుచున్నది. ప్రతిచలనమునందును, తదావశ్యకమగు శక్తి- దైవమగుచున్నది.

ప్రతి తేజమునందును, చక్షువు, లేక లక్ష్మి- (కాంతియే) దైవమగు చున్నది. ప్రతిశబ్దమునందును, వాణి- దైవమగుచున్నది.

మూ॥ హృదయే హృదయే జీవద్ దైవం
శీర్షే శీర్షే ధ్యాయద్ దైవమ్।
చక్షుషి చక్షుషి రాజద్దైవం
మూలే మూలే ప్రతపద్దైవమ్॥ ౬

ప్రతిహృదయమునందును ప్రాణించునది- (జాగరూకమగు నది) దైవము. ప్రతిశీర్షమునందును ధ్యానించునది దైవము. ప్రతి చక్షువునందును రాజిల్లునది- దైవము. ప్రతిమూలాధారచక్రము నందును ప్రజ్వలించునది- దైవము.

మూ॥ అభితో గగనే ప్రసరద్దైవం
పృథివీలోకే రోహద్దైవమ్।
దినకరబిమ్బే దీప్యద్దైవం
సితకరబిమ్బే సిఞ్చద్దైవమ్॥ ౭

ఆకాశమునందంతటను ప్రసరించునది- (వ్యాపించునది) దైవము. భూలోకమునందు, మొలుచునది- (వృక్షాదిరూపమున జనించునది) దైవము. సూర్యమండలమున వెలుఁగునది- దైవము. చంద్రమండలమున, (అమృతమును) స్రవించునది-దైవము.

మూ॥ శ్రావం శ్రావం వేద్యం దైవం
నామం నామం రాధ్యద్ దైవమ్।
స్మారం స్మారం ధార్యం దైవం
వారం వారం స్తుత్యం దైవమ్॥ ౮

వినివిని, (శ్రవణముచేత- ఆవృత్తిబలమువలన) తెలియఁదగి నది- దైవము. నమస్కరించి నమస్కరించి, సాధింపఁదగినది-

దైవము. స్మరించి స్మరించి, (స్మరణావృత్తి బలము వలన) ధరింపఁదగి నది దైవము. వరించి వరించి; ౹ మిక్కిలిగా కోరుటవలన స్తుతింపఁ దగినది— దైవము.

మూ॥ శ్రుతిషు వటూనాం శ్రావ్యం దైవం
గృహిణామగ్నౌ తర్ప్యం దైవమ్।
తపసాం శీర్షే పుష్టం దైవం
యతినాం హృదయే శిష్టం దైవమ్॥ ౯

వేదాధ్యయన మొనర్చు బ్రహ్మచారులకుఁ దెలియఁదగినది— దైవము. గృహమేధులకు అగ్నిహోత్రముచేత తృప్తినొందింపఁదగి నది— దైవము, తపోనిష్ఠుల శీర్షస్థానమందు వృద్ధినొందునది— దైవము. యతులకు హృదయమునందు, స్వరూపముచేత మిగిలినది— దైవము.

వి:— బ్రహ్మచారులకు స్వాధ్యాయమే ఆశ్రమధర్మమగు తపస్సు. కావున వారికి స్వాధ్యాయమునందున్నది— దైవమగుచున్నది. యతుల మనస్సు— వృత్తిశూన్య మగుటవలన స్వరూపముతో నవశేషించిన యాత్మయే— వారికి దైవమగును.

మూ॥ నమతాపుష్పైః పూజ్యం దైవం
కవినా పద్యారాధ్యం దైవమ్।
మునినా మనసా ధ్యేయం దైవం
యతినా స్వాత్మని శోధ్యం దైవమ్॥ ౧౦

నమస్కరించువాని చేత— పూవులచేఁ బూజింపఁదగినది— దైవము. కావ్యనిర్మాతయగు కవిచేతపద్యములచేత నారాధింపఁదగి నది— దైవము, మననశీలుఁడగు మునిచేత— మనస్సుచేత ధ్యానింపఁదగినది— దైవము. యమనంతుఁడగు యతిచేత— (నైష్ఠికునిచేత) స్వాత్మయందు శోధింపఁదగినది— దైవము.

వి:— చిత్త కాలుష్యమునుడిగి— ఆత్మను, స్వమూల స్వరూపభూతమును దైవము నుపాసించుటకు యతియే నగుయుక్తుఁడు గదా!

మూ॥ స్తువతాం వాచోవిదధద్ దైవం
స్మరతాం చేతః స్ఫుటయద్ దైవమ్।
జపతాం శక్తిం ప్రథయద్ దైవం
నమతాం దురితం దహయద్ దైవమ్॥ ౧౧

స్తోత్రమొనర్చువారికి- వాక్కులను స్తుతిసమర్థములుగా నొనర్చునది దైవము. స్మరించువారికి (ధ్యాతలకు) చిత్తమును వికసింపఁజేయునది- దైవము- (మంత్రమును) జపించువారికి- శక్తిని విజృంభింపఁజేయునది- దైవము. నతిఁగావించువారికి పాపములను నశింపఁజేయునది- దైవము.

మూ॥ వాచోవినయద్ వహ్నౌ దైవం
ప్రాణాన్ వినయద్విద్యుతి దైవమ్।
కామాన్ వినయచ్చంద్రే దైవమ్
బుద్ధీర్వినయత్ సూర్యే దైవమ్॥ ౧౨

అగ్నియందుండి వాక్కులను శిక్షించునది- (ఉపదేశించునది) దైవము. మెరుపునందుండి ప్రాణములను శిక్షించునది-(నడిపించునది) దైవము. చంద్రునియందుండి కోరికలను శిక్షించునది-(పెంపొందించునది) దైవము. సూర్యునియందుండి బుద్ధులనుపదేశించునది- (ప్రేరణచేయునది) దైవము.

ప్ర భ:-"అగ్నిర్వైవాగ్ భూత్వాముఖం ప్రావిశత్" "అగ్నియే వాక్కై ముఖమునందు ప్రవేశించెను" అను మంత్రముచేత- అగ్నివాగ్ దేవతగా చెప్పఁబడినది. కావున-అగ్నియందుండి వాక్కుల నుపదేశించునది-దైవమని చెప్పఁబడినది. అంతరిక్షమునందు వ్యాపించిన జ్యోతిస్సుగానున్నదై, ప్రాణములను చలింపఁజేయునది దైవస్వరూపమైయున్నది. ఇక్కడనుండి, సకాముఁడగు మనుష్యుఁడు మరణించి చంద్రలోకమునకు వెళ్ళును.

"క్షితేర్గసుధాకరంగతాః పితృయాన్వేనేతుమర్త్యాయే"

అని యిందలి ప్రథమశతకమూనందలి ద్వితీయస్తబకమున నీయంశము చెప్పఁబడినది. కావుననే చంద్రుని యందున్నదై కామములను గరపునది దైవమని చెప్పఁ

బడినది. సూర్యుఁడు- బుద్ధులను ప్రేరణచేయునను నంశము-వేదమున ప్రసిద్ధమగుచున్నది. "ధియోయోనః ప్రచోదయాత్" "ఏసూర్యుఁడు- మాబుద్ధులను ప్రేరణ చేయునో" అని గాయత్రీమంత్రము చెప్పుచున్నదిగదా! కావుననే, సూర్యునందున్నదై, బుద్ధులను ప్రేరేపించునది దైవస్వరూపమని యిందుఁజెప్పఁబడినది.

మూ॥ హృదయే నివసద్ గృహ్ణాద్ దైవం
వస్తౌ నివసద్ విసృజద్ దైవమ్।
కణ్ఠే నివసద్ ప్రవదద్ దైవం
కుక్షౌ నివసత్ ప్రపచద్ దైవమ్॥ ౧౩

హృదయమున నివసించుచు (సర్వమును) గ్రహించునది (తెలిసికొనునది) దైవము. (వస్తియందు(నాభికిఁ గ్రింది ప్రదేశమున) నివసించుచు (అశుచిపదార్థములను) విడుచునది- దైవము. కంఠమున నివసించుచు ప్రవచనము నొనర్చునది- (మాటాడునది) దైవము. ఉదరమునందు నివసించుచు (భుజింపఁబడినయన్నమును) పక్వమొనర్చునది- దైవము.

ప్ర. భ:- సాక్షిగానుండు దైవమే-సర్వమును గ్రహించును. కావున హృదయమున నివసించుచు, గ్రహించునది దైవమని చెప్పఁబడినది.

మూ॥ దేహే నివసద్ విచలద్ దైవం
పఞ్చప్రాణాకారం దైవమ్।
భాగిసమస్తస్యాన్నే దైవం
స్వాహాకారే తృప్యద్ దైవమ్॥ ౧౪

దేహమునందు స్థిరముగా నివసించుచు. విశేషముగా చలించునది- దైవము, పంచప్రాణాకారమునుబోలిన యాకారముగలది- దైవము. భోక్తలందఱికిని భోజ్యమగు నన్నమునందు భాగముగలది-దైవము. స్వాహాకారమునందు తృప్తినొందునది దైవము.

వివ:- దైవము నివసింపనియెడల దేహమునకు చలనము కలుగదు. కావున దేహమునందుండి చలించునది - దైవముగాఁ జెప్పఁబడినది. ప్రాణాపాన సమాన

వ్యానోదానముల రూపములంటి రూపములుగలదగుటవలన దైవము-పంచప్రాణాకారమని చెప్పఁబడినది. అన్నభోక్తయొక్క మూలస్వరూపమునమండి, వానిని భుజింపఁజేయునది కావున దైవము-భుజ్యమానమగు నన్నమున భాగము గలదగుచున్నది.

'స్వాహా' అనునది- దేవతలకు తృప్తినిచ్చు వాచకముగుచున్నది. కావున దైవము-స్వాహాకారమున తృప్తినొందునదని చెప్పఁబడినది.

అవ:- దైవమును స్త్రీరూపముగా భావించి ప్రత్యంగస్తవము నొనర్చుచున్నాడు

మూ॥ బిభ్రన్నారీ వేషం దైవం
శుభ్ర దరస్మిత విభ్రాడ్ దైవమ్।
అభ్రమదాపహ చికురం దైవం
విభ్రమవాసస్థానం దైవమ్॥ ౧౫

నారీరూపమును ధరించునది- దైవము.
తెల్లని చిరునవ్వుచేత వెలయునది- దైవము.
నీలమేఘదర్పమునడఁచు కేశపాశముగలది- దైవము.
విలాసములకు నివాస స్థలము- దైవము.

మూ॥ శీతజ్యోతిర్వదనం దైవం
రుచి బిన్దూపమరదనం దైవమ్
లావణ్యామృత సదనం దైవం
స్మరరిపులోచన మదనం దైవమ్॥ ౧౬

శీతజ్యోతిని బోలిన ముఖముగలది-దైవము. కాంతిబిందువులతోడి సాదృశ్యముగలదంతములుగలది- దైవము. లావణ్యమను నమృతమునకు నివాసభవనము - దైవము. స్మరునకు శత్రువగు హరుని నేత్రములకు హర్షమునిచ్చునది- దైవము.

మూ॥ లక్ష్మీవీచిమదలికం దైవం
ప్రజ్ఞావీచిమదీక్షం- దైవమ్

తేజోవీచిమదధరం— దైవం
సమ్మదవీచిమదాస్యం— దైవమ్॥ ౧౭

లక్ష్మీ తరంగములుగల లలాటముగలది— దైవము.
ప్రజ్ఞాతరంగములుగల దృష్టిగలది— దైవము
తేజస్తరంగములుగల కెమ్మోవి గలది— దైవము.
ఆనంద తరంగములుగల యాననము గలది—దైవము.

మూ॥ కరుణోల్లోలిత నేత్రం- దైవం
శ్రీకారాభశ్రోత్రం- దైవమ్
కుసుమ సుకోమలగాత్రం- దైవం
కవివాగ్వైభవ పాత్రం- దైవమ్॥ ౧౮

కృపా తరంగితములగు నేత్రములు గలది— దైవము.
శ్రీకారమువంటి ఆకారముగల శ్రోత్రముగలది- దైవము.
పుష్పమువలె మిక్కిలి కోమలమగు గాత్రముగలది—దైవము.
కవియొక్క వాగ్వైభవమునకు పాత్రమగునది- దైవము.

ప్ర శ:—నాగరలిపియందుఁ గాని; ఆంధ్రలిపియందుఁ గాని, లిఖింపబడిన 'శ్రీ' "శ్రీ" అను నక్షరముయొక్క ఆకారమువంటి ఆకారము గల శ్రోత్రములుగలది దైవమని భావము.

మూ॥ హిమవతి శైలే వ్యక్తం దైవమ్
సితగిరి శిఖరే క్రీడత్ దైవమ్।
తుమ్బురునారదగీతం దైవం
సురమునిసిద్ధధ్యాతం దైవమ్॥ ౧౯

హిమాలయపర్వతమున వ్యక్తమయినది- దైవము.
కైలాసగిరి శిఖరమున క్రీడించునది- దైవము.
తుంబురునారదులచేత గానముచేయఁబడినది-దైవము.
సుర-ముని-సిద్ధులచేత ధ్యానముచేయఁబడునది-దైవము.

ప్ర భ:- హిమాలయమునందు మార్యూపమున ప్రకాశించినదియు, కైలాసశృంగమున విహరించునదియు, గాయకభక్తుఁడగు తుంబురునిచేతను, భక్తాగ్రేసరుఁడగు నారదునిచేతను, సంకీర్తింపబడునదియు, దేవతలచేతను, ఋషులచేతను, సిద్ధులచేతను, ఏకాగ్రతచేత ధ్యానింపఁబడునదియు నగు దివ్యస్త్రీస్వరూపము- దైవమని భావము.

మూ॥ క్వచిదపి రతిశత లలితం దైవం
క్వచిదపి సుతరాం చణ్డం దైవమ్
భక్తమనోనుగవేషం దైవం
యోగి (యుక్త) మనోనుగ విభవం దైవమ్॥ ౧౦

కొన్నిచోటులందు క్రీడాశతములచే లలితము- దైవము.
" మిక్కిలియు చండము - దైవము.
భక్తజనమనోనుసారియగు వేషముగలది - దైవము.
యుక్త(యోగి)మనోనుసారియగు నైశ్వర్యము గలది-దైవము.

ప్ర భ:- లలితమనఁగా సౌమ్యమనియు, చండమనఁగా ఉగ్రమనియు నర్థమును గ్రహించునది. భక్తుల సంకల్పమునను సరించు బాహ్యరూపముగలది దైవము కావుననే-

"యోయోయాం యాంతనుంభక్తః శ్రద్ధయార్చితుమిచ్ఛతి।
తస్యతస్యాచలాం శ్రద్ధాంతామేవ విదధామ్యహమ్".

"ఏయేమనుష్యుఁడు- ఏయేశరీరమును-భక్తుఁడై శ్రద్ధతో పూజింపఁగోరునో, ఆయామనుష్యున కాయచలమగు శ్రద్ధను-నేనే కలిగింతును"అని గీతచెప్పుచున్నది.

యోగిజనసంకల్పము-వ్యర్థము కాదు. కావున వారి సంకల్పము ననుసరించు వైభవముగలది-దైవమే యగును.

మూ॥ చరితే మధురం స్తువతాం దైవం
చరణే మధురం నమతాం దైవమ్।
అధరే మధురం శంభో ర్దైవం
మమతుస్తన్యే మధురం దైవమ్॥

స్తోతలకు చరిత్రమునందు మధురము — దైవము.
నమస్కరించువారికి-చరణమునందు మధురము-దైవము.
శివునకు- అధరమునందు మధురము — దైవము.
పుత్త్రుఁడనగునాకు స్తన్యమునందు మధురము—దైవము,

ప్ర భ:—దైవస్వరూపమగు భగవతి—స్తుతికారులయందు కారుణ్యమును ప్రదర్శించును. కావున, వారికి మధురమైన నడవడి గలదగుచుండును. నమస్కరించు వారికి దేవీచరణమాధుర్యము తెలియును. కావున వారికి చరణమునందలిమాధుర్యముగలది—దైవమని చెప్పఁబడినది, శివునకు రమణీయమగుటవలన కెమ్మోవి యందలి మాధుర్యముగలది—దైవమగుచున్నది. మాతయొక్క స్తన్యరసమును శిశు వేయెఱుంగును. కావున గణపతికి స్తన్యమునందలి మాధుర్యముగలది-దైవమగుచున్నది.

వి శే:-ఇట్లు, అంతటను, మధురమగు (మాధుర్యముగలదియగు) దైవము-దేవియేయని యెఱుంగునది.

మూ॥ భుజభృత విష్టపభారం దైవం
పదధృతసమ్పత్సారం దైవమ్।
లాలిత నిర్జర వీరం దైవమ్
రక్షిత సాత్త్విక ధీరం దైవమ్॥ ౨౨

నిజబాహువులచేత లోకభారమును వహించునది— దైవము.
పదములచేత సంపత్సారమును ధరించునది — దైవము.
నిర్జర వీరులను లాలించునది— దైవము.
సత్త్వగుణయుక్తులగు ధీరులను రక్షించునది— దైవము,

మూ॥ చిచ్ఛక్త్యాత్మకమథితను దైవం
తటిదాకృత్యధిభూతం దైవమ్
శ్రుతిషు శివేతిప్రథితం దైవం
జయతి జగత్త్రయ వినుతం దైవమ్॥ ౨౩

శరీరమునందున్న చితిశక్తిస్వరూపము- దైవము. బాహ్య వస్తువునందున్న విద్యుదాకారము- దైవము శ్రోతులయందున్న 'శివ' అను నామమునఁ బ్రసిద్ధము- దైవము. దైవమిట్లు త్రిలోకసంస్తుతమై వెలయుచున్నది.

ప్ర భ:- అధ్యాత్మమగు దైవము_చితిశక్తి. అధిభూతమగు దైవము-విద్యుత్తు అధి వేదమగు దైవము- శివ. ఇట్లు, ఉమా దైవము-ప్రసిద్ధమగుచున్నదని భావము.

మూ॥ రమణ మహర్షే రన్తేవాసీ
మధ్యమపుత్రో నరసింహస్య ।
వాసిష్ఠోఽయం మరుతాం మాతు
ర్గణపతి రఙ్ఘ్రిం శరణముపైతి॥ ౨౪

అరుణాచలవాసియగు రమణమహర్షికి- అంతేవాసియు,అతనిచేత ననుగ్రహింపఁబడుటవలన శిష్యుఁడును నరసింహునికి మధ్యమపుత్త్రుఁడును, వసిష్ఠగోత్రమున జనించినవాఁడును, అగు ఈగణపతి- మరుత్తులకు తల్లియగు నిం్రదాణియొక్క- చరణమును శరణముగా నాశ్రయించుచున్నాఁడు.

ప్ర భ;- నరసింహశాస్త్రికి పుత్త్రులు ముప్వురనియు, అందితఁడు-మధ్యముఁడనియు, దీనివలన స్పష్టమగుచున్నది.

మూ॥ త్రిభువనభర్తుః పరమాశక్తిః
సకల సవిత్రీ గౌరీ జయతి ।
తన్నుతిలేఖా గణపతి రచితా
పాదాకులకప్రాన్తా జయతి॥ ౨౫

త్రిలోకేశ్వరుని సర్వోత్కృష్టశక్తియు, సకలసవిత్రియు, (విశ్వజననియు)అగు ఉమాదేవి- సర్వోత్కృష్టయై వెలయుచుండును. గణపతి విరచితమును-శ్లేష్మములగు పాదాకులకవృత్త నిబద్ధ పద్యములతో ముగింపబడినదియు నగు- ఈ "యుమాసహస్రస్తుతి"- ఉత్కృ

ర్షత్తో వెలయుచుండును. ఇట్లు- వాసిష్ఠగణపతిముని ప్రణీతమగు నీ యుమాసహస్రము- విజయము నొందుగాత! విజయము నొందుగాత !!

ఇతి- శ్రీమహర్షి-రమణభగవత్ పాదాన్తేవాసినో వాసిష్ఠస్య
నరసింహాసూనోః గణపతిమునేః కృతావుమాసహస్రే,
చత్వారింశః, స్తబకః, సమాప్తః.
సమాప్తంచ దశమంశతకమ్.
॥ ఉమాసహస్రం సమాప్తమ్. ॥

ఇది-శ్రీమహర్షి రమణభగవత్పాదశిష్యుఁడు, శతమర్షణసగోత్రుఁడు,
శ్రీమత్పంతుల పేరయశాస్త్రిపౌత్త్రుఁడు; వేంకటరామబుధేంద్ర
(ద్వితీయ) పుత్త్రుడు లక్ష్మీనారాయణశాస్త్రిచే నాంధ్రీక
రింపఁబడిన ఉమాసహస్రమను స్తోత్రకావ్యమునందు
చత్వారింశ స్తబకము సమాప్తము.
దశమశతకము ముగిసినది.
ఓమ్. తత్. సత్.



ప్రభావ్యాఖ్యాతృభిః, శ్రీ కపాలిశాస్త్రిభిర్విరచితా—
స్తబక- వృత్త— విషయసూచికా- శ్లోకాత్మికా !

---

సైషాస్తుతి రుమాందేవీ మధికృత్య మహాత్మనా।
శతకైర్దశభిర్గీతా చతుఃస్తబక సమ్మితైః॥ 1
అత్రస్థవిషయాన్ సర్వాన్ వృత్తానిచ యథాక్రమమ్।
సఙ్కీర్తయామః పఠతాం కణ్ఠస్థ పదలబ్ధయే॥ 2
ఆర్యాభిరాద్యే స్తబకే వ్యోమాత్మాస్త్రీ తనురున్నతా।
సర్గాది వర్ణసంప్రోక్తం ద్వితీయే పఞ్చచామరైః॥ 3
తృతీయే తనుమధ్యాభిః సదేహాయాశ్చసాధనమ్।
చతుర్థే గీతిభిర్గీతా ఆధ్యాత్మికవిభూతయః॥ 4
ఉపజాతిభిరుద్వాహః పార్వత్యాః పఞ్చమేస్మృతః।
షష్ఠేతు మదలేఖాభిః ర్మహాభాగ్యం జగత్సువః॥ 5
మాతురాకాశదేహాయా మాతృకాదివిభూతయః।
వసన్తతిలకావృత్తైః సప్తమేస్తబకేనుతాః॥ 6
అష్టమేఽనుష్టుభః శుభ్రాః ప్రీణాతాభీష్టదాయినీమ్।
చణ్డికాముపతిష్ఠన్తే చరిత్రత్రయభాసినీమ్॥ 7
నవమేస్తబకే రమ్యే తమస్తాపహారం పరమ్।
మన్దస్మితం మహేశ్వర్యా ఆర్యాభిరభివర్ణ్యతే॥ 8
వృత్తైః కేశాదిపాదాన్తం సౌన్దర్యం లలితాభిధైః॥
తథా పాదాదికేశాన్తం ఆర్యాభిర్భువనోత్తరమ్॥ 9
అభివర్ణితమమ్బయా ద్వయోస్తబకయోస్తతః।
రథోద్ధతాభిః శృఙ్గార వర్ణనం ద్వాదశే కృతమ్॥ 10
త్రయోదశే జగన్మాతుః కటాక్ష ఉపజాతిభిః।
చతుర్దశేఽథస్తబకే శస్తాభిరుపగీతిభిః॥ 11

కాళీ గౌరీ పరా దేవీ గీతాకుణ్డలినీ తథా
ఉదీర్ణా స్వాగతం దేవ్యా స్వాగతాభిరనన్తరే॥ 12
కుమారలలితావృత్తైరధ్యాత్మం శక్తివైభవమ్
షోడశేవివృతం సర్వమథ సప్తదశే పరా॥ 13
శక్తిశ్చమ్పకమాలాభిర్దివ్యామదకరీస్తుతా।
ప్రహర్షిణీభిర్ధారాభిర్గిరామష్టాదశేత్వథ॥ 14
కుణ్డలిన్యాః సముల్లాసశ్చిత్రో వ్యాఖ్యాయతే సతామ్
తథారూప విశేషాణాం సాక్షాత్కారశ్చ కీర్త్యతే॥ 15
ఏకోనవింశే స్తబకే లలితాయా మహత్తరమ్।
ప్రమాణికాభిరగ్ర్యాభిర్ధ్యేయం రూపం ప్రగీయతే। 16
మణిబన్ధైస్తథా వింశే సర్వసారమయీ స్తుతా।
ఏకవింశే హారార్ధాఙ్గీం సమ్ప్రగాయన్త్యనుష్టుభః॥ 17
వియోగినీభిర్ద్వావింశే గీతం హారకుటుమ్బకమ్
అథప్రకీర్ణకా తత్రత్యేకా నరమనోరమా॥ 18
గాయత్రీగర్భితాన్యాతు సుప్రతిష్ఠాసరత్ప్రభా
క్షేత్రమాలేన్ద్రవజ్రాభిః పఞ్చవింశే ప్రగీయతే॥ 19
షడ్వింశే దోధకైర్గీతామాతాపీతకుచామ్బికా
ప్రచణ్డచణ్డీంగాయన్తి శిఖరిణ్యస్త్వనన్తరే॥ 20
వసన్తతిలకా వృత్తైరష్టావింశే మనోహరైః
ఉజ్జ్వలం స్తబకే గీతం రేణుకాద్యభివర్ణనమ్॥ 21
మదలేఖాభిరేకోనత్రింశే నవవిధం లఘు
అనర్ఘం భజనం గీతం భక్తలోకముదావహమ్॥ 22
త్రింశేప్రమాణికావృత్తైర్మాతుర్మానసపూజనమ్
ఏకత్రింశేఽమ్బికానామ్నాం మహాత్మ్యముపజాతిభిః। 23

ఆర్యాగీతిభిరాఖ్యాతౌ భక్తిర్యోగోఽప్యనన్తరే।
త్రయస్త్రింశేతు వంశస్థైర్జపో యోగోఽర్పణం తథా॥ 24

హరిణీశక్వరీభ్యాంతు క్రియాంశః ప్రార్థనాద్వయోః।
తథాతిశక్వరీభిశ్చ షట్ త్రింశేతు ప్రకీర్ణకమ్॥ 25

వ్యాచక్షతేఽథ తత్త్వాని సప్తత్రింశేత్వనుష్టుభః।
తతో దశమహావిద్యాః పాదాకులక గీతయః॥ 26

ఏకోనచత్వారింశేతు స్తబకే జగతీసువః।
మహిమావ్యోమదేహాయా ఇన్ద్రవజ్రాభిరీడితః॥ 27

చత్వారింశేన్తిమే స్తోత్రే పురుషార్థకరం పరమ్।
దైవగీతం మహాసారం పావనానాంచ పావనమ్॥ 28

ఇత్థం సహస్రం పద్యానా మధికృత్యాఖిలేశ్వరీమ్।
గీతం ప్రశస్తం మహతాం మాననీయేన సూరిణా॥ 29

వృత్తేన రత్యా భారత్యా ప్రతిభానమహీయసా
తపసోఽర్జితయా కణ్ఠం గతయా కావ్యవేధసా॥ 30

నిర్మితా రతి నిష్పత్తి భూరమ్బాపదపద్మయోః
స్తుతిః కామదుఘా సైషా కృతిర్గణపతేర్గురోః॥ 31

వేదశాస్త్రాదివిద్యాబ్ధిలోడనేన మహాత్మనా।
స్తోత్రసాహిత్యమమృతం భూసురేణ సమాహృతమ్॥ 32

సేవ్యతాం కావ్యరసికైర్భజ్యతాం భజనార్థిభిః।
మహత్త్వకాఙ్క్షిభిః సద్భిరిదమాద్రియతామితి॥ 33

వ్యాఖ్యాం సహాయామాబధ్య ప్రభామేనాం మునేర్గిరామ్
కృతకృత్యోఽస్మి తస్యాస్తే వాసీ పుత్త్ర ఇవ ప్రియః॥ 34

సేయం ప్రణీతా సాహిత్యగుణాలఙ్కారసారగా
జగదమ్బాపదప్రేమరసావిర్భవ జీవనా॥ 35

ఆనృణ్యం లేశతో వాఽపి గురోర్గన్తుం ప్రకల్ప్యతామ్।
ఇతి యతోఽయమారబ్ధస్సమ్పూర్ణ స్తత్ప్రసాదతః॥ 36

నపాణ్డిత్యప్రకర్షోఽత్ర నవాతస్య ప్రకాశనమ్।
విద్యాసన్తాన విచ్ఛేదవారణం మూలకారణమ్॥ 37

అధీతస్తాతపాదేభ్య స్స్వాధ్యాయస్సానుశాఖినా
బాల్యే కావ్యాని, శాస్త్రంచ, తథాశబ్దానుశాసనమ్॥ 38

శ్రీ విద్యాచమయా లబ్ధా తత్రైవ పితృపాదతః।
అథ దైవప్రసాదేన ప్రాప్తాద్ గణపతేర్మునేః॥ 39

సాహిత్యశాస్త్రవిజ్ఞానం దర్శనానాంగతీరపి।
దేవతాతత్త్వమీమాంసాం మన్త్రయోగస్యసాధనమ్॥ 40

వేదార్థపద్యాంగమహానాం రమణం పరమం గురుమ్।
సర్వాణ్యేతాని సమ్ప్రాపం గురునాథాద్ గిరాంపతేః॥ 41

తదత్ర గుణలేశశ్చేద్ రచితాయాం కపాలినా।
సమర్చ్యాస్తత్ర గురవో హేతవః పురుషాస్త్రయః॥ 42

గురుర్విశ్వేశ్వరో జీయాజ్జీయాద్ గణపతిర్గురుః।
రమణో మునిరాట్ జీయా-జ్జీయాత్ సపరమో గురుః॥ 43

ఇదమ్ప్రసూః పరా జీయాదుమా జీయాత్ పురాతనీ।
ఉమాసహస్రమాసూర్యం జీయాజ్జీయాత్ ప్రభోజ్జ్వలమ్॥ 44

ఇతి-శ్రీమహర్షి రమణభగవత్పాదానుధ్యాత శ్రీభగవద్ వాసిష్ఠ
గణపతిముని ప్రవరాన్తేవాసినః, పూర్ణయోగాచార్య
శ్రీమదరవిన్ద భగవత్ పాదానుధ్యాతస్య, భారద్వాజస్య
విశ్వేశ్వరసూనోః కపాలినః కృతి ఉమాసహస్ర
ప్రభాఖ్యా ఉమాసహస్రవ్యాఖ్యా సమాప్తా.

ఓం నమోభగవతే శ్రీరమణాయ,

# శ్రీబాలసరస్వతీ ప్రచురణములు.

శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారి కృతులలో లభించునవి.

1. ఆంధ్రధ్వన్యాలోకము :— ఆంధ్రీకృత శ్రీమదభినవగుప్త లోచనోన్మీలితము. [ సంస్కృతమూలకారికా సహితము ] స్వవిరచిత ప్రభామతి వ్యాఖ్యాప్రసారితము. 1960 సం॥లో భాషాప్రవీణ ఫైనలుకు పాఠ్యము. సాహితీ ప్రియులుముఖ్యముగాపఠింపఁదగిన, ఉత్తమసాహితీశాస్త్రరత్నము.

Rs-Np

1) ప్రథమభాగమున, ప్రథమోద్ద్యోతము. గ్లేజుముద్రణము. 5—00
న్యూస్ ముద్రణము. 4—00

2) ప్రథమభాగమున, ద్వితీయోద్ద్యోతము. గ్లేజుముద్రణము. 5—00
న్యూసు ముద్రణము. 4—00

3) ఆంధ్రధ్వన్యాలోకము. (సలోచన ప్రభామతి సమున్మీలితము) ద్వితీయభాగము [తృతీయోద్ద్యోతము] 4—00

4) [అచ్చులో] తృతీయభాగము. [చతుర్థోద్ద్యోతము] 4—00

2. ఈశావాస్యోపనిషత్తు :— మూలమంత్ర, ఆంధ్రపద్యానువాద, పదవిభాగ, ప్రతిపదార్థ, తాత్పర్య-త్రిమతసంబంధి షోడశభాష్యార్థ-శాక్తాద్వైత భాష్యానుబంధ-స్వాభిప్రాయ-సమన్వితము. ఇట్టిది – తెలుఁగుననేటికింకొకటివెలువడ లేదని విద్వాంసులచేత ప్రశంసింపఁబడినది. 2—50

3. ఉమాసహస్రము :- శ్రీకావ్యకంఠ గణపతిమునికృ మూలశ్లోకసహితము. ఆంధ్రపద్యానువాద-ప్రభావ్యాఖ్యా వివరణ- సమన్వితము.

1) ప్రథమభాగము [మొదటిశతకము] క్రొత్తకూర్పు.

2) ద్వితీయభాగము: వచనానువాదము: ప్రభా - వివరణ సమన్వితము. [రెండు-మూడు-నాల్గు శతకములు]

3) తృతీయభాగము [మిగిలిన ఆరుశతకములు]

4. అంజలి :- ['శ్రీరమణాంజలి'యున్నగు నంజలులుగలది]

5. శ్రీ గీతా సు ధాం జ లి :- ... ... ఉచి

6. భా మ తి :- [స్వతంత్రనవ్యకావ్యము]
త్వరలో వెలువడనున్నది.

7. ఏ కా ద శి [వేదాంతగేయములు] ... ఉచి

వఞ్తుల లక్ష్మీనారాయణశాస్త్రి

పత్తిపాటివారివీధి - విజయనగరము. (విశాఖజిల్లా)

---

'శ్రీనివాస' ప్రెస్, రాజమండ్రి.